శ్రీరస్తు.

# ప్రతాపసింహ

నవరసభరితంబగు నవల.

బ్రహ్మశ్రీ హొత్రా వెంకటకృష్ణకవి

ప్రణీతము.

మొదటి కాపీలు 1000

కాకినాడ.

కాకినాడ ముద్రాక్షరశాలలో ముద్రితమై

గ్రంథకర్తచే ప్రచురింపఁబడెను.

1928

వెల రు 1-8-0

పోస్టేజి ప్రత్యేకముగాక.

కాపీరైటు రిజిస్టర్డు.

# పీఠిక.



పాఠకమహాశయులారా! నేనిదివరలో రోహిణీసుధాకరవిజయము, ద్రౌపదీస్వయంవరము, శశికళ, సుభద్రార్జునీయము, ప్రభావతీప్రద్యుమ్నము, శ్రీరామాభ్యుదయము మున్నగు నాటకంబులను వరాహనారసింహమను చంపుప్రబంధమును రచియించి యొక్కింత యాంధ్రభాషాసేవఁ జేసియుంటిని. ఇటీవల నవలలు పాఠకులహృదయముల మిక్కిలి గరంచుచుండుటచేతను నేనింతదనుక వచనగ్రంథమెద్దియు వ్రాసియుండకపోవుటచేతను నామిత్రులప్రోత్సాహంబుచే నిప్పుడీనవలను రచియించితిని.

ఇది కేవలము స్వకపోలకల్పితముగాని దీనికి చరిత్రాత్మకవిషయంబు లెవ్వియు నాధారములైయుండలేదు. నవలలను రచించుటలో నిదియే నా ప్రప్రథమ ప్రయత్నంబగుటచే నిందు లేఖకముద్రణప్రమాదజనితదోషములేమైన నుండిన నుదారహృదయులగు పాఠకమహాశయులు వానినన్నిటిని సాదరబుద్ధి మన్నించి నన్నుత్సాహింపఁ [illegible]కురని నమ్ముచున్నాను.

ఈగ్రంథముపైఁ దమయభిప్రాయముల వెలిఁబుచ్చినవారిలో నొక[illegible]భిప్రాయమును బొందుపరచితిని. విద్యాపోషకులగు చదువరు లిం[illegible]దోషంబులఁ గరుణార్ద్రహృదయులై తెలిపినచో వానినెల్ల కృతజ్ఞతాపూర్వకంబుగఁ గైకొని రెండవకూర్పునందైన సవరణఁ జేసికొనియెదనని విన్నవించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

మచిలీపట్టణము, [illegible]-12-1928.<br>
విభవనామసంవ[illegible] కార్తిక<br>
బహుళస[illegible]

ఇట్లు విన్నవించు<br>
విద్వజ్జనవిధేయుఁడు,<br>
హోతా వెంకటకృష్ణకవి.

# OPINION.

Srijit Hota Venktakrishna Kavi is too well known as a poet and a dramatist in the Circars to require any introduction at my hands. The present work, entitled Pratapasimha, is his first attempt in the field of Novel composition. It looks too high for a first attempt. I have heard the book through and have formed a very good opinion about it. The plot is worked out with consummate skill and every one of the situations which form the crises is each worth a Novel by itself. The main theme has a nice moral setting which is a very great advantage to the readers. The style is beautiful and flowing and shows the promise of a very bright future. I am sure that the work deserves every encouragement, and, I commend it to the reading public most heartily. Let me hope that with the public encouragement which he richly deserves I am sure the author will surely receive it he will give us another instalment of his work in the near future. I think that it may be set for Non-detailed study in the college classes.

Hindu College, Masulipatam, 6—12—1928. (Sd) VARANASI SREENIVASARAO,
M. A. (honours) L. T.
*Principal.*

శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## ఒకటవ ప్రకరణము.

ఉ. శ్రీగల భాగ్యశాలికడఁ జేరినదుర్మతి దర్పకాంతుఁ డు
ద్యోగముపేర్మి ద్రోహముల నత్యుకటన్ బచరింపఁజూచినన్
సాగునె తత్ప్రయత్నము లజస్రమి మిదుకన్ విపరీత మాఫలం
బేగతి హానివృద్ధులకు నీశ్వరుఁడే గద కారణం బగున్.

"అబ్బా! ఈకాంతారం బెంతభయంకరంబుగ నున్నయది. వివిధలతాలింగితాత్యున్నతమహీరుహంబులతోడను, కంటకవికీర్ణనికుంజపుంజంబులతోడను నీరంధ్రింబై, ఖరకరకిరణముకుత్కోరంబులకు దుర్గమంబై, శరభసింహశార్దూలవరాహకాకోలాదిదుష్టజంతువుల కాటపట్టై, బాటసారుల కగమ్యంబై యుండ చిమ్మచీఁకటి కారుక్రిమ్మి యుండుటచేఁ గన్నులుఁ గాళ్ళుఁ గానరాకున్నయవి. దైవమా! నేఁ బూనినకార్యము నెట్లు నెఱవేర్చెదవో నీదే భారము."

అని యేమేమో యనుకొనుచు నొకరేయి భయంకరారణ్యమార్గంబున శారదాభ్రింబులోని శీతాంశునిక్రైవడి వెలుంగుచున్న ధవళదుకూలాంబరపరిచ్ఛన్నుం డగు నొకమగశిశువును బొమ్మునకు హత్తికొని యొకస్త్రీ యొంటరిగఁ బోవుచుండెను.

ఆమె నలువదిసంవత్సరములవయస్సు గలదిగాఁ బైకిఁ గన్పట్టుచున్నను జవ్వనంబున నెందఱినో యువతుల నాక్షరింపఁగలిగినసౌందర్యవతి యనియే చెప్పవచ్చును. అప్పు డామె మలినవస్త్రధారిణియై విశీర్ణకేశపాశంబుతో నూతనోత్సాహపూరితురాలై నల్వాలంకుల బెదరి

బెదరి చూచుచు గాఢాంధకారబంధురం బగునిశాసమయం బగుటచే నాయింతి కంటకవికీర్ణ విషమప్రదేశంబులఁ బడుచు లేచుచుఁ ద్రోవ యుఁ దెన్నుఁ గానరాని యాదుర్గమఘోరారణ్యంబున నతిసంభ్రమం బుగఁ బోవుచుండెను.

ఆయింతి ధీరచిత్త యయ్యు జన్మప్రభావవైపరీత్యంబున దివాంధమ్ముల నాకస్మికకిలకిలారావంబుల కులుకుచు, ఫణిఫూత్కారంబులకుఁ దల్లడిల్లుచు, శరభసింహశార్దూలకోలార్భాటంబుల కదటుఁ జెందుచుఁ జని చని యొకవిశాలవటవృక్షంబు దరిసి యచ్చోఁ దన కర్తవ్యమును నెఱవేర్పఁ దలంచి శిశువును గ్రింద నొకకఱకుఱా నేలపైఁ బరుండఁబెట్టెను. వెంటనే యాశిశువు తనకు రానున్న భావికవిపత్తు నెఱింగికాఁబోలు వల వని తనచేతు లాడించుచు రోదనము సేయనారంభించెను.

దర్వ్యలోభత్వంబున నాజరభి యెంతవజ్రకాఠిన్యము వహించిన దైనను నిరుపమాన తేజోరాశి యగు నానిసుఁగును జూడంజూడ నామె హృదయక్షేత్రము కరుణరసోదయంబున నార్ద్రంబగుచుండెను. “ఛీ, ఛీ! దుర్మార్గురాలా! ఇందుమతీ! బాలఘాతినివిగా నెంతటిబారుణ కర్మం బొనర్ప సాహసించుచుంటివే! ఇంతటిరాజద్రోహ మొనర్చిన చో నీ కెన్నటికైనఁ జిత్తశాంతి కలుగునా? నీవొనర్చు నీదుష్కర్మ ఫలము నిన్నుఁ గట్టికుడుపకుండునా? మారసుందరాకారుం డగు నీ చిన్నారిముద్దుబిడ్డను జంపుటకు నీ కెట్లు మనస్సొప్పె? ఘోరాంధకారబంధురం బగు నీదుర్గమారణ్యంబున నీ వొనర్పనెంచినహత్య పరు లెఱుంగఁజాలరని యనుకొనుచుంటివి కాఁబోలు! పంచభూతములును సాక్షులు కావా? నీమనస్సాక్షి లేదా? ఈద్రోహ మొక పిశాచరూపంబున నీలోఁబ్రవేశించి, నీచేనింకను నెన్నియోదుష్కృతపరంపరల నొనర్పఁజేసి చివరకు నిన్నధఃపతితను జేయును. అదియే

దీన నీకుఁ గలుగులాభము. మత్సరగ్రస్తయు దురాశాబద్ధురాలునగు నీయజమానురాలు నీకొసంగుపారితోషికంబుచే నీ వాచంద్రతారా ర్కము భూమిపై సుఖింపఁగలుగుదు ననుకొనుచుంటివి కాఁబోలు! అట్లువిధంబునను జరుగనేరదు. 'జాతస్యమరణంధ్రువమ్' అను నా రోక్తి నీ వెన్నండును వినలేదా?" అని తన్నవరో దూరుచుఁ జెవిలో నేకాంతముగఁ బలుకుచున్న ట్లామెకుఁ దోఁచెను. "అన్నా! నే నెంత దుర్మార్గురాల నైతిని. ధనాశచే నిట్టి తేజోవంతుఁడగు పసిబిడ్డను దిన దినప్రవర్ధమానంబుగ భూమిపై వర్ధిల్లి మృదుపల్లవపుష్పఫలంబుల నగణితాశ్రితవిహంగంబులఁ బోషింపఁజాలు కల్పద్రుమంబుగా నున్న నామొలకనుఁ దున్రించివేయ సిద్ధపడుచుంటిని. నావంటి పాపాత్ము రాం డెందైన నుందురా? ఇప్పుడు నాకుఁ గర్తవ్యం బేమి? అని సింగును గూరహృదయనై కడతేర్చిగాని జాలిదలఁచి యిచ్చోటవదిలి వేసిగాని నేను తిరుగ నాయజమానురాలియొద్ద కేగినచో నాయం దవిశ్వాసము కలుగుటనో భగ్నమనోరథ యగుటనో యేదోవిధం బుగ నన్నంత మొందింపఁజూచుట నిశ్చయము. కావున నే నిప్పుడీ సిసువు నెక్కడనో యొకసురక్షితప్రదేశంబున డాఁచి నాజన్మస్థాన మగువంగరాజ్యమున కేగెదను." అని కృతనిశ్చయురాలై యాశిశు వును మరల యొమ్మునను హత్తికొని యచ్చోటు వాసి బయలు దేఱెను.

అట్లామె కొంతదూర మేగినపిదప బాలాక్రిందనముతోఁ గూ డినకలకలం బొక్కం డామెకుఁ గర్ణపథగోచర మాయెను అదియేమి యుపద్రవమో యని కళవళపడుచు నాతోవ వీడి వేఱొంకమార్గ మున బయలుదేఱెను. అప్పటికిఁ జంద్రోదయ మగుటచే నామెకు మార్గము చక్కఁగఁ గన్పట్టుచుండెను అంత నొకరాజభటుఁ డామార్గ మున నే మూర్ఛాక్రాంతుఁడై యున్న యొకబాలుని మూఁపుపై నిడు

కొని యామె కెదురుగ వచ్చుచు నామెను జూచి "కాంతామణీ! నీవిప్పు డీమార్గమున నేగుట క్షేమకరము గాదు. నరహంతకు లగుచోరులయ్యెడ విచ్చలవిడిగఁ దిరుగుచున్నారు. నీ వీమార్గమున నేగితివేని హేలాపురము తెల్లవాఱుసరి కేగెదవు" అని పలికి యతిసంభ్రమంబునఁ బోయెను.

ఇందుమతి భీతిల్లి "అకటా! దైవమా! నే నిప్పు డేమిసేయుదును? హేలాపుర మేగితినేని నే నచ్చో నున్నసంగతి నాయజమానురాలికిఁ దెలిసినచో నాకు వెంటనే ముప్పు వాటిల్లును. అప్పు డీబిడ్డగతి యేమికావలయును? ఈమార్గముననే బయలుదేఱినఁ జోరులచేఁ జిక్కి యెట్టివెతలపాలుగావలసి వచ్చునో? ఏమైనను సరే, నే నీమార్గముననే పోయెదను. రాజభటుఁడు తనమూఁపున నిడికొని పోవుచున్నబాలుఁ డెవ్వఁడై యుండునో వాని కేమివిపత్తు ఘటిల్లెనో తెలియరాదు. ఈరాజభటుఁడుకూడ నొకచోరుఁడే యైయుండఁడు కదా! దొంగయు మనిషివంటివాఁడే. కానిమ్ము నాయొద్దనున్న నిసుంగుగతియు నాగతియు నేమికానైయున్నదో యట్లు జరుగకమానదు. దైవసంకల్పమును మనుష్యబుద్ధి ప్రతిఘటింపఁగల్గునా?" అని పరిపరివిధంబులఁ దలపోయుచు నడుచుచుండ నామెయెదుట మఱియొకవ్యక్తి తనవైపు వచ్చుచున్నట్లామెకుఁ దోఁచెను.

ఆవ్యక్తి కోరపాగా చుట్టి విల్లంబులు గైకొని బాణహతిఁ ద్రెళ్ళిన కొన్నిపక్షిజాతంబుల మూఁపున నిడికొని వచ్చుచుండెను. ఆవ్యక్తి మృగయుం డగు నొకసామం డని తెలిసికొని యామె చిత్తము నొక్కింత కుదుటుపడఁజేసికొనియెను. బోయవాఁ డామెను సమీపించి "కాంతామణీ! మీ రెవ్వరు? ఏమికతంబున నెచ్చోటనుండి మీ రిట్లేకతంబ వచ్చుచుంటిరి? చెప్పనగునేని మీవృత్తాంత మొక్కింత తెలిపి నావలన నెద్దియైన సహాయ మపేక్షించితిరేని యానతిండు"

అని పలికెను. ఆమాటలు విని యిందుమతి సంతసించి "బోయవాఁడా! నావృత్తాంతము నీ కిప్పు డెఱింగింపఁజాలను. కొన్ని కారణములచే నే నిప్పుడు నిగూఢంబుగ వర్తించుచున్నదానను. నావృత్తాంతముతో నీకుఁ బనియేమి? నే నొకయదృష్టహీనురాలను. కొండొక కార్యార్థము నాజన్మస్థాన మగు వంగరాజ్యమున కేఁగఁగోరి వచ్చుచుండఁ ద్రోవలో నా కీశిశువు లభించె. మారసమసుందరాకారుం డగు నీసుకుమారునిఁ బొదిగిటనిడికొని వచ్చుచు నీనికటంబున నెన్నియొకడగండ్ల పాలైతిని. వీని నెందైన నొకసురక్షితప్రదేశంబున నిలుపఁగోరి యేపుణ్యాత్ముఁడైన వీనిని స్వయంప్రాప్తపుత్రుఁడుగ స్వీకరింప నంగీకరించినచో మనఃపూర్వకంబుగ వాని కిచ్చివేయఁ దలంచి తిరుగుచుఁ ద్రోవఁ దప్పి యీమార్గమున వచ్చుచుంటిని. నీ వీవజ్రాలహారమును బారితోషికంబుగఁ గైకొని యీభారమును వహింపఁ గలవా?" అని దైన్యముదోఁపఁ బలికెను. బోయవాఁ డామాట విని పుత్రసంతానము లేనివాఁ డగుటచేతను, భార్యావిహీనుం డగుటచేతను బరమానందభరితుఁడై "అమ్మా! నేఁ జిరకాల మనపత్యుం డనై పుత్రసంతానంబుపొంటె నెన్నియో సద్వ్రతంబుల నాచరించితిని. ఇంతలో నాభార్య పరలోకగత యగుటచే నాయాశ నిరాశయయ్యెను. తల్లీ! మున్ను నేఁ జేసియున్న సద్వ్రతప్రభావంబున భక్తవత్సలుం డగు నాయిష్టదైవము మీరూపంబున నామ్రోల నవతరించి తదీయసద్వ్రతఫలోదయంబుగ నిట్టి దివ్యతేజోరాశి యగు పుత్రరత్నంబు నవ్యాజకరుణచే నాకొసంగెద నన్న నేఁ దిరస్కరింతునా? శ్రీరామో కాలొడ్డుమూర్ఖు లెందైన నుందురా? అయినను మహారాజలక్షణలక్షితుం డగు నీబాలుని నేఁ జేరఁదీసినచో నా కెప్పటికేమియుపద్రవము వాటిల్లునో యని తలంకుచున్నాను" అని పలికెను. అందుపై నాయింతి "బోయవాఁడా! నిర్హేతుకసంశయంబులచే

నీమనంబు నలయింపకుము. నీ వీపిల్లవానిని బరులకంటఁ బ్రచ్ఛన్నం బుగఁ గాని కడకుండఁ గాపాడుచు నర్ధిల్లఁజేసితివేని నీభావిభాగ్యో దయంబున కీతండే కారకుం డగును." అని వజ్రాలహారముతో నాశిశువును బోయవాని కొసంగెను.

బోయవాఁడు సముత్కంఠ వానిఁ గైకొని "అమ్మా! ఈసమీపంబుననే నాకుటీరము గలదు. మీరయ్యెడ కేతెంచి యానాకుటీరము వాసయోగ్యమని మీకుఁ దోఁచినయెడల మీరీరేయి కందు విశ్రమించి తెల్లవాఱినతోడనే మీ రేఁగఁదలంచినచోటికిఁ బయనంబుగాఁ గొరెదను" అని సవినయంబుగఁ బలికెను. అందుపై నిందుమతి "బోయవాఁడా! నేను తెల్లవాఱుటకుఁ బూర్వమే వంగరాజ్యముఁ జేరవలయును. నే నిప్పు డిచ్చో విశ్రాంతిఁ జెందఁజాలను. నాకు నీవే మార్గదర్శకుండవు గావలెను" అని పలికెను. అందుపై బోయవాఁడు "అమ్మా! ముఖ్యముగ నే మీకోరికప్రకారము మిమ్ము గమ్యస్థానముఁ జేర్చివచ్చెదను. నే నీపిల్లవాని నాకుటీరములోనికిఁ గొనిపోయి భద్రపఱచి వచ్చెదను. మీ రంతవఱకు నిచ్చోటనే యుండెదరా, నావెంట వచ్చెదరా?" అని యడిగెను. అందు కాయింతి తా నచ్చోటనే యుండెద నని పలుక బోయవాఁడు వెడలిపోయెను.

బోయవాఁడు చనినపిదప నిందుమతి తనలో "దైవకటాక్షంబున నేఁ బూనినకార్యభారము నిరపాయముగఁ దొలంగినది. నేనింక సురక్షితంబుగ వంగరాజ్యముఁ జేరవలసియున్నది. బోయవాఁ డెంతసేపటికి తిరుగ వచ్చునో కదా!" అని యేమేమో యనుకొనుచుండ నామె కనతిదూరంబున గుఱ్ఱపుడెక్కలచప్పుడు వినిపించెను. అంతఁ గొందఱాశ్వికు లామార్గమున వచ్చుచు నామెనుజూచి "కామినీ! నీవెవ్వతెవు? నీ విట్టిసమయంబున నీఘోరారణ్యంబున నొంటిగ నుండుటకుఁ గారణం బేమి?" అని యడిగెను.

తన్నట్లు సంబోధించి ప్రశ్నించినపురుషుఁడు కుళిందదేశాధీశ్వరుం డగు కామపాలుఁ డని తెలిసికొని యిందుమతి "మహారాజా! ఏలినవారి సమయోచిత సందర్శనంబుచే నాదిగు లడంగినది. ఏకారణంబుననో గుర్తించలేదు కాని, యేలినవారు నన్నెఱుఁగకపోలేదు" అని పలికెను. అది విని వివిధభావపరీతచేతస్కుండై కామపాలుఁడు "ఇందుమతీ! నీవేనా? నిర్జనంబగు నీదుర్గమారణ్యంబునకు నిశాసమయంబున రాఁగారణం బేమి?" అనియడిగెను. అందుపై "మహారాజా! నాయజమానురాలగు శ్రీ చిత్రాంగిమహారాణీగారు నాపై మోపిన కార్యభారమును నిర్వహించుచుపొం టె నీయరణ్యంబున వచ్చుచుండ నొక కూరవ్యాఘ్రంబు నాపైఁ బడెను. ఉపాయంబున నే నద్దాని బారిఁ దప్పించుకొని వచ్చుచుఁ దోవఁ దప్పి నేనిమ్మెడ కేతెంచితిని. ఆచారలమొకమే నా కార్యభారమును దొలఁగించుటచేతను, తమ సమయోచిత సందర్శనంబుచేతను నేను కడు ధన్యురాల నైతిని." అని సవినయంబుగఁ బలికెను ఆమాట వినినంతనే కామపాలుఁడు హర్షపులకితగాత్రుఁడై తనలో "వహ్వా! నాయనుంగుఁజెల్లెలు నేఁ జెప్పినచొప్పున జరిగించి యుండెఁగాఁబోలు. ఇఁక రెండవకార్యము నకై గడంగవలయును." అని కృతనిశ్చయుండై, "ఇందుమతీ! చిరకాలమునుండి నీ స్వామిభక్తిపరాయణత్వమునందు నాకుఁ గల దృఢవిశ్వాసంబునకుఁ దార్కాణంబుగ నీవు కార్యనిపుణత్వంబునఁ జరితార్థురాల వగుచుంటివి. నీ విటులనే యింగితమెఱింగి వర్తించుచుంటి వేని నిరుపమానభాగ్యవతి వయ్యెదవు. నీ విపుడు తిరుగ నీయజమానురాలియొద్ద కేగఁగోరుచుంటివి కాఁబోలు ? నావలన నీ కెద్దియైన సహాయము వలయునేని తెలుపుము" అని సాదరంబుగఁ బలికెను.

అందుపై నిందుమతి "మహారాజా! నాకింక నెవరిసహాయము నవసరము లేదు. అరుణోదయము గావచ్చినది. సెల వొసంగెద రేని

పోయివచ్చెదను" అని సవినయముగఁ బలికెను. ఆమాట వినినంతనే కామపాలుఁ డొక్కింత యాలోచించి తనభృత్యులలో నొకనిఁ జేరం జీరి వానిచెవిలో రహస్యోచితంబుగ నెద్దియో యుపవారించి చెప్పి పిశాశముగా "మందారకా! నీ వీయిందుమతిని వెంటఁగొనిపోయి తెల్లవాఱుటకుమున్నె మధురాపురముఁ జేర్చిరావలయును. నీవు కృతార్థుఁడవై తిరుగ వచ్చినపిదపఁ దగినపారితోషిక మందెదవు" అని పలికెను. మందారకుఁ డాయభిప్రాయమును గ్రహించి "చిత్తము. మహారాజా!" అని యిందుమతిని వెంటనిడికొని మధురాపురాభిముఖుండై బయలుదేఱెను. కామపాలుండును నిజాశ్వంబు నదలించి యనుచర సహితుండై పుష్పగిరిమార్గమున నేగెను.

బోయవాఁడు తిరుగ వచ్చుసరికి యిందుమతి యదృశ్యయయ్యెను. పాపమాయింతిగతి యేమయ్యెనో యని తత్తరముఁ జెందుచు నాప్రదేశమందంతటను నల్వలంకుల వెదకి వెదకి యెచ్చోటను గానరామిఁ గళవళ మొందుచు నరుణోదయం బగుటచే నామె యెద్దియో సహాయంబుపడసి గమ్యస్థానమగు వంగరాజ్యమున కేగియుండునని భావించి మఱలి తనకుటీరంబున కేగుచుండ, వానికి దవ్వుల నొకయార్తాలాపము వినవచ్చెను. ఆధ్వని యిందుమతికంఠధ్వనివలె నుండుటచేఁ బాప మాపుణ్యాత్మురాలికిఁ జోరులచే నేమికీడు వాటిల్లుచుండెనో యని భయమందుచు నతిత్వరితంబుగ నాధ్వనివచ్చినదిక్కు పరుగిడిన యంత మధురాపురముచెంత యమునానదిపైఁ గలవంతెన వానికి దృగ్గోచరమాయెను. ఆవంతెనపై నెవరో యొకస్త్రీని నిర్బంధించుచున్నట్లు వానికిఁ దోఁచెను. వెంటనే బోయవాఁ డచ్చోటకుఁ బరుగిడి తన చేతిలోనిబడియతో వానిశిరంబుపై దృఢముగఁ గొట్టెను. ఆదెబ్బతో మందారకుఁడు వివశుఁడై క్రిందఁబడెను.

అట్లు చోరునిచే నిర్బంధింపఁబడుచున్న స్త్రీ యిందుమతియే. బోయవానిని జూచినతోడనే యామె యింతి పట్టరాని సంతోషముతోఁ "పుణ్యపురుషా ! నీసమయోచితసాహాయ్యంబుచే బ్రిదుకఁ గంటిని. నీ కిదే నాకృతజ్ఞతాభివందనము" అని జరిగినసమాచార మంతయు బోయవాని కెఱింగించి "దయామయా ! నీవు నాకు సంపూర్ణ ప్రాణ దాతవు గాఁదలంచితి వేని నన్నిప్పుడే నాజన్మస్థానమగు వంగరాజ్యము నకుఁ గొనిపొమ్ము" అని పలికెను. బోయవాఁడు వల్లె యని యామెను వెంటనిడికొని వంగరాజ్యాభిముఖుండై బయలుదేఱెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## రెండవ ప్రకరణము.

---

ఉ. ఉత్తమరాజవంశమున నున్నతిమై జనియించినట్టి వీ
రోత్తముఁ డాత్మగతగుణసముద్ధతి స్వప్రతిభోపజీవనం
బెత్తఱినైనఁ గోరఁ బర లెద్దియొసంగిన నొల్లఁడుండుఁ దా
మిత్తికినైన జంకక రమించును సాహసకార్యలీలలన్.

శ్రీమదఖండమహీమండలమండనాయమానం బగు భరత ఖండంబునఁ గోసలదేశ మెంతయో వైభవోన్నతి విరాజిల్లుచుండెను. ఏయెడఁ జూచిన మధురపుష్పఫలభారవినమ్రలతాద్రుమంబులును, గుటిలప్రవాహమనోహరంబు లగు నదీనదంబులును, భసలఝంకార సమన్వితంబులగు పద్మాకరంబులును, నిఖిలజనపరిశ్రమాపనోదకంబు లగు విశాలపుష్పోద్యానవనంబులును, మహోన్నతపర్వతశిఖరంబులును నత్యున్నతతాలహింతాలతమాలరసాలనారికేళపనసఖర్జూరార్జునమాతులుంగలవంగకదంబకదళీనింబజంబుజంబీరవటాశ్వత్థవృక్ష నీరంధ్రంబు లగు కాంతారంబులును బరిమళకుసుమాలంకృతలతాకుడుంగంబులును గనులపండువు గావించుచుండెను. ఎల్లయెడల లక్ష్మి తాండవమాడుచుండెనో యనఁ గేదారంబులును బచ్చికబయళ్ళు నుల్లసిల్లుచుండెను. ఏవంకఁజూచిన హాలికులకర్షకకార్యోత్సాహకోలాహలంబులును మూతులెత్తక మేయుచుండు నసంఖ్యాకంబులగు నజామహిషీగోవ్రాతంబులును జూపరులకు హృదయానందముఁ గలిగించుచుండెను.

మధురాపురము కోసలదేశమునకు రాజధాని. ఆపురంబు రమాదేవికిఁ గాఁపురంబో యన సకలైశ్వర్యశోభితంబై యుండెఁ. అద్దా

నియోడయుండు నిజపవిత్రాపార్జితకీర్తిలక్ష్మీవరుం డగుచంద్రశేఖరుండు. ఆతనిపాలనంబునఁ గోసలరాజ్యమంతయు సర్వసంపత్సమృద్ధంబై సకలకలావిలసితంబై నిఖిలజనసుఖావహంబై విలసిల్లుచుండెను. నీతియుతంబుగఁ బరిపాలింపఁబడుచుండుటచే నీతిరహితంబై పాఁడిపంటలు సమృద్ధిగఁ గలిగి శోభిల్లుచుండెను. రాజ్యప్రజ లందఱు ధనధాన్యపశ్వాదులతోడను బహుపుత్రపౌత్రప్రపౌత్రసంపదలతోడను వర్ధిల్లుచుండిరే కాని క్షామడాంబరంబులు నాధివ్యాధులు నెన్నండు నెఱుంగరు. ఆరాజ్యప్రజ లందఱు జాతిమతాచారంబుల కనుగుణంబుగ వర్తించుచుండిరి. వారందఱు నల్పాధిక్యతలు కానరాని విద్యావంతులే గాని విద్యావిహీనుం డొక్కండును మందునకైనఁ గానరాఁడు. వారందఱుఁ గృషివాణిజ్యపరిశ్రమాదులచే ధనరాసు లార్జించియు దుర్వ్యసనలోలురు గాక యాద్రవ్యమంతయు దేవతాకార్యములయందును వైద్యశాలాన్నసత్రాదిధర్మసంస్థాపనలయందును మఱియు ననేకలోకోపకారవిషయములయందును వినియోగించుచుండెడివారు గాని స్వసౌఖ్యముల కుపయోగించుచుండెడివారు కారు.

మధురాపురయువజనకదంబము ప్రతిరోజునను సాయంసమయమున వాహ్యాళికై బయలువెడలి తత్పురమధ్యంబునంగల పౌరజనపరిశ్రమాపనోదకం బగు విశాలపుష్పోద్యానవనంబునఁ గొంతతడవు శీతలమరుత్కిశోరసమానీతప్రసవసౌరభంబులం జొక్కుచు నుత్ఫుల్లపరిమళమిళత్కుసుమంబుల మనోజ్ఞతకు మెచ్చుకొనుచుఁ బద్మాకరకూలంకషసైకతోన్నతప్రదేశంబుల విస్తృతకలాపంబులతో నృత్యము లొనరించు కలాపిజాలంబుల క్రేంకారధ్వనుల కానందించుచు ఫలపల్లవాసక్తిఁ గొమ్మలపై వ్రాలుచు విహరించెడు శుకపికనికరకలకలారావంబుల కుల్లసిల్లుచు నాతటాకంబుచుట్టును గల పీఠంబులపై హాయలుమీఱఁ గూర్చుండి వినోదగోష్ఠిఁ దేలుచుఁ బరి

పరివిధంబుల విహరించి విహరించి చీఁకటిపడకమునుపే తమతమగృహంబుల కేగుచుండెడివారు. వీరోత్సాహులైన రాజపుత్రులాపుర వరంబున కుత్తరభాగమునంగల పర్వతారణ్యంబుల కేగి యందం దాఖేటఖేలనాలోలురై వాహ్యాళి నుత్సహించుచుండిరి.

కోసలరాజ్యరమాకళత్రుండగు చంద్రశేఖరమహారాజునకు షష్టిపూర్తియైనది. నిగర్వచూడామణి యన నతఁడే యని ప్రఖ్యాతి వహించియుండెను. ఆమహారాజు నిరుపమానభూతదయావిశిష్టుండై యాశ్రితజనపారిజాతం బని యెల్లరచేఁ బొగడొందుచుండెను. విద్యావైదగ్ధ్యంబున ద్యుమణికైవడి నాతఁడు స్వయంప్రకాశుం డగుటయేగాక సన్నిధి కేతెంచువిద్వాంసులను సాకఁ బ్రకాశింపఁజేయుచుండెను.

వానికిరువురుభార్యలు. అందు జ్యేష్ఠభార్యయైన చారుమతి కొక కొమరుఁడు కలిగెను. కాని యాశిసువు దశరాత్రములలోనే యంతకాలయంబున కేగెననియు నాయమ పుత్రశోకార్తి మ్రగ్గి మ్రగ్గి యమునానదిలోఁ బడి మృతిఁ జెందెననియు వాడుక కలదు. రెండేండ్లు గడచినపిదప రెండవభార్యయైన చిత్రాంగికి దివ్యసుందరవిగ్రహుం డగు నొకకుమారుండు జనించెను. ఆకుమారుండు దినదినప్రవర్ధమానుండై సకలకలల నభ్యసించి యమితశౌర్యసాహసాదిగుణంబులు గలిగి నిరతిశయభుజబలోదగ్రమూర్తి యయ్యు శాంతసౌహార్దాదిగుణంబులఁ దేజరిల్లుచుండెను. అతండు నిరంతరమును వీరోచితవిహారములయం దాసక్తి గలిగి వర్తించుచుండువాఁ డగుటచే వీరపాలుఁ డని పేర్కొనఁబడుచుండెను.

వీరపాలుఁడు పదునెనిమిదేండ్ల ప్రాయము గల యువకుఁడు. మిగులఁ బొడగరి. వంగపండువంటి మేనిచాయఁ గలిగి పుండరీకంబులం గేరు విశాలనేత్రంబులతోడను, గజతుండంబుల ననుకరించు నాజానులంబితబాహుదండంబులతోడను దృఢవిపులవక్షస్థలంబుతోడను సన్నని

నెన్నడుముతోడను గేసరికిశోరంబునాఁ జెన్నెసలారుచుండెను. ఆతఁడు ధనుర్విద్యయం దారితేరిన మేటివిలుకాఁడై శర[illegible]నకుండెను. శూరుఁడయ్యుఁ బరమదయాశాలియై యతిసాహసికుండయ్యుఁ బ్రమత్తుండుగాక సకలైశ్వర్యసంపన్నుఁడయ్యు వ్యసనమనునది యెట్టిదియో యెఱుంగక గురుదేవతాభక్తిపరాయణుండై వితరణంబుచేతను నాఖేటఖేలనాదివీరవినోదంబులచేతను శౌర్యధైర్యగాంభీర్యసాహసాదిగుణంబులచేతను పురజనులను రంజించుచు సకలసుగుణరాశి యని చిన్నతనముననే ప్రఖ్యాతి వహించియుండెను.

ఒకరోజున సూర్యుఁడపరాంబుధిఁ గ్రుంకుచుండెను. సంజకెంజాయయు ప్రకృతిసౌందర్యంబునకు వన్నెవెట్టుచు సకలజీవులకుఁ గనుపండువొనరించుచుండె. పాలికాఁపులు తమ కాఁడి మేడి మొదలగు సామానులతోడను, ముక్కిడిమూఁకలు పాలకావిళ్ళ మూఁపున నిడికొని సవత్సము లగునజామహిషీగోగణంబులతోడను నత్యుత్సాహంబుగఁ బాటలు పాడికొనుచుఁ దమతమ నెలవులకుఁ జనుచుండిరి. పక్షులన్నియుఁ గిలకిలార్భాటంబుల నల్దెసలఁ బఱచుచుఁ గులాయమూలంబుల వేచియుండుకిశోరంబుల కామెత లిడఁ దమతమ నీడల కేగుచుండెను.

అట్టి సకలజనమనోల్లాసకరంబగు సాయంసంధ్యాసమయంబున వీరపాలుఁడు మృగయావిహారతత్పరుండై కతిపయపరివారంబుతో నుత్తరదిశారణ్యభూములకు బయలుదేఱెను. అతఁడు సీటైన జిలుగుబుటేదారుమొహమల్ షరాయియు నంగరకాను దొడిగి నెన్నడుమునఁ దోలుపటకా బిగించియుండెను. ఆపటకానుండి రతనాల పిడితో నొప్పారు పొడవైనకత్తి యొకటి వానియెడమతట్టున వ్రేలాడుచుండెను. శిరంబున హొంబట్టుజిలుగుటోపీని ధరించెను. జాళువాతళుక్కుటంచుల పట్టుటుత్తరీయమును మేనిపై వలెవాటుగ

వైచికొనియెను. వానివర్చస్సు వానికివి కొదమసింగంబు ననుకరించుచు వీరోత్సాహంబును సూచింపుచుండెను.

వీరపాలుఁ డనుచరసహితుండై దుర్గమఘోరారణ్యమ్ములకుం జని దుష్టమృగంబులఁ జండమార్గణాసారంబున ముంచి యిట్టట్టుఁ గదలనీయకఁ బడఁగొట్టుచు నత్యుత్సాహపూరితుఁడై పలుతెఱంగుల వీరవిహారం బొనరించుచు నొకయెడఁ బుండరీకము నిండుచూలుతో నున్నహరిణంబు నొకదాని నెగిచి తఱుముచుండుటఁ గని కరుణార్ద్ర హృదయుం డగు నావీరశిఖామణి శరవేగంబున నిజాశ్వం బాపెనకు దుమికించెను. పాప మాహరిణము గర్భభారముచేఁ బరుగిడఁజాలక యొకచో సొమ్మసిల్లి పడిపోయెను. క్రూరవ్యాఘ్రము దానిపైఁ బడ సిద్ధముగ నుండెను. అంత వీరపాలుఁడు వాఁడియగు నారసంబు నొక దాని నాచారలమెకంబుపొట్టలో గ్రుచ్చెను. వ్యాఘ్ర మాయేణమును వీడి వీరపాలునిపై కేగెను. ఇదంతయు సమీపంబునం గలకొండ పైనుండి యొకనిషాదయువకుఁడు చూచుచుండెను. వీరపాలుఁడు మఱియొకశాతభల్లము దానినెన్నుదుట గ్రుచ్చికొనునట్లు ప్రయోగించెను. వేదనచే నఱచుచు నాశార్దూలము పాఱిపోయెను. ఉదాత్తధీరుండగు వీరపాలుఁ డావ్యాఘ్రమును విడువలేదు. దానిని వెన్నంటి తఱుమఁదొడఁగెను.

కొంతతడవు వీరపాలు నట్లలయించి చివరకా వ్యాఘ్రము కన్మొఱంగెను. వేఁటతమకంబున మైమఱచి యావీరశేఖరుం డాక్రూరవ్యాఘ్రంబుఁ దఱుముచు నిట్టట్టుఁ జనిచని నిజపరివారంబును వీడి యొంటరియగుటచే దిగ్భ్రమఁ జెందియుండెను. ఆరోజునఁ బూర్ణిమయగుటచే షోడశకళాపరిపూర్ణుఁడైన నిండుచందురుఁడు నిఖిలభువనాహ్లాదకరుండై మింట వెలుంగుచుండెను. వీరపాలుఁడు మిగుల డప్పిగొని యుండుటచే నందెచ్చటనైన మధూదకము లభించునేమో యని

గుఱ్ఱము నొకచో నాఁపి నల్వలంకులఁ గలయఁజూచుచుండెను.

ఒకయెడ నత్యున్నతపర్వతాగ్రంబుపైఁ గొన్నిజలపక్షుల కలకలం బాలకించి యటనుండి చల్లనిపిల్లవాయువులు వీతెంచుచుం డుటచే నచ్చోట నెద్దియైన జలాశయం బుండవచ్చునని యూహించి యామహీధరంబు దరిసెను. పర్వతము వెనుకతట్టున కేగుట కెచ్చట నైనఁ ద్రోవ దొరకునేమో యని యంతటను బరికించి చూచెను. ఎచ్చోటను ద్రోవ లభించలేదు. చుట్టుఁదిరిగి మరల యెప్పటిస్థలము నకే వచ్చెను. అతికష్టముతో నానగం బెక్కెను. తా ననుకొనినయట్లా పర్వతంబువెనుక నొకజలాశయం బుండెను. దానిచుట్టును సమున్నతమహీధరంబులు సహజంబుగ నేర్పడినప్రాకారంబులో యన వలయాకారంబుగ నుండెను వానిమధ్య నాతటాకము మరకతదర్పణము వలెఁ బ్రకాశించుచుండెను.

మిగుల దగఁగొనియున్నవాఁడగుటచే వీరపాలుఁడు గుఱ్ఱముడిగ్గి దాని నచ్చో నొకచెట్టుకొమ్మకుఁ గట్టివేసి తటాకముచెంత కేగుటకుఁ గొండదిగుచుండెను. కొంతదూరము దిగినపిదప వానికుడితట్టునుండి గాండ్రుమను నొకభయంకరధ్వని వినవచ్చెను. వెంటనే సన్నికటంబున నున్నపొదలోనుండి యాకస్మికముగ దెబ్బతినియున్న బెబ్బులి వానిపై కుఱికెను. వీరపాలుఁ డేమఱియుండలేదు. తత్క్షణమే యొక ప్రక్కకు గుమికి దానిఘాతఁ దప్పించికొని కత్తితో దానికంఠమున నొక్కపోటుఁ బొడిచెను. అద్దాని సరకుఁగొనక యాదుష్టమృగము మరల వానిపైఁ బడనెంచుచుండ నెటనుండియో యొకబాణము ఱివ్వున వచ్చి పులికంఠములో గుచ్చికొనియెను. ఆదెబ్బతో బెబ్బులి బొబ్బలిడుచుఁ గతిన తా నేలఁ గొట్టినరబ్బరుబంతికైవడి నుపరివీథి కెగిరి నోరు తెఱచి వీరపాలునిపైఁ బడెను. మరల నాయుపద్రవమును నేర్పుతోఁ దప్పించుకొని వీరావేశంబునఁ జేతిలోని ఖడ్గముచేఁ దెఱచియున్నదా

కినోట్లో దృఢముగఁ బొడిచెను. తత్క్షణమే వ్యాఘ్ర మంతమొందెను. కాని యదివఱకే దప్పిగొనియున్న వీరపాలుఁ డధికపరిశ్రమంబుచే సొమ్మసిల్లి పడిపోయెను.

ఆసమయమున నొకబోయయువకుఁ డచ్చోటకువచ్చివివశుఁడై పడియున్న వీరపాలునిఁ జూచి తత్క్షణమే తటాకోదకంబును గొనితెచ్చి వానిచేఁ ద్రావించెను. పిదప నొక్కింతతడవునకు వీరపాలుఁడు తెప్పరిల్లి లేచి బోయయువకునిఁ జూచి "పుణ్యపురుషా! నాకిట్టి సమయోచితమహోపకార మొనర్చిన నీ వెవ్వండవో యెఱుంగఁగోరెదను" అని పలికెను. అందుపై నానిషాదయువకుఁడు "రాజకుమారా! నీ కాదుష్టమృగముచేఁ గీడేమియుఁ గలుగ లేదుకద! నే నొకనిషాదుఁడను. నీ వీమెకమును వేఁటాడుట కారంభించినది మొదలింతవఱకును జరిగిన సమాచారమంతయు నేను చూచుచునే యున్నాను. ఈమెకము నీచే నట్లు ములికిదెబ్బఁ దిని పాఱిపోయివచ్చి యీయెడ డాఁగియున్నయది. గాయముచే వేదనఁ జెందుచు మిక్కిలి కోపముతో నుండుటవలన నిన్నుఁ జూచినంతనే నీపై కుఱికినది. ఆసమయమున నాబాణము దానికంఠములో గ్రుచ్చుకొనుటయుఁ బులి యద్దాని సరకుఁగొనక పైకెగిరి నీపైఁ బడనుంకించుటయుఁ జూచి నీకుపద్రవమే సంభవించెనని తలంకితిని. నేనిప్పు డాభయముచేతనే యాతురతతోఁ బరుగిడి వచ్చితిని. నీవు మహాశూరుండ వగుటచే నేర్పుతో దానిఘాతఁ దప్పించుకొనుటయే గాక దాని నతిచమత్కారముగ సంహరించితివి. బళె! నీవేఁటచతురత్వ మెంతయైనఁ గొనియాడవచ్చు" నని పలికెను. అందుపై వీరపాలుఁ డత్యాదరంబున "బోయవాఁడా! నీ విద్దాని నానవాలుగ నీయొద్ద నుంచుము. ఎప్పుడైన నీవు మధురాపురము వచ్చి దీనిఁ జూపితివేని నేఁడు నీవు నా కొనర్చినమే లెంతవిలువైనదో నీవే తెలిసికొనఁగల్గెదవు." అని తనవ్రేలినున్న వజ్రఘటితకనకాంగుళీయకమును దీసి

వాని కొసంగఁబోయెను. అదిచూచి బోయవాఁడు నవ్వి "రాజకుమారా! నే నీపారితోషికమును గ్రహించుట కర్హుండనని నీకెట్లు తోఁచెనో ముందు వివరింపుము. ప్రభువులముకదా యని రాజపుత్రులు పరుల గుణస్వభావంబులను పాటింపక నెల్లర నర్థిజనులుగ భావించు టుచితమగునా ?" అని పలికెను. ఆమాటలకు వీరపాలుఁ డాశ్చర్యమగ్న మానసుఁడై తనలో "ఈపురుషుఁడు వేషముచే బోయవాఁడు గాని పుట్టువుచేఁ గాదని తోఁచుచున్నయది. నిక్కువంబుగ నల్పనిషాదవంశజుఁడే యైనచో నమూల్యమైన కనకాంగుళీయపారితోషికమును దిరస్కరించునా ? పౌరుషప్రతాపమహోదారగుణంబులు వీనిమాటల యందును రూపమునందును జేష్టలయందును బ్రతిఫలించుచున్నవి. పైకి సంకుపూసలదండలు మెడలో వైచికొని మోటుబట్ట కొలను ధరించి కోరపాగా శిరంబునఁ జుట్టి విల్లంబులు గైకొని కిరాతునివలెఁ గాన్పించుచుండెనే గాని యీతఁడు నిషాదకులంబున జన్మించినవాఁడు కాఁడని నాకుఁ దోఁచుచున్నయది. ఎవ్వరైననేమి ?" అని ప్రకాశముగా "పురుషవరా ! నేను పిపాసాపీడితుండనై సొమ్మసిల్లి పడియుండఁ దటాకోదకంబును దెచ్చియిచ్చి నన్ను బ్రతికించితివి. ఈమేలు నే నెన్నఁటికైన మఱవఁజాలుదు ననుకొంటివా ? పులివాతఁబడకుండ సోదరునివలె నన్నుఁ గాపాడితివి· ఇట్టి ప్రాణదాతవగు నీయెడల నాకుఁ గలిగిన కృతజ్ఞతను దెలుప జ్ఞాపకచిహ్నంబుగ నిద్దాని నీయొద్ద నుంచ మంటినే గాని మహావీరుండవగు నిన్నర్థిజనునిగ భావించి కాదు. నాకోరిక నెఱవేర్చి నన్ను సంతోషపెట్టుము" అని బ్రతిమాలఁ దొడఁగెను. నిషాదయువకుఁడు చిఱునగవుతో "రాజకుమారా! నేను పరులచే నద్దియు గ్రహించుస్వభావము గలవాఁడను గాను. ప్రతిఫల మపేక్షించి పరుల కుపకార మొనర్చువాఁడ నని తలంపకుము. నీ విపు డెచ్చోటకేగఁగోరుచుంటివి ?" అని యడిగెను. అందుకు వీరపాలుఁడు "నేను

తిరుగ మధురాపురంబునకే పోయెదను. సన్నిహితమార్గ మేదైనఁ జూపెదవా ?" అని యడిగెను. అందుపై నిషాదుఁడు "రాజకుమారా! నీ వాకనఁబడెడు గుట్ట దాఁటినతోడనే యమునానదిని గాంచెదవు. ఆ నదిని దాఁటినంతనే గమ్యస్థానమును సమీపించెదవు" అని పలికెను. వీరపాలుఁడు విస్మయాకులితచిత్తుఁడై నిజాశ్వం బెక్కి బయలుదేఱెను.

బోయవాఁడు చూపినమార్గమునుబట్టి వీరపాలుఁడు యమునానదిని దరిసెను. రేవుదాఁటించునావ యచ్చోటనే యుండెను. కాని పడవనడుపువాఁడు లేనందున నదినిదాఁటుటకు వీలులేక యచ్చోటనే యొక్కింతతడవు నిలిచియుండెను. ఆసమయమున వరద యత్యుగ్రతంబుగ వచ్చుచుండెను. వాని యనుచరు లగు నాశ్వికు లిరువురు వచ్చి వీరపాలునిఁ గలిసికొనిరి. వారుముగ్గురు గుఱ్ఱముల నధిరోహించి వాని నీఁదవిడిచి నావపై నెక్కిరి. ఒకభటుఁడు చుక్కాని యందుండెను. ఒకభటుఁ డీఁదుచున్నగుఱ్ఱములమొడత్రాళ్ళను బట్టికొనియెను. వీరపాలుఁడు తెడ్డువేయుచుండెను.

వా రావిధంబున నదీగర్భంబుఁ జేరిరి. ప్రవాహవేగంబున నా నావనడుప వా రెంతయోఁ బ్రయాసపడుచుండిరి. గుఱ్ఱము లీఁదలేక మిగుల నాయాసపడుచు జీవితాశచే హాహాకారము సేయుచుండెను. వాని యార్భాటంబు రాజభటుఁ డోర్వఁజాలకుండెను. ఆగుఱ్ఱములు నావపై కెక్కుటకుఁ బ్రయత్నింప నావ తలక్రిందై మునిఁగిపోయెను. గుఱ్ఱములు ప్రవాహవేగంబునంబడి కొట్టికొనిపోయెను. భటు లిద్దరితో వీరపాలుఁ డదృశ్యుఁ డయ్యెను. కొందఱు పల్లెవాండ్రు వేఁటనావలపై వారి నరయుచుండిరి. అనుచరభటుఁ డొక్కఁడుమాత్రము వారికిఁ జిక్కెను. వానిని గట్టుపైఁ జేర్చి తగుచికిత్స లొనరించి పునరుజ్జీవితుని గావించిరి. వెంటనే యారాజభటుఁడు వీరపాలునకుఁ గలిగినయాపదను మహారాజుగారికి నివేదింప మధురాపురంబున కేగెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## మూఁడవ ప్రకరణము



చ. అవిరళభస్మగుప్త మగు నగ్నికణంబును బోలెఁ గాలక
ర్మవశత నల్పులం గలసి మాన్యత వీడి యడంగియున్న వీ
రవరునిసత్ప్రతాపగుణరత్నము లడంగునె కార్యకారణో
ద్భవముల కెల్ల నీశ్వరుఁడె బాధ్యుఁ డవస్థల మార్చు వాఁడే.

వీరపాలునకు మధురాపురమార్గమును జూపి బోయవాఁడు నిజగృహాభిముఖుఁడై బయలుదేఱియు బెబ్బులి మృతిఁజెందెనో లేదో యని మరల దానిచెంత కేతెంచెను. అది పూర్తిగఁ జచ్చి పడియుండెను. రతనాలపిడితో నొప్పారుఖడ్గ మింకను దానినోటనే యుండెను. అద్దాని నూడఁబెఱికి వీరపాలునిఁ గలిసికొని వాని కిచ్చివే యవలయునను తలంపుతో నారాజకుమారుఁ డేగినమార్గమున బయలుదేఱెను.

అప్పటికి యమునానది కడుభయంకరముగ నుప్పొంగుచుండెను. గట్లు పుట్టలు చెట్లు చేమ మొదలగునవెవ్వియుఁ గానరాక యపారపారావారంబుగఁ గాన్పించుచుండెను. ప్రవాహవేగము పాములను దిగవేయుచుండెను. అనేక మహామహీరుహంబులు కూఁకటివ్రేళ్ళతోఁ బెల్లగిల్లి కొట్టుకొనివచ్చుచుండెను. ఆచెట్ల నాసికొని యెన్నియో ప్రాణావశిష్టమై యున్న నరకీటకమృగవిహంగసరీసృపాదిజీవజంతువులు తేలి వచ్చుచుండెను. దారుసంగ్రహార్థ మామహీరుహంబులం గొనిపోవఁ గొందఱును కరుణార్ద్రహృదయులై మునుఁగుచుఁ దేలుచు రక్షింపుఁ డని మొఱలిడువారినిఁ గాపాడుటకుఁ గొందఱును దెప్పల

పై నెల్లయెడలఁ గోలాహలంబుగ నీఁదుచుండిరి. ఎందఱో సుడిగుండంబులంబడి యదృశ్యు లగుచుండిరి.

అట్టిదారుణవిప్లవమును జూచుసరికి బోయవానిహృదయము కరుణరసోద్రేకంబుచే సంక్షుభితమయ్యెను. ఒక్కక్షణము నిర్విణ్ణుఁడై యంతటను గలయఁజూచెను. ఆనదీగర్భమున నొకనావపై ముగ్గురుమనుజులు నావ నడుపఁజాలక ప్రయాసపడుచుండిరి. అంత నానావ మునిఁగిపోయెను. అందలిమనుష్యు లదృశ్యులైరి. వెంటనే బోయవాఁడు కేవలము భూతదయాప్రేరితుఁడై యుపాయమును గమనింపక నదిలో దుమికి ప్రవాహవేగంబునఁ గొట్టికొనిపోవుచుండియు లక్ష్యమును విడువక యీఁదుచుండెను. ఎంతయోదూర మేగినపిదప నద్వితీయభుజబలప్రతాపశ్రేయుండగుటచే నదీగర్భంబుఁ జేరెను. అచ్చట నొకదురదృష్టవంతుఁడు సుడిగుండంబునంబడి గిరగిరఁ దిరుగుచు మునుఁగుచుఁ దేలుచుఁ బ్రాణావశిష్టుండై యుండెను. బోయవాఁడు వాని నాసుడిగుండంబునుండి తప్పించుట కుపాయ మేమియుఁ దోఁచక తనశిరోవేష్టనముఁ దీసి వానిచేతి కందునటుల విసరివైచెను అతఁడద్దాని గట్టిగఁ బట్టికొనియే గిరగిరఁ దిరుగుచు మరల మునింగెను. బోయవాఁడు కడుజాగ్రత్తతో వాని నాసుడినుండి వెలికిలాగెను. కాని పాప మాయభాగ్యుఁడు మిక్కుటంబుగ నీరుత్రాగుటచే స్మృతి దప్పియుండుటవలన నాశిరోవేష్టము పట్టువదలి మరల ప్రవాహవేగంబునఁ గొట్టికొనిపోవుచుండెను. మహాబలశాలియైన యానిషాదయువకుఁడు విసువుఁజెందక బలము కొలఁది నీఁది వానిఁబట్టికొని మఱికొంతదూరము ముందు కేగి వానిని గట్టుపైఁ జేర్చెను. వానిని జూచినంతనే బోయవాని కమితమైనసంతోషము కలిగెను. తాను రత్నఖడ్గ మొసంగుటకై కలిసికొనఁగోరిన యువకుఁ డతఁడే. కాని వానిమీనఁ బ్రాణవాయువు లుండెనో లేదో యని బోయవానికి సంశయము కలిగెను. నీరు

విశేషముగఁ దాఁకుటచే వానికడు పుట్టియుండెను. అప్పుడు బోయ వాఁడు వానికడుపు గట్టిగనొత్తి నీరు గ్రక్కించి శుష్కపత్రంబు లేఱి తెచ్చి జ్వాలఁజేసి వానిదేహమంతయుఁ గాచెను. అంతట నాపురుషుఁ డూపిరివిడిచి కను లొక్కింత తెఱచెను. పిదప నాబోయవాఁడు సమీ పంబునఁగల కొన్నియోషధులను దెచ్చి రసముదీసి వానిచేఁ ద్రావిం చెను. కొంతవడికి వీరపాలుఁడు తెలివిఁజెంది బోయవానిని గుర్తించి "పుణ్యపురుషా! నాపాలిటి భాగ్యదేవతవైన నీవే నాకు మరలఁ బ్రా ణదాత వైతివా!" అని కృతజ్ఞతదోఁపఁ బలికెను. అందుపై బోయవాఁ డు "రాజకుమారా! నీ కింక భయములేదు. వాక్పరిశ్రాంతిఁ జెందక యొక్కింతతడ వీబాలతృణాంకురశయ్యపైననే నిద్రింపుము. ఈయో షధిని నీయొద్దనుంచికొని నిస్త్రాణ గలిగినచో మరల నద్దానిరసమును సేవింపుము" అనిచెప్పి యాయోషధిని వాని కొసంగెను.

అప్పటికి తెల్లవాఱినది. చంద్రశేఖరమహారాజు సపరివా రముగ నచ్చోటికి వచ్చెను. వీరపాలుఁడు బాగా తెలివిఁజెంది లేచి ని లుచుండెను. మహారాజ పుత్రునిఁ బ్రియమారఁ గౌఁగిట గదియించి "నాయనా! వీరపాలా! నాకుఁ దక్కితివా తండ్రీ! గంగాభవాని కరు ణించి నిన్ను నా కొసంగినది." అని యింకను దానేమో యనుచుండ వీరపాలుఁడు బోయవానిని జూపి. "తండ్రీ! ఈమహాపురుషుఁడు నన్ను మీకొసంగెనేగాని గంగాభవాని నన్ను మ్రింగివేయుటకే తలంచెను" అని జరిగినవృత్తాంతముఁ దా నెఱింగినంతవఱకుఁ దెలిపెను. మహారా జావృత్తాంతమును విని బోయవాని రెండుచేతులుఁ బట్టికొని పుణ్య పురుషా! నాకు చేసిన యీమహోపకారమునకు నీ వేమిప్రత్యుప కార మపేక్షించెదవు?" అని యడిగెను అందుకు బోయవాఁడు కు పితుఁడై "మహారాజా! మీవంటి యుత్తమక్షత్రియులే యట్లు సెల విచ్చిన నే నేమి మనవిసేయుదును. మానవంతుఁడు మానవసోదర

సోదరీమణులకుఁ బ్రత్యుపకారము నపేక్షించియే యాపత్సమయ ములఁ నడ్డుపడునా? మీరు నాకు సెలవొసంగితిరేని మఱియెవ్వరికైన విప్లవోపద్రవమునుండి కాపాడుభాగ్యము నాకు లభించును. అదియే నే నపేక్షించెడు ప్రత్యుపకారము” అని పలికెను. ఆమాటలు విని మ హారాజు నివ్వెఱఁగందుచునత్యాదరంబున“పురుషవరా! భగవంతుఁడు నీమహోదారవీరవ్రతంబునకుఁ దగినప్రతిఫలం బచిరకాలములోనే యొసంగుఁగాక. పోయిరమ్ము” అని పలికెను. వెంటనే మొలనుండి రతనాలపిడితో నొప్పారెడుఖడ్గమును దీసి “రాజకుమారా! ఈఖడ్గ మును నీవు బెబ్బులినోట విడిచివచ్చితివి ఇద్దాని నీకొసంగుటకై వచ్చి నీ కీయలంతికర్జము నొనర్పఁగలిగితిని. దీనిని దిరుగ నీవు గ్రహించి నాకు సెలవొసంగుము” అని వీరపాలునితోఁ బలికెను. అందుపై వీరపాలుఁడు ‘‘పుణ్యాత్మా! నాకు రెండుసార్లు ప్రాణదాన మొసంగిన మహోదారవీరపురుషుండ వగు నీయెడల నాకృతజ్ఞత నెట్లు చూపు దును? ఈఖడ్గమును స్మృతిచిహ్నముగ నీయొద్ద నుంచుము. తరువాత నేను దిరుగఁ గైకొనియెదను” అని వినయముతోఁ బలికెను. అందు పై బోయవాఁడు ‘‘రాజకుమారా! పరులచే నెద్దియుఁ గొనువాఁడను గానని మున్న చెప్పియుండలేదా? మరల నన్నిప్పు డేల నిర్బంధించె దవు?” ఆమాటలు విని చంద్రశేఖరుఁడు “మహోదారవీరవ్రతా! ఆఖ డ్గము నిప్పటికి నీయొద్ద జాగ్రత్తపెట్టుమని కోరుచుండ నేగాని నీ కిచ్చి వేసితిని తీసికొనుమని చెప్పుటలేదు కదా అయ్యది నీయొద్దఁ గొంత కాలమైన నుండినచోఁ గృతజ్ఞతాబద్ధులమగు మేము నీకును బ్రాణ దాతవగు నీవు మాకును జ్ఞప్తియుండుట కనువగు నని కోరిన యీపాటి యలంతికోరిక నెఱవేర్పఁగూడదా” అని పలికెను. అందుపై బోయ వాఁడు “మహారాజా! నన్ను క్షమింపుఁడు. ఇదే నేఁ బోవుచుంటిని.” అని ఖడ్గము నచ్చో విడిచి యమునానదిలో మరల దుమికెను. చంద్ర

శేఖరుఁడు విస్మయానందతరంగితుండై వీరపాలుని వెంటనిడికొని పరివారసహితంబుగ వెడలిపోయెను.

వరద యింకను నత్యూర్జితంబుగఁ బొంగివచ్చుచుండెను. కూలంబుల నధిగమించి యెన్నియో పట్టణంబులను బల్లెలను ముంచి వేయుచుండెను. బోయవాఁ డతిక్లేశముతో నీఁది యవలిగట్టు సమీపించెను. అప్పుడే గడ్డితోఁ గప్పఁబడిన నులకమంచపుకుక్క యొకటి వానిచెంతనుండి కొట్టికొనిపోవుచుండెను. బోయవాఁ డద్దానిం బట్టికొని యవలిగట్టు చేరెను. వెంటనే మంచముపైనున్న గడ్డి తీసిచూడఁగా నందొక్కముసలిది చచ్చినశవమువలెఁ జైతన్యరహితయై పడియుండెను. ఆమె యింకను జీవముతోనే యుండెనని తెలిసికొని తనమూఁపుపై నిడికొనిపోయి సమీపంబునంగల యొకపత్రికుటీరంబులో నామెను బరుండఁజేసి తగుచికిత్సలఁ బునరుజ్జీవితురాలిఁ గావించెను.

ఆముసలిది కనులువిచ్చి చూచెను. తాను సురక్షితయైనట్లు తెలిసికొనియెను. బోయవెజ్జచికిత్సామహిమచే నొక్కింతపుష్టిఁ జెంది నిషాదయువకునిఁ జూచి "నాయనా! నే నిపు డెచ్చోట నుంటిని?" అని మెల్లగ నడిగెను. అందుపై బోయవాఁడు "అమ్మా! నీవు సురక్షితమైనప్రదేశములో నే యుంటివి. నీ కింక భయములేదు. నీ వింతటివిపత్తున కెట్లు లోనైతివి? నీవృత్తాంతముఁ దెలుపనగునేని వచింపుము" అనిపలికెను. అందుపై నాజరఠి "నాయనా! నీ వెవ్వండవో ముందెఱింగింపుము" అనెను. "తల్లీ! నే నొకకిరాతుండను. హేలాపురపరిసరారణ్యంబున నివసించు వీరధన్వియను నొకకిరాతుని పుత్రుండను. నేఁ బుట్టినపిదపఁ గొంతకాలమునకు నాతల్లి పరలోకగతురాలగుటచే నా తండ్రిచేతనే యతిగారవంబునఁ బోషింపఁబడుచుంటిని" అని పలికెను. ఆమాటలు వినినంతనే ముసలిది తనలోఁదా నేమేమో యోజిం

చుచున్నదానివలె నొక్కింతతడ వూరకుండి, "నాయనా! నేను నమ్మఁజాలను. నీవు మసిపాతనుగట్టిన మానికంబువలెఁ గిరాతవేషధరిచ్చున్నుండవు గాని కిరాతుండవు కావు. కిరాతుల కింతటి నిరుపమాన మహోదారశౌర్యసాహసాదివీరగుణంబులును జగన్మోహనాకారము నలవడునా? నేను పరమపాపాత్మురాలను. అతికలుష మైననావృత్తాంతమును ముందు నీవే తెలిసికొనఁగల్గెదవు. నీతండ్రినిఁ జూడ నభిలషించుచున్నాను. నన్ను నీవెంటఁ గొనిపోయెదవా?" అనియెను. అందుకు వల్లె యని ప్రియాణసన్నద్ధుఁ డగుచుండ నాకుటీరమువెనుక నెవరో మాట్లాడుచున్నట్లు తోఁచుటచేఁ గిరాతయువకుఁడు శ్రద్ధగ నాలకించుచుండెను.

"మొ॥చో—నేఁడు మనము నక్కనడుముఁ దొక్కివచ్చితిమి. వహ్వా! మనపాలిటి భాగ్యదేవతయైన యమునానదీయతల్లి మనయిరువురకు నిరువదివేలరూపాయిల విలువగల బంగారునగల నొసంగినది. ఆముండిపాపిని యెవ్వరోగాని మెడలోనికంఠె దీయుచున్నపుడు నాచెయ్యొడిసిపట్టినది. నేను రెండవచేతితో మొలనున్న కైజారు దీసి కంఠములోఁ బొడిచితిని. పిదప మర్యాదగాఁ దీసికొననిచ్చినది.

రెం॥చో—మిత్రమా! నేనును రెండుమూఁడుదెబ్బలుతిని నా కైజారుతోనే వారిని నెమ్మదిపఱచి కొన్నివస్తువులను గ్రహింపఁగలిగితిని. ఏవిధముననో మన మీమహావిప్లవంబున నేయపాయమును జెందకుండఁ జెరియొకపదివేలరూపాయిలు సంపాదించితిమి. మన మీరాత్రి పాంచాలరాజపుత్రినిఁ బట్టితెచ్చి మనమితుఁ డైన కామపాలునికోర్కె నెఱవేర్చితిమేని యింకను నిరువదివేలు లభించును."

అని యింకను నేమేమో చెప్పఁబోవుచుండ కిరాతయువకుఁడు వెలికి వచ్చెను. వానిని జూచినంతనే చోరులు పాఱిపోయిరి. అతఁడు మరలఁ గుటీరములోనికిఁ బోవనెంచుచుండ సమీపమున నొకకో

లాహలము వినవచ్చెను. కొందఱు పల్లెవాండ్రాకయువకునిఁ జేతులపైఁ గొనిపోవుచుండిరి. బోయవెజ్జామృతపాత్రియుఁ డైనయువకునిఁగూడ నాకుటీరములోనికే రప్పించి ముసలిదానికిఁ జేసినచికిత్స లన్నియుఁ గావించి వానినిఁగూడఁ బునరుజ్జీవితునిఁ గావించెను. ముసలి దాయువకుని గుర్తించి వానిజన్మవృత్తాంతం బొక్కింత యెఱింగినదికావున నమితానందముఁ జెంది "ఓహో! యేమిపుణ్యము; నాయనా! భానుమంతా! నీవు జీవించియే యుంటివా? నేఁ డెట్టిసుదినము!" అని వాని నెన్నుదురు ముద్దుపెట్టుకొనియెను. అదిచూచి బోయవెజ్జాశ్చర్యము నొందుచుండెను.

ఆయువకుఁ డిరువదిరెండేండ్లు వయస్సు గలిగి నూనూఁగుమీసములతోడను విశాలనేత్రయుగంబుతోడను మేల్మిబంగరుమిసిమిగల మైచాయతోడను శ్రీకారంబులంబోని యుదుకర్ణంబులతోడను పృథుపీనవక్షస్థలంబుతోడను దీర్ఘబాహువులతోడను బ్రతాపదీధితుల వెలుంగు ముఖవర్చస్సుతోడను విరాజిల్లుచుండెను. ఆపురుషుఁడు ధరించినదుస్తు లంతవిలువైనవి గాకపోయినను వానికేవి రాజలక్షణముల వెలిబుచ్చుచుండెను. ఆయువకుఁడు తెలివిఁజెందియుండుటచే ముసలిదానిని జూచి "నే నిపు డెచ్చోట నుంటిని? అమ్మా! నీవు సజీవవై నాయొద్దనే యుంటివా?" అని యడిగెను. అందుపై ముసలిది "నాయనా! ఇప్పుడు నీవు నేను మనప్రియాభిలాషులయొద్దనే యుంటిమి. నీ వింక నన్ను విడిచి యెచ్చోటకును బోవసమకట్టకుము" అనెను. తరువాత భానుమంతుఁడు కిరాతయువకునిఁ జూచి "పుణ్యపురుషా! కిరాతవేషంబుననున్న నీ వెవ్వండవైనను నా కిప్పట్టునఁ బ్రాణదాతవైతివి. కావున నే నిదే నాకృతజ్ఞతాభివందనసహస్రంబు లర్పించుచున్నాను" అని పలికెను.

ముప్వురును బయలుదేఱిరి. వీరధన్వకుటీరమును సమీపించు సరికి రాత్రి రెండు యామము లయ్యెను. వీరధన్వ యావచ్చినముప్వురను బ్రియపూర్వకముగ నాదరించెను. తరువాత వీరధన్వ కుమారునితోఁ "ప్రతాపసింహా! ఇంతతడవు నీ వెచ్చోట మసలితివి? వీరు నీ కెచ్చోట నెవ్విధంబున లభించిరి?" అని యడిగెను. అందుపై బోయ యువకుఁడు తండ్రితో జరిగినవృత్తాంతము నెఱింగించి చోరులమాటలు జ్ఞాపకమురా "తండ్రి! నే నొక యత్యవసరకార్యముపై హేలాపుర మేగిరావలసియున్నది ఆలసించితి నేని మన యేలికయైన పాంచాల రాజపుత్రికకుఁ గీడువాటిల్లుట నిశ్చయము." అని నిశితకరవాలంబుఁ గైకొని యతిత్వరితగమనంబున హేలాపురాభిముఖుండై బయలు దేఱెను.

ప్రతాపసింహుఁడు కొంతదవ్వేగినపిదప వానికుపత్యాసంగల కొండలోయనుండి యొకయార్తాలాపము వినవచ్చెను. ఆధ్వని స్త్రీకంఠధ్వనివలె నుండెను. చోరులకు రుద్యము బెఱింగియున్నవాఁడగుటచేఁ గాతరపరిరక్షణాయమానభుజపజరుఁడును వీరాగ్రేసరుండును నగు ప్రతాపసింహుఁడు తత్క్షణమే సజ్యంబగు ధనుస్సునుండి లాగివిడచినబాణమువలె నతిశీఘ్రముగ లోయలోని కేగి యొక వటావృక్షముక్రింద నిరువురుచోరు లొకయెలనాఁగను బంధించి కొనిపోవఁ బ్రయత్నించుచుండుటఁ జూచెను. అప్పుడు ప్రతాపసింహునకు మితిలేనికోపము వచ్చెను. ఫాలనేత్రముఁ దెఱచిచూచెడు కాలాగ్నిరుద్రుఁడో యన నుగ్రుండై వరనుండి కత్తిసిదీసి యొక్కచోరుని గొట్టెను. ఆదెబ్బచే నాచోరుఁడు కుడిప్రక్కలో గాయముపడ రక్తాప్లావితదేహుండై క్రిందఁబడెను. అదిచూచి రెండవచోరుఁడు స్మృతిదప్పి బంధితురాలైపడియున్న లేమనువీడి పలాయితుఁడుగాఁ బ్రయత్నించుచుండ వానిచెయ్యొడిసిపట్టి కత్తిపిడిచే వానిమొమురొమ్ముపై దృఢ

ముగఁ బొడిచెను. ఆపోటుతో వాఁడు క్రిందఁబడెను. వెంటనే వాని కుత్తుకఁ ద్రొక్కిపట్టి "తుచ్ఛుఁడా! నీవు నీప్రాణముల కాసించితివేని మెదలక పడియుండుము" అని మఱియొకపోటుఁ బొడిచి వివశుఁడై యున్న వానిని వీడి యాజవ్వనిని బాధవిముక్తురాలను గావించెను. పాప మాలేమ కింకను స్మృతి రాలేదు. ప్రతాపసింహుఁడు పడియున్న చోరుల నిర్వుర నాతాటిచే నావటవృక్షమునకుఁ జేర్చికట్టి "క్రూర రాక్షసులారా! మీ కీమనుష్యలోకంబునఁ జేయుటకు యెద్దియుఁ జాలదు. అధోలోకంబున మీకుఁ దగినశిక్ష కలుగును" అని యాసుందరియొద్ద కేగెను.

అంత నాపూఁబోఁడికిఁ దెలివివచ్చెను. భయవిహ్వలయై చకిత దృష్టుల నల్గడలుఁ బరికించిచూచెను. చెట్టునకుఁ గట్టివేయఁబడిన చోరులను జూచి సహర్షయై కొదమసింగమువలెఁ దనయెదుటనున్న ప్రతాపసింహునిఁ జూచి యామహావీరుఁడే తన మానప్రాణరక్షకుం డని తెలిసికొని దిగ్గన లేచి వానియెదుట మోకరించి "పుణ్యపురుషా! నేఁడు నీవు నాకొనర్చిన మేలు నే నాజన్మాంతరమును మఱవఁజాలను. నామానప్రాణములను గాపాడిన మహావీరుఁడ వగు నీ కిదే వందన సహస్రము లర్పించుచున్నదానను" అని నమస్కరించెను. ప్రతాపసింహుఁడు వీరోచితంబుగ నామెను లేవఁదీసి "మానవతీమణీ! దుర్జనుల దౌర్జన్యంబుచేఁ గుసుమకోమలి వగు నీ కీయుగ్రారణ్యంబున నిట్టి విపత్తు గలిగినందు కెంతయుఁ జింతిల్లుచున్నాను. అదృష్టవశమున సమయమునకు వచ్చి నీ కొకింతమేలు సేకూర్చుభాగ్యము నాకు లభింపఁజేసినభగవంతునకు నేనుగూడ ననేక భక్తిపూర్వకవందనము లర్పించుచున్నాను" అని పలికెను. ఆమాటలు వినినంత నే యావాల్గంటి గెంటినతమకంబునఁ బ్రతాపసింహునిపై నుత్కలికఁ దన బెళుకుఁజూపులు సారించుచుఁ "కైతవకిరాతవేషంబున నార్తత్రాణపరాయణుం

డవై నామానప్రాణంబుల రక్షింపవచ్చిన మహావీరుండవగు నీపవిత్రనామాక్షరంబులను వినఁగోరెదను" అని దరహసితవదనపంకజయై యల్లనఁ బలికెను. ఆమాటలు వినినంతనే ప్రతాపసింహుఁడు కడుముగ్ధుఁడయ్యెను. వానిహృదయమున నపూర్వభావము లెన్నియో యుదయించుచుండెను.

ఉదాత్తధీరుండగు నామహావీరుండట్లు ముగ్ధుండయ్యు సంశయాకులితచిత్తుండగుటవలనఁ బ్రత్యుత్తరము వెంటనే యొసంగఁజాలక కొంతసేపాలోచించి నిజభావోర్మికల వెలి కుబ్బనీయక "లలనామణీ! నాపేరు ప్రతాపసింహుఁడు. నిన్నుఁగానక నీతల్లిదండ్రులు నీకై యెంతపరితపించుచుందురో! నీ పరిశ్రాసమయంబున దుర్గమారణ్యముగుండా నొంటిగఁ బోఁజాలవు. నీ వనుమతించెదవేని నిన్నుఁ గొనిపోయి నీతల్లిదండ్రుల కప్పగించి వచ్చెదను. ఏమనియెదవు?" అని యడిగెను. అందు కాతరుణీమణి హర్షపులకితగాత్రియై వ్రీడాభరంబున శిరంబు వంచి "భవాదృశు లగు మహోదారవీరశిఖామణుల కంతటిదయ నాపైఁగలిగినచో ధన్యురాల నైతి ననియే తలంచెదను." అని యల్లనఁ బలుకుచుఁ గ్రీగంటిచూపుకోపులఁ బ్రతాపసింహునకుఁ బారితోషికం బొసంగెను. అంత నాయిర్వురు నచ్చోటు వదలి హేలాపురాభిముఖులై బయలుదేఱిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ

## నాలుగవ ప్రకరణము.

చ. ఖలులను రంతకృత్యముల బుణ్యపరాక్రమశాలురౌ మహో
జ్జ్వలగుణవన్తనీ సుజనపాలనశౌర్యుల కెల్లసౌఖ్యముల్
గలుగఁగఁ జేయు నైనఁ దొలఁగఁగ నొనర్చుచు వారి వైరమె
ల్లలనొ గాని పుణ్యసుఖవంతులఁ జేయుచు పంచు నిమ్మహిన్.

ఆకాలమునఁ బాంచాలరాజ్యలక్ష్మీపురరత్నదామమేనవమైన హేలాపుర మహైశ్వర్యంబులును గలిగి సిరి కాటపట్టై విలసిల్లుచుండెను. విశాలమైన రాజవీథులును వానికిరుప్రక్కలనత్యున్నతగోపురాట్టాలకశోభాభిరామంబు లైన ప్రాసాదంబులును సమస్తవస్తుపరిపూర్ణంబులైన విపణిప్రదేశంబులును గలిగి తృష్ణాశాంతమధురజలసమృద్ధంబై సకలజనసుఖావహంబై విరాజిల్లుచుండెను. ఆపురవతంసంబు చుట్టును సహజముగ నేర్పడిన గభీరపరిఘమై పురలక్ష్మి ధరించిన మొద్దాణమో యన జాలానది ప్రవహించుచుండెను. ఆమొద్దాణమునకు మరకతహరిద్రంబులు దాపికో యన సరుబుజంబులఁ బచ్చికబయళ్లును కేదారంబులును బ్రకాశించుచుండెను.

ఉత్తరదిశయందానదిపై నొకబలమైనవంతెన కలదు. అయ్యది పురముఖద్వారమున కంటియుండెను. ఆవంతెన యుద్ధసమయములయందుఁ బైకిమొత్తివేయుటకును శాంతసమయములయందు వ్రాల్చియుంచుటకును వలయునేర్పాటులను గలిగియుండెను. పురంబులోఁ బ్రవేశించునట్టియు నద్దాని నిర్గమించునట్టియు యాతాయాతజనంబులావంతెనమీఁదనుండి పోవలయునేగాని వేఱుమార్గము లేదు. అసం

ఖ్యాకంబగు గోగణం బెప్పుడు నాపచ్చికబయళ్లలో మేయుచుఁ జిఱ్ఱ పట్టియుండును ఆపురంబున కనతిదూరంబునఁ బర్వతారణ్యంబులు పెక్కులు గలవు.

ఆపురవరంబుఁ బాంచాలరాజ్యరమాకళత్రుం డగు సుదర్శన మహారాజేలుచుండెను ఆతండే బదిసంవత్సరములవయస్సు గలవాఁ డయ్యును దృఢకాయుఁడై భుజములపై నుగ్గులుదేఱి వ్రేలాడు నల్లని దీర్ఘశిరోజంబులు నిమ్నప్రదేశ నాఁపఁగల మెలితిరిగిన నల్లనికోఱమీసంబులును శారదాసదనంబగు నత్యున్నతఫాలంబును నిత్యప్రసన్న వీక్షణంబులఁ దనుపు సువిశాలనేత్రంబులును నాజానుబాహువులును వెడందయురంబును హర్యక్షమధ్యంబును గలిగి పిఱుఁదివియనివీరంబున భీష్ముని, వదాన్యత శిబికర్ణదధీచులను బురడించుచు రాజనీతియందుఁ గవిగురుల దెక్కసేయక ప్రజ్ఞాదక్షుండై యొప్పారుచుండెను.

అధరారమణుని పేరు వచింపవినంతమాత్రమున భీతిచే శత్రువులు గజగజ వణంకుచుందురు. ఆతఁడు సుదర్శనుండగుటచే వానిసుస్వరూపసౌందర్యంబును దిలకించియుఁ గర్ణరసాయనంబులగు వాని మహనీయమంజులమధురాలాపంబుల నాలకించియు వానిమహోదార్యభూతదయాదిగుణఫలవిశేషంబుల ననుభవించుచుండియుఁ దనివిసనక నుత్సహించు నాశ్రితజనులు రాజ్యమునం దెల్లెడల గుజగుజలుపోవుచుందురు రాజ్యప్రజల నతిదాక్షిణ్యభావముతో నాదరించు ప్రభువగుటచే నతఁ డాశ్రితజనచింతామణి యని ప్రసిద్ధిఁ జెందియుండెను. ఆమహారాజెప్పుడును ప్రజలసౌఖ్యముకొఱకే పాటుపడుచుండును గాని యెన్నండును స్వసౌఖ్యము నపేక్షించి పాటుపడిన వాఁడు కాఁడు. ఆధర్మమూర్తిపాలనములోఁ బాంచాలరాజ్యమును రామరాజ్య మని లోకులు కొనియాడుచుండెడివారు.

అట్టిధర్మప్రభు వైన సుదర్శనమహారాజు చిరకాల మనపత్యుఁడై సంతానముకొఱ కెన్నియో ధర్మకార్యము లొనరించి యిష్టదేవతాప్రసాదంబున నొకకుమారీరత్నంబును గాంచెను. ఆకన్నియ శుక్లపక్షచంద్రికవలె దినదినప్రవర్ధమానయై సంగీతసాహిత్యాదిసమస్తవిద్యలయందు నసమానశేముషీవిశేషురాలై వీరపురుషుల ధిక్కరింపఁజాలు శౌర్యధైర్యగాంభీర్యసాహసాదిగుణ బులను గలిగి నవలావణ్యాదిభితులచేతను మించుతీవనుగేరు మైచాయచేతను గుసుమకోమలావయవసౌష్టవంబుచేతను సకలధీరజనహృదయాకర్షణసమర్థంబగు జగన్మోహనయంత్రంబనఁదగిన తేజస్విని యయ్యెను. ఆలేమసౌందర్యం బవాఙ్మానసగోచరం బగుటచే వేనోళ్లుగలిగిన చిలువరాయఁడైన వర్ణింప నలవికాదు.

మహారాజాలేమను నెంతయో ముద్దుమురిపెముల గారవించుచుండెను. పదియారేండ్లవయసునకు నాయింతి యువజనదృక్పిపాసాళికులంబునకుఁ గంతునిచేతిపూలబంతియో యన వింతహాయులఁజెన్నారుచుండెను. ఆబిడ్డ నగువెన్నెల గానరానిచో నామహారాజునకు లోకమంతయు నంధకారమయంబుగఁ దోఁచుచుండెను. ఆజవ్వని తననేత్రకుముదంబులకుఁ జంద్రికళ యగుటచే మహారాజాలేమకుఁ జంద్రికళ యని పేరిడెను.

ఆతరుణీమణి స్త్రీజనసామాన్యఖేలనాలోలత్వంబునఁ గేళీవనంబులఁ బరిభ్రమింప నెగి గగనరంగంబున రిక్కచెలికత్తియలతోఁగూడి విహరించు రేవెలుంగుకైవడి నిజసఖీజనంబుతోఁ గూడి పుష్పాపచయవినోదంబులతోడను కేలికాహోహాణంబులతోడను గందుకపతంగాదిఖేలనావిశేషంబులతోడను వ్యాయామవిహారంబులతోడను జలక్రీడలతోడను గొంతతడవు సాయంసమయముల వాహ్యాళినెసంగి సూర్యుఁ డస్తంగతుఁ డగుచున్నతఱిఁ బ్రతిరోజునను నశ్వారాజం

చెక్కి సఖీద్వితీయయై ధనుర్బాణంబులఁ గైకొని యుషాఘాటవిహారో
త్సుకత సమీపారణ్యభూములకు సాయంసమయముల వాహ్యాళి
కేగుచుండెడిది.

ఒకరోజునఁ జంద్రికళ కేళికోద్యానవనవిహారానంతర మాఘో
టఖేలనోచితములైన దుస్తులను ధరించి ధనుర్బాణంబులు గైకొని పం
చకల్యాణికళ్ళము నెక్కి సఖీద్వితీయయై తండ్రిగారిసెలవుఁ గైకొని
యుత్తరారణ్యభూములకు బయలుదేఱెను. వారిరువురుఁ బురోపకంఠం
బునం గలవంతెనను దాఁటిరి. ఆసమయంబున వృద్ధభానుకిరణప్రసా
రంబుచేఁ గేదారంబులెల్ల బంగారుమలాము చేసి మెఱుఁగిడినట్లు కన్న
ట్టుచుండెను. హాలికులు తమపను లుజ్జగించి పురంబులోనికేగ నా
యత్తపడుచుండిరి. పచ్చికబయళ్ళ విచ్చలవిడిఁ గసవు మెసవి చేఁపిన
పొదుగులతో లేఁగలకుఁ బాలొసంగ నావులు మూఁతులెత్తి యంభా
రావములు సేయుచుండెను. లేఁబచ్చికఁ గడుపారఁ దిని యత్యుత్సా
హంబునఁ దఱిపిడుపొతలు అంకెలువైచుచుండెను. శుకపికశారికాని
కురుంబంబులు కిలకిలారావంబులఁ గొమ్మలనుండి యిమ్మల కేగుచుం
డెను. పరిమళమిళితమందమలయమారుతకిశోరంబులు హాయిగఁ బైఁ
బొలయుచుండెను.

అట్టిమనోహరమైన ప్రకృతిసౌందర్యమును జూచి యానందిం
చుచు నాయిరువురుఁ జనుచుండిరి. సూర్యుఁ డస్తమించెను. పద్మినీ
కాంత ప్రియునివియోగంబునకుఁ గుందుచు శిరంబు వాల్చి మంచు
బిందులమిషచేత నశ్రుకణంబుల రాల్చుచు దుఃఖించుచుండెను. ధవళ
పుష్పాలంకృతంబైన నీలాంబరవితానంబో యనఁ దారకానిచయసమం
చితంబై గగనంబు శోభిల్లుచుండెను.

అంత దవ్వుల నొకవ్యక్తి వికృతాకారంబున నామృగయాకామి
నులకు గోచరమాయెను. వెంటనే యదృశ్యమగుటచే నావ్యక్తి యేఁ

మైయుండునో యని వారిర్వురు యోజించుచుండిరి. అప్పటికి చంద్రో దయమగుటచే వెన్నెల దశదిశల నలమికొనియెను. ఆమృగయాముణు లు మఱలి పురాభిముఖు లైరి. మధురిక ముందును జంద్రకళ వెనుకను గుఱ్ఱములను నడిపించుచుండిరి.

ఆసమయంబున "హా! హా! రక్షింపుడు-చోరులు" అని కెవ్వున నొక కేక వైచి చంద్రికళ భూమిపైఁ బడెను. మధురిక మఱలిచూచు నరికి నల్లనిముసుఁగులచే మొగములను మాటువఱచియున్న యిరువురు చోరు లామెలనాఁగ నెత్తికొని పరుగిడిపోవుచుండిరి. అట్టి భయంకరో త్పాతంబును జూచి మధురిక దుఃఖావేశంబున నోడ లెఱుఁగక "అయ్యో! ప్రియసఖి! చంద్రికళా! ఓపుణ్యాత్ములారా! పాంథులారా! వనపాలకులారా! నిషాదులారా! మానెచ్చెలి యగుచంద్రికళను జోరు లెత్తికొనిపోవుచున్నారు. రక్షింపుఁడు. రక్షింపుఁడు. అయ్యో! ఇక్కడ నామొఱాలించువా రెవ్వరు? ఇంక నాకుగతియేది? దైవమా! నీవే గతి. మాచంద్రికళను రక్షింపుము." అని యెల్గెత్తి రోదనమొ నర్చుచు నీదుర్వార్త మహారాజుగారి కెఱింగింప నతివేగంబునఁ బురం బులోని కేగెను.

సుదర్శనమహారాజు తన ప్రియకుమారీమణి యగు చంద్రికళ వాహ్యాళినుండి నడిరేయివఱకు రాకుండుటచే నాందోళన మొందుచుం డెను. త్రోవలో నామె కేమైన యాపద ఘటిల్లెనేమో యని భయ విహ్వలుఁ డగుచుండెను. వచ్చి యెచ్చోటనైన నిలిచియుండెనేమో యని పురమంతయు వెదకించుచుండెను. పౌరులతిసంభ్రమంబున నెల్ల యెడల నరయుచుండిరి.

అట్టియెడ మధురిక రోదనమొనర్చుచు వచ్చి గుఱ్ఱమును డిగ్గి మహారాజుపదములపైఁ బడి జరిగినవృత్తాంతమంతయు డగ్గుత్తికతో నె ఱింగించెను. కోపవిషాదంబులు మనంబునఁ బెనఁగొన మహారాజు తు

ళ్ళిపడి లేచి ఖడ్గంబుఁ జేతఁబట్టి పుత్రికాన్వేషణార్థ మాశ్వికదళంబు తోఁ బ్రిశయకాలరుద్రునివలె బయలుదేఱెను.

అందఱును వంతెనను దాఁటిరి. ఆయుత్పాత మొదవినచోటుఁ జూపుటకు మధురిక వారివెంట వచ్చుచుండెను. నిండు వెన్నెల పిండారఁ బోసినట్లు మెండుగఁ దేజరిల్లుచుండెను. ఆశ్వికభటులకోలాహలంబుచేఁ గ్రూరమృగంబులెల్ల భయంకరారావంబుల నిట్టట్టుఁ బఱచుచుండెను.

ఆసమయంబున మధురిక తా నారోహించినవారువం బొకశాస్త్రాలమ్ముం గని బెదరి యస్వాధీనంబుగఁ బరుగిడుచుండ నొకయొడ్డిరికాబు పట్టుదప్పి గుఱ్ఱముపైనుండి క్రిందఁబడెను. ఆదెబ్బచే నాకన్నియ స్మృతిదప్పి యుండెను. మహారాజా సమాచారమును విని యామె నతిజాగ్రతగఁ బురంబులోని కనిపి తాను నిజానుచరులతో మరల బయలు దేఱెను.

అంత నాకస్మికంబుగఁ జండ్రికారుచిఁ గ్రిలు నమూల్యవజ్రాలంకృతనీలాంబరవితానంబువోలె శోభిల్లుచున్న తారకాగణసముంచితగగనలక్ష్మి యామహారాజు దురవస్థను జూడలేక మాటుమడఁగెనో యన నొక్కమాటుగఁ గారుమబ్బులచే దట్టముగఁ గప్పివేయఁబడెను. తీవ్రతీవ్రగతిఁ బెనుగాలి వీవఁదొడంగెను. తళుక్కు తళుక్కుమని మెఱుములు కనులకు మిఱుమిట్లు గొలుపుచుండెను. గుండియలవియునట్టుల నుఱుము లుఱుముచుండెను. దృఢమైన మహోన్నత మహీరుహంబులుఁ గూడ కూఁకటివేళ్ళతోఁ బెల్లగిల్లి పడిపోవుచుండెను. వర్షము తుపానుగ నారంభించెను. చిమ్మచీఁకటి కారుక్రమ్మియుండెను. గాలి తగ్గినకొలంది వర్షము బలమయ్యెను. ఆకసము చిల్లిపడినట్లు జోరుజోరునఁ గుంభవృష్టి కురియసాగెను. ఇనుపగుండ్లతోఁ గొట్టినట్లు వర్షధారలు ముఖమును బ్రద్దలుగొట్టుచుండుటచే నాశ్వికభటులు బహుముఖంబులఁ జని వృక్షములదరికిఁ జేరిరి. మహారాజు

మాత్రి మొక్కరుం డయ్యె నాయుపద్రవంబును సరకుగొనక చను చునే యుండెను.

పాఠకమహాశయులారా! ప్రేమ యెంతబలవత్తర మైనదో చూచుచుంటిరా! ప్రేమమయమైన హృదయము మంచుగడ్డవంటిది. ఏపాటికాక తగిలిన నది కరఁగి నీరగుచుండును. అట్టిగాఢాంధకార సమయంబున మధ్యవయస్కుం డగు నామహారా జెన్నండు నెండ కన్ను వానకన్ను నెఱుంగని యాగర్భశ్రీమంతుఁ డయ్యుఁ బ్రేమబలం బున దుష్టమృగాభీలనినాదంబులకు బెదరక చండకంటకంబుల నర కుగొనక గుట్టలను గోతులను గమనింపక వృక్షలతానికుంజనీరం ధ్రం బైన యాకికార్యణంబునఁ బోవుచుండెను.

ఆశ్వికభటులు తీవ్రమైన యావర్షములోఁ దమగుఱ్ఱములను నడి పింపఁజాలక చెట్లక్రిందఁ జేరి రని చెప్పియుంటిమి. ఒకభటుఁడు తాను నిలిచినచెట్టుదాపునఁ గల వేఱొకచెట్టుపై "మిత్రులారా! నిశ్శబ్దముగ నుండుఁడు. రాజభటులు మనచెంతనే యున్నారు." అను మాటలను విని దుర్మార్గు లగుచోరు లందుండిరి కాఁబోలు నని తలంచి గుఱ్ఱము ను దిగి మెల్లగఁ దక్కినభటులయొద్ద కేగి సంగతిఁ దెలిపి వారిని వెం టఁగొనివచ్చి చోరులున్న చెట్టుచుట్టు నిలిపి క్రిందకు రండని చోరుల నదలించెను.

ఆచెట్టుపై మువ్వురుచోరులుమాత్రమే కలరు. వారిలో నిద్ద ఱు గాయములచే వేదనఁ జెందుచుండిరి. ఒక్కఁడుమాత్రము ఖడ్గధా రియై యొకచేతఁ దాడుమట్టను బట్టికొనియుండెను.

రాజభటుఁ డట్లదలించినతోడనే యామువ్వురుచోరులును క్రిందకు మెల్లగ దిగి వచ్చిరి. వెంటనే రాజభటు లామువ్వురిని బట్టి కొని కరచరణంబుల దృఢముగ బంధించి "దుర్మార్గనిశాటులారా! మాచంద్రికళాదేవి నేమిచేసితిరో యిప్పు డామె యెందుండెనో శీఘ్ర

ముగ వచింపుఁడు. అసత్య మాడితి రేని యిప్పుడే మీకుత్తుకలను గఱుక్కున నఱికివైచెదము" అని గద్దరించి పలికిరి. ముష్కరు లగు నా చోరు లామాటలకు బెదరక నిశ్చలచిత్తులై "రాజభటులారా! మేము బాటసారులము. దుష్టు లగుచోరులబారిఁ జిక్కి మాసర్వస్వమును గోల్పోయి ఖడ్గప్రహారంబుల గాయములను జెంది వివశులై పడియున్న యీనామిత్రులను విడి యసువులపై నాసచే నేనొక్కరుండఁ బలాయితుండనై యొక్కింతతడవునకు మఱలి నామిత్రులయొద్దకు రా వారిర్వురు నీతాటిచేఁ గట్టివేయఁబడి యుండిరి. చోరు లేగియుండుటఁ దెలిసికొని యాత్రాడు విప్పి నామిత్రులను వెంటఁగొనివచ్చుచుండ బెనుగాలి తటస్థించుటచే నడవలేక క్రింద నున్నచోఁ జెట్టు విఱిగి పడు నేమో యని చెట్టుపైఁ గూర్చుంటిమి చంద్రికళాదేవిని గుఱించి మా కేమియుఁ దెలియదు. కాని యెవ్వరో యొకపురుషుఁ డొకయొలనాఁ గను వెంటఁగొని యాదిక్కున నేగుచుండఁ జూచితిమి. వా రెవ్వరో మే మెఱుంగము" అని యాఖడ్గధారి పలికెను. అందుపై నొకరాజ భటుఁడు ఖడ్గమును ఝళిపించుచు "ఓరోరి జాల్మా! అసత్యవక్రిసంభాషణంబులఁ దప్పించికొనఁ జూచుచుంటివా ? నిజము చెప్పెదవా లేదా ?" అని కత్తిపిడిచే నొక్కపోటుఁ బొడిచెను. ఆపోటుతోఁ గ్రింద(ఁ)బడి వెంటనే లేచి "రాజభటులారా! మేము నిరపరాధులము. పరమసాధులైన బాటసారులను బాధించుట పౌరుషవంతు లగు మీవంటి వీరపురుషుల కుచితము గాదు. వర్షము వెలిసినది. మమ్ములను బోనిండు." అని పలుకుచుండ "హాహా! బిడ్డా! చంద్రికళా!" అను నార్తనాదము వినవచ్చెను. వెంటనే యెద్దియో క్రిందఁబడినట్లు చప్పుడయ్యెను. తమప్రభువున కేమియుపద్రవము తటస్థించెనో యని చోరుల నలుగురుభటుల కప్పగించి మిగిలినయాశ్వికు లందఱు నార్తధ్వని వచ్చినచోటునకుఁ బరుగిడిరి.

సుదర్శనమహారాజు ఘోరారణ్యముగుండా పుత్రికాన్వేషణపరాయణుండై తదేకలక్ష్యంబునఁ బోవుచుండఁ దళుక్కుమని యొకమెఱపు మెఱసెను. ఆమించువెల్గున నల్గడలుఁ బరికించి చూచుచుండ దవ్వుల నిరువురు బాటసారులు తన కభిముఖంబుగ వచ్చుచున్న ట్లాతనికిఁ దోఁచెను. చంద్రికళయే యెవ్వరితోనో వచ్చుచుండెనని యుత్కలికఁ జెందుచు వారి నతిశీఘ్రముగఁ గలిసికొనుటకై గుఱ్ఱము నతివేగముగఁ బరుగిడఁజేయుచు నొకగుట్ట యెక్కుచుండెను. వర్షముచే నాగుట్టపై ఱాళ్ళన్నియుఁ దడిసియున్నందున కాళ్లు జాఱుటచే గుఱ్ఱముతోఁ గూడ నామహారాజు దొర్లి క్రిందిపల్లములోని యొకముండ్లపొదలోఁ బడెను.

ఆధ్వని విని రాజభటులు లచ్చోటికిఁ బరుగిడిరి. మహారాజు కాన్పించలేదు. ఆప్రదేశమంతయును వెదుకగా నొకముళ్లపొదలో గుఱ్ఱము చచ్చి పడియుండెను. దానికనతిదూరంబున నొకపురుషుఁడు చైతన్యరహితుఁడై ముళ్ళపొదలోఁ జిక్కుకొని యుండెను. వానిదేహమంతయు గాయములుపడి రక్తసిక్తమయ్యెను. ముండ్లు గాఢముగఁ గుచ్చికొని యుండెను. మహారాజుదేహశోభ యిట్టిదని తెలుపుటకై యరుణుండు పూర్వదిక్తటంబున కెంజాయల మెఱుఁగిడుచుండెను. వాని పరిభ్రమణక్లేశంబు వాపఁ జల్లనిపిల్లవాయువులు వానిపై నల్లనఁ బొలయుచుండెను. శకుంతసంతానంబు లవ్యక్తమధురాలాపంబుల వాని మేల్కొలుపుచుండెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఆఱవ ప్రకరణము.

---

చ. అగణితశౌర్యసంపద మహామహిమోన్నతిఁ గాననంబునన్
మృగయులచేతఁ జిక్కువడి మృత్యువువాతను గూలనున్న సో
యగపుశుకంబుఁ గాచి హృదయం బనుపంజరమందు నిల్పియుం
డఁగ దయ వీడి వెండియుఁ గడంగెద ద్రోయఁ గిరాతుబారికిన్.

ప్రతాపసింహుఁడు తండ్రియొద్ద సెలవుఁ గైకొని వెడలినపిదప వీరధన్వి వృద్ధనారినిఁ జూచి "అమ్మా! నాభాగ్యదేవతవైన నిన్నెంతకాలమునకుఁ దిరుగఁ జూడఁగలిగితిని. నీనిజవృత్తాంత మెఱుఁగఁగోరి యెన్నియోప్రయత్నములు చేసితిని; కాని వ్యర్థుండ నైతి. నీవు నాకోసంగినబిడ్డఁ డెవరో తెలియకయ పుత్రవాత్సల్యమున నింతవఱకుఁ బెంచితిని. ఇరువదిసంవత్సరముల ప్రాయమువాఁ డైనను మాజాతిమర్యాదలు గాని యాచారములు గాని వాని కలవడియుండలేదు. ధనుర్విద్యయం దసమానప్రజ్ఞాధురీణుఁ డయ్యు వ్యర్థముగఁ బ్రాణిహింసఁ జేయుట కోర్వఁడు మాటలచేతను సాహసక్రియలచేతను నమానుషతలంపులచేతను విశేషించి నిరుపమానప్రభాభాసితసుస్వరూపప్రతాపాదిగుణములచేతను మహారాజపుత్రుఁ డైయుండు నేమో యని యభిప్రాయపడుచున్నాను. వాని జన్మవృత్తాంత మొక్కింత యెఱింగించెదవా?" అని యడిగెను. ఆమాట విని యిందుమతి "నాయనా! కొద్దిరోజులలో వానివృత్తాంతము నీకేగాక లోకమంతకును వెల్లడి కాఁగలదు. వాని జన్మరహస్యము ప్రతికూలసమయమున వెల్లడియైనచోఁ గార్యవిఫలత్వ మొదవుటయే గాక వానికి నీకు నాకు

మనతో సంబంధించినవారికిఁగూడఁ బ్రాణహాని తటస్థించును. కావునఁ ద్వరపడకుము" అని పలికెను. అందుపై వీరధన్వి "అమ్మా! నీతో వచ్చినయువకుఁ డెవ్వరు? వానివృత్తాంత మేమైన నేను విననగునా?" అని యడిగెను. అందు కాయిందుమతి యేమో చెప్పఁబోవుచుండ వాకిట జనసంకులము వినవచ్చెను. వీరధన్వి వెలుపల కేగెను. ప్రతాపసింహుఁడు కొందఱు రాజభటులతోడను నొకజవ్వనితోడను స్మృతిదప్పి పడియున్న సువర్ణునితోడను బంధితులైనచోరులతోడను కుటీరముచెంత కేతెంచెను. మహారాజును గొనిపోయి లోనఁ బరుండఁ జేసిరి. దీపపుకాంతిని వీరధన్వి మహారాజును గుర్తించి సంభ్రమాశ్చర్యవిషాదంబులు మనంబునఁ బెనంగొనఁ దగుచికిత్స లొనరించుచుండెను. ఇందుమతి చంద్రికళ కుపచారములు సేయుచుండెను. బంధితులైనచోరులను రాజభటులు వాకిటఁ దమస్వాధీనమునం దుంచుకొనిరి. ఇందుమతివిచార మింతింత యని చెప్ప నలవిగాకుండెను. భానుమంతుఁడు లేచి కళవళపడుచుండెను.

బోయవానిచికిత్సాప్రభావంబునఁ గొంతసేపటికి మహారాజునకొకింత తెలివివచ్చెను. చంద్రికళయు మూర్ఛదెలిసి లేచి తండ్రికుపచారము లొనరించుచుండెను. మహారాజు కనులు విచ్చి చూచెను. తా నా కుటీరములోని కెట్లువచ్చితి నని విస్మయాకులితచిత్తుఁడై మరల కనులు మూసెను. జగన్మోహనాంగి యగు నొకయెలజవ్వని వానిగాయములకు బోయవాఁడు చెప్పినట్లు కట్లుగట్టుచుండెను. ప్రతాపసింహుఁడును వీరధన్వియు మహారాజునకిరుబుజంబుల నిలిచి తాళవృంతంబుల వీచుచుండిరి. కొలువువారందఱు దూరమున నిలిచియుండిరి. తండ్రి తెలివిఁజెందె నని చంద్రికళ యెఱుంగదు. తనకుఁ గట్లుకట్టుచున్న జవ్వని తనప్రియకుమారీమణి యగుచంద్రికళ యని మహారాజు నెఱుంగఁడు. మహారాజు మరల బాగుగఁ దెలివిఁజెంది విచ్చవడినచూపుల

తో నల్వురంకులఁ గలయఁజూచుచు నొక్కింతతడవు నిర్విణ్ణుఁడై యుం డి "పుణ్యాత్ములారా! నాచంద్రికళను మీ రెచ్చటనైనఁ గనియుండి రా?" అని యల్లన నడుగుచు లేవఁబోయి పడిపోయెను. ఆమాట విని నంతనే చంద్రికళ తుళ్ళిపడి లేచి, "జనకా! జనకా! నీ కింతటియాపద ఘటిల్లుటకు హేతుభూత నగు మందభాగ్యురాలను నీచంద్రికళను నేనే నీయొద్దనే యున్నాను. హా! హా! తండ్రీ! నీ వెంతటివిపత్తునకు లోనైతివి!" అని పట్టరానిదుఃఖావేశంబునఁ దండ్రియక్కున వ్రాలి వెక్కి వెక్కి యేడువసాగెను. మరల మహారాజు తేఱిచూచి తనయెద పై వ్రాలి యేడ్చుచున్న ముద్దులగుమ్మ తనయనుంగుఁజంద్రికళయే యని తెలిసికొని పట్టరానిసంతోషముతో "అమ్మా! చంద్రికళా! ని న్నీజన్మంబున మరలఁ జూడఁగలిగితినా తల్లీ! నీముద్దుమొగ మేదీ?" అని మఱియొకసారి లేవఁ బోయి పడిపోయెను. వీరధన్వీసలహాపై నో షధీమిళితమైనపాలు చంద్రికళ వానిచేఁ ద్రావించెను.

మఱికొంతసేపటికి చంద్రికళ తిరుగ లభించిన దనుసంతోష ముచేతనో వీరధన్వచికిత్సాప్రభావంబున గాయములు మాని బలము గలుగుటచేతనో మహారాజు చివాలున లేచి కూర్చుండి కూఁతుం బ్రియ మార ముద్దుబెట్టికొని "తల్లీ! నీ వాచోరులనుండి తప్పించికొని యెట్లు రాఁగలిగితివమ్మా! నన్నుఁ గాపాడి నా కింతటిమహోపకార మొన రించిన పుణ్యాత్ముఁ డెవ్వరో చెప్పఁగలవా?" అని యడిగెను. చంద్రి కళ తండ్రికుడిబుజంబుపైఁ దనశిరంబు వాల్చి "జనకా! దైవానుగ్ర హంబుచే వీరశిఖామణుల సహాయమును బడయఁగల్గినవారి కెట్టియా పదలైన రానేర్చునా?" అని ప్రతాపసింహునిపై నోరచూపు పాఱఁటి సారించి సిగ్గుచేఁ దన లేనగుమొగంబు వంచి యూరకుండెను. ఆచేష్ట వలన మహారాజామెభావమును దెలిసికొని "ఏమీ! ఆమహాపురుషుఁ డితఁడేనా?" అని తనకుడిబుజంబుచెంత నున్న ప్రతాపసింహుని

చేయిఁ బట్టుకొని "ఓపుణ్యపురుషా! కిరాతవేషంబుననున్న నీ వెవ్వం డవైనను నాపాలిటి యదృష్టదేవతవై ప్రాణసమాన యగు నాయీ యనుంగుచంద్రికను రక్షించి నాకుఁ బ్రాణదాత వైతివి. నేఁడు నీవు నాకొనర్చినమహోపకారమునకుఁ దగినప్రత్యుపకార మొనర్పలే కున్నను వీరధూర్జటి వగు నీ వాచంద్రతారార్కంబుగఁ గాతరపరి రక్షణాయమానభుజపంజరుఁడవై దివ్యయశశ్చంద్రికళావిలసితుండవై ధరాతలంబున వర్ధిల్లున ట్లనుగ్రహింప జీవితకాల మంతయు నాయి ష్టదైవమును బ్రార్థించుచుండెదను. ఓదయామయా! నీపవిత్రనామా క్షరంబులను దెలిపి నీవృత్తాంత మేమో వివరించి నాకుఁ జెవులపండు వ గావింపుము" అని సాదరంబుగఁ బలికెను. ఆమాటలు విని ప్రతా పసింహుఁడు కడుముగ్ధుఁడై వినయవినమితగాత్రుఁడై "మహారాజా! పరమధర్మస్వరూపులును కృపాయత్తచిత్తవృత్తులును నగు మీవంటి యుత్తమప్రభువుల కొక్కింత యుపకరింపఁ గలిగినభాగ్యము నాకుఁ జాలదా? మీరు వేఱుగ నాకుఁ బ్రత్యుపకార మొనర్పవలెనా? నికృష్టుఁ డెవ్వఁడో తప్ప మానవమాతుఁ డైనవాఁడు వివేచితకులంబునం బుట్టి మానవసోదరసోదరీమణుల యాపదల కడ్డుపడకుండునా? ప్రతి ఫల మపేక్షింపకయ పరోపకార మొనరించువాఁడే పురుషుఁడు. వా నిప్రయోజనమే పురుషార్థము. పురుషార్థసిద్ధిలేని జీవనము వాయస జీవనము కాదా? ఇంతకు నే నిప్పుడేలినవారికిఁ బ్రత్యేక మొనరించిన యుపకార మేమియున్నది? ఈపాటిస్వల్పవిధ్యుక్తకార్యమునకు మీ వంటిమహానుభావులు బాలుఁడ నగు నన్నింత గొప్పసేయుట నాకు శ్రేయస్కరము గాదని వినయపూర్వకముగ విన్నవించుచున్నాఁడను. క్షమింపుఁడు. నన్నుఁ బ్రతాపసింహుఁ డని యీమొడనున్నవారంద ఱును బిలుచుచున్నారు. ఏలినవారికిఁ జికిత్స యొనరించిన యీవీరధ న్వి పుత్రుండను. నేను పుట్టినతోడనే నాతల్లి చనిపోయెనఁట. నా

యీ దేహ మేలిసవారు పెంచినదే యగుటచేత మీయదియే” అని పలికెను. ఆమాటలు వినినంతనే చంద్రికళహృదయము కళవళపడం జొచ్చెను. ప్రతాపసింహుండవలి కేగెను

తరువాత మహారాజు వీరధన్విని జూచి “భిషగ్రత్నమా! నీ కిట్టి పుత్రరత్నము కల దని మాకెన్నండు నెఱింగింపనైతి వేమి? వీని కింతబుద్ధివిశేషము వాక్చాతుర్యము శౌర్యోదగ్రత సౌందర్యగరిమ భూతదయ యెట్లు లలవడియెనో తోంచ రాకున్నయది. ఈతండు నీ కౌరసపుత్రుండే నా?” అని యడిగెను. అందుకు వీరధన్వ “మహారాజా! ఈపురుషుండు నాకు స్వయంప్రాప్తపుత్రుండు గాని యౌరసుండు గాండు” అని పూర్వవృత్తాంతమును మహారాజుగారికి నివేదించెను. ఆవృత్తాంతమునువిని మహారాజొక్కింత తనలోందా నేమేమో వితర్కించుకొని యిందుమతితో “పొలంతీ! వీరధన్వనివేదించినయుదంత మంతయు సత్యమే నా?” అని యడిగెను. అందు కాదాసీ “మహారాజా! నిశ్చయమే” అని పలికెను. అంత మహారాజు “కామినీ! నీ వీపిల్లవాని నెంతకాలముకిందట వీని కిచ్చితివి? ఆతండు నీయౌరసపుత్రుండా యేమి?” అని యడిగెను. అందుపై నిందుమతి వెనుక వీరధన్వతోం జెప్పినవృత్తాంతమునే మహారాజునకు నివేదించెను.

తెల్లవాఱినది. సుదర్శనమహారాజు మంత్రిభటసామంతసకురుంబం బాందోళికశకటాశ్వగజాదులతో నాకుటీరమున కేతెంచెను. హేలాపురప్రయాణసన్నాహంబులు జరుగుచుండెను. ఆసమయమున భానుమంతుండు సుదర్శనునకు నమస్కరించి “మహారాజా! నిఖిలనరపాలమకుటకిరీటరత్నచ్ఛవిచ్ఛటానీరాజితపాదపంకేజ యుగ్మలగు నేలినవారి సందర్శనభాగ్యము లభింపంజేయుటకై యీమహానుభావుండు యమసదనంబున కేగుచున్న నన్నుం దోడ్కొనివచ్చె. పుణ్యవశంబునం బరమధర్మస్వరూపులును సకలభువనైకమాన్యులు

నగు తమ్ము దర్శించి ధన్యతముఁడ నైతిని. సెలవొసంగెదరేని పోయి వచ్చెదను" అని సవినయముగఁ బలికెను. అందుపై సుదర్శనుఁడు "యువకుఁడా! నీపేరేమి? నీతల్లిదండ్రు లెవరు? నీవృత్తాంతము సమగ్రముగ నెఱింగింపుము" అని పలికెను. అందుపై నాయువకుఁడు "మహారాజా! నాపేరు భానుమంతుఁడు. నాతల్లిదండ్రు లెవ్వరో నే నెఱుంగను. నే నీయిందుమతినే తల్లిగ భావించి యీామెయొద్దనే పెరుఁగుచు నొకరోజున నాతల్లిదండ్రులు చనిపోయి రనేదుర్వార్త నీమెచే వింటిని. కాని వా రేకారణంబున నెట్లు మృతులైరో నే నెఱుంగలేదు. మేము కల్యాణగడ మనే యొకగ్రామంబునఁ గాలముఁబుచ్చుచుండ నొకనాఁడు రాత్రి యమునానది పొంగి యాగ్రామమును ముంచివేసెను. అప్పు డాప్రవాహవేగంబునఁ గొట్టికొనివచ్చుచు మేమిర్వురము నీ ప్రతాపసింహునిచే రక్షింపఁబడితిమి" అని . చెప్పెను. ఆవృత్తాంతమును విని మహారా జిందుమతినిఁ జూచి, "ఏమమ్మా! నీవృత్తాంత మెఱింగింపవైతివి. నీసంగతి తెలిసినంగాని నీవు చెప్ప దలంచిన రహస్య విషయము మే మెట్లు నమ్మనగు?" అని పలికెను. అందుపై నాదాసి తనవృత్తాంతము తనతో సంబంధించినదిమాత్రము మహారాజునకు నివేదించెను. ఆవృత్తాంతము విని మహారా జొక్కింతసేపు తనలోఁ దానేమేమో వితర్కించుకొని "ముసలిదానా! నీయుదంతంబు నా కతివిస్మయమును గలిగింపుచున్నది. పట్టపురాణియైన చిత్రాంగి ప్రధానదాసివై యపారరాజభోగంబుల ననుభవించుచున్న నీ వాకొలువును బరిత్యజించుటకుం గలకారణము లెవ్వియో తెలియకున్నవి. మీాయిరువుర కేమైనఁ గలహముకలిగెనా యేమి?" అని ప్రశ్నించెను అందు కాజరభి "మహారాజా! లేదు. ఆమెయొద్ద కొలువుండుటకు నాకే యిష్టము లేకపోయినది. కారణ మెఱింగించుట కిది సమయము కాదు. నన్ననుగ్రహింపుఁడు" అని పలికెను. ఆమాటలు మహారాజుమనస్సును

మఱింత కలతవడిచెను. ఒక్కింత యాలోచించి "ముసలిదానా! నీ వీ భానుసుతునిపూర్వవృత్తాంత మెఱుఁగుదువా?" అని యడిగెను. అందుపై నావృద్ధనారి "మహారాజా! నే నట్లు నాజన్మస్థాన మగు వంగరాజ్యమునం దుండఁగాఁ దదీయధరారమణునిపైఁ గళింగరాజ్యాధిపతి యగు శూరసేనుఁడును కుళిందదేశాధీశుం డగు కామపాలుఁడును గలిసి యుద్ధమున కేతెంచిరి. ఆథండనంబున వంగరాజ్యరమాకళత్రుం డగు విష్ణువర్ధనుని గామపాలుఁడు వంచనచే సంహారించె. పిదపఁ బతివియోగంబు సహింపఁజాలక వానిభార్య సహగమనం బొనర్చె. తదీయరాజవంశంబు నంత మొందింప రాజబంధువులనెల్ల వధించుచుండుటచే నొకవృద్ధభటుఁ డీపిల్లవానినిఁ దెచ్చి నా కప్పగించెను. అప్పటి కీపిల్లవాని కైదేండ్లవయస్సు కలదు అప్పు డావృద్ధభటునిచే నీబాలుని వృత్తాంతమును వినియుంటిని.

మహారాజా! ఇప్పుడు కుళిందదేశము నేలుచున్న కామపాలుఁడు రాజ్యలోభంబునఁ దనయన్నయగు కీర్తివర్మ యొకసమయమున రాజ్యమును దన కప్పగించి సకుటుంబముగఁ దీర్థయాత్రల కేగ రాజ్యగర్వంబునఁ గ్రిందును మీఁదును గానక వర్తించుచుఁ గ్రూరకర్మంబులకు వెనుదీయనివాఁ డగుటచే ద్రోహియగు కామపాలుఁడు చోరులతో మైత్రిఁ జేసి వారిచేఁ గీర్తివర్మను వారణాసిలోఁ జంపించెను. అప్పుడే వానిభార్య సహగమనంబునఁ బరలోకగత యయ్యె. ఆరాజదంపతుల పరస్పరానురాగఫలోదయం బైన యీయువకుఁ డప్పటికి రెండేండ్లవాఁడు. ఆవిధంబుగఁ దల్లిదండ్రులను బాసి దిక్కుమాలినవాఁడైయున్న వీనిని దనయొద్దకుఁ దోడితెమ్మని యిరువురభటుల నంపెను. ఆభటులు చోరులే. పిదప నాచోరు లాబాలుని గొనిపోయి యరణ్యమధ్యంబున నొకచెట్టునకుఁ గట్టి వధింప యత్నించుచుండిరి. అంతట దైవవశంబునఁ గామపాలున కహితులై వానికొలువుఁ ద్యజించి

యామార్గముననే వచ్చుచున్న కొంద ఱాశ్వికభటు లాఘోరంతోద్యోగంబును జూచి తత్క్షణమే తమగుఱ్ఱముల నయ్యెడ కుఱికించి యాబాలుని జోరులబారినుండి రక్షించి వానిమేనమామ యైనవిష్ణువర్ధనున కొప్పగించి యేగిరి. పిల్లవాఁ డట్లు తనయొద్దకు వచ్చినరోజుననే విష్ణువర్ధనున కొకకొమరిత కలిగెను. మహారాజు పిల్లల నిర్వుర నతిగారాబముతోఁ బెంచుచుండెను.

తనమార్గనిరోధకుం డగు నీబాలుఁడు విష్ణువర్ధనునియొద్ద నున్న సంగతి విని మాయలమారి యగు కామపాలుఁడు వీని నంత మొందించుటకై యెన్నియో కుటిలప్రయత్నము లొనర్చియు విఫలమనోరథుం డగుటవలనఁ దనమిత్రుం డగు శూరసేనునిఁ బ్రోత్సహించి సమరంబు సంఘటింపఁ జేసి యంతటిరాజద్రోహ మొనరించెను. ఆవృద్ధభటుండు డీపిల్లవానిని నా కప్పగించి చనినపిదపనే వంగరాజ్యమును వీడి యీపిల్లవానిని వెంటఁగొని యమునానదీతీరమునఁ గలకల్యాణగడ మనే బ్రాహ్మణాగ్రహారంబుఁ జేరి యందు నిగూఢంబుగఁ గాలక్షేపము సేయుచుండ నీవిప్లవోపద్రవంబు సంభవించుటయు మే మిపురమును బ్రతాపసింహునిచే రక్షింపఁబడి యేలినవారి యండఁ జేరుటయుఁ దటస్థించినది. విష్ణువర్ధనుని పుత్రికగతి యేమయ్యెనో తెలియదు." అని చెప్పెను. ఆవృత్తాంతమును విని సువర్ణుఁడు తన యశ్రుపూరితలోచనంబులు క్రోధారుణకాంతిఁ బ్రజ్వరిల్లుచుండ భానుమంతునిఁ జూచి "నాయనా! భానుమంతా! నీ కింతటిద్రోహ మొనర్చిన కామపాలుని భగవంతుఁ డెప్పటికైన శిక్షింపక మానఁడు" అని పలికెను. తనతండ్రిరాజ్యము నపహరించి తన్నంత మొందింప నన్నిద్రోహకృత్యము లొనరించిన క్రూరకర్ముఁడు తనపినతండ్రియగు కామపాలుఁడే యని యింతవఱకును భానుమంతుఁ డెఱుఁగఁడు. ఇందుమతిచే సకృత్స్నము వినినంతనే వానికి యింతింతయనరానికోపము వచ్చె

ను. క్రోధవిషాదావేశంబున నశ్రుపూరితలోచనంబు లరుణకాంతిఁ బ్రజ్వరిల్ల వరనుండి కత్తిఁ దీసి "మహారాజా! పరమగురుద్రోహి యైన కామపాలుని నే నిప్పుడే వధించివచ్చెదను. సెల వొసంగుఁడు" అని వీరావేశంబునఁ బలికెను. ఆవీరోచితపౌరుషోక్తికిఁ జిఱునవ్వు నవ్వి సుదర్శనుఁడు "నాయనా! త్వరపడకుము. తొందరపడి యేపని యుఁ జేయరాదు. పాపకర్మఫలము పరిపక్వమైనంగాని పతన మొంద దు. పరమదుర్మార్గుఁడగు రావణుని సంహరింపు మని దేవతలు కోరఁగా శ్రీమహావిష్ణు వేమనెనో నీవు వినలేదా.

"అతనిం గాలము గూడఁ జంపెదఁ జదుండుదాక మీ క్రోధవలదు"

అట్లుచితకాల మొదవునందాక భగవంతునకైన దుష్టులను శిక్షింప వలనుపడదు. "అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలముచ్యతే" అను నార్యోక్తి ననుసరించి దుష్టుఁడగు కామపాలుఁ డెప్పటికైనఁ దాను త్రవ్వినగోతిలోఁ దాను పడకమానఁడు. పురంబులోనికేగి వలయుసన్నాహములను గావింతము" అని వాని నొడంబఱిచి యక్కడనున్నవారి నందఱి నుద్దేశించి, "మిత్రులారా! నేఁడు నాయిష్టదైవము మీరూపంబున నాకు సాక్షాత్కరించి నన్ను నాయనుంగుపుత్రికను గాపాడుటయే గాక నా కెన్నియో విశేషవిషయంబు లెఱింగించి దుర్లభము లైనకోరికల నుత్పత్తిల్లఁజేసె ఆకోరికల సఫలంబుఁ జేయుపొంటె మీరందఱుఁ గొంతకాలము నాయాతిథ్యంబుఁ గొని నన్నానందింపఁజేయ వేఁడుచున్నాఁడను." అని పలుకుచుండఁ బ్రతాపసింహుఁడు లోనికేతెంచి "మహారాజా! అత్యవసరమగు కొండొక కార్యార్థమై పోవలసివచ్చినది. సెల వొసంగుఁడు" అని యడిగెను. అది విని సుదర్శనుఁ డదరిపడి, "మహావీరుఁడవగు నోపుణ్యపురుషా! కృతజ్ఞతాబద్ధులమగు నాయొక్కయు నాముద్దులపట్టియైన చంద్రికళ యొక్కయు సగౌరవాతిథ్యంబుఁ గొనకయే మ మ్మాయరణ్యంబున

విడిచిపోవ నెంచుట పాడి యగునా? నీవు మాత్రోడఁ బురంబులోని కే తెంచి దినత్రియమైన మాగృహముఁ బావనం బొనరించి మమ్మానం దింపఁజేయఁ గోరెదను" అని పలికెను.

ఇందుమతియుదంతంబువలన మందీకృతంబులైయున్న నిజహృదయానందవీచికలు మరల నుప్పొంగుటచేఁ జద్రికళయుఁ గన్నుల నీరు నించి ప్రతాపసింహునిమొకట మోకారించి దీనవదన యై, "పుణ్యపురుషా ! మమ్మింతవఱకును గాపాడి నన్నును నాతండ్రిని సురక్షితంబుగ గృహంబుఁ జేర్చకయే నీసుందరముఖచంద్రిని మాటుపఱచి మమ్ముఁ జీఁకటిపాలుసేయఁ దలంచితివా? నీమొదల మే మేమైన యపచార మొనరించితిమి కాఁబోలు! లేకున్న నీకిట్టిసంకల్పం బేలకలుగును. మొదటనే న న్నాయరణ్యంబున రక్షింపకున్న మా కిప్పటున నింతటి పరితాపంబునకుఁ గారణ మొదవకుండునుగదా. వీరపురుషుల హృదయములు సహజముగ దయారసభరితము లని వినియుంటిని. మహోదారవీరపురుషుండ వైన ని విమ్మేళ నింతటి వజ్రికాఠిన్యము వహించుటకుం గలకారణ మేమో తెలియరాకున్నది. దయామయుండవై నాతండ్రిగారి వేడికో లంగీకరింపుము." అని దీనదృష్టుల వేఁడికొనియెను ప్రతాపసింహుఁడు కరుణార్ద్రహృదయుఁ డయ్యుఁ బట్టిన పట్టు విడుచువాఁడు కాఁడు. వారివేడికో లంగీకరించి తాను హేలాపురంబున కేగినచోఁ దనపుక్కిటి నిలిపియున్న భావోద్వేగంబు చంద్రకళాసాహచర్యంబునఁ దన్నేమి త్వరపడఁజేయునో యనియుఁ దానట్లు త్వరపడినచో నుపకారవంతురాలైయున్న యామెను అలకఁగ నెంచెనని భావించునేమో యనియు, నాభిజాత్యవైపరీత్యంబును గమనింపకయ యట్టిసాహచర్యదోషమున కవకాశ మొసంగుట వీరోచితలక్షణము గాదనియు విశేషించి తన ప్రస్తుతోద్యమంబున కంతరాయంబు కలుగుననియు మొదలైన యాలోచనలచేఁ బ్రతాపసింహుఁ

డొకింతతడవు డోలాయమానమానసుఁడై యెట్టకేలకుఁ దనమనంబు దిట్టపఱచికొని "మహారాజా! తరుణీమణీ! నిరుపమానగుణఖనులగు మీరు నిర్హేతుకజాయమానకటాక్షామృతంబును వర్షింపఁగోరు మహాఘనులై రమ్మని కోరుచుండ నాకిప్పట్టున నీయవసరకార్య మొకఘటత్రిమునవలె నన్నువచ్చినది. నన్ను మీ రింతగఁ బ్రార్థింపవలయునా? నేను మీకింకరుఁడను గానా? నాయీసంకల్పంబునకుం గలకారణము ముందు మీకే తెలియఁగలదు. మీకు నాభాగ్యవశంబున నాపైఁ గలిగినగౌరవాదరములు నిరూఢములే యైనచో నన్నుఁ బ్రియపూర్వకముగ వీడ్కొల్పుఁడు. కొద్దికాలములోనే తిరుగ మీసన్నిధికి వచ్చి మీయాతిథ్యమును హృదయపూర్వకముగ గ్రహించెదను" అని పలికెను. అందుపై మహారాజు, "వీరాగ్రగణ్యా! నీవంటి సద్గుణరాశిదృఢసంకల్పంబున కంతరాయంబుగ నే నేమియుఁ బలుకఁజాల. ఉచితానుచితవివేకశాలి వగు నీకుఁ దోఁచినట్లు చేయుము. శీఘ్రకాలములో నీపునర్దర్శనము మాకు లభింపఁజేయ మాయిష్టదైవమును బ్రార్థించుచుండెదము. పోయిరమ్ము" అని పలికెను. అందుపైఁ జంద్రికళ గద్గదకంఠయై "తండ్రీ! ఎయ్యెడకేగినను మహాభాగ్యవంతు లెందఱో విహరింపఁజాలు వీరాగ్రగణ్యుల విశాలమైన హృదయవీథిలో మనబోంట్లకుఁ జోటుండదుగా?" అని సాభిప్రాయంబుగఁ బలికెను. ఆమాట విని ప్రతాపసింహుఁడు నిజాంతరంగభావోద్వేగంబు నాఁపికొనలేకపోయెను. దరహాసితముఖుఁడై "మహారాజా! ఈ నాహృదయవీథిని గుణశీలస్నేహంబుచేఁ బ్రజ్వరిల్లు జగన్మోహనరూపదీపంబునకే చోటుండదవును గాని లాతివారలకుఁ జోటుండదని రూఢిగ నమ్మియుండుఁడు" అని గిరుక్కున మఱలి యదృశ్యుఁడయ్యెను.

అంతట వాకిట నొకకోలాహలము వినవచ్చెను. మహారాజు కుటీరము వెలికి వచ్చెను. బంధితులైన చోరులు కట్లూవిప్పికొని యే సమయముననో పాఱిపోయి రనియు వారలను బట్టి తెచ్చుటకు కోయ వాఁడు కత్తిఁ జేతఁబట్టి పరుగిడియె ననియు రాజభటులు మహారాజున కు విన్నవించిరి. సుదర్శనుఁడు ప్రతాపసింహుని కార్యావసర మదియే యని గ్రహించి తనభటుల యశ్రద్ధచేత నేకదా తన కట్టియుత్సాహభంగము కలిగెనని భటులను మందలించి వానిసహాయార్థము కొందఱభటు ల ననిపి మిగిలినపరివారముతోఁ బుత్రికాసహితుఁడై హేలాపుర మునుఁగూర్చి బయలుదేఱెను.



శ్రీరస్తు.

# ప్ర తా ప సిం హ.



## ఆఱవ ప్రకరణము.

---

ఉ. వీరవిహారలీలల సువిశ్రుతుఁడౌ బలశాలి సర్వదా
పౌరుషవంతుఁడై యురుకృపామతి దీనులఁ గాచి కీర్తినొ
ప్పారెడు నంతె కాని మసిపాతను గట్టినమాణికంబు వాఁ
గారణవేష మూనిన విశారదుఁ గల్గునె పెంపు దప్పునే.

"వీరపాలుని యమునానదీవిప్లవమునుండి కాచిరక్షించిన కిరాతయువకుఁడెవ్వఁడై యుండునో? అతండు నాకుఁ బుత్రదానంబు సేయఁ గోరి కపటకిరాతవేషంబున వచ్చిన యుమాభర్తయో లేక హేత్వంతరముచే నావేషము ధరించిన మహోదారవీరశిఖామణియగు నుత్తమ రాజపుత్రుఁడో కావలయు. కానిచో నట్టిమహనీయసుందరాకారుండును నిరుపమానభూతదయాసమన్వితుండును నద్వితీయశౌర్యధైర్యగాంభీర్యసాహసాదివీరగుణశోభితుండును మహాపరాక్రమశాలియు నగువీరపురుషుండు కిరాతకులంబున జన్మించునా! ప్రతిఫల మపేక్షింపక యపరుల కుపకారము చేయుచుండుటయే వానివ్రతమఁట! దివ్యపురుషునకుఁగాక విషయలోలుఁడైన మానవున కట్టివ్రతము సాగునా? వానియాకారం బతిగంభీరంబుగ నున్నయది. బాలసూర్యునిఁబోలు నెమ్మొగంబును బద్మదళసంకాశంబులగు విశాలనేత్రంబులును సింహమధ్యంబును గలిగి బాహ్యవేష మెట్లున్నను రెండవమన్మథుండై బిత్తరులచిత్తము నపహరించు జగన్మోహనుఁ డాతఁడే. వానిమైచాయ తమ్ములదాయ నపహసించుచుండె. ఉన్నతంబగు వెడందనెన్నుదురు వానిధీశక్తిని వెల్లడించుచుండెను. పొడవైన వ్రేళ్ళతోఁగూడిన

కరతలంబులు వానియుదారభావమును జాటుచుండెను. వాని చూపు కోపులు దయారసంబును జిలుకుచుండెను. వానిమోముగోము సుప్రసన్నతఁ దెలుపుచుండెను. వానిరవి నిరుపమానతేజోవిశేషంబును దృఢమైన పట్టుదలయు వెలిబుచ్చుచుండెను. జానువులంటుచున్న గజతుండంబులం గేరు వానిభుజాదండంబు లద్వితీయపరాక్రమంబును బ్రకటించుచుండెను. అట్టిసుందరపురుషుఁడు బోయకులంబునం దొదవెనన్న నెట్లు నమ్మనగు? మఱియు వానివెనుపట్టి కుడిత్రట్టున మత్స్యాకారముగల పుట్టుమచ్చ యొకటి నాకు దృశ్యాదృశ్యంబుగఁ గాన్పించినది. నాఁటినుండియు నామనోవిహంగంబు పైకెగుర నుంకించుచున్నయది.

ఈమధ్య నొకపరివ్రాజకుఁడు నా కిరువురుభార్యలు గలరని యు వారిరువురకు నిరువురుకొమరులు కలిగిరనియు జ్యేష్ఠభార్య యదృశ్యయైనను నాపెద్దకొమరుఁడు చనిపోయె నని తలంచితేగాని సజీవుఁడైయుండెననియుఁ జెప్పియుండె. అట్టిజన్మచిహ్నముగలపిల్లవాని నెన్నియోవిధముల నరయుచుండ నాబోయయువకునియందా చిహ్నంబు కన్పట్టుటచే నాయాశాంకురంబులు మోసులెత్తుచున్నయవి. ఆదైవజ్ఞుఁడు చెప్పినదంతయు సత్యమేయైనయెడల నాపరివ్రాజకుని భగవంతునిగ భావించి పూజించెదను. నాచారుమతిని నాపుత్త్రరత్నమును నే నీజన్మమున మరలఁగాంచఁగలుగుదునా? నాకంతటియదృష్ట మబ్బునా? హృదయమా! తహతహ జెందకుము. నాచారుమతి యదృశ్యయయ్యెనని పరివ్రాజకుఁడు పలుకుటచే నామెయు నెయ్యెడనో సజీవయైయుండెనేమో యనునాస పొడముచున్నది. నాచారుమతి యదృశ్యయై యిరువదిసంవత్సరము లైనది. ఆబోయయువకుని వయస్సును నాప్రాంతముననే యున్నట్లు తోఁచె. మరల నే నానిషాదయువకు నెట్లు చూడఁగలుగుదును?" అని యొకనాఁటి సాయంకాలమునఁ జంద్రశేఖర

మహారాజు వాహ్యాళికేగి యెుక్కచోఁ జంద్రశిలావేదికపైఁ గూర్చుండి యేమేమో తలపోసికొనుచుండెను. సహచరులైనభటులు దూరమున నిలిచియుండిరి.

ఆసమయమున దవ్వుల నొకయువకుఁ డశ్వారూఢుండై వచ్చుచుండెను. ఆయువకుఁ డెవ్వఁడై యుండునోయని చంద్రశేఖరుండు లేచి కొంచె మెదురుగఁ జనియెను. వీరపాలుఁడు తండ్రినిజూచి వారువమ్మును డిగ్గి తండ్రికి నమస్కరించెను. చంద్రశేఖరుండు ప్రియమారఁ బుత్రునిఁ గౌఁగిలించికొని "నాయనా! నీవు వీరపాలుఁడవేనా ?" అని యడిగెను. ఆమాటవిని వీరపాలుఁడు నివ్వెఱఁగందుచుఁ "దండ్రీ! ఏమట్లు పలికెదరు ? మీయనుంగుఁబుత్రుఁడ నగు వీరపాలుఁడను. నను గుర్తింపలేకుండిరా? నేఁడు నాయందేమైన విలక్షణము గలిగెనా యేమి?" అని పలికెను. అందుపైఁ జంద్రశేఖరుఁడు "నాయనా! నేఁ డేమో కాని నామనస్సు కలతవాఱియున్నది. దేహ మస్వస్థతగ నున్నది. యమునానదీవిప్లవమునుండి రక్షించి నిన్ను నా కొసంగినవైద్యశిరోమణి యగు నాబోయవెజ్జువలనఁ గాని నా కీవ్యాధి నివారణ కాదని తోఁచుచున్నది. కావున నెల్లి సూర్యోదయ మైనతోడనే నీవు పయనంబై వాని జాడఁ దెలిసికొని తోడ్కొనిరావలయును" అని పలికెను. ఆమాట వినినంతనే వీరపాలునిహృదయము భావమరీచికలచే నాకులమగుచుండుటవలన నొక్కింత యాలోచించి "తండ్రీ! తనయసువ్రులపై నాస వీడి నన్నట్లు విప్లవమునుండి యుద్ధరించి రక్షించుటయేకాక యనుంగు సోదరునివలె నా కింతయుపచార మొనరించిన యామహనీయుని సాహచర్యమును నేనును నభిలషించుచునే యున్నాఁడను. కావున ముఖ్యముగ నే నటులనే జరిగింప సర్వవిధములచేతను బ్రయత్నించెదను. కాని—" అని యేమో చెప్పఁబోవుచుండఁ జంద్రశేఖరుఁ డార్తితోఁ, "గుమారా! ఏమట్లనియెదవు? ఆయువకున కేకీడును వాటిల్లియుండ లేదు

కదా! నీసహచరులైన యాశ్వికమృగయులు నీవెంట రాకుండుటకుఁ గారణ మేమైయుండును?" అని యడిగెను. అందుపై వీరపాలుఁడు "తండ్రీ! నేను సహచరులతో మృగయావిహారార్థ మరణ్యంబునకేగి యందందు సంచరింపుచుండఁ గొందఱుచోరులు వివశుఁడై పడియున్న యొకయువకుని కరచరణములను బంధించుచుండిరి. అదిచూచి నేనును నాయనుచరులును దత్క్షణమే యాచోరులను గలిసికొని కయ్యమునకుఁ గడంగితిమి నాసహచరులు బంధితుఁడైనయువకుని విడిపింప యత్నించుచుఁ జోరులచే హతులైరి. అదిచూచి వీరావేశంబున నొక్కరుండనయ్యు బంధితుఁడైనయువకుఁడు నాప్రాణరక్షకుఁడైన నిషాదయువకుఁడే యగుటఁ దెలిసికొని శతాధికసంఖ్యగల యాచోరులతోఁ బెనఁగి పెనఁగి ఖడ్గప్రహారంబుల రక్తాప్లావితదేహుండనై మూర్ఛిల్లితిని. నేను తెలివొంది నల్గడలఁ బరికింప నేవిధంబునో నే నొకకుటీరంబులో నుంటినని తెలిసికొంటిని. పిదప నే నంతవెదకిన నాచోరులజాడ కాని కిరాతయువకునిజాడ కాని తెలియరానందున నిష్ఫలమనోరథుండనై నాసహచరులను జోరమృగంబులవాత విడి యొంటరిగ వచ్చితిని. ఆనిషాదయువకుఁడు చోరులచే నెయ్యెడనో బాధితుఁడై యుండనోపు. మీయాజ్ఞ వడిసితిని గావున నెల్లి నేఁ దప్పక పయనంబై యేవిధంబుననైనఁ జోరులయిక్కఁ గనుంగొని యుపాయంబున వానిఁ దోడ్కొనివచ్చి నాకృతజ్ఞత నెఱపెదను." అనిపలికెను. ఆయుదంతంబును విని చంద్రశేఖరుఁడు మితిలేనికోపంబున "వీరపాలా! నీవు వలసినసైన్యమును గొని యూఘోరమృగంబులఁ గనిమసంగి వేఁటాడియైన నాకిరాతయువకుని నెలరోజులలో నాకుఁ గనఁబఱచవలయును. లేనిచో నీవు తండ్రిలేనివాఁడవయ్యెద వని తెలిసికొనుము" అని పలికెను. అందుపై వీరపాలుఁడు "తండ్రీ! చోరులు మాయావులు. కపటతంత్రజ్ఞులు. భీరులు గాని శూరులు కారు. సైన్యసన్నాహంబుతోఁ దనుపైకి వచ్చుచుండుట నెఱిఁ

గిరేని మాయోపాయంబున నదృశ్యులై చేయిదాఁటిపోవుదురు. కాపట్యమును గాపట్యముచేతనే సాధింపవలయును. కావున నే నొక్కరుండనే బయలుదేఱెదను. అనుమతి నొసంగఁ బ్రార్థించెదను.'' అని వేఁడుకొనెను. అందుకు మహారా జనుమతింప నందఱును బురాభిముఖులై బయలుదేఱిరి.

వీరధన్వికుటీరముచెంత బంధితులై పడియున్నచోరులు కట్లు విప్పికొని పాఱిపోయినవెంటనే ప్రతాపసింహుఁడు సుదర్శనునియొద్ద సెలవుఁ గైకొని యాచోరుల వెన్నంటి పరుగిడె నని యిదివఱకే చెప్పియుంటిమి. చోరులు బదరీవనగిరిప్రాంతముఁ జేరునటికి వేగుఁజుక్క పొడిచెను. ఇఁక నొకగవ్యూతిమార్గం బేగినచో వారు తమ గమ్యస్థానంబుఁ జేరుదురు అంతలో నొకచోరుఁడు 'ద్రోహము. ద్రోహము' అని కెవ్వన నొకకేక వైచి క్రిందఁబడిపోయెను. వానిశిరంబునఁ బెద్ద గాయము పడెను. అది చూచి మిగిలినచోరులలో నిరువ్వ రదివఱకే గాయముపడియున్నవా రగుటచే "మిత్రులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు." అని యాక్రందించుచు నతికష్టమునఁ బరుగిడుచుండిరి. ఒకఁడు పాఱిపోయెను. ప్రతాపసింహుఁడు పడియున్నచోరుని దనశిరోవేష్టముచే దృఢముగ బంధించి మిగిలినతస్కరుల నిరువుర నతిదూరంబునఁ బట్టికొని బంధించుచుండెను. అంతలో శతాధికసంఖ్య గలచోరు లశ్వారూఢులై వచ్చి ప్రతాపసింహుని మార్కొనిరి. వీరశిఖామణియైన మనకథానాయకుఁడు తనచేత నున్నఖడ్గమును గిరగిరఁ ద్రిప్పుచు వారందఱితో నతిఘోరంబుగఁ బోరాడుచుండెను. ఖడ్గసంఘర్షణంబున విస్ఫులింగంబు లెగయుచుండెను. ఒక్కనిముషములో నిరువురుచోరులు కూలిరి. మిగిలినచోరులు విడువక వానిని జుట్టుముట్టి పోరాడుచుండిరి. ఇంకొకనిముషమునకు మఱి యిర్వురుచోరులు కూలిరి. ప్రతాపసింహుఁ డలయుచుండెను. వానిదక్షిణభుజముపై

నొకగాయము పడెను. అంతలో దవ్వులఁ గొందఱు రాజభటులు లశ్వా రూఢులై వచ్చుచుండుటఁ జూచి చోరు లొక్కుమ్మడిఁ బ్రతాపసింహునిపైఁ బడిరి. అదివఱకే యలసియున్నవాఁ డగుటచేతను నిశితాయుధక్షతవేదనాభరుం డగుటచేతను జేతిలోని ఖడ్గము జాఱవిడిచి చోరులకుఁ జిక్కిపోయెను. చోరులు వాని కరచరణంబులను బంధించుచుండిరి. అంతలో సుదర్శనునిరాజభటులు వచ్చి చోరులను మార్కొనిరి. కొంతతడ వతిభయంకరంబుగ సమరంబు ప్రవర్తిల్లెను. సహజభీరు లగుచోరులు రాజభటులఖాక కోహటించి బ్రధితులై పడియున్న తమచోరభృత్యుల నచ్చోటనే విడిచి బహుముఖంబులఁ బలాయితు లైరి. పెక్కుగాయములనుండి రక్తము విశేషముగఁ బ్రవహించుటచేఁ బ్రతాపసింహుఁడు వివశుఁడై పడిపోయెను. రాజభటులు వాని కెన్నియో చికిత్సలు గావించిరి. కొంతసేపటికి ప్రతాపసింహుఁడు తెలివిఁ జెంది 'దాహము దాహము' అని సంజ్ఞఁ జేసెను. తత్క్షణమే రాజభటులు వానిచే నిర్మలోదకంబును ద్రావించిరి. దాననొక్కింతబలము గలిగి లేచి కూర్చుండి రాజభటులను జూచి "మీ రెవ్వరు? ఇయ్యెడకు రాఁ గారణం బేమి? చోరు లేమైరి?" అని ప్రశ్నించెను. అందుపై రాజభటులలో నొకఁడు "బాబూ! పాంచాలదేశపు మహారాజుగారు తమకు బాసటగా నుండ మమ్మంపిరి. మేము మాయదృష్టవశంబున సమయమునకు వచ్చుటచే మిమ్ములను గాపాడుభాగ్యము లభించినది. మీపైఁ గవిసినచోరులలోఁ బెక్కండ్రు హతులైరి. మిగిలినవారు నిరాశులై బహుముఖంబులఁ బలాయితులైరి. తమకు మరలఁ జేజిక్కినచోరులను గొనిపోవ యత్నించిరి. కాని మేము మాప్రయత్నము నాగనివ్వలేదు. బాబూ! ఆజ్ఞ యేమో సెలవిచ్చెదరా?" అని సవినయంబుగఁ బలికెను. అందుపైఁ బ్రతాపసింహుఁ డొక్కింత యాలోచించి "ఆశ్వికులారా! మీ రిచ్చో

టనే యుండుఁడు. నే నిప్పుడే తిరుగవచ్చి కర్తవ్య మెఱింగించెదను." అని బాధితులై పడియున్న యిరువురుచోరులను బంధవిముక్తులఁ గావించి వారి నొకవివిక్తప్రదేశంబునకుఁ గొనిపోయి కొంతతడ వేమేమో సంభాషించి తిరుగ వారి నారాజభటులయొద్దకుఁ గొనివచ్చి "రాజభటులారా! మీ రీయిర్వురను జాగ్రతగఁ దోడ్కొనిపోయి మహారాజుగారి కప్పగించి నేను వారిసముఖమున కేతెంచువఱకుఁ దగిన కట్టడిలో నుంచి సగౌరవంబుగ నాదరింపవలయు నని నాకోరికగా మనవిచేయుఁడు. నే నిపుడు కొండొకకార్యార్థమై యొకచోటి కేగ వలసియున్నది. మీరు పొండు" అని పలికెను. రాజభటు లాయిరువురుచోరులను వెంటఁగొని హేలాపురాభిముఖులై బయలుదేఱిరి.

ప్రతాపసింహుఁడు రాజభటు లేగినపిదప వనౌషధులచేఁ దన గాయములకుఁ గట్టుకట్టుకొని మెల్లగ బయలుదేఱి తనలో "ఏమిది! వీరవ్రతుండనై పరులతాపంబు లడంపఁబూనిన నేనే పరితాపంబునకు లోనగుచుంటిని. నాహృదయసాగర మిప్పట్టున నూత్నభావవీచికాపరంపరలఁ గల్లోల మగుచున్నయది. ఆమోహినిని చోరులబారినుండి రక్షింప నే నేల గడంగవలయు. రక్షించితింబో జాతిస్థిత్యంతరంబుల గమనింపకయ ప్రథమదర్శనంబుననే యాకుసుమకోమలి నన్నంతగ నేల ప్రేమింపవలయు. వృద్ధవనిత వాక్బీజంబులచే నాహృదయక్షేత్రంబున నేమేమో యాశాంకురంబులు మోసులెత్తుచున్నయవి. నేను వీరధన్వికి స్వయంప్రాప్తపుత్రుండను గాని యౌరసుండను గాననియు నాజన్మవృత్తాంత మతినిగూఢమైనదనియుఁ బలుకుటచే నామానసవిహంగమ ముపరిసీమ కెగుర గమకించుచున్నయది. నాతల్లిదండ్రులెవ్వరైయుందురో తెలియరాదు. వారు జీవించియుండిరో లేదో జీవించియున్నచో నాకొఱకెచ్చోట్ల నెంతగ నడలుచుండిరో! నిజజన్మవృత్తాంత మెఱుంగకుండ నంధకారంబునఁ బొరలాడుచుంటిని. ఈయుం

ధకారము చంద్రికళాయోగంబునఁగాని పాయదు. ఆయోగము నాకెట్లు సిద్ధించును? ప్రథమసందర్శనంబుననే యాలేమమోహనవిగ్రహమును నాహృదయఫలకంబునఁ జిత్రించితిని. నాఁటనుండియు నా దివ్యమంగళవిగ్రహంబును ప్రేమపుష్పంబుల నంతర్ముఖుండనై పూజించుచుంటిని. ప్రత్యక్షంబుగఁ దదీయరూపామృతంబును దృక్కరంబులను గుణామృతంబును వాక్యామృతంబును గర్ణాంజలిపుటంబులను దనివితీరఁ ద్రావుచు దినత్రయమైనఁ దమయింట నిలిచి యాతిథ్యంబును గొనుమని యెంత వేఁడిన నొల్లనైతిని. చేఁజిక్కనతస్కరులు సురుంగుటఁ దెలిసికొనినతోడనే యాదేశంబునఁ దిరుగ వారిని బట్టికొనుటకై వెడలివచ్చితిని. ఆతరుణీమణియందుఁ గలదివ్యప్రభావ మెట్టిదియో కాని యామెదృగ్విశిఖంబులు నాహృదయంబు నాఁటినయంతనే వివశుండ నయ్యు సంచలితచిత్తుండనై సాత్త్వికభావంబుల నెంతయో ముగ్ధుండ నైతిని ఇప్పు డేమనుకొనిన నేమిలాభము. నాయాభిజాత్య మెట్టిదియో నాస్థితిగతు లెట్టివియో తెలిసికొనకుండఁ బరుల దయాపోషణంబున నెంతకాల మీదేహయాత్ర జరుపవలయునో గదా! నన్నెడఁబాయవలసివచ్చినప్పు డాలేమ బాష్పాంబుపూరితనేత్రములనుండి ప్రసరించిన ప్రేమమయదీనవిలోకనంబు లిప్పటికిని నాహృదయమును వేధించుచున్నయవి. అకటా! అట్టిప్రేమామృతకలశంబును బుద్ధిపూర్వకంబుగ విడి మిక్కుటంబుగ దగగొనిన పాంథుఁడు మధురజలాశయంబును బుద్ధిపూర్వకంబుగ విడి మృగతృష్ణ నపేక్షించునట్లు నేనిప్పు డాలేమను మరలఁ జూడ నపేక్షించుచుంటిని. మింటవెలుంగు చంద్రికళ నపేక్షించుచాతకంబున కొకయెడ నశనిపాతంబు ఘటిల్లి మ్రగ్గించునట్లు నన్నివియోగతాపంబు మ్రగ్గించుచున్నయది. చీ, చీ, ఇది వీరోచితలక్షణమేనా? ఇప్పట్టున నాకుఁ బ్రతివీరుఁడైయున్న భావభవు నోహటింపలేకుంటిని. నాకు వీరశబ్ద మెట్లుచెల్లును. ఓరీ మన్మ

థా! ఆమెలనాఁగపలుకుచిలుక నెక్కి కన్నొబ్బనువిల్లుఁ జేఁగొని నేత్రమీనధ్వజుండవై మెడసంకువ నూఁదుచు నరాళకుంతల వరూథినీసహితుండవై యసహాయుండ నగు నాపై విజృంభించుచుంటివా? నీయాటోపమంతయు నావంటి యసహాయులపైఁ జూపిన నేమిలాభము. నీచే నే నిర్జితుండ నైతిని. నన్ను విడువుము." అని పరిపరివిధంబులఁ దలపోసికొనుచుఁ దోవఁదప్పి మధురాపురారణ్యంబుఁ బ్రవేశించెను.

అట్లు చనుచుండఁ బ్రతాపసింహుని వెనుకతట్టునుండి గుఱ్ఱపుడెక్కలచప్పుడు వినిపించెను. అతఁడు తిరిగి చూచునంతలో శతాధికసంఖ్యగల యాశ్వికులు వానిని జుట్టుముట్టి "ఓరీ! దుర్మార్గా! మా మిత్రులైన కాళీపాదభైరవుల నేమిచేసితివో చెప్పుము. లేనిచో నీ వీసారి మా శాంభవీదేవికి బలి గాకుండఁ దప్పించుకొనఁజాలవు" అని పట్టి బంధింప యత్నించిరి. వీరశిఖామణియైన ప్రతాపసింహుఁడు నిరాయుధహస్తుఁ డయ్యు వీరావేశంబున నొకచోరుని చేతిలోని ఖడ్గము నూడఁబెఱికి యట్టాని గిరగిరఁ ద్రిప్పుచుఁ గొంతతడవు పోరు సల్పి పెక్కండ్రు నుక్కడంచి పరిశ్రాంతుం డగుటచే నాచోరులకు లొంగవలసివచ్చెను. చోరులు వానిని దృఢముగ బంధించి గుఱ్ఱముపై నిడికొని పోవుచుండ వీరపాలుఁ డనుచరసహితుఁడై వారిని మార్కొని పోలికలని మూర్ఛిల్లుటయు బంధవిముక్తుఁడైన ప్రతాపసింహునిచే వీరపాలుఁడు తెలివిఁజెంది నిజపురంబున కేగుటయు మా చదువరు లిదివఱకే వినియుంటిరి.

అట్లు ప్రతాపసింహుఁడు వీరపాలునికి వలయుచికిత్సలను గావించి వెడలిపోయినతరువాత వీరపాలుఁడు తెలివిఁజెంది చూచుసరికిఁ దానొకరుండ యొకకుటీరములో నున్నట్లు తెలిసికొనియెను. సహచరుఁ డొక్కఁడును గానరానందున వారందఱు చోరులచేఁ హతులైరని నిశ్చయించి యేకతంబ మధురాపురాభిముఖుఁడై బయలుదేఱెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఏడవ ప్రకరణము.

శా. కన్నుల్మూయుచుఁ బిల్లి పాల్గుడుచుచున్ గాంచంగలే రెవ్వరుం
డున్నిశ్చింత మెలంగునట్లు కుజనుల్ చూపోపలే రాత్మలా
భాసక్త్యంబును గోరి సాధుల కపాయం బెంచి దుస్తంత్రముల్
బన్నం జాతురు వారి దైవము తుదిన్ బాధింపఁడే త్రుంపఁడే.

భగవంతుని చైదములు మనుష్యబుద్ధికి దురవగాహములు. స్వలాభార్థియై చేసిన కార్యము దైవానుగ్రహము లేనిచో నయ్యది పరుల కుపయోగించునే గాని తత్కర్త కుపయోగింపదు. నామిత్రుఁడైన కామపాలుఁడు తనయన్నను జంపి వశపఱచుకొనిన కుళిందరాజ్యము సుప్రతిష్ఠితంబుఁ గావించుకొనుటకై తనయన్నకొమరుఁడైన భానుమంతుని సంహరింపఁగోరి వంగరాజ్యముపై దాడివెడల నన్నుఁ బ్రోత్సహించె. వాని కేమిలాభించె? వానికపకీర్తియు నాకు వంగరాజ్యము లభించినవి. అయినను విష్ణువర్ధనున కొకకొమరిత కలదఁట. ఆకన్నియ యెచ్చోట నుండెనో తెలియరాదు. భానుమంతుఁడును గామపాలునిబారినుండి తొలంగి యెచటికో సుంగె. వారిరువురును బ్రతికి యున్నంతవఱకుఁ గుళిందరాజ్యము నామిత్రున కెంతసుస్థిరమో వంగరాజ్యము నాకు నంతియే సుస్థిరము. వంగరాజ్యము నాకు సుస్థిరంబైనను నాకు సంతోషము లేదు. నేను చిన్ననాఁడు ప్రేమించినచిత్రాంగి మఱియొకని కైవసం బయ్యె. అమితానురాగముతో నన్నలరించుచుండిన నాభార్యయు స్వర్గస్థురా లయ్యె. ఎవరికొఱకై నే నీరాజ్యాభివృద్ధి నపేక్షింపవలయును? నాముద్దులపట్టి యైనలలిత కీకళింగరాజ్యము చా

లదా? పుత్రసంతానార్థినై పాంచాలరాజకన్య యగు చంద్రికళను నాకిచ్చి వివాహము సేయుమని సుదర్శనునకు వర్తమాన మంపితిని. అందు కాతఁ డియ్యకొనఁ డయ్యె. పిదపఁ దనచెల్లెలైన చిత్రాంగిని నాస్వాధీనముఁ జేసెదనని నామిత్రుఁడైన కామపాలుఁడు వాగ్దత్తముఁ జేయుటచేఁ బునర్వివాహప్రయత్నము నుజ్జగించితిని. నే నిప్పు డా యపేక్షచేతనే మధురాపుర మేగితిని. కాని భగ్నమనోరథుండనై తిరుగ రావలసివచ్చె. ఛీ, ఛీ, వీరోచితక్షత్రియకులంబున జన్మించిన నా కిట్టి తుచ్ఛకోరిక చెల్లునా? చిత్రాంగిని స్వాధీనముఁ జేసికొనఁగోరిన చో నామెను వితంతుగాఁ జేయవలయును. తరువాత నామెవలన నాకుఁ బుత్రోదయంబైనను గోళకునకు రాజ్యార్హత కలుగునా?" అని యేమేమో తలపోసికొనుచుఁ గళింగదేశాధీసుండగు శూరసేనుఁ డశ్వారూఢుండై యొకనాటిప్రాతఃకాలమునఁ బుష్పగిరిపరిసరంబు దరియవచ్చెను.

ఆసమయమున వానిభృత్యుండగు నొకయాశ్వికుఁ డొకఁ డత్యార్తితో వాని కెదురుగ వచ్చి "మహారాజా! లలితాకన్యను జోరు లెత్తుకొనిపోయిరి" అని యాక్రోశించెను. వజ్రపాతసదృశం బగు నాదారుణవార్త వానిధైర్యభూధరం బగలింప "హా! లలితా! లలితా!" అని దుఃఖవివశుండై గుఱ్ఱముపైనుండి క్రిందఁబడియెను. వెంటనే యారాజభటుఁడు వలయునుపచారంబులఁ గావించి యాతనిఁ దెలివొందఁ జేసెను.

అప్పటికి లలితాకన్య పదియారేండులవయస్సు గలిగియుండుట చేఁ బెండ్లియీడు వచ్చినదయ్యెను. ఆమెతల్లి గతించిననాఁటనుండియు శూరసేనుఁ డామెలనాఁగ నల్లారుముద్దుగఁ బెంచుచుండెను. అట్లా కన్నియ శుక్లపక్షచంద్రికవలె దినదినప్రవర్ధమానయై యెన్నియో విద్యల నభ్యసించి నిరుపమానశేముషీవిశేషురా లయ్యెను. ఆమె మెయి

సోయగ మంతకంతకు జగన్మోహన మగుచుండెను. తామరరేకుల వంటి యామె వెడందకనుదోయి యువజనజిగీషభావభవుం డెత్తిన ధ్వజంబులో యనఁ బ్రకాశించుచుండెను. ఆయింతినగుమోము పండు వెన్నెలను వెదచల్లు షోడశకళాపరిపూర్ణం బైన పూర్ణిమాచంద్ర బింబమ్మును విడంబించుచుండెను. కొదమతుమ్మెదలగేరు నల్లగిరు లాడు నామెదీర్ఘశిరోజంబు లాపాదమస్తకంబుగ వ్రేలాడుచుండెను. నువ్వుపువ్వు నేలు నాజవ్వని నాసికాగ్రమునందలి తళుకయస్కాంతంబువలె ధీరజనహృదయలోహంబుల నాకర్షించుచుండెను. వేయేల నామె నొక్కసారి చూచినచో నామెమోహనవిగ్రహ మెంతటి మునిముఖ్యులహృదయంబులను నాఁకొనక మానదు.

నిజభటునిసముచితోపచారంబులఁ దెలివిఁ జెంది శూరసేనుఁడు లేచి "అయ్యో! నాముద్దులలలితా! లలితా! పరమమూర్ఖుండనై నిన్ను వీడి యీవిధంబుగ నిన్నుఁ జోరమృగంబుల వాతనిడితినే. బిడ్డా! నీ చిన్నారిముద్దుమోము నే మరలఁ జూడఁగలుగుదునా? అయ్యో! ఇంకెక్కడిలలిత? దుర్మదాంధుండనై పరులసహాయంబును నమ్మి నిన్నొంటిగ విడిచి పెట్టినపాపాత్మున కిట్టిశిక్ష కలుగు టాశ్చర్యమా? నిర్దయులగు నామక్కరచోరులు నిన్ను బలాత్కారముగఁ గొనిపోవునప్పుడు వారికర్కశహస్తంబుల శిరీషకుసుమపేశలం బగు నీసుకుమార తనువల్లి యెంతనలిగిపోయెనో? హా తండ్రీ! రక్షింపుము, రక్షింపు మనుచు నిర్భాగ్యుండ నగు నాకొఱ కెంతపలవించితివో? ఆపాపాత్ములు నిన్నెట్టి వెతలపాలు చేయుదురో?" అని పరిపరివిధంబులఁ బనవిపనవి భటునిఁ జూచి "రాజద్రోహులారా! మీయుపేక్షచేతనే నా కిట్టివిపత్తు తటస్థించినది" అని తీక్ష్ణభీషణనేత్రుండై పలికెను.

రాజభటుఁడు గజగజ వడంకుచు "మహారాజా! మే మెంతమాత్రి మేమఱియుండలేదు. ఏలినవా రాగ్రహావేశంబున నిరపరాధుల

మగు మమ్మూరక శిక్షింపఁదలంచిన మే మేమిచేయఁగలము. ఆమె యా ర్తనాదము వినినతోడనే కోటలోనికిఁ బరుగిడితిమి. అంతిపురంబులోనిచెలికత్తియ రోదన మొనర్చుచు మా కెదురువచ్చి యీసంగతిఁ దెలిపి లలితాకన్యగదిలో దొరకెనని యీ లేఖ నాచేతి కిచ్చినది. చిత్తగింపుఁడు" అని మహారాజుచేతి కొక లేఖ నొసంగెను. శూరసేనుఁడు భయకంపితచిత్తుఁడై యాయుత్తరము నత్యాతురతతో విప్పి చదువుకొనెను. అం దిట్లు వ్రాయఁబడియున్నది:—

"మహారాజశ్రీ శూరసేనమహారాజుగారి సన్నిధికి—విలినవారి మిత్రులును శ్రేయోభిలాషులు నగు చోరాచార్యశిష్యులు సేయు విజ్ఞాపనము. మహారాజా! మీరు నిరంతరము మాక్షేమమును గోరుచుండు ప్రభువు లగుటచే మీవల్లఁ గించిదుపకారమును వడయఁగోరి తమకుమారీమణి యగు లలితాకన్యకపై మక్కువఁ గొని సౌందర్యరాశి యగు నామోహినీమణిని వీడియుండఁజాలక మాస్వాధీనములో నుంచికొంటిమి. మీ రామెను జూడ నెంతప్రయత్నించినను లాభము లేదు. సంపూర్ణపుత్రికాభిమానముతో మీ రాకన్నియను గానఁగోరితిరేని యేఁబదివేలరూపాయీ లీక్రిందసూచింపఁబడిన సంకేతస్థలమున కొక్కమనిషిచే రహస్యోచితంబుగఁ బంపితిరేని సొమ్ము మాకుముట్టినవెంటనే మీపుత్రికను మీరు వడయఁగలరు.

ఇట్లు చోరాచార్యశిష్యులు,
బదరీవనగిరిప్రాంతము."

ఆలేఖను జదివినంతనే మహారాజు కాలాగ్నిరుద్రుఁ డయ్యెను. మరల నిజాశ్వం బారోహించి తనరాక యెఱింగించి దర్బారుదీర్ప రాజభటుని ముం దనిపి శూరసేనుఁడు పురప్రవేశం బొనర్చెను.

బదరీవనమనునది పాంచాలరాజ్యములోని దుర్గమారణ్యములలో నొకటి. తన్మధ్యంబున నత్యున్నతం బగు పర్వతంబు కలదు. ఆప

ర్వాతంబు మట్టును దట్టపుటీరంబులతోఁ గూడిన చిన్నచిన్నగుట్ట లనే కంబులు గలవు. అందొక శిలావేదికపై బేహారొకఁడు కూర్చుండి తన లో “మూర్ఖుఁడగు శూరసేనుని యొద్దనుండి దస్త్రికను రాకుండుటకుఁ గారణ మేమైయుండునో తెలియరాకున్నయది. ఆకన్నియ యెడల నిరాశుఁ డయ్యెఁగాఁబోలు. నాయకుఁడగు మందారకుఁ డింకను రాఁడయ్యె. నే నెంతసే పిచ్చోట నుండవలయునో కదా!” అని యనుకొనుచుండ సమీపంబున నడుగులచప్పుడు వానికిఁ గర్ణపథగోచరమాయెను. ఎవ్వఁడో నేకతంబ వచ్చుచుండుట నడిగట్టి శూరసేనునిభటుఁ డాతఁడే యై యుండవచ్చునని యూహ్వని వచ్చినదిక్కునకేగెను. ఎంత వెదకిన నెవ్వఁడును వానికంటఁ బడలేదు. తిరిగితిరిగి నిరాశుఁడై మఱలి యెప్పటిశిలావేదికపైఁ గూర్చుండెను. కొంతసేపటి కొకవ్యక్తి యతిసంభ్రమంబున వచ్చి బేహారును జూచి “మిత్రమా! ఇప్పట్టున మనప్రయత్నము విఫలమైనది. వివేకహీనుఁడగు శూరసేనుఁడు మన మాలేఖలో వెల్లడించిన హితోపదేశంబును వీటిబుచ్చి మనలను బట్టి శిక్షించుటకై యేఁబదిమంది రాజభటులను నియోగించెను. వారు వడిగలవారువంబుల నెక్కి ఖడ్గపాణులై వీరావేశంబున వచ్చుచుండ సాధువేషధారి నగు నేను మార్గమధ్యంబున వారిని గలిసికొని వంచనోక్తుల పదభ్రష్టులఁ గావించి వచ్చితిని. అయినను వారిలో మనరహస్యావాస మెఱింగినవాఁ డొక్కరుండుగలఁడు. నిశీథినీసమయంబగుటచే వారీరేయి నియ్యెడకు రాఁజాలరు” అని పలికెను. ఆమాట విని బేహారు విసుగుఁజెంది “మిత్రమా! నీకార్యనిపుణత్వంబును నే మెచ్చుకొనఁజాలను. నీవు తప్పుసేసితివి. మనకట్టడముమాట మఱచితివా యేమి? ఎఱనాసించిన పిట్టలన్నియు నొకేసారి వలలోఁ జిక్కునని యోజించవైతివి. ఇప్పుడైనను మిగిలిపోలేదు. నీవు మరల నతిత్వరితంబుగఁ జని మాయోపాయంబున నాపిటికిపందల నియ్యెడకు రప్పించి కట్టడములోఁ బ్రవేశపె

ట్టుము. నేనిప్పుడే చని కట్టడమును సరిచేసెదను" అని యిరువురు నె వరితోఁగ్రివను వారు చనిరి.

శూరసేనుని రాజభటు లట్లు వంచనచే పదభ్రష్టులై యొక్కింత కాలయాపనం బొనర్చినను తెల్లవాఱుసరికి బదరీవనగిరిప్రాంతంబుఁ జేరిరి. అచ్చో నెటుచూచినను దట్టమైన ముళ్ళపొదలును జిన్నచిన్న గుట్టలును జూచి చోరు లందెచ్చటనో డాఁగియుందురని శ్రద్ధగఁ బరీక్షించుచుఁ బోవుచు దవ్వుల నత్యున్నతం బగు నగంబును గాంచిరి. అదియే బదరీవనగిరి యని తెలిసికొనిరి. ఆపర్వతసమీపంబున నొక తటాకము గలదు. దానిచెంత నల్లిబిల్లిగా నల్లుకొని యున్నమల్లెపొద లో నొకయువకుఁడు పరుండియుండెను. రాజభటులు వానిం జూడకయే యాపొగ నతిక్రమించిరి. అప్పటికిఁ దెల్లవాఱినది.

ఆసమయమున నొకవృద్ధుఁడు కఱ్ఱఁ జేతఁబట్టికొని యామార్గముననే తొందరగఁ బోవుచుండెను. రాజభటు లావృద్ధుని నిలు నిలు మని యదల్చి "మార్గస్థుఁడా! నీ వెటనుండి వచ్చుచుంటివి?" అని యడిగిరి. అందు కావృద్ధుఁడు జవాబుచెప్పకయే మిన్నక పోవుచుండెను. రాజభటులలో నొకఁడు వానిఁబట్టికొని "వృద్ధుఁడా! మాప్రశ్నకుఁ బ్రత్యుత్తర మీయకయే పోవుచుంటి వేమి?" అని గద్దరించి పలికెను. అందుపై నావృద్ధుఁడు భయము నభినయించుచు "బాబూ! నేను బంధుదర్శనార్థమై హేలాపుర మేగి యటనుండి వలువాత బయలుదేటి వచ్చుచుండ నీసమీపంబుననే చోరులు నన్నడ్డగించి శగ్గనభగ్గనఁ గావించిరి. ఆదుర్మార్గులబారినుండి యదృష్టవశంబున విడివడి ప్రాణంబులతో వచ్చుచుంటిని. నేను తొందరగఁ బోవలసియున్నది. ప్రొద్దెక్కుచున్నది. బాబూ! నన్నుఁ బోనిండు." అని సవినయంబుగ వేఁడికొనియెను. "ఆచోరుల నీ వెచ్చోటఁ జూచితివి?" అని రాజభటు లడుగ నావృద్ధుఁడు "బాబూ! దుష్టస్వభావు లైన యాచోరులు నాయద్ద

ష్టవశంబున నన్నుఁ గరుణించి విడిచి యాకట్టడమువైపు చనిరి. "వా రా కట్టడములోఁ బ్రవేశించుట నీవు చూచితివా?" అని రాజభటు లడుగ "బాబూ! చూడలేదు. కాని వా రందే ప్రవేశించియుందురు. ఏమన నేనట్లు విడివడి పదియడుగులు నడిచి తిరిగిచూచుసరి కా చోరు లదృశ్యులైరి. మీ రచ్చోటి కేగఁదలంచితిరా?" అని వృద్ధుఁడు పలికెను. "అవును. నీవుకూడ మాతో రావలయును." అని యావృద్ధునిఁ దోడ్కొ-ని రాజభటు లాకట్టడముచెంత కేగిరి.

ఆకట్టడ మొకకొండ మొదలునకు ముప్పదియడుగుల యెత్తున నుండెను. అఱువదియడుగులచతురము గలిగి నలుతట్టులఁ జెక్కలతో నమర్పఁబడియుండెను. లోపలి యడుగుభాగ మంతయు నొక బల్లచేఁ గప్పఁబడియుండెను. ఆబల్ల కడుగున నొకతీఁగమఱ గలదు. ఆమఱను ద్రిప్పుసాధన మాకట్టడముచుట్టును గల బల్లకూర్పులో ముఖద్వారముప్రక్క గలదు. అయ్యది యెఱింగినవారలకే గాని యితరులకుఁ గోచరము కాదు. ఆమఱఁ ద్రిప్పినతోడనే బల్లంతయు నొకతట్టునకును మఱియొకతట్టుపైకి నుండునటులఁ దిరిగిపోవును. ఆకట్టడమున కధోభాగమున నొకగహ్వరము గలదు. అదియొక విశాలమైన భవనమువలె ననేకగదులు గలిగియుండెను. వానిలో నొకగదిపై నాకట్టడమును బల్లకూర్పుతోఁ దయారుచేసిరి. ఆగహ్వరమే చోరుల నివాసస్థలము.

అట్లాకపటవృద్ధునితోఁ బోయి రాజభటు లాకట్టడములోఁ జొఱఁబడిరి. అందు వారు నిలిచియున్నబల్ల కడలిలోనిపడవవలె నట్టిట్టుఁ గదలుచుండెను. ఏవంకఁజూచినను లోనికేగుటకు ద్వార మెచ్చటను గాన్పింపలేదు. మాయలమాఱిచోరుఁడే యాకపటవృద్ధవేషంబున వచ్చి తమ్ము మోసముఁ జేయుతలంపుతో నచ్చటికిఁ దోడ్కొనివచ్చె నని రాజభటు లనుమానించి వెలికి రానెంచుచుండ నాకపటవృద్ధుఁడు వె

ఉపలనే యున్నవాఁడు గావున వారియత్నమెఱింగి వెంటనే మఱ త్రి
ప్పివేసెను. కట్టడములోనిబల్ల తిరిగిపోయెను. రాజభటులందఱు "మో
సము. మోసము." అని కెవ్వున నొక కేకవైచి యాగహ్వరములోఁ
గూలిరి. అప్పటికి సూర్యోదయ మైనది.

మల్లెపొదలోఁ బరుండియున్నయువకుఁడు "పరమపాపాత్ము
లగుచోరులదుష్ప్రయత్నం బెఱుఁగఁగోరి వ్యర్థముగఁ గాలయాపనం
బొనరించితిని. నేఁ జూచి తోడ్కొనిపోఁగడంగిన కిరాతయువకునిజాడ
యింతవఱకును దెలియరాదయ్యె ఆపురుషుండు వీరధన్వయనే బోయ
వానిపుత్త్రుఁ డనియు నావీరధన్వి నామామయైన సుదర్శనమహారాజు
గారి యాస్థానవైద్యుఁ డనియు విని యుంటిని. ఆసంగతి యథార్థమేయైన
యెడల నే నామహారాజుసాహాయ్యంబున వానిజాడఁ దెలిసికొనఁగల్గె
దను. నే నిప్పుడే హేలాపురమునుగూర్చి బయలుదేఱెదను." అని యు
నకొనుచు బయలుదేఱ నుద్యుక్తుఁ డగుచుండ రాజభటుల యాక్రంద
నధ్వని వినవచ్చెను. రేపకడనే చోరులామార్గమున వచ్చి యాకృత్రి
మకట్టడములోని కేఁగుటయుఁ బిదప రాజభటు లొకవృద్ధునితో నయ్యె
డకే పోవుటయుఁ జూచియున్నవాఁడు గావున దుర్మార్గులగు నాతస్క
రులచేఁ బాప మారాజభటులందఱకు నొక్కసారిగ నేదో యుపద్ర
వము సంభవించెఁ గాఁబోలు నని తలంచి యొక్కండయ్యు మహాసింహుం
డగుటచే వీరపాలుఁడు—ఆమల్లెపొదలోఁ బరుండినయువకుఁ డతఁడే —
చోరులను శిక్షించి రాజభటులను రక్షించుటకై బయలుదేఱెను.

ఆసమయమున వీరపాలున కెటనుండియో యాలసడి యొకటి
వినవచ్చెను. రాజభటుల నట్లు మోసగించి యాకపటవృద్ధుఁడునల్ల
డలఁ బరికించి చూచి దవ్వుల నొకయువకుఁడు ఖడ్గపాణియై కట్టడము
చెంత కేతెంచుచుండె నని తెలిసికొనియెను. అతఁడు మున్నొకప్పుడు
తమ్ము మాఱొక్కని ప్రయత్నభంగముఁ గావించినవాఁడే యని గుర్తిం

చి తనసహచరులను బిలువ నాయీాల వేసెను. అది వినినతోడనే చోరులందఱును బైకి వచ్చి వీరపాలునిఁ జూచి "ఓరీ వివేకహీనుఁడా! మందబుద్ధివై బెబ్బులులున్న గుహాలోనికి లేడిపిల్ల రా సాహసించు నట్లు వచ్చుచుంటివి. నీవు మున్ను మా కొనర్చిన యుపకారంబునకుఁ దగిన ప్రతీకారమును గావించెదము రమ్ము ఇంక నీ వెందుఁ బోఁగలి గెదవు" అని కరఘటితకరవాలంబులు త్రిప్పుచు వానిపైఁ బడిరి. వీరపాలుఁ డొక్కరుం డిరువదిమందిముష్కరచోరులతోఁ బోరాడవ లసివచ్చెను. అమితశౌర్యశాలి యగుటచే వీరపాలుఁ డట్టివిషమసమ రంబును గొంతతడవు గావించి యిరువురుచోరులను బడఁగొట్టి క్రాం తిఁగొనియు వీరావేశంబున మఱి యిద్దఱిశిరంబులను ఖండించెను. హతశేషులైన చోరులు వీరపాలుని ఖడ్గప్రహారంబుల గాయములఁ జెంది పూచిన మోదుగచెట్లవలె రక్తసిక్తాంగు లయ్యు విడువక పెనం గుచుండిరి. వీరపాలుఁడు మిక్కుటంబుగ నలయుటచేఁ జివరకు చోరు లకుఁ జిక్కవలసివచ్చెను. ఆపాపాత్ములు వానిని గొనిపోయి తమ పాతాళగహ్వరములో బంధించిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఎనిమిదవ ప్రకరణము.

చ. కలియుగమందు దుర్వ్యసనకాంక్షఁ బరార్థముఁ గోరి మానవం
తులు స్వకులోచితంబు లగుత్రోవల వీడి దురాశచేత ని
చ్చలుఁ గుటిలప్రవృత్తుల నెసంగఁగఁ గోరుదు రంతె కాని యా
వల జనదూష్యు లౌదు రని భావమునం దలపోయ రక్కటా.

లోకములో మనుజుఁడు తా నొకటి తలంప దైవము వేఱొకండు దలంచుచుండును. పురుషుఁ డెప్పుడును స్వప్రయోజకత్వంబున నెన్నియో మనోభీష్టంబులను సిద్ధింపఁ జేసికొనఁ జూచుచు నువ్విళులూరుచుండును. దైవానుకూలము లేనిచో భగ్నమనోరథుం డగుటయే గాక విపత్తులను గూడఁ జెందుచుండును. కాలమనునది నేర్పరియైన తస్కరునివంటిది. మనుజుల జీవధనంబులను బహురహస్యోచితంబుగ గ్రహించుచుండును. కాలమహిమ యిట్టిది యని యెఱింగిన వారుఁ గూడ తమ జీవధనంబులు నిత్యము లని నమ్మి గర్వపూర్ణులై విషయసంసక్తి వఱలుచుందురు. వారిలోఁ గుటిలవర్తనుల దురాశాబదనికలచే నెన్నియోసంసారవృక్షంబులు నశించుచుండుట మనము ప్రత్యక్షంబుగఁ జూచుచునే యున్నారము.

కుళిందదేశాధీశుం డగుకామపాలుఁ డొకనాఁటిరేయి ఫరషు మీఁదఁ గూర్చుండి హుక్కాపీల్చుచు "హేలాపుర మేగియున్న నాభృత్యులు జగన్మోహిని యగుచంద్రికళను దోడ్కొని వత్తురు. నే నామెలనాగను బలాత్కారముగ నైనఁ జేపట్టి వివాహమాడితి

నేని సుదర్శనున కామె యొక్కరితయే కాని పుత్రసంతానము కలుగనందున వానియనంతరమునఁ బాంచాలరాజ్య మంతయుఁ జంద్రికళద్వారా నాకు లభించును. అటుపైఁ గళింగరాజ్యము నాగోటిలోనిది కాకపోవునా?" అని యువ్విళు లూరుచు నెన్నియో వాయుహర్మ్యముల నిర్మించుచుండెను. "పండువెన్నెలలో వికచప్రసూనభరితమైన మల్లెపందిరి వాపునఁ బుష్పపరాగవికీర్ణమైన చంద్రశిలావేదికపై నావిలాసవతిసరసను గూర్చుండి యిట్టులనే పలుక్కాపీల్చుచు సరససల్లాపము లాడుచు నిష్టోపభోగంబుల ననుభవించెదను." అని యనుకొనుచు గుప్పుగుప్పునఁ బొగ విడుచుచుండెను.

అంత హఠాత్తుగ నొకపురుషుఁడు కుడిచేత నొకపసిండిపొన్నుబెత్తముఁ బట్టికొని యొకచేతికొనగోటఁ దనకోరమీసముల దువ్వికొనుచుఁ గామపాలుని సమ్ముఖంబునకు వచ్చి నగుమొగంబుతో "మిత్రమా! కామపాలా! కుశలమేనా? వంగరాజ్యవిప్లవము కడచినది మొదలు నీవు మరల నాకంటఁ బడవైతివి. నీతో స్వయముగ మాట్లాడవలసిన సంగతు లెన్నియో యుండుటచే నిన్నుఁ గలిసికొనుటకు వివిధప్రయత్నములను జేసిచేసి విసిగి తిరుగ నారాజ్యమున కేగఁ దలంచి బయలుదేఱ నీవు నీరాజ్యములోనే యుంటి వన్నసంగతి తెలియవచ్చినది. వెంటనే యిక్కడకు బయలుదేఱితిని. నేఁటికి నేఁ గాంక్షించినసమావేశము దైవవశంబున లభించినది. ఏమి నేఁడు నీవట్లుంటివి? సకలభువనాహ్లాదకరుం డగు శీతరశ్మి నీమెడల దోషాకరుం డయ్యెఁ గాఁబోలు! మనమిత్రులైన కాళీపాదభైరవ లింకను సఫలితప్రయత్నులై తిరుగ రాకుండిరే యని యతనుతాపపీడితుండవై చంద్రికళానుభూతి నపేక్షించుచుంటివి కాఁబోలు!" అని పరిహాసముగఁ బలికెను. కామపాలుఁడు విషణ్ణుడై "మీ రెవ్వరు? నన్నెవ్వనిగ భావించితిరి? మీ రిట్లు రాజమర్యాదల నతిక్రమించి యేకాంతసమయములో నా

యనుమతిఁ గొనకయే నాయంతికంబున కేతెంచి నన్నుఁ బరిహసింప సాహసించుటకు మీకుఁ గల యధికార మేమి?" అని తిరస్కారముగఁ బలికెను. అందుపై నావీరపురుషుఁడు పక్కున నవ్వి "కామపాలా! నన్ను నీవు గుర్తింపలేవు కాఁబోలు. నిన్ను నేను పూర్తిగ నెఱుంగుదును. కార్యానేకముగ్నుండవై నన్ను మఱచితివి. దాని కేమి; నిన్ను నేను మఱమువాఁడను గాను. మిత్రులకు మర్యాదలు కావలెనా? మైత్రికి మించిన యధికార మేమియుండును? నీపై నాకుఁ గల ప్రేమగౌరవములచేతనే నీమిత్రులైన వారల నెన్నిసార్లో గౌరవించితిని. చంద్రికాపహరణకార్యమునందుఁగూడ నీమిత్రుల కెంతయో యుపకార మొనరించితిని. నీరుఁడ నగుటచే నీపై నాకుఁ గల ప్రేమ బలంబున నీప్రయత్నములనెల్ల పరోక్షంబుగఁ దెలిసికొని నీకుఁ దగు సహాయ మొనర్పఁగోరి యెంతయో పాటుపడితిని. అవియన్నియు మఱచి నీకుఁ బరమాప్తుఁడనైన నన్ను నీవెవ్వాఁడ వని యడుగుచుంటివి. ఇదియేనా నీకృతజ్ఞత? భావమఱది వని నమ్మి నీచెంతకువచ్చిన వంగదేశాధీశుని వంచించి చంపుటలో నీ కెవ్వరు సహాయులైరి?" అని చనవొప్పఁ బలికెను. కామపాలుఁడు సహజభీరుఁడును వివేకహీనుఁడు నగుటచే నావీరునిమాటలలోని వ్యధికరణమును గ్రహింపఁజాలక విస్మయాకులితచిత్తుఁడై మఱియు నిర్ఘాంతపడి చూచుచుఁ దనలోఁ దా నిట్లనుకొనఁదొడంగెను. "ఈసాహసికుని నే నిదివఱ కెన్నండును జూచియుండలేదు. ఈతండు నా కుపకారియా లేక యపకారియా? తా నొకవీరుండఁట. అట్లయినచో నిశ్చితుకంబుగ నా కపకారముఁ జేయునా? ఇప్పట్టున వీనిని మిత్రునిగ భావించవలెనో శత్రువుగ భావించవలెనో తెలియకున్నయది. చంద్రికాపహరణకార్యము సిద్ధించినచో నీతండు నాకు మహోపకారి యనియే నమ్మెదను" అని యేమేమో యాలోచించుకొనుచుండఁ బ్రతాపసింహుఁడు—అవ

చ్చిన వీరపురుషుఁ డతఁడే—"ఓయీ మిత్రఘ్నా ! నీ వింత విశ్వాస ఘాతకుండ వని యెఱుంగక నీయొద్దకు వచ్చినందుకా న న్ననుమా నించుచుంటివి ? పోనిమ్ము చంద్రికళ నేదోవిధముగ లభింపఁజేసి నచో నన్ను నమ్మెదవా?" అని యడిగెను. ఆమాట వినినంతనే కా మపాలుఁడు హర్షపులకితగాత్రుండై "మిత్రమా! సందేహ మేమి? నీవు నా కంతటిమహోపకారము జేయఁగలిగితి వేని నాకు నీకంటెఁ బరమా ప్తుఁ డెవ్వఁ డుండును ? అప్పుడు మిత్రుండవైన నీకు నేను కింకరుండ నయ్యెదను" అని యాత్రుతతోఁ బలికెను. "మిత్రమా! చంద్రకళ ల భించినపిదప మనమిత్రులైన చోరులచేఁ బాతాళగహ్వరంబున బం ధింపఁజేసిన లలితనుగుఱించిన ప్రయత్నము విరమించెదవు కాఁబో లు ?" అని ప్రతాపసింహుఁ డనఁ గామపాలుఁడు ఱిచ్చపడినచూపు తోను వెల్లనైన మోముతోను వెంటనే ప్రత్యుత్తరమీయఁజాలక యె ట్టకేలకు చిత్తంబుఁ గుదుటపఱచికొని తనలో "నిక్కము నా ప్రయత్న ము లన్నియు నెఱిఁగెను! నాకు శత్రువై నా గుట్టంతయు నావల్లనే తెలిసికొని నా కపకారము సేయఁదలంచి యిట్లు కపటముగ మాట్లా డుచుండెనేమో? అట్లయిన నారహస్యోద్యమము లన్నియుఁ గనిపెట్టి చూచుచున్నవాఁడు నాకు హానికలుగఁజేయ నెంచినచో నిదివఱకే చేయకుండునా ? ఎట్లయిన వీఁడు నాపాలిటి దుష్టగ్రహమై దాప రించినాఁడు. ఇప్పుడు నాకుఁ గర్తవ్యమేమి? ప్రాణోపద్రవకరములైన నాద్రోహచింతనము లెల్ల నెన్నండును జూచియుండనట్టియు శత్రువో మిత్రుఁడో తెలియనట్టియు నూతనపురుషునకు వెల్లడింపనగునా? నేని ప్పుడు వీనిని దిరస్కరించితి నేని వీఁడు నాకుం బ్రబలశత్రువై నాత్రోవల కడ్డువచ్చుచు నాప్రయత్నము లన్నియు భంగపఱచుచుండుటయే గాక నాకుఁ బ్రాణహానికూడఁ గలుగఁజేయును. కావున వీని నిప్పుడు మా యోపాయంబున నంత మొందించుటకే ప్రయత్నించెదను." అని కృత

నిశ్చయుండై "మిత్రమా! నీవు నాకుఁ బరమాప్తుఁడవు. కార్యాలోచనా పరత్వంబున నాయంతరంగికుండవైన నిన్ను గుర్తింపఁజాలక నిన్ను సముచితమర్యాదల బహూకరింపని నాతప్పు మన్నింపవేఁడెదను. లలిత మాట యటుండనిమ్ము. మన మెన్నియో రహస్యవిషయంబులను నానాన్యాకర్ణనీయంబుగ మాట్లాడికొనవలసియున్నది. గోడలకుఁ జెవు లుండును. ఏకాంతప్రదేశమున కేగుదము రమ్ము" అని పలికెను. ఆ మాటలు విని ప్రతాపసింహుఁడు తిరస్కారసూచకంబుగ నవ్వి "మిత్రమా! నన్నుఁ జూచినప్పుడే నిన్నావహించిన యనుమానపుఁబిశాచము నిన్నింకను వదలలేదని నీముఖవర్ఛస్సే తెలుపుచున్నది. వెఱ్ఱివాఁడా! మిత్రులసాహాయ్యంబు లేకుండ పట్టిన ద్రోహచింతనములచే నెప్పుడైనఁ గార్యములు నెఱవేఱునని కొంటివా? తోడఁబుట్టినతోడు వని రాజ్యమును నీకప్పగించి తీర్థయాత్రల కేగిన ప్రేమమయుఁడగు నీయన్నను జోరులచేఁ జంపించి కుళింద రాజ్యము నాక్రమించుకొంటివి. కాని నీకు మొగుఁడింకను బ్రతికియేయున్నాఁడు. శూరసేనుని స్నేహ మపేక్షించి నీముఖ్యబంధువైన విష్ణువర్ధనునిఁ జంపి వానికుటుంబమంతయు నాశన మొనర్చి వంగరాజ్యమును శూరసేనుని కర్పించితివి. అందువలన నీ కేమిమేలు కలిగె? నక్కపోతువలె శత్రులమారివై లలితను జేపట్టి వంగరాజ్యసహితమైన కళింగరాజ్యమంతయుఁ గబళింపఁదలంచి నీమిత్రునకుఁ బుత్రికాపహరణయోగంబును గలిగించితివి. దాన శూరసేనుఁడుఁగూడ నీకుఁ బ్రబలశత్రువగుట నిశ్చయము. చంద్రికాపహరణప్రయత్నంబుచే సుదర్శనునకుఁగూడ నీవు విద్వేషివైతివి. నీసంబంధమైన యీదారుణపరిస్థితుల నెల్లఁ దెలిసికొని నీమేలు కోరి నీకు సహాయము సేయవచ్చిన నన్ను విశ్వసింపలేకున్నావు. పోనిమ్ము. నీవు శ్రమపడవద్దు. పోయివచ్చెదను" అని లేచెను. అంతఁ గామపాలుఁడు భీతిల్లి చేయఁగలిగిన దేమియు లేనందున "ఓమహాపు

రుషా! నన్నుఁ గరుణింపుము. నీ వెవ్వండవో నే నెఱుంగకున్నను నాపాలిటి భాగ్యదేవతవై నన్నుఁ గృతార్థునిగఁ జేయుటకే వచ్చితివని యిప్పుడు రూఢిగ నమ్మితిని. నీటను ముంచెదవో పాలను ముంచెదవో నీపాలఁ బడితిని; న న్నీవిపత్సాగరమునుండి యుద్ధరించి రక్షింపుము. నీవు వక్కాణించిన ద్రోహచింతనములన్నియు యథార్థములే. శరణాగతుని రక్షించుటయే కదా వీరధర్మము? " అని ప్రతాపసింహుని పాదములపైఁ బడెను.

ఆసమయమున కింకరుఁ డొకఁడు వచ్చి "మహారాజా! నిగూఢ కారాగారంబున బంధింపఁబడినకాంత మూఁడురోజులనుండి యాహార పానీయములు లేకుండుటచేఁ గాఁబోలు వివసురాలై పడిపోయి యసువులవీడ సిద్ధముగా నున్నయది. ఆజ్ఞ యేమో సెలవిండు" అనిపలికెను. ఆమాట విని కామపాలుఁడు దద్దరిల్లి లేచి "ఏమేమి? వెంటనే వైద్యునిఁ బిలిపించి యామె కాహారాద్యుపచారములచే బలముఁ గలిగింపవలయు నని మంత్రికి నాయాజ్ఞగా నెఱింగింపుము" అని కింకరుని బంపివేసెను.

అనంతరము ప్రతాపసింహుఁడు "కామపాలా! నీమాటలు విశ్వాసపాత్రము లని యెట్లునమ్మనగు. నీవు నన్ను మిత్రునిగ హృదయపూర్వకముగ నెంచితివేని యాకాంతామతల్లి యెవ్వరో యామెను జెఱలోనుంచుటకుం గలకారణమేమో వివరింపుము" అని పలికెను. అందుపైఁ గామపాలుఁడు "వీరవరా! ఆవిషయము పరుల కెఱింగించునది కాదు. నన్ను నిర్బంధింపకుము. నాప్రాణములనైన నర్పించెదను గాని యారహస్యమును వెలిబుచ్చను" అని దృఢముగఁ బలికెను. అందుపైఁ బ్రతాపసింహుఁడు "పోనిమ్ము. ఆవిషయము మేరాజ్యముతో సంబంధించినదో చెప్పెదవా?" అని యడిగెను. అందు కాకామపాలుఁడు పరధ్యానమగ్నుఁడై "కోసల——" అని "కాదు, కాదు. నే నావిష

యమును గుఱించి యేమాత్రమును నారహాస్యమును వెల్లడింపను"
అని నిష్కర్షగాఁ బలికెను.

అందుపైఁ బ్రతాపసింహునకుఁ గలిగినకోపమునకుఁ బరిమితి
లేదు. క్రోధారుణనేత్రుండై పండ్లు పటపటఁ గొఱుకుచు వర
నుండి కత్తి దీసి "దుర్మార్గుఁడా! అందినచో జుట్టును లేనిచోఁ గాళ్లను
బట్టుకొనియెదవా? చంకదుష్టుతో శరణార్థి వగు నిన్నెవ్వరు విశ్వసిం
తురు? కపటశీలా! కామపాలా! నీవు పరమద్రోహివి. నికృష్టుండవు.
నీవారుణకృత్యము లన్నియు నే నెఱింగితిని. నీవంటికృతఘ్నునకు సహా
యమొనర్ప నెంచువాఁడు నీకంటెను ద్రోహి కావలయును. పాపులను
శిక్షించుభగవంతుఁడే నిన్నుఁ బాలింపవలయును గాని మనుష్యమా
త్రుఁడు నిన్ను రక్షింపఁజాలఁడు. నిన్నుగుఱించి లోకులవల్ల వినియు
న్నసంగతు లెంతవఱకు విశ్వసనీయములో యెఱుంగఁగోరియే నీయొ
ద్దకే తెంచితిని. కృతార్థుండ నైతిని. నిన్నీక్షణముననే సంహరించి లో
కమంతయు నిష్కంటకంబుఁ గావింపఁగోరుచుంటిని. కాని రాజ్యలుబ్ధుం
డవై నిష్ప్రయోజకంబుగ నిరపరాధులను బీడించియుఁ జంపియు మలిన
మనస్కుఁడవైన పరమనీచుఁడవగు నీపాపురక్తముతో నాపవిత్రఖడ్గ
మును మైలపఱుప మన సొప్పకున్నయది. అయినను నీకుఁ దగినశిక్ష
విధించుకాల మాసన్నమైయున్న దని తెలిసికొనుము" అని గిఱుక్కున
మఱలి యదృశ్యుఁ డయ్యెను.

కామపాలుఁడు నిశ్చేష్టుఁడై వెఱఁగంది చూచుచు మిన్ను విఱిగి
మీఁదఁబడినట్లు భావించి కొంతతడ వేమిచేయుటకును దోఁచక
హుక్కాను బీల్చుచుఁ హఠాత్తుగ లేచి వ్రాఁతబల్లయొద్ద కేగి
శూరసేనునిపేర నొకలేఖ వ్రాసి విశ్వాసపాత్రుఁడైన యొకయాశ్వి
కుని బిలిపించి యాలేఖను వానిచేతి కిచ్చి శూరసేనునియొద్ద కనిపెను.

అశ్వికుండు చనినపిదపఁ గామపాలుఁడు వెఱ్ఱివానివలె నిటునటుఁ జెరలాడుచుండ నొకప్రతీహారి ప్రవేశించి "ప్రభూ! ఏలినవారిదర్శనార్థమై మందారకుఁడు వచ్చి ద్వారమునొద్ద వేచియున్నాఁడు" అని మనవిచేసెను. "లోనికి రప్పింపుము" అని కామపాలుఁడు పలికెను. వెంటనే మందారకుఁడు లోనఁ బ్రవేశించి ఫరషుపైఁ జతికిలఁబడి "మిత్రమా! ఇప్పట్టున దైవము మనయెడలఁ బ్రతికూలుఁడై యున్నాఁడు. మనపన్నుగడ లన్నియు భగ్నము లైనవి." అని నిట్టూర్పు విడుచుచుఁ బలికెను. "ఏమేమీ! మనయత్నము లన్నియు విఫలము లయ్యెనా? మందారకా! హేత్వంతరముల నెఱింగితివా? ఏమి జరిగినదో సవిస్తరముగఁ దెల్పుము" అని పలికెను. అందుపై మందారకుఁడు "చంద్రికాపహరణయత్నము విఫలమగుటయే గాక యాపనికి నియోగించిన కాళీపాదభైరవులు శత్రువుచేతిలోఁ జిక్కిరి. లలితాకన్నియను జెఱలో నుంచితిమి." అని చెప్పి "మిత్రమా! ఈపై మనము చేయవలసినపని యేమి?" అని యడిగెను. అందుకుఁ గామపాలుఁడు "మందారకా! ఆశత్రు వెవ్వఁడు? వానిని మట్టుపెట్టలేకపోయిరా?" అని పలికెను. "మిత్రమా! ఆశత్రువు వివిధవేషంబుల మనలను వెన్నంటియే తిరుగుచున్నవాఁడు. అతఁ డొకకిరాతయువకుఁడు. మహావీరుఁడన నతఁడే యని చెప్పనొప్పు. అతఁ డొకప్రచ్ఛన్నవేషంబున మీయొద్దకు వచ్చెనని విని నేనియ్యెడ కేతెంచితిని" అని పలికెను. ఆమాట వినినంతనే కామపాలునిదేహ మొక్కింత కంపించెను. వానిగుండె చెదరెను. అతిప్రయత్నంబున గుండె దిట్టపఱచికొని "మందారకా! నీవు నీసహచరులందఱను వెంటఁబెట్టుకొని యిప్పుడే బయలుదేఱి యాకిరాతయువకునిఁ బట్టికొని రేపుసాయంత్రములోపునఁ దీసికొనిరావలయును. ఆకిరాతయువకునివృత్తాంత మంతయుఁ దెలిసికొనవలయును. ఈకార్యము నెఱవేర్చితిరేని యేఁబదివేలరూప్యంబు లిచ్చెదను" అని

పలికెను. 'మంచిది' యని మందారకుఁడు వెడలిపోయెను. కామపాలుఁడు తనలో "నేఁ డెట్టిపాపిష్ఠిదినమో కాని తలంచినపనియెల్లఁ బాడగుటయే కాక నామనం బేలొకో కలంగుచున్నది. అయినను లలిత నాచేఁ జిక్కియున్నంతవఱకు శూరసేనుఁడు నాచేతిలోని కీలుబొమ్మయే కదా!" అని యనుకొనుచుఁ బడకగదిలోనికిఁ జనియెను.

చోరులు లలితాకన్యను గొనిపోయిననాఁటనుండియు శూరసేనమహారాజు నిద్రాహారములు లేక రేయుంబవళ్లు "లలితా! లలితా!" యని వాపోవుచుఁ గృశించుచుండెను. దర్బారున కేగుటయే లేదు. ఒకనాఁడు తనసచివునిఁ బిలిపించి "మంత్రీ! నాలలితను జోరులబారినుండి తప్పించి తోడ్కొనిరాఁ బంపిన మనభటులు వచ్చియుండిరా?" అని యడిగెను. "మహారాజా! లేదు. కారణ మేమో యూహింపలేకున్నాను" అని పలికెను. అందుపై మహారాజు భీతిల్లుచు "ఏమీ, మన భటులలో నొక్కండును రాలేదా? వారికిఁ గూడఁ జోరులచే నెట్టిదైన నపాయము వాటిల్లెఁ గాఁబోలు! మంత్రీ! చోరులు కోరినప్రకారము లంచపుసొమ్మును బంపించితివా?" అని యడిగెను. అందుకుఁ బ్రధాని "మహారాజా! ఏలినవారి సెలవైనతోడనే దస్తంతయు విశ్వాసపాత్రుఁడైన యొకభటునిచేతి కిచ్చి పంపించివేసినాను. ఆభటుఁడును దిరిగి రాఁడయ్యె. వాని కేమియుపద్రవము సంభవించెనో తెలియదు" అని పలికెను

వారట్లు మాట్లాడుకొనుచుండ నేదిక్కునుండియో నొకబాణము జివ్వున వచ్చి వారిమ్రోలఁ బడియెను. ఆబాణముఖంబున నొక కాగితము గ్రుచ్చఁబడి యుండెను. అది యొకలేఖ యని తెలిసికొని యద్దాని ములికినుండి పైకి జాగ్రత్తగఁ దీసి సచివుఁడు మహారాజునకుఁ జదివి వినిపించెను. అం దిట్లు వ్రాయఁబడి యున్నది:—

"మహారాజా! లలితాకన్యవిషయమై మే మిదివఱలోఁ గోరిన లంచమును జెల్లింపవలసిన గడు వతిక్రమించుటచే నాలంచ మిప్పుడు ద్విగుణీకృత మైనది. ఆ హేతువుచే మాయొద్ద నున్న కోమలవ చాలమి మీ రాయేబదిమందిభటులనుగూడ మా స్వాధీనములో నుంచికొంటిమి. మీ రాలలితను భటులను గైకొనఁదలంచినచో వెనుక మే మెఱింగించిన యేర్పాటుప్రకారము లక్షవరహాలు చెల్లించవలయును.

ఇట్లు,

చోరాచార్యశిష్యులు.

మహారా జాగ్రహావిష్టుఁడై భూమిఁ దన్నుచు "మంత్రీ! మనచతురంగబలమంతయును గట్టాయితముఁ గావింపు మని నాయాజ్ఞగా సేనాధిపతికి ఫర్మానా బంపుము. ఇప్పుడే నేను స్వయముగ సన్నద్ధుండనై బయలుదేఱి బదరీవనగిరిప్రాంత మంతయు నిర్ధూమధామంబు గావించి చోరు లందఱను వెదకి వెదకి సంహరించి నాలలితను నా భటులను గొనివచ్చెదను. ఏతత్ప్రయత్నంబున నాప్రాణము లన్నైన నర్పింపఁదలంచితిని. నాముద్దులలలిత లేని నాప్రాణ మేల? నాయీరాజ్య మేల?" అని పలికెను. "చిత్తము" అని మంత్రి పనివినియెను. మహారాజుహృదయము కల్లోలమై యుండెను. మతిపోయినవానివలె నారాట మొందుచుండెను అప్పుడు దవ్వుల గుఱ్ఱముపై నెవ్వరో వచ్చుచున్నట్లు గవాక్షములోనుండి చూచెను. వివిధభావపరీతచేతస్కుండై లలితాకన్నియ చెఱవీడి వచ్చుచుండె నేమో యని యత్యుత్కంఠ గవాక్షముచెంత కేగెను.

అంత నొకయాశ్వికుఁడు గేహాళి సమీపించి గుఱ్ఱము డిగ్గి మహారాజు సౌధాంతరంబున నుండె నని విని పరిచితుఁ డగుటచే ధారాళముగ లోని కేగి శూరసేనునిఁ జూచి నమస్కరించెను. రాజు భగ్నమనోరథుఁడై యాపురుషునిఁ జూచి "కామపాలా! నీవు వచ్చినపని యే

మి?" అని యడిగెను. అందుపైఁ గ్రామపాలుఁడు "మహారాజా! నేను వచ్చినపని యేలినవారికి శుభసంపాదకము గుఁగాక!" అని నుడువ శూరసేనుఁ డుత్కంఠతో "మిత్రమా! నాముద్దులలలితజాడ నీకేమైనఁ దెలియవచ్చెనా ?" అని యడిగెను. అందుపైఁ గ్రామపాలుఁడు విస్మితుండై "మహారాజా! నేను వ్రాసి పంపినలేఖ యేలినవారి కందలేదా యేమి ? విశ్వాసఘాతుకుండును రాజద్రోహియు నగు నాభటుఁ డెందైన మసలెఁ గాఁబోలు; లేక వాఁ డేదైన నపాయముఁ జెందియుండెనేమో! మహారాజా! ఏపూర్ణచంద్రముఖహాసామృతమ్మును గ్రోల నాదృక్చకోరిక లజస్రంబుఁ గాంక్షించుచుండునో, ఏమోహినీమణినవలావణ్యదీధితులు నాహృదయాంధకారంబును బ్రకాశింపఁజేయునో యట్టి నాహృదయాధిష్ఠితమోహినీదేవత యగు లలితాకన్య చోరులచే నపహరింపఁబడియె నన్నదుర్వార్త పిడుగువలె నాచెవిఁ బడినంతోడనే దుఃఖవివశుండ నైతిని. లోకమంతయు నంధకారమయంబుగఁ దోఁచె. బ్రహ్మాండకటాహ మంతయు గాలించియైన నామనోరమజాడఁ దెలిసికొనకున్న నే బ్రతికియుండుట లాభము లేదని యెంచి యేలినవారిపేరఁ గొన్నిరహస్యవిషయంబులతో నొకలేఖ వ్రాసి యంపి తదన్వేషణార్థంబు నే బయలుదేఱితిని. అంతలో నాయదృష్టవశంబున నాగూఢచారుఁడు వచ్చి నా కొకశుభవార్త నెఱింగించె." అని యింకను నేమేమో చెప్పఁబోవుచుండ శూరసేనుఁడు తాలిమి నిలుపోపలేక "మిత్రమా! నాపుత్రికారత్నంబుపై నీకుఁ గలప్రేమ యెంతగాఢమైనదో నే నెఱుంగుదును వ్యర్థమైన వాక్ప్రచారంబులఁ గాలయాపనం బొనర్పక యాశుభవార్త యేమో శీఘ్రముగ వచింపుము." అని పలికెను. అందుపైఁ గ్రామపాలుఁడు "మహారాజా! త్వరపడియెద రేల ? ఏలినవారి పూన్కినిఁ బట్టి గాని శుభమగునో యశుభమగునో చెప్పఁజాలను. తమయభిప్రాయం బెఱుంగఁగోరియే నే నిప్పు డిట్లాడను

వచ్చితివి" అని పలికెను. శూరసేనుఁడు సామర్షముగ "కామపాలా! నీమాటలు నాకేమియు నర్థము గాకున్నయవి. సమయాసమయజ్ఞతలేని వాగ్ప్రచారము విపరీతభావముల నుదయింపఁజేయక మానదు. అల్లారుముద్దుగఁ బెంచిన కన్నబిడ్డపై నాకు నీపాటిప్రేమ లేదనుకొంటివా యేమి? ఆవార్త యేమో వచింపుము. కొదువమాటలు నే విననొల్లను" అని పలికెను. అందుకుఁ గామపాలుఁడు "మహారాజా! కినియకుఁడు. లలితాకన్య జీవించియే యున్నయది కాని యేలినవారు సాహసము వహించి వెనుక వంగరాజ్యముపైఁ జూపిన నిజప్రతాపాగ్నిని రగుల్కొల్పి శత్రుకాననంబును దగ్ధముఁ గావించినం గాని లావణ్యరాశి యగు లలిత మనకుఁ దక్కుట దుర్లభము." అని పలికెను. ఆమాట వినినంతనే శూరసేనుఁడు రోషభీషణుండై కన్నుల నగ్నికణంబు లురుల "ఏమంటివి! పుండరీకముచెంత నున్న పులిపిల్లను గొనిపోవ నేలేడి సాహసించె? ఆశత్రు లెవ్వరో తెలుపుము. ఇప్పుడే దాడివెడలి యాతుచ్ఛశాత్రవుని బుత్రమిత్రకళత్రబాంధవులతో మదీయకోపాగ్నిహోత్రమున కాహుతి యొనర్చి నాలలితను గొనితెచ్చెదను" అని కఠోరంబుగఁ బలికెను. కామపాలుఁడు తనమిత్రుఁడైన శూరసేనునకుఁ దగనమ్మంట యెక్కెఁగదా యని లోలోన సంతసించుచు "మహారాజా! ఏలినవారికుమారీమణి పాంచాలరాజుస్వాధీనములో నున్నయది. ఆదుర్మార్గుఁడు చోరులకు ముఖ్యపోషకుఁడై వారిచే నిట్టిద్రోహము లెన్నియో చేయించుచున్నాఁడు. బాహ్యవాగ్వడంబనముల జనరంజకుండని పేరువడసెనే గాని సుదర్శనుఁడు నిశ్చయముగ గోముఖవ్యాఘ్రమని నమ్ముఁడు." అని పలికినంతనే శూరసేనుఁడు తోఁకఁద్రొక్కినత్రాఁచువలె లేచి "ఏమీ! ఆదుర్మార్గుఁడింతటదారుణంబున కొడిగట్టెనుగాని యిది నిప్పులతోఁ జెలగాటమని యనుకొనలేదు కాఁబోలు. మంచిది. మన మిప్పుడే జైత్రయాత్రకుఁ

బ్రియాణోన్ముఖులము గావలయును. నీ విశ్వాసే సమరసన్నాహదోహలుండవై నీరాజధాని కేగి యతిశీఘ్రముగ రావలయును" అని పలికెను. అందుపైఁ గామపాలుఁడు "మహారాజా! ఇకొంకమాట: పుత్రికాభిమానముచే నేలినవారును, మదీయజీవనాకాశంబునకుఁ బూర్ణిమాచంద్రబింబ మని నేనును లలితాకన్యావిషయమై నిట్టిదుర్ఘటం బగుకార్యంబుఁ దలపెట్టితిమి. యుద్ధానంతరమున లలితను నాయర్ధాంగిగఁ జేయ నంగీకరించితి రేని నేను నా సమస్తవాహినీసహితుండనై వచ్చి యేలినవారికి నాయర్థప్రాణంబుల స్వాధీనముఁ జేసెదను. లేనిచో నా కీవిషయంబునఁ దగినంతయుత్సాహము కలుగనేర దని వినయపూర్వకముగ మనవి చేయుచున్నాఁడను" అని పలికెను. శూరసేనుఁడు వానికోరికప్రకారము మాట యిచ్చెను. కామపాలుఁడు శూరసేనుని పీడ్యాని తనతంత్రము కొనసాగుచున్న దనుసంతోషముతో నిజపురాభిముఖుండై బయలుదేఱెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## తొమ్మిదవ ప్రకరణము.



మ. కరుణావేశముచేఁ బరోపకృతికై కష్టంబులం జిక్కినన్
వెర వేదో కలిగించి యానరుని సంప్రీతిం గనం బ్రోచు నా
పరమేశుం డది గానలేక ధరణిన్ బాహాత్ము లౌ మూర్ఖులు
ధురతల్ వేడుకఁ జేయుచుందురు కదా ద్రోహంబు లెన్నెన్నియో.

పూర్వకాలమున మహర్షులు తపస్సుఁ జేసికొనుటకై నిశ్శబ్దముగ నుండునని కొండగుహల నేర్పఱచికొనుచుండెడివారు. నానాఁటి కాగుహాలు వర్షపురాపిడిచేతను మఱికొన్ని కారణంబులచేతను విరివియై వాసయోగ్యము లయ్యెను. అట్టిగుహాలు గలపర్వతములచుట్టును దట్టమైనకాఱడవులు ప్రబలుటవలన నయ్యవి జనసామాన్యమున కగోచరములై యుండెను. ఆహేతువుచేఁ దస్కరులు దివాంధమ్ములవలెఁ బగటివేళల నాగుహాలయందు డాఁగి రాత్రిసమయములందు వెలికి వచ్చి బాటసారుల నడ్డగొట్టి వారియొద్దనున్న సర్వస్వమును లాఁగికొనుచుండుటయుఁ బురంబులలోనికి మారువేషంబుల నేగి గృహస్థులిండ్లకుఁ గన్నములు త్రవ్వి లోనఁ బ్రవేశించి రహస్యోచితంబుగ వారిసొత్తెల్ల ముచ్చిలించుచుండుటయు రహస్యహంతకులయొద్ద లంచములు పుచ్చుకొని వివిధవేషంబుల నిరపరాధులను వంచించి యాగుహాలలోనికిఁ గొనిపోయి బంధించుచుండుటయు వధించుచుండుటయు మొదలగు రాక్షసకృత్యముల నెన్నియో చేయుచుండిరి.

హేలాపురపరిసరారణ్యమధ్యమున బదరీవనప్రదేశంబున నొక యత్యున్నతపర్వతగర్భంబునఁ జోరులకు నివాసయోగ్యం బగుగహ్వర

మొకటి కలదు. ఇటీవలఁ జోరు లాగుహ నెంతయో యభివృద్ధిఁ గావించిరి. అది యొకమహారాజభవనమువలె మిక్కిలి యెత్తైన ప్రాతి గోడలతోడను విశాలమైన చావిళ్ళతోడను పెక్కుగదులతోడను గూడికొనియుండెను. ఆగదులలోఁ బ్రతిదానికిని బలమైన యినుప కడ్డీలు గల కిటికీల నమర్చిరి.

"అకటా! నే నెంతమందభాగ్యుండ నైతిని. దైవమా! కరుణావేశంబునఁ జోరుల బారిఁ జిక్కిన రాజభటులను రక్షింపఁగోరియే కదా నే నిట్లు బందిగంబునఁ గూలితిని. నా కిట్టిదుర్గతిఁ గలిగించుటకే దైవము నన్నిట్లు తోడ్కొనివచ్చెను గాఁబోలు! బోయ వెజ్జుజాడ యెచ్చోటను తెలియరాదు. నే నిచ్చోఁ జిక్కియుంటిని. ఎన్నటికైన నా కీచెఱనుండి విముక్తి కలుగునా? నన్నుఁ జూడఁగోరి నాతల్లిదండ్రు లెంతపరితపించు చుండిరో? నాదుర్గతికై నేను పరితపించను. ఏమన, నా కిది స్వయంకృతాపరాధఫలము. కాని నాకతంబున నాతల్లిదండ్రులు దుఃఖింపవలసివచ్చెఁగదా యని విలపించుచున్నాను. అయినను వీరుండనైన నే నిట్లు ధైర్యమును జాఱవిడువవచ్చునా? చేతగానివానివలె దుఃఖించిన నాపద నివారణ యగునా? దైవసంకల్పం బప్రతిహతంబు కదా. కాని వీరోచితంబగు నుత్తమక్షత్రియవంశంబునం బుట్టి పౌరుషపరిధానజీవుండను గాఁదలంచిన నే ననాథవలె నీచులచేఁ గర్కశశిలాగారంబున బంధింపంబడి వెలువడుతెరువుఁ గానక పరితపించుచుఁ గృశించి కృశించి చివరకు నక్కచావు చావఁదవలసివచ్చునేమో యని విచారించుచున్నాను." ఈవిధంబుగ నాచోరులరహస్యగహ్వారంబున నొకయువకుఁడు తనదుస్థితినిగూర్చి పరిపరివిధంబులఁ బలవించుచుండెను. అసమయంబున నిశీథంబగుటచేఁ జోరు లాగహ్వరంబును వీడి తమతమ రహస్యోద్యమంబులపై నెచ్చోటికో చనియుండిరి.

వీరపాలుఁ డిట్లు తలపోసికొనుచుండఁ బ్రక్కగదిలోనుండి యొక దీనాలాపము వినవచ్చెను. దయావిధేయుఁడగు వీరపాలుఁ డాకర్ణించి "అన్నా! పాప మెవ్వఁడో నావంటిదురదృష్టవంతుఁడే యీ చెఱలో నాతోఁబాటు బంధింపఁబడి యుండెను గాఁబోలు. ఆతఁ డెవ్వఁడో కదా? ఓరోరి చోరులారా! పరమనీచులారా! మానవసోదరుల నిష్కారణ మీవిధంబుగ హింసింపు మన్న మిమ్మాజగజ్జనకుం డెంతకాల మోర్చి మననిచ్చును. మీహృదయము లయోమయములా లేక పాషాణములా? దుర్న్యయంబుననేగాని నీతిగ జీవించుటకు మీకు మార్గములు లేకపోయెనా? ఏమి నా తెలివితక్కువ! గుణములుసహజములు గాని యాగంతుకములు గావు. మనుజుఁడు సహజస్వభావానురూపజీవనమునే యపేక్షించును గాని మఱియొకని మతమును బట్టి జీవింపనొల్లఁడు. అట్లు జీవింపవలెనన్నను వానిచిత్తము సహజగుణము ననుసరించియే పరివర్తించుచుండును. నైజము చికిత్సచేఁ జక్కఁబడునది కాదు. పుట్టుకతోఁ బుట్టినగుణము పుడకలతోఁ గాని పోదను జనశ్రుతి లేదా?" అని యనుకొనుచుండఁ "బుణ్యాత్ములారా! ఈదీనురాలి మొఱ్ఱ యాలింపరా? మహారాజపుత్రికనైన నన్నీచోరమృగంబులపాలు సేయఁదలంచితిరా? అయ్యో! ఇచ్చట నా కుయ్యాలించువా రెవ్వరుందురు? ఈయరణ్యరోదనమువల్ల ఫలమేమి? జగద్బాహ్యాంతరవిషయపరిజ్ఞానచణుఁడగు నాభగవంతుఁడే నావంటియబలల నిట్టి దుర్భేద్యగహ్వరమునుండి విడిపింపవలయును గాని మనుష్యమాత్రులకు శక్యమగునా? అంతటి దైవసహాయము నాకెట్లు లభించును?" అను మఱియొక దీనాలాపము వీరపాలుని కర్ణపథగోచర మాయెను. కరుణార్ద్రహృదయుండగు వీరపాలుఁ డాకర్ణించి "అన్నా! పాప మొకయెలనాఁగ చోరులచే నీప్రక్కగదిలో బంధింపఁబడియుండెఁ గాఁబోలు! ఆచిన్నది మహారాజపుత్రికయఁట. ఆ శేము కిట్టివిపత్తు కలుగుటకుఁ గార

ణ మేమైయుండునో కదా? దుర్జనుల ద్రోహకృత్యంబులకుఁ బ్రబల
కారణము లుండవలయునా! రాజద్రోహంబు తాంత్రికమో పామఁతు
ని మోహమో చోరుల ధనకాంక్షయో కావలయు. ఛీ, వీరపాలా!
నీ విప్పట్టుననిరర్థకనామధేయుండ వైతివి. లోకనుల యెదుట నింతటిదురం
తకృత్యములు జరుగుచుండ నుత్తమక్షత్రియజాతుండ వయ్యు నసుప్రల
పై నాసచేఁ బిఱికిపందవై చేతఁగానివానివలె నూరక చూచుచుంటి
వా? నీవంటి వాఁడు జీవించియుండిన నేమిలాభము; ఏమిపురుషార్థము?
అసాధ్యవిషయమని సంశయించుచుంటివా? అదియే భీరుత్వము. పూని
కగలిగి పనిచేయువాని కసాధ్య ముండునా?" అని మనంబు దృఢపఱ
చికొని యది చోరులులేని సమయమగుటచే మెల్లగ గవాక్షముపై
కెగఁబ్రాకి యాకన్నియను జూచెను. ఆలేమతనుకాంతి సౌదామినీ
లతవలెఁ గనులకు మిఱుమిట్లుగొలుప వీరపాలుఁడు నిశ్చేష్టుఁ డయ్యె
ను. వాని హృదయక్షేత్రంబున నదివఱ కెన్నండును దా నెఱుంగని
నూతనభావాంకురంబు లొక్కసారి మోసులెత్తెను. ఆనందసాగరంబు
న భావతరంగంబుల నూఁగులాడుచుండియు నొక్కింత తనమనంబుఁ
గుదుటఁబఱచికొని యాకన్నియవృత్తాంతం బెఱుంగఁగోరి "బాలా
మణీ! నీవొక మహారాజపుత్రిక ననుచుంటివి. నీవంటి మోహనాంగికిఁ
గన్నధన్యు లెవ్వరో తెల్పెదవా?" అని యడిగెను. ఆమాట విని లలిత
పైకిఁజూచి రూపవిజితపుష్పశరుం డగు వీరపాలునిఁ గని "పుణ్యపురు
షా! నీవు నాభాగ్యదేవతవో నాయవస్థ నెఱింగిజాలిఁగొనినన్ను రక్షింపఁ
గోరిన దివ్యపురుషుండవో కావలయును. నేను కళింగదేశమహారాజ
గు శూరసేనుని యేకైకపుత్రికను. పుట్టినతోడనే తల్లినిజంపి జవ్వని
నై చోరులచే బందిగంబునఁ జిక్కి పుత్రికావియోగదుఃఖంబునఁ దం
డ్రినిఁ జంపనున్న పరమనిర్భాగ్యురాలను. నావంటి పాపాత్మురాలిని
గనుటచే నాతల్లిదండ్రు లభాగ్యులై రేకాని ధన్యులైరని యెట్లుచెప్ప

నగు?" అని పలికెను. వీరపాలుఁ డామాటలు విని యదివఱకే యా జవ్వని నవలావణ్యాదిక్షితుల కొంకఁజెంది యామించుబోణి మోహన రూపామృతంబును దనదృక్కరాంజలిపుటంబులఁ దనివితీరఁ గ్రోలుచు నానందపరవశత నున్నవాఁడయ్యు నిజాంతరంగంబునఁ గరుణా తరంగంబు లుద్రేకింపఁ గుసుమసుకుమారియైన యట్టి లేజవ్వని కింతటివిపత్తుఁ గలిగించిన మనుష్యరూపరాక్షసుఁ డెవ్వఁడో తెలిసికొనఁ గోరి మఱల నామె నద్దియో యడుగఁబోవుచుండ హఠాత్తుగా వాని గది కవలపక్క నొకకోలాహలము వినవచ్చెను. వీరపాలుఁడు వెంటనే గవాక్షమునుండి యల్లనఁ గ్రిందను డిగ్గి యెప్పటియట్ల కూర్చుండెను.

వీరపాలునిగది కవలపక్క నొకవిశాలమైన హాలు కలదు. అది సుమారు రెండువందచతురపుగజముల వివి గలిగి కుర్చీలతోడను మేజాబల్లలతోడను విచిత్రచిత్రాలంకృతకుడ్యంబులతోడను జెన్నలరారుచుండెను. చోరులు తమమారాయుధసామానులన్నియు నచ్చటనే గోడల నలంకారముగఁ జేర్చి యుంచుదురు. చోరు లప్పుడే వచ్చి తమ తమ మారాయుధంబుల యథాస్థానంబుల నుంచి యాహాలులోఁ గుర్చీల పైఁ గూర్చుండి యేమేమో మాట్లాడుకొనుచుండిరి. వీరపాలున కా మాటలన్నియు వినిపించుచునే యుండెను. చోరనాయకుఁడు తోడి వారల నుద్దేశించి "నాప్రియమైన సహచరులారా! నేఁ డెవరిముఖముఁ జూచితిమో గాని మనముచేసిన ప్రయత్నములన్నియు విఫలములగుట యే గాక మనసహచరులలోఁ గొంతమందిని గోల్పోయి మనము చావు తప్పి కన్ను లొట్టాయె నన్నట్లు మృత్యుముఖమునుండి వెలువడి యిచ్చోటఁ జేరఁగలిగితిమి. మనమిత్రులైన కాళీపాదభైరవుల చంద్రకళాపహరణప్రయత్నమును ద్రోహియగు నాబోయయువకుఁడు శనిగ్రహమువలె దాపరించి భగ్నముఁ గావించె. ఆప్రయత్నము నెఱవేఱియుండిన

యెడల మనమిత్రుఁడైన కామపాలునిచే నిరువదివేలరూపాయీలు సంపాదించుటయేగాక సుదర్శనునిచే లక్షలకొలఁది సంపాదించేవారము. మఱియుఁ జేతికిఁజిక్కిన యాంబోయయువకునిపైఁ గసిదీర్చికొనుటకు సిద్ధముగ నుండ సుదర్శనునిరాజభటులు లడ్డువచ్చిరి. మనలో మిక్కిలి ననఁగా యువరాజులగు కాళీపాదభైరవు లాంబోయయువకునిచేతిలోఁ జిక్కియుండిరి. వారిని విడివడఁజేయుట కెన్నియోప్రయత్నములు చేసితిమి. కార్యము లేకపోయెను. దైవమిప్పట్టున మనయెడల నెంతయో ప్రతికూలుఁడైయున్నట్లు తోఁచుచున్నది. మన ప్రబలశత్రువగు బోయవీరునిచేతిలోఁ గాళీపాదభైరవులు చిక్కియుండుటచే నాకుర్నాగ్రహుఁడు వారివలన మనగుట్టుమట్టుఁ దెలిసికొని మన కెప్పటి కేమియుపద్రవముఁ గలిగించునో యని తలంకుచున్నాను. సూరసేనునిరాజభటులును వీరపాలుఁడును మనకుఁ జిక్కినపిదప నాబల్లకట్టడమును దీసివేయుట మన కెంతయు మేలయ్యె. అట్లు చేయుటవలన మన మిచ్చోటు వదలి వేఱొండుచోటి కేగితి మని లోకులు భ్రమించుటచే మనము సురక్షితులమై యిప్పటివఱకు నిచ్చోట నుండఁగలిగితిమి. అయినను మన మెప్పటికైనఁ గాలిలోఁ గ్రుచ్చికొనినముల్లువలె నున్న యాంబోయయువకునిఁ గడతేర్పనన్న మనబ్రతుకు లస్థిరము లని నమ్మియుండుఁడు. ఈవిషమస్థితిలో మనకుఁ గర్తవ్య మేమో యాలోచింపుఁడు” అని పలికెను.

అందుపైఁ జోదులలో నొకఁడు లేచి “ఏలికా! మే మందఱము నీవిషమస్థితి నెఱింగియుండియు నితికర్తవ్యతామూఢులమై యాందోళనావస్థలో నున్నారము. మన మా పాలికలన వీనుసరికే మన కాళీపాదభైరవులు పంచత్వంబు నొందియుందురు. లేనిచో మన మాదుష్టశత్రువును వారితో దాఁటిపోనిచ్చితిమేని మన కెప్పటికేని యుపద్రవము తటస్థించుట నిశ్చయము. ఆప్రబలశత్రువు మనయుక్కువములెల్ల

నిర్బంధించి తెలిసికొనుటకే పడియున్న మనమిత్రులకుఁ జికిత్స సేయు చుండె. ఆద్రోహి కుళిందమార్గమునఁ బోవుచుండఁ జూచితినని మనగూఢచారుఁ డిప్పుడే వచ్చి తెలిపియున్నాఁడు. కావున మనమందఱము వెంటనే బయలుదేఱి వెళ్ళి యాకట్టడిదారుని మట్టుపెట్టుటయే శ్రేయమని నాయభిప్రాయము” అని పలికెను. వానియభిప్రాయము తో నందఱు నేకీభవించిరి. తత్క్షణమే యాచోరులందఱుఁ దమతమ యాయుధంబులను గైకొని జవనాశ్వంబుల నెక్కి బయలుదేఱిరి.

అప్పుడు నిశాకాంత గాఢనిద్రలో మునింగియుండెనో యన రోదసీకుహరమంతయు నిశ్శబ్దముగ నుండెను. చోరులసంభాషణ మాద్యంతంబును విని వీరపాలుఁ డాబోయుయువకుఁ డెవ్వఁడై యుండు నో యని యాందోళన మొందుచుండియుఁ దనపూర్వకనుకూలసమయ మొదవినందు కుత్సహించి మరల గవాక్షముపై కెగఁబ్రాకి దాని కమర్చిన యినుపకడ్డీలను సత్తువకొలఁది వంచి యూడఁబెఱికెను. ఆసడి విని లలిత పైకిఁ జూచెను. మొదట కొంత భయపడెను. కాని యుత్సాహపూరితుఁడై యువకుని మోముగోమును దానఁ బ్రస్ఫుటంబులగు పరితాపదీధితులును వానిసాహసోద్యోగసూచకంబులగు ప్రసన్నవీక్షణంబులును జూచి కరుణాసముద్రుండగు దాని పదీవరమునఁ దీనురాలగు తన కుయ్యాలించి తనమానప్రాణంబులను రక్షింప నాపుణ్యాత్మునిఁ బంపుచుండెనో లేక తానే యారూపంబున వచ్చుచుండెనో యని యుత్కలికఁ జెందుచుండెను.

అప్పుడే వీరపాలుఁడు లలితయున్న గదిలోని కుఱికెను. అది చూచి సుమాళంబున పడంకుచున్న లలితను దరిసి సద్దుచేయవద్దని నిజతర్జనీయాంగుళిఁ జూపుచు “లలనామణీ! నీ వీచెఱనుండి వీడఁదలంచితివేని సద్దుసేయక నా వెనువెంట రమ్ము. నేను నీకు మిత్రుండను గాని శత్రుండను గాను. నన్ను విశ్వసింపఁగలిగితివేని శీఘ్రముగ రమ్ము.

ఆలసించినచో మనప్రయత్నమంతయు విఫలమగుటయే కాక ప్రాణో పద్రవము గూడఁ గలుగవచ్చును." అని పలికెను. లలితయు నపరి మితానందభరితయై మారుమాటాడక వీరపాలునివెంట బయలు దేఱెను.

అట్లు వారిరువురు ద్వారముచెంతకు వచ్చిరి. గుమ్మమునకు వెలుపల హుషారుగ ఫారా యిచ్చుచున్నవాని పదఘట్టనశబ్దము విని పించుచుండెను. గదిలోఁ జప్పుడు విని యాఫారావాఁ డందేమి జరుగు చుండెనో చూతమని తలుపు తెఱచి తొంగిచూచెను. లలితయు వీర పాలుఁడుఁ దలుపుచాటున డాఁగియుండిరి. అందు లలిత కానరామి నాచోరుఁడు కత్తి ఝళిపించుచు లోనికిఁ జొరఁబడెను. అంత వీరపా లుఁడు హఠాత్తుగ వానిపైఁబడి వానిచేతిలోని ఖడ్గము నూడఁబెఱికి వానిని గ్రిందఁబడవైచి కుత్తుకఁ దొక్కిపట్టెను. అట్లొక్కించుకతడ వుంచి యాయుభాగ్యుఁడు ప్రాణావశిష్టుండై యుండుటఁ గాంచి యా పట్టు వదలి వానినోట గుడ్డలుక్రుక్కి కరచరణంబులు బంధించి వాని యొద్దనున్న తాళపుచెవులగుత్తిని దీసికొని లలితతోఁ దాను వెలికి వచ్చి యాగదికి నెప్పటియట్లు వెలుపల బీగము బిగించి యిరువురును బయలుదేఱిరి.

ఆగహ్వరములో నొక్కఁడేచోరుఁ డుండెను. వానియొద్దనుండి తాళపుచెవులగుత్తిని దీసికొనియున్నవాఁడు కావున వీరపాలుఁ డంద ఱిగదులలో బంధింపఁబడినవారినెల్ల బంధవిముక్తులఁగావించి యాగదుల కన్నిటికి మరల నెప్పటియట్లు వెలుపల బీగములను బిగించి గహ్వర ముపైకి రాఁ బ్రయత్నించుచుండెను. రాజభటులు చెఱనుండి వెలికి వచ్చినతోడనే చోరులభాండారములోని కేగి యందలిద్రవ్యమును నమూల్యాభరణంబులను సంగ్రహించి గుహవెలుపల కేగుమార్గ ము నరయుచుండిరి. ఆగుహయొక్క పైభాగము ముప్పదియడుగుల

యెత్తున నుండెను. ఏవంకఁజూచినను భయంకరమైన గోడలేకాని పైకే గుటకు సాధన మెద్దియుఁ గానరాదయ్యె. ఏమిచేయుదుము దైవమా యని రాజభటులారాట నొందుచుండిరి. వారు లలిత నింకను గుర్తింపలేదు. వారట్లు తిరిగి తిరిగి మెట్టకేలకు గుహాముఖమార్గముచెంత కేగుచిరి. అచ్చట నొకచిన్నగది కలదు. దానితలుపు లోపలిభాగమున బీగమును వేసియుండిరి. రాజభటులద్దానిఁ దెఱువ నెన్నియో విధములఁ బ్రయత్నించిరి. అది చాలా దృఢమైన యినుపతలుపగుటచే వారి కెంతమాత్రమును స్వాధీనము కాలేదు.

అంత వీరపాలుఁడు లలితతో నచ్చోటకు వచ్చెను. రాజభటులు నిరాశులై యుండిరి. వీరపాలుఁడు ఖడ్గపాణియై బంధింపఁబడినచోరునియొద్ద కేగి "ఓరీ చోరుఁడా! ఈచెఱలోనున్నవారందఱును విడివడిరి. ఆచోరులు వచ్చి సంగతిఁ దెలిసికొని నిన్ను వధింపకమానరు. నీకసువులపై నాస కలదేని మెట్లగదితలుపుఁ దెఱచుట కుపాయ మెఱింగింపుము. లేకున్న నిప్పుడే నిన్నీకరవాలంబున నఱికి వేయుచుంటిని" అని ఖడ్గ మెత్తెను. చోరుఁడు గజగజ వడంకుచు "బాబూ! నన్నుఁ జంపకుఁడు. నన్ను మీతోఁ గొనిపోవ నంగీకరించెద రేని యారహస్య మెఱింగించెదను" అని పలికెను. ఆమాట విని వాని కపటోద్దేశ్య మెఱింగినవాఁడై వీరపాలుఁడు కర్తవ్యము నిశ్చయించి చోరునియిష్ట ప్రకారము సేయ నంగీకరించి యాతలుపున కమర్చిన తీఁగమఱను దెలిసికొని తలుపుఁ దెఱచెను. ఆగదిలోనుండి పైకి మెట్లు గలవు. ఆ మెట్లపైనుండి లలితయు వీరపాలుఁడు రాజభటులతో గుహాద్వారము నుద్గమించిరి.

అట్లు గుహవెలుపలకు వచ్చినతోడనే వీరపాలుఁ డాచోరుని కరచరణంబులను బంధించి వెంటఁగొనిపోండని రాజభటుల కాజ్ఞనొ

సంగెను. రాజభటులు చోరుని వెంటఁగొని వెడలిపోయిరి. పిదప వీర పాలుఁడును లలితయుఁ జోరులయశ్వరాజంబుల నెక్కి యచ్చోటు వదలి బహిరంగవాయువు నావటించుభాగ్యము లభింపఁజేసిన భగ వంతునకు భక్తిపూర్వకంబుగ వందనము లర్పించుచు బయలుదేఱిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## పదియవ ప్రకరణము

ఉ. తేలుచు రాజ్యభోగములఁ దృప్తిఁ జెందక స్వార్థకాంక్ష భూ
పాలవరేణ్యకోటి సపత్నులసూయ దురంతకృత్యముల్
బాలి నొనర్తు రీశ్వరుఁడు పైఁ గలఁ డంచుఁ దలంప రక్కటా
కాల మచింత్యపూర్వఫలకారణ మౌ. తుది నెంతవారికిన్.

మానవుఁడు ప్రకృతిపురుషునిచేతిలోని కీలుబొమ్మవలె జగన్నాటకరంగంబున నశ్రాంత మాడుచుండును. ప్రకృతిపురుషుఁ డింద్రజాలకునివలె విచిత్రవిషయసందర్శనంబుల నొకయెడ నుత్సహింపఁ జేయుచు వానిని మాటుపఱచి వేఱొకయెడఁ గుందించుచు బహువిధంబుల భ్రమింపఁ జేయుచుండును. కావుననే ప్రకృతిబద్ధుఁడైన పురుషుఁడు విషయలోలత్వంబున నహంకారమమకారంబులను విడువలేకుండును. భగవంతుఁడు జీవునికొఱకు భూతపంచకకలితంబైన మృత్పిండమ్మును గాలదండంబున మర్దించి పదునుపఱచి ప్రకృతియనెడు సారెపై నునిచి పరిభ్రమింపఁజేయుచుఁ గర్మసూత్రంబున వివిధోపాధుల నిర్మించుచుండును. అట్టిప్రకృతిజనితమైన యుపాధిపై నమితాభిమానంబున దేహి బహువిధవిషయలోలుఁడై కుటిలప్రవృత్తుల సంచరించుచు నెన్నియో దుష్కార్యము లొనరించుచుండును. ఆకార్యఫలములు వాని పురాకృతకర్మల ననుసరించియే పరిణమించుచుండుటం జేసి యొక్కొకతఱి విరుద్ధపరిణామమును జెందుచుండును. ఆహేతువుచేతనే పురుషుఁ డెప్పుడును ఖేదమోదావమానంబులఁ దూఁగుచుండును.

కామపాలుఁ డట్లు శూరసేనుని వీడ్కొని యత్యుత్సాహపూరితుఁడై నిజపురంబుఁ బ్రవేశించి యొకనాఁటియుదయమున ఘరమ్ముపైఁ గూర్చుండి హుక్కా బీల్చుచు, "నాఁడు నాచిత్తంబున కంతటియుత్తలపాటుఁ గలిగించినసాహసికుఁ డెవ్వఁడో తెలియరాకున్నయది. ఆతం డెవ్వనిపంపుననో నారహస్యోద్యమంబుల నెఱుంగవచ్చినగూఢచారికావలయు. ఒకవేళ నాయన్నపుత్త్రుఁడైన భానుమంతుఁడు కాఁడు గదా! యమునానదీవిప్లవంబున మృతిఁజెందిన యానిర్భాగ్యుఁడు మరల బ్రతికివచ్చు టెట్లు? నాప్రబలశత్రు వగు సుదర్శనునిపంపున వచ్చిన గూఢచారియే కావలయు. అట్లైనచో మందారకుఁడు చెప్పిన బోయయువకుఁడే కాఁబోలు. ఆతం డాతుచ్ఛవైరి యాస్థానవైద్యుండగు వీరధన్వి పుత్త్రుండఁట! కానిమ్ము. వాఁడు నన్నేమిచేయఁగలఁడు. అసత్యమాడి శూరసేనునకు మిక్కుటంబగు ప్రతాపాగ్నినిఁ బ్రజ్వలింపఁజేసితిని. కార్యసాధకుం డెప్పట్టుననైన సత్యాసత్యములఁ బాటించునా? సుదర్శనునిపై నాకసిఁ దీర్చికొనుట కిదియే మంచియుపాయము. నాకార్పణ్యదృక్పథంబునంబడిన విష్ణువర్ధనుని గతి యేమయ్యె, వీనిగతియు నంతియే కాఁగలదు. కార్యము ఫలించినపిదప మనము కూడ నెన్నియో శ్రీరంగనీతులను జెప్పఁగలము. సమరవిషయంబులలోను శత్రువుల రణముఖంబున నిర్జించుటలోను వీరపురుషు లసత్యమాడుట ధర్మవిరుద్ధంబు గానేరదు. మున్ను ద్రోణునిఁ బరిమార్చుటకై ధర్మరా జసత్య మాడలేదా? మహాపరాక్రమశాలియైన శూరసేనుని సాహాయ్యంబున సుదర్శనుఁడు నాకు స్వాధీనుఁడైనచో భరతఖండమంతయు జయించినవాఁడనే యగుదును. అప్పుడు నన్నెవ్వఁ డేమనఁ గలుగుదురు?" అని యేమేమో యనుకొనుచుండ ఫణిహారి లోనికి వచ్చి "మహారాజా! ఏలినవారిచేతి కిమ్మని యెవరో యొకయువకుఁ డీలేఖను నా కొసంగినాఁడు, చిత్తగింపుఁడు." అని యొకలేఖ నొసంగెను. అదాని

నందికొని కామపాలుఁడు వివిధభావపరీతచేతస్కుఁడై "ఓరీ! ఆ యువకుఁడు నాజాబుకై వేచియుండెనా యేమి? ఆతఁడెవ్వరు? ఎచ్చోటనుండి వచ్చియుండె?" అని యడిగెను. అందు కాపరిహారి "మహారాజా! ఆయాశ్వికుఁడు లేఖను నాచేతి కిచ్చి తత్క్షణమే నామాట వినిపించికొనక మఱలిపోయినాఁడు. ఆతఁ డెవ్వఁడో యెందుండి వచ్చెనో నేను తెలిసికొనలేకపోయినాను" అని పలికెను. ఆమాట వినినంతనే కామపాలుని కృతాపరాధచిత్త మెన్నియో యనుమానంబుల విహ్వల మగుచుండెను. ఇది యేమియుత్పాతమో యని దిగులొంది తత్తరంబున నాయుత్తరంబును విప్పి చదివికొనెను. అం దిట్లు వ్రాయఁబడి యున్నది:—

"కామపాలా! నీవంటి రాజద్రోహికి వ్రాయులేఖల కుత్తరపు మర్యాద లవసరము లేదు. నీప్రత్యర్థి వ్రాయున దేమనఁగా:—రాజ్యలుబ్ధుండవై నాతల్లిదండ్రులను నీపాల్బడను బెట్టికొని కుళిందరాజ్యము నక్రమముగ స్వాధీనముఁ జేసికొని కులుకుచు రాజ్యమత్తతచే దుర్వ్యసనలోలుఁడవై నిహ్ృదయకంటకుండ నని రెండేండ్ల పసికూననైన నన్నుఁ జంపుట కెన్నియో ప్రయత్నములొనరించితివి. ఓరీ నరహంతకుఁడా! నీవు నీమిత్రులైన మందారకాదిచోరుల సాహాయ్యంబునఁ జేసిన ద్రోహకృత్యంబులకుఁ దగినఫల మచిరకాలములోనే యనుభవించెదవు. పూర్వము శ్రీకృష్ణునిఁ జంపుటకుఁ గంసుఁ డెన్నిప్రయత్నములు చేసి చివర కేమయ్యెనో యెఱుంగవఁట రా? స్వల్పకాలములో నీపనియు నట్టులనే కాఁగలదు. దుష్టచిత్తా! పరమపాతకీ! నేను నామేనమామయింటనున్న సంగతి విని నన్ను వధించుటకై పాపము నిష్కారణంబుగ నామేనమామను సంహరించి వానివంశము నిర్వంశము గావించితివి. ఈనిష్కారణద్రోహము నిన్నెప్పటికైనఁ గట్టి కుడుపదనుకొనుచుంటివిరా బాలిశా! నేను నీచేతికిఁ జిక్కకుండ ప్రహ్లాదవరముఁ దగు

శ్రీహరియే నన్నుఁ గాపాడుచున్నాఁ డని తెలిసికొనుము. ఒకప్పుడు నేనును నన్నుఁ బెంచిన యిందుమతియుఁ గల్యాణగడమున నిద్రింపుచు యమునానదీవిప్లవములోఁ జిక్కి నీకోర్కె నెఱవేర్పుచుండియు శ్రీహరికృపాస్వరూపుఁడైన బోయయువకునిచే రక్షింపఁబడితిమి. మేమిద్దరము నిప్పుడు హేలాపురమున సుఖముగ నున్నారము.

ఆసంగతి వినియే కాఁబోలు నీచెల్లెలైన చిత్రాంగి నీపేరఁ గొన్ని పరమదారుణరహస్యవిషయంబులు గలలేఖ వ్రాసినది. దైవవశంబున నాలేఖ నాచేతికిఁ జిక్కినది. అందలివిషయంబుల కాలేఖవలన నీవే యుత్తరవాదివై యుంటివని తెలిసికొనుము.

ఇట్లు,

భానుమంతుఁడు."

ఆలేఖను జదివినతోడనే కామపాలుని చిత్తసంక్షోభమును బాఠకమహాశయు లూహింపవలయునే కాని వ్రాయుటకు శక్యము గాదు. మోము వెల్లనై యొడలెల్లఁ జెమ్మటలు గ్రమ్మెను. నాలుక తడి యారిపోయెను. చూపులు చెచ్చవడియెను. చిత్తము తల్లడిల్లుచుండెను. ఆతఁడట్లు కొంతతడవు నిర్విణ్ణుఁడై యుండి హఠాత్తుగ లేచి యాలేఖను హుక్కాగొట్టపుటంగలంబునఁ బాఱవైచి యేకాంతస్థితి తనమనంబును గుదుటఁబఱచికొనుటకై శయనాగారములోనికిం జని పాన్పుపైఁ బరుండెను.

అంత నొకపరిచారకుఁడు హుక్కాగొట్టమును శుభ్రపఱుచుటకై వచ్చి యందలి కాగితమును జూచి దగ్ధశేషమును దీసి చదివెను. భానుమంతుఁడు సజీవుఁడై హేలాపురంబున నున్నసంగతిఁ దెలిసికొని యమితానందముఁ జెందెను. పరమదుర్మార్గుఁడైన కామపాలుని కొలువుఁ బరిత్యజించుట కెప్పు డేవిధంబుగ వీలుకలుగునో యని యతఁడు తటి వేచియుండెను. దగ్ధపత్రశేషమును జాగ్రత్తగఁ దనయొద్దనుం

చికొని హుకుక్కాగొట్టమును యథాస్థితిలోనే యుంచి యది యు యద సని వెడలిపోయెను.

హేలాపురంబున సుదర్శనమహారాజు కొలువు సాగించుచుండె ను. ఆనాఁడు దర్బారు నిండువేడుకలఁ గనులపండువొనరించుచుండె ను. పురజను లందఱు నపరిమితానందభరితులై యుండిరి. కాని మహా రాజుముఖమునందు మాత్రము సమయసముచితోత్సాహంబు చూ ట్టుటలేదు. దర్బారులో జరిగుచువినోదములకెల్ల విముఖుండై "బో యయువకుని విడిచివచ్చి పదియేనురోజు లైనది. వానిజాడ నరయ నెందఱనో గూఢచారుల నల్లెడల కంపియుంటిని. ఈసరికిని వానిసం గతి యొక్కింతయుఁ దెలియదయ్యె. వానిగతి యేమైనదో కదా! వానియాభిజాత్యం బెఱుంగకున్నను నాపుత్రికారత్నము వానిపై నప రిమితప్రేమ కలదియై వానిం జూడ యుంబవళ్ళు నిద్రాహారంబులు లేక నవయుచున్నయది. స్థిత్యంతరంబు లెఱుంగకుండ నాగంతుకము నోవికారంబులకు లోనగువారు లోకనిందకుఁ బాల్పడుదు రని యెంత వారిం బినను వినకున్నయది అత్యుత్కటకృతజ్ఞతాభరితం బగు మనం బు ప్రేమాస్పదంబగుట యబ్బురమా! ఆపురుషుఁ డెద్దియో హేత్వంత రంబుచేఁ గిరాతకులంబున వర్ధిల్లుచుండెనేగాని వానిసుస్వరూపగుణశీ లప్రజ్ఞావిశేషంబులంబట్టి యూతం డుత్తమక్షత్రియకులసంజాతుండే యై యుండవలయుననియు వానిజన్మరహస్యముఁ దానెఱుంగకున్నను నచిర కాలములోనే వెల్లడికాఁగలదనియు నిందుమతి చెప్పినమాటలవలననా కును వానియం దనివార్యమైనప్రేమ పొడుకొనియుండుటచే నాకొమరి తెను మందలింపలేకున్నాను. నిక్కువంబుగ వానిజన్మరహస్య మెఱింగి యున్నచో నిందుమతి నాకుఁ దెలుపకుండునా? కొన్నికారణములచేఁ జితాంగికొలువు వీడితిననియె నేకాని యాకారణములను వివరింప దయ్యె. దాన నాయాలోచనలు కొనలుసాగుచున్నయవి." అని యే

మేమో తలపోసికొనుచుఁ జిత్రిపుంబ్రతిమవలె సింహాసనముపైఁ గూర్చుండియుండెను. మంత్రిభటభృత్యసామంతాదిజనులమనవులను వినుచుండెనేకాని ప్రత్యుత్తరము లొసంగుటలేదు. ఆనాఁడు మహారాజుగారట్లుండుటకుఁ గారణ మేమైయుండునో యందఱు నివ్వెఱఁ గంది చూచుచుండిరి.

ఆసమయమున భానుమంతుఁడు దర్బారున కేతెంచి వినయవినమితగాత్రుఁడై మహారాజునకు నమస్కరించి "మహారాజా! ఏలినవారి సెలవుఁ గైకొని నే వఱువాత బయలుదేఱి బోయయువకునికై యరణ్యమంతయు వెదకి వెదకి యెచ్చోటను గానరానందున నిష్ఫలమనోరథుండనై తిరుగ వచ్చుచుంటిని. అప్పుడు జవనాశ్వంబుపై నొక రాజభటుఁ డతివేగంబునఁ గుళింద కేగుచు నా కెదురయ్యెను. అతఁడు నన్నుఁజూచి గుఱ్ఱము నాఁపి "బాబూ! కుళింద కేగుమార్గ మిదియేనా?" అని యడిగెను. "అవును. నీ వెందునిమిత్తమై మాకుళింద కేగుచుంటివి?" అని నేను మరల వానిఁ బ్రశ్నించితిని. అందుపై నాయాశ్వికుఁడు "బాబూ! మీ రెవ్వరో తెలిసికొనకుండ మీప్రశ్నకు సదుత్తరం బివ్వఁజాలను" అని పలికెను. అందుపై నే నొక్కింత యనుమానించి "రాజభటుఁడా! నేను కుళిందదేశాధిపతి కొమరుండను. నా పేరు భానుమంతుఁడు" అని దర్పముతోఁ బలికితిని. అందుపై నాయాశ్వికుఁడు "బాబూ! మధురాపురపుమహారాణీగారు కామపాలమహారాజుగారిచేతి కివ్వవలసిన దని నాచేతి కొక లేఖ వ్రాసి యిచ్చినారు. నేనిపు డద్దానిఁ గొనిపోవుచుంటిని" అని పలికెను. ఆమాట విని నా మేనయత్త యగుచిత్రాంగి యన్నదోహచింతనములతో సంబంధముగలదిగా యుండెనేమో యని తెలిసికొనఁదలంచి "రాజభటుఁడా! మహారాజుగా రిప్పుడు కుళిందలో లేరు. నీ వాలేఖను నా కొసంగితివేని వారు వచ్చినతోడనే యద్దాని వారిచేతి కిచ్చెదను. నీ విప్పుడు శ్రమ

పడి కుళింద కేగుట వ్యర్థము" అని పలికితిని. అందుపై నాభటుఁడు కుపితుఁడయ్యు నమ్రతతో "బాబూ! నన్ను మన్నింపుఁడు. ఈయుత్తర మతిరహస్యమైనదగుటచే మహారాజుగారిచేతికే కాని మఱియొకరి చేతి కివ్వవద్దని మహారాణిగారు విధించి నన్నుఁ బంపించినారు. ఆహేతువుచే నే నీలేఖను మీ కొసంగఁజాలను" అని ముందుకుఁ బోవ యత్నించెను. తత్క్షణమే నేను వానిని గుఱ్ఱముపైనుండి క్రిందకుఁ బడఁద్రోచి నేనును వెంటనే క్రింద కుఱికి వానికుత్తుకఁ ద్రొక్కిపట్టి వాని జేబులోని లేఖను గ్రహించి వాని నొకచెట్టునకు బంధించి వచ్చితిని. మహారాజా! చిత్తగింపుఁడు" అని యాలేఖను సుదర్శనుని చేతి కొసంగెను. అద్దాని మహారాజు స్వయముగ విప్పి చదివెను. అం దిట్లు వ్రాయఁబడి యున్నది.

"మహారాజశ్రీ కుళిందదేశాధీశుండగు కామపాలమహారాజుగారి సన్నిధికి:—తమయనుంగుచెల్లెలు చిత్రాంగి వ్రాయు వినయపూర్వకమైన విజ్ఞాపనము. ఉభయకుశలోపరి. వెనుక మీ ప్రోత్సాహముపై నేనొనర్చిన దుస్సాహసకృత్యము సమూలముగ నిష్ఫలమైనదేమో యని కొన్నికారణములచేఁ దలంకుచున్నాను. మిమ్ముల నమ్మి మీస్వాధీనములో నుంచిన విషయమును భద్రపఱచవలయును. మీ యనుంగుచెల్లెలి ప్రాణములను గాపాడఁదలచితి రేని యాబోయయువకుఁడు మధురాపురములో నడుగుపెట్టకుండఁ జూడవలెను. వానిఁ దోడ్కొనిపో నేగియున్న వీరపాలుని బోధించి వెంటనే తిరుగ పంపించివేయవలయును. దాసీ నన్ను మోసముచేసినది. ఆకృతఘ్నురాలిని వెంటనే సంహరింపవలయును.

ఇట్లు, చిత్రాంగి."

ఆలేఖఁ జదివినంతనే మహారాజు హృదయాంబుధిని వివిధభావతరంగము లుప్పొంగఁదొడంగెను. కాని యిదమిద్ధమని యేమియు

నిశ్చయింపలేకుండెను. "ఏమిది? ఇప్పట్టున నామనంబున నెద్దియో యుత్కలిక జనించుచున్నయది. ఈమధ్య నా బావమఱంది చంద్రశేఖర మహారాజు నాపేర వ్రాసిన లేఖలోని విషయముల నీయుత్తరము కొంతవఱకు బలపఱచుచున్నయది. చిత్రాంగీమహారాణి కాంభోయయువకునిపై నంతద్వేష ముండుట కాయుభయులకు నేమిసంబంధము కలదు? చిత్రాంగి తనయన్నయైన కామపాలుని స్వాధీనములో నుంచిన విషయ మేమైయుండును? దాసియైన యిందుమతి యామె నెట్లుమోసగించియుండును? పరివ్రాజకుండు చెప్పినవృత్తాంతమంతయు యథార్థమేనా? అట్లైనచో నాయనుంగుచెల్లెలైన చారుమతిని నాముద్దులమేనల్లుని గన్నులారం జూచుభాగ్యము లభించును. హృదయమా! త్వరపడకుము. సపత్నీమాత్సర్యంబునం జిత్రాంగి తనయన్నయైన కామపాలునిసాహాయ్యంబునం దనసవతిని సవతిబిడ్డను సంతమొందించి కోసలరాజ్యమంతయు దనస్వాధీనములో నుంచికొనుట కంతటి ద్రోహమున కొడిగట్టెనుగాంబోలు! ఆదుస్సాహసకృత్యము సమూలముగ నిష్ఫలమైనదనుటచే వారిరువురు నింకను జీవించియేయుండుట స్పష్టమగుచున్నది. ఇంతటి దారుణకృత్యంబున నిందుమతి యెంతవఱకుం బాల్గొనియుండెనో ముందు తెలిసికొనవలయును." అని దర్బారు చాలించి వెడలంబోవుచుండ శూరసేనకామపాలుడు హేలాపురముపై యుద్ధమునకు వచ్చుచుండెనను వార్త వినవచ్చెను. పిడుగువంటి యావార్త వినినంతనే ధీరుండయ్యుం బరమదయాశాలి కావున సుదర్శనుం డాసన్నరణోల్కాపాతంబున కాత్మం గుందుచు నామారణకర్మంబున కేమిహేతువు కలిగెనో విచారించి సముచితోపాయంబుల నావిప్లవమును వారింపం గార్యనిపుణులైన కొందఱు సామంతుల రాయబారులుగ నియమించి చతురంగబలంబును గట్టాయితంబుం గావించి

పురప్రాకారంబులకును గోటబురుజులకును వలయు మూర్పులను గా
వించి యుద్ధసన్నద్ధులు గాం దారథంగాముల కాజ్ఞ నొసంగుచుండెను.

ఆసమయమున నంతిపురంబున నొకకలకలము వినవచ్చెను.
అదియేమి యుపద్రవమో యని యోజించుచుండం బరిచారిక యొక
ర్తు పరువిడివచ్చి "మహారాజా! ఇందుమతి — ఇందుమతి—" అని
యేమో చెప్పంబోయి చెప్పలేక మహారాజు పాదములపై వ్రాలెను.
మహారాజు నిర్విణ్ణుడై "ఏమీ! ఇందుమతి కేమియు హాని కలుగ లేదు
కద!" అని యత్యాతురతతో నడిగెను. అందుపైం బరిచారిక "మహారాజా!
ఇందుమతి నెవ్వండో హంతకుండు చంపి వేసినాండు" అని చెప్ప మహా
రాజదరిపడి "ఆం, ఏమంటివి? ఇందుమతిని హంతకుండు సంహరించెనా!
ఈహత్య నెవ్వరెచ్చోటం గావించిరి? ఆహంతకుండు పట్టుబడియెనా?"
అని యడిగెను. అందుపైం బరిచారిక "మహారాజా! చంద్రికళాకన్య
యుద్యానవనములో విహరించుచు నేకారణంబుననో మూర్ఛిల్లి యొ
క్కచోం బడియుండెను. అదిచూచి మధురిక యాక్రందింప నిందు
మతి యచ్చోటి కేగి వలయుశైత్యోపచారంబులం గొన్ని మాకు ని
యమించి యెద్దియో దివ్యౌషధినిం దెచ్చుటకుం దవ్వులకేగెను. కొం
తసేపటికిం జంద్రికళ తెలివిందెచ్చెను. ఆమె దిగ్గున లేచికూర్చుండి జరి
గినవృత్తాంతమును దెలిసికొని యిందుమతిని దోడ్కొనిరమ్మని నన్న
నిపెను. నే నామెపోయినజాడనుబట్టి చన నొక్కచో రక్తసిక్తమైన
దేహము నేలపొదచెంతం బడియుండం జూచితిని. ఆసంగతి వెంటనే
చంద్రికళాకన్యకెఱింగింప నాసంగతి నేలినవారికి నివేదింప నన్నని
పెను" అని చెప్పెను ఆవృత్తాంతము వినినంతనే మహారాజు భగ్న
మనోరథుండై మితిలేనివిచారమును జెందెను. ఇరువదిసంవత్సరము
లనుండి మృతప్రాయులై యగోచరంబుగ నున్న తనయనుంగుచెల్లెలు
చారుమతియొక్కయుం దనముద్దులమేనల్లునియొక్కయు నిక్కువ

తెఱుఁగఁజేయ సమర్థురాలని నమ్మియున్న యిందుమతి చనిపోవుటచే మహారాజు నిరాశుఁ డయ్యెను.

ఆసమయమునఁ జెఱకాపరి యగు నొకరాజభటుఁ డరుదెంచి "మహారాజా! కాళీపాదభైరవులు చెఱనుండి విడివడి పాఱిపోయిరి. వారున్న చెఱసాలయొక్క గవాక్షమునుండి యొకత్రాడు వ్రేలాడుచుండుటచే వా రామార్గమునఁ బోయియుందు రని కేళీవనమంతయు వెదకుచుండ నొకపొదచెంతఁ బడియున్న యొకస్త్రీకంఠములోఁ గ్రుచ్చియుంచిన యీయసిపుత్రిక లభించినది. దీనిపిడిపై నాచెఱనుండు ఘోరాయిచ్చెడు నీలకంఠుని పేరు గలదు. అతఁ డాచెఱలోఁ బంధింపఁబడి యుండుటచేఁ జోరులు వానిని నిర్జించి యచ్చో బంధించి వానిచేతిలోని ఖడ్గముఁ గొని పాఱిపోవుచు హత్యఁ గావించియుందురు. తప్పించుక పోవుట కాచోరులుచేయు ప్రయత్నమును గనిపెట్టి స్వామిభక్తిపరాయణుండగు నీలకంఠుఁడు సాహసంబున లోనికిఁ జొఱంబడి వారి నరికట్టయత్నించెఁగాఁబోలు!" అని విన్నవించెను. అందుపై మహారాజు తనయాస్థానమునందుఁగల యపరాధశోధకాగ్రేసరుని బిలిపించి యాచోరులఁ దిరుగఁ బట్టి తెప్పింప నాజ్ఞ యొసంగి యంతిపురంబున కేగెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## పదునొకండవ ప్రకరణము.

ఉ. క్రూరులు ద్రోహకృత్యములకు స్వామినిఁ జూక లాతివారలన్
జేరిచి స్వార్థచింతనలఁ జేకొనఁగూర్పఁగఁ జూతు రట్టి దు
ర్వారుల దుష్టయత్నముల భగ్నము సేయఁ గడంగినట్టి యా
ధీరులు మోహమున్నత ధృతిన్ దగనాడ నొకప్పు డేనియున్.

లలితయు వీరపాలుఁడుఁ [illegible]గుల కారాగారమునుండి యెట్లు వెలువడఁగలిగిరో మా చదువరు లిదివఱకే యెఱిఁగియున్నారు. వారట్లు వల్లదశ్వంబులపై బయలుదేఱి గాఢాంధకారబంధురంబగు భయంకరారణ్యముగుండా పుష్పగిరిమార్గాభిముఖులై పోవుచుండిరి. అట్లు కొంతదవ్వేగినపిదప గగనరంగంబున దిక్పురంధ్రీమణులు పట్టియున్న తిమిరపటలనేపథ్యంబు మెలమెల్లగ జాఱుచున్నట్లు వారికిఁ దోఁచె. పిదప నాతెరచాటున నున్న యాటకత్తియగు యామినీకాంత కుంకుమరాగశోభితంబైన ఫాలంబో యనఁ రేఖాకృతిగఁ జంద్రోదయ మయ్యెను. క్రమక్రమంబుగ నారజనీశైలూషి నగుమొగంబో యనఁ జంద్రబింబము పొడారఁబోసినట్లు పండువెన్నెల మొలకఁ వెదచల్ల నారంభించెను. ఆవెన్నెలవెలుంగున నాయువతీయువకులు నిర్భయంబుగఁ బోవుచుండిరి.

వారికిఁ బుష్పగిరి గవ్యూతిదూరం బగునరికి వేగుఁజుక్క పొడిచెను. వారట్లు పోవుచుండ వెనుకతట్టున నెవ్వరో రహస్యముగ మాట్లాడికొనుచున్నట్లు లోకసడి వినవచ్చెను. వీరపాలుఁడు వెనుకకుఁ దిరిగిచూడ రెండువ్యక్తు లప్పుడే యొంటిగా[illegible]డి చెరియొకప్రి

క్కకుఁ బోయి కనుమెఱంగినట్లు వానికిఁ దోఁచెను. ఆసంగతి లలిత తోఁ జెప్పలేదు. ఉదాత్తధీరుం డగు వీరపాలుఁ డావిషయ మంతగణనీయముగా భావించలేదు. యథాప్రకారము పోవుచుండిరి. వారట్లు కొంతవేటుదూర మేగిరి. అంత హఠాత్తుగ వీరపాలుఁ డెక్కినగుఱ్ఱము వెనుకకాళ్ళు తెగుటచేఁ బడిపోయెను. తత్క్షణమే వీరపాలుఁడు క్రింద కుఱికి ఒఱనుండి కత్తిని దీయుసరికి నిరువదిమందిచోరులు ఖడ్గపాణులై వారిని జుట్టికొనిరి. మహాపౌరుషశాలి యగు నావీరుఁడు తానున్నయుపద్రవమును గ్రహించి యద్వితీయసాహసంబున కోశఘూర్ణమానతారకోదంచితరక్తారుణనేత్రుండై హుమ్మని యామునగఱచి కరగృహీతకరవాలంబును వలయాకారంబుగఁ ద్రిప్పుచు నాచోరులతోఁ బోరఁదొడంగెను. ఆచోరులను జూచినంతనే యత్యుత్కటభీతిచే వివశురాలగుచున్న లలితను ముగ్గురుచోరులు బలాత్కారముగ నెత్తికొనిపోవఁ బ్రయత్నించుచుండిరి. గుఱ్ఱము నాఁపి యావివశురాలైయున్న లలితాకన్యను గ్రిందికి దింపి బాధింప యత్నించుచుండిరి. అదిచూచి వీరపాలుఁ డుదగ్రక్రోధుండై కదళీతరుషండమధ్యంబున విహరించు మత్తసుండాలంబుకైవడిఁ జోరులమధ్య విహరించుచుఁ గొమ్ములను గూల్చినట్లు లార్గురుచోరుల నొక్కుమ్మడిఁ బడఁగొట్టి లలితను రక్షింపఁబోవుచుండెను. ఆసమయంబున మిగిలినచోరులలో నొకఁడు వెనుకనుండి వీరపాలునివీపునఁ గత్తితో దృఢముగఁ బొడిచెను. వీరపాలుఁడు హా! హా! యని యొక్క కేకవైచి క్రిందఁ బడిపోయెను

అప్పుడే యెక్కడనుండియో యొకశూరుఁడు వచ్చి యాచోరుల మార్కొని వారి నిట్టట్టుఁ గదలనీయక పెనఁగులాడఁ దొడంగెను. ఒక్కనిముషములో నిరువురుచోరులు భూమిపైఁ ద్రెళ్ళిరి. అదిచూచి లలితను గొనిపోవ యత్నించుచున్న చోరు లామెను విడిచి మిగిలిన చోరులతోఁ గలిసి యాశూరుని జుట్టికొనిరి. ఇంకొకనిమేషమునకు

మఱి యిద్దఱు చోరులు కూలిరి. అంతఁ జోరు లోహటించుచుండుటఁ గని పెట్టి యాయనర్గళభుజార్గళుఁడైన శూరశిఖామణి "పిఱికిపందలగు నో చోరులారా ! ఊరక పాఱిపోయెద రేల? ఈపడియున్న మీసహచరుల శిరంబులను ఖండించి మీమిత్రుఁడైన కామపాలునకుఁ బారితోషికం బుగ నొసంగుఁడు" అని పలికెను. ఆమాట సరకుగొనక చోరు లతిభీతచిత్తులై నల్వాలంకులఁ బాఱిపోయిరి.

అట్లు చోరు లదృశ్యులైనపిదప నాశూరుఁడు లలితను బంధవిముక్తురాలిగ గావించెను. పాపమామె యింకను గాఢమూర్ఛ మునింగియే యుండెను. తరువాత నాశూరుఁడు పడియున్నవారిలో నింకను జీవముతో నున్నవారికిఁ గట్లు కట్టుచుండెను. కొంతతడవునకు లలిత యొక్కింత మూర్ఛ తెలిసి లేచి భయవిహ్వలయై చకితదృష్టుల నల్గడలఁ బరికించి చూచెను. చోరు లదృశ్యులైరి. కొందఱు గాయములమూలమున రక్తసిక్తాంగులై పూచినతంగేటిచెట్లవలెఁ బడియుండిరి వారికిఁ జైతన్య మిసుమంతయును లేదు.

అట్లు పడియున్నకళేబరములలో నొకదానిచెంత నెవరో యొక మహాశూరుఁడు కూర్చుండి యుండెను. లలితాకన్య వానిని జూచి యెవ్వఁడు చోరులకారాగారమునుండి వెల్వడఁజేసి తన మానప్రాణంబులఁ గాపాడెనో, యెవ్వానిమోహనమూర్తిని దనహృత్పీఠంబున నెలకొల్పి తనదైవముగ నారాధించుచుండెనో యామహాపురుషుఁడే తనయనివార్యపరాక్రమంబునఁ జోరులను నిర్జించి తన్నిప్పుడు మరలఁ గాపాడె ననియు నాకూర్చుండియున్న శూరుఁ డాతఁడే యనియు భావించి యత్యుత్కంఠఁ దనకృతజ్ఞతను దెలుప గొబ్బున లేచి వానిచెంత కేగెను. అంత నాపురుషుఁడు తనహృదయాధిష్ఠితదైవము కాఁడనియు నెవ్వరో దయాప్రేరితుఁడగు మఱియొకఁడనియుఁ దెలిసికొని దిగులుచెంది చకితయై నల్గడల వీక్షించి యత్యార్తితోఁ బ్రి

తాపసింహునిఁ జూచి "ఓమహాపురుషా! నన్నుఁ జోరులచేతినుండి త ప్పించి తోడ్కొనివచ్చిన నామానసాప్రాణరక్షకుండగు వీరపురుషుఁ డేమయ్యెనో మీ రెఱుఁగుదురా? చోరు లేమైరి? ఇప్పట్టున మీరే కాఁబోలు చోరులబారిఁజిక్కిన యబలనగు నన్ను రక్షించిన వీరపురుషులు" అని గద్గదకంఠయై పలికెను. అప్పుడు ప్రతాపసింహుఁడు లలితను జూచి "లలనామణీ! చోరులబందిగంబునుండి నిన్ను వెల్వడఁజేసి తోడ్తెచ్చిన వీరపురుషుఁ డాదుర్మార్గులచే ఖడ్గక్షతుండై యిదిగో యిచ్చోటనే పడియున్నాఁడు చూడుము." అని తనచెంతఁ బడియున్న వీరపాలుని జూపెను. వీరపాలుఁ డింకను జైతన్యరహితుఁడై మృతప్రాయుఁడుగా నుండెను. ప్రతాపసింహుఁడు వానిగాయమునుండి స్రవించురక్తమును పరిశుభ్రముగఁ దుడిచి యొకదివ్యౌషధిచే జాగ్రత్తగఁ గట్టుగట్టెను. అట్లు పడియున్నవీరపాలుని జూచినంతనే పిడుగు పడుటచేఁ గూలుపక్షికిఁబ్రియ "హా! ప్రాణరక్షకా!" అని కెవ్వున నొక కేక వైచి దుఃఖావేశంబున వివశురాలై నేలపైఁ బడెను. ప్రతాపసింహుఁ డాయెలనాఁగయవస్థఁ జూచి మూచి జాలిగొని యామెకు వలయునుపచారంబులు గావించుచు "ఈపురుషుఁడు చోరులకారాగారంబున కెట్లేగె? అందు బంధింపఁబడిన యీలేమను దా నెట్లు చూడఁగలిగె? అతఁ డీప్రాంతమునకు రాఁ గారణ మేమైయుండునో? మరల వేఁటలమకంబునఁ దోవఁదప్పి యేకతంబ సంచరించుచుండఁ జోరులు చెలిసాలను బంధించిరి కాఁబోలు! అందా లేమయవస్థను జూచి యుత్తమక్షత్రియ వీరుండు కావునఁ గరుణాతిరేకంబున నట్టిసాహసకృత్య మొనర్చియుండును. జన్మమెత్తినందుకుఁ గేవలము స్వసౌఖ్యమునే యపేక్షింపక పరులవిపత్తుల హరింపఁ బాటుపడునదే జన్మము. సరీసృపాదులవలె స్వజాతినే హింసించుచోరులజన్మ మొకజన్మమే నా? ఇంతటియు దారభావుని భగవంతుఁ డెప్పట్టునకైన నదోరూపంబున నిట్టి

విపత్తులనుండి రక్షింపకుందునా?" అని తనలో నేమేమో యనుకొనుచుండ లలితాకన్య మూర్ఛదెలిసి లేచి పేరెలుంగున నేడ్చుచు "హా! హా! మదీయమానప్రాణరక్షకా! శూరాగ్రేసరా! మహోదారవీరపురుషుండవగు నీకే యింతటివిపత్తు ఘటిల్లెనా? అయ్యో! పరమపాపాత్మురాలనగు నాపైఁ గరుణకలిగి నన్ను రక్షించుటచేత నేగదా దుర్మార్గులచే నింతటియాపదను జెందితివి? పరమనిర్భాగ్యురాలని నన్ను విడుచుంటివా? నీతోఁగూడ నన్నింతవఱకును దోడ్కొనివచ్చితివి. నా కేలోకమైనను నీతోడిదే యగుటచే నన్నుఁగూడ నిప్పుడు నీవెంటఁ గొనిపోవా? నీవుగొనిపోకున్న నిదిగో నేనే స్వయముగ నీతో వచ్చుచున్నాను." అని పరితాపసింహుని ఖడ్గమును గైకొని పొడిచికొనఁబోయెను. పరితాపసింహుఁ డామెకరంబుఁ బట్టికొని ఖడ్గమును దీసి "వెఱ్ఱిదానా! ఏల నీ విట్లు బేలవై యింతటిదుస్సాహసంబునకుఁ గడంగెదవు. ఈ నీపురుషుఁడు జీవించియేయున్నాఁడు. ఇఁక వీని కేమియు భయములేదు. గాయమునుండి రక్తము స్రవించుట తగ్గినది. రక్తహీనతచే మైమఱచియుంకను గొంతతడ విట్లున్నను వీనికిఁ బ్రాణభయము లేదు. ఏలవాపోయెదవు. ఊఱడిల్లుము. ధీరచిత్తవై వీనికివలయు నుపచారంబు లొనర్చుచు వీనిచెంతఁ గూర్చుండుము" అని పలికెను. ఆమాట వినినంతనే లలితాకన్య యమితానందముచే నుప్పొంగుచు "వీరవతంసమా! నీమహోదారవీరత్వము నే నెంతనికొనియాడుదును. కాటువేసి చంపుటకుఁ గ్రూరసర్పము మీఁదికివచ్చుచుండ గరుడుం డాకస్మికంబుగ నెటనుండియో వచ్చి దాని నెగురఁదన్నునట్లు పరహింసాపరులును గ్రూరహృదయులు నగు చోరులు మమ్ము సంహరింప మూఁకొనినంతనే యాగంతుకంబుగ నెక్కడనుండియో నిష్కారణజాయమానకటాక్షంబున వచ్చి చోరుల నెగురఁదన్నితివి. ఓహో వీరపురుషులస్వభావమిట్టిదియే కాఁబోలు! పుణ్యాత్మా! నేఁడు నీవు మాకొనర్చిన మహోప

కారమును నే నాజన్మాంతమును మఱవఁజాలను. ఆ ర్తజనావనుండ వగు నీ కిదే నాకృతజ్ఞతపూర్వకవందనసహస్రంబు లర్పించుచుంటి ని" అని ప్రతాపసింహునియెదుట మోకారించి నమస్కరించెను. ప్రతాపసింహుఁడు ప్రియపూర్వకముగ లేవఁదీసి "లలనామణీ! నే నిప్పు డొనర్చిన యీపాటిస్వల్పకార్యమునకు నన్నింతగఁ గొనియాడ వలసిన పనిలేదు. పరోపకారమే పురుషుని కర్తవ్యము. సౌహార్ద హృదయులగు పురుషులు తమమానవసోదరసోదరీమణుల యాపద ల కడ్డుపడుచుందు టబ్బురమా! నీ కీపురుషునిపై నంతటిప్రేమ జనిం చుట సహజమే. ఈపురుషుఁడు రూపగుణాభిజాత్యంబుల నీకుఁ దగిన వరుఁడు." అని పలుక లలితాకన్య దరహాసితముఖియై వ్రీడాభరంబున శిరంబు వాల్చి "పుణ్యపురుషా! నాప్రాణరక్షకుఁ డైన యీమహా పురుషుఁ డెవ్వరో నీ వెఱుంగుదువా?" అని యల్లన నడిగెను. అందు పైఁ బ్రతాపసింహుఁడు "జవ్వనీ! నీ వెఱుంగనేమెఱుంగవా ? ఈతం డు నిఖలనరపాలమకుటమాణిక్యఘృణిచ్ఛటానీరాజితపాదపంకేరుహుం డును దుర్మదారాతిసుష్కకాంతారవీతిహోత్రుండును గోసలరా జ్యరమాకళత్రుండు నగు చంద్రశేఖరమహారాజు పుత్రుఁడు. వీని పేరు వీరపాలుఁడు. మున్నొకప్పుడు వీనిని యమునానదీవిప్లవోపద్ర వంబునుండి రక్షించుటయేగాక యిప్పు డీవిధంబుగఁ గాపాడుభాగ్య ముకూడ నాకు లభించినది"— అని యింకను యేమో చెప్పఁబోవు చుండ వీరపాలుఁడు "దాహము; దాహము" అని సంజ్ఞచేసెను. ఆసన్న గ్రహించి ప్రతాపసింహుఁడు చివాలున లేచి "జవ్వనీ! ఈపు రుషున కొకింత తెలివి వచ్చినదని భావోద్వేగంబున వీనిచే విశేషము గ మాట్లాడింపకుము. దాహము కావలెనని సంజ్ఞ సేయుచున్నాఁడు. నే నాకనఁబడెడు సెలయేటిలోని నిర్మలోదకంబును దెచ్చెదను. నీ

వంతవఱకు వీనిచెంతఁ గూర్చుండి వీనిని బహుజాగ్రత్తగఁ జూచుచుండుము" అని చెప్పి వెడలిపోయెను.

అప్పుడు లలిత వీరపాలునిచెంత మోకరించి యంజలిఘటియించి యాకసమువంకఁ జూచుచు "దీనజనశరణ్యుండ వగు నోపరమేశ్వరా! జగద్రక్షకా! ఆపదుద్ధారకా! ఏమహాశూరుఁడు ముష్కరులగు చోరులదుర్గమకారాగారంబున నాకు ఝ్యాలించి నామానప్రాణములను రక్షింప నంతటిసాహసం బొనరించెనో, ఏప్రియాగ్రేసరుని మోహనమూర్తి నాఁటనుండియు నామానసరాజహంసమై ప్రేమపూరితాపాంగవీక్షణంబుల నన్నానందరసాబ్ధివీచికల నోలలాడించెనో, ఏమహోదారుఁ డిచ్చోటఁ జోరులనుండి నన్ను మరల రక్షించుటకై తనప్రాణముల నర్పింప సిద్ధపడియెనో యాపుణ్యమూర్తి యీవిధంబుగఁ బడియుండ నే నెట్లు చూచి సహింపఁగలుగుదును. మున్ను సావిత్రీద్రౌపదులపైఁ జూపిన నీయనంతదయలో నొక్కింత యార్తురాల నగు నాపైఁ జిలికి యీమహోదారవీరశిఖామణిని శీఘ్రంబ తెలివొందఁ జేసి విపత్తిమూతపటలాచ్ఛాదితవీరచంద్రుని షోడశకళాపరిపూర్ణునిగఁ జేసి నానేత్రకుముదంబుల నలరింపుము. హృదయమా! ఏల నీవిట్లు వ్యర్థముగ నందరానిఫలంబున కాసక్తిఁ గొని దురపిల్లుచుంటివి? రూపవైభవగుణాభిజాత్యంబుల జగదేకవర్ణనీయుం డగు నీమహాభాగుని యర్ధాంగిలక్ష్మియగు భాగ్యవతి పూర్వజన్మంబున నెన్నిసద్వ్రతంబు లాచరించియుండవలయునో! ఈయనవద్యపుచరిత్రుని చరణదాస్యము నపేక్షించు నీలలిత మనోరథం బెప్పటికైన నీడేర్చెదవా? దేవా! కరుణాసముద్రా! మ మ్మీవిపత్సముద్రమునుండి నీయపారదయాతరణిపైఁ జేర్చి యుద్ధరింప మాల్మియగుటకా మహాశూరు నంపితివి? ఆర్తత్రాణపరాయణుండ వగు నీయనంతదయ నే నెంతని కొనియాడుదును. సమయమున కామహాపురుషుఁడు గాకున్న మా

గతి యేమగునో? ఇట్టిమహావీరునిసాహాచర్యంబును లభింపఁజేయుటచే నే నెంతయు ధన్యురాల నైతిని. హే దేవా! మహానుభావా! నాభావిభాగ్యోదయం బెట్లుండునో, నీదివ్యవాల్లభ్యలక్ష్మీకటాక్షము నాపై నెంతవఱకుఁ బ్రసరించునో యజ్ఞానురాలనగు నే నెట్లు తెలిసికొనఁగల్గెదను. నావంటిదీనజనుల రక్షింప నీవేగదా దిక్కు. నిరాధారముగ మింట నెగురుపక్షులును సలిలంబుల విహరించు జలచరంబులును నేదయామయుని యపారకరుణచే రక్షింపఁబడుచుండెనో జాగ్రత్స్వప్నసుషుప్త్యాద్యవస్థలయందును ననన్యగతికంబుగ గిరిగహన జలాశయంబులఁ బరిభ్రమించు నెడలను సకలజీవుల నేమహాదేవుఁడు కంటిని ఱెప్పవలెఁ గాచిరక్షించుచుండునో యాపరమేశ్వరుఁ డాజగద్రక్షకుఁ డీదీనురాలి కుయ్యాలించి తనయార్తత్రాణబిరుదంబును సార్థకంబుగఁ జేయ నాప్రాణతుల్యుండగు నీమహాపురుషుని శీఘ్రంబుగఁ బూర్ణారోగ్యవంతునిగఁ జేసి నామనోభీష్టము నెఱవేర్పుఁగాక!” అని నిమీలితనేత్రయై భగవంతుని భక్తిపూర్వకముగ ధ్యానించుచుండెను. అంత వీరపాలుఁడు కనులువిచ్చి చూచి ‘దాహము; దాహము’ అని లేవఁబోయెను. వెంటనే లలిత యత్యుత్సాహంబున వానిఁ గౌఁగిటఁబట్టికొని వానిశిరంబు తనయెడమతొడపై నుండునట్లుగఁ బరుండఁజేసెను. వీరపాలుఁడు కనులు తెఱచి ‘లలితా! లలితా!’ యని మరల నిద్రించెను.

అంతఁ బ్రతాపసింహుఁడు సెలయేటినీ రొకపత్రపుటంబునఁ గొనితెచ్చి లలితచేతికిచ్చి “జవ్వనీ! ఈపురుషుఁడు దాహమని యడిగినప్పుడే యీపత్రపుటంబులోని జలమును ద్రాగింపుము. బలవంతముగ నిద్రనుండి మేల్కొలిపితివేని నిస్త్రాణ యధికంబగును. నీవు బహుజాగ్రత్తగ వీనినిఁ గనిపెట్టి చూచుచు వలయునుపచారంబులను సేయుచుండుము. జ్వరాతిశయముచే నీతఁ డప్పుడప్పు డేమేని యసం

బద్ధవాక్యములను బలికినను నీవు భయపడవలదు. నే నిప్పుడే పోయి వైద్యునిం దోడ్కొనివచ్చెదను" అని చెప్పి వెడలిపోయెను.

ప్రతాపసింహుండు వెడలిపోయిన పిదపం గొంచెముసేపటికి వీరపాలునికి జ్వరముతగ్గిపోయెను. అతండు బాగుగ మెలకువనొంది కను లువిచ్చి నూవి దాహము దాహ మని యడిగెను. వెంటనే లలిత తన వామకరంబున వాని నొక్కించుక లేవం దీసి పత్రపుటంబులోని నీరు వానిచేం గడుపారం ద్రావించెను. ఆనీ రెట్టిదివ్యౌషధీరసమిశ్రితమైనదో కాని యద్దానిం ద్రావినతోడనే వీరపాలుండు పుష్టిం జెంది లేచి కూర్చుండెను. లలితాకన్యను జూచి "లలితా! నీవు సురక్షితంబుగ నారక్షకదేవతవై నాయొద్దనే యుంటివా? చోరు లేమైరి? నా కీకట్టు లెవ్వరు కట్టిరి? నిన్నాచోరులనుండి రక్షించినపుణ్యపురుషుం డెవ్వండు ?" అని ప్రశ్నమీందం బ్రశ్న నడుగంజొచ్చెను. లలిత భయాకులితచిత్తమై "వీరవరా! మీర ట్లతిశ్రోరణికి మాట్లాడకుండు. పదుపడి జరిగినవృత్తాంతము నే నెఱిగినంతవట్టు మీకెఱిగించెదను. మఱికొంచెముసేపు మీ రింధంబుగనే పరుండి నిద్రింపుండు." అని మఱలం దనతొడపైం బరుండం జేయ యత్నించెను. కాని వీరపాలుం డట్లు పరుండనొల్లక "వనాక్షీ! అబలవగునిన్ను రక్షింపంజాలని నాకు వీరశబ్దము మెట్లు చెల్లును? చోరవ్యాఘ్రములచేం జిక్కి బంధింపంబడుచుండ నేమియుం జేయంజాలక యూరకచూచుచుండిన యసమర్థుండగు యీనిర్భాగ్యునిపై నీకింతటిదయ యేలకలుగవలయును? కుసుమకోమలంబగు నీయూరువుపై నా కర్కశశిరంబు మోపి నిన్నింతనొప్పించితినో? నాసంశయములెల్ల నివారణమైనంగాని నే విశ్రాంతి నొందంజాలను" అని దృఢముగం బలికెను. ఆమాటలు విని లలితాకన్య భావోద్వేగంబునం గన్నుల నశ్రుకణంబు లురులం గొంతతడవేమిచెప్పుటకును దోంచక యూరకుండెను.

వీరపాలుఁడు పడిపోవుటకుఁ బూర్వమే లలిత చోరులను జూచి మరల వారిచేతికిఁ జిక్కవలసివచ్చెఁ గదా యని యత్యుత్కట భయంబున మూర్ఛిల్లెను. చోరులు పలాయితు లైనపిదప నామె తెలివొందెను. అందుచే జరిగినవృత్తాంత మంతయు సవిస్తరముగ నామెకును దెలియదు. ఆహేతువుచే వాని నెట్లు సమాధానపఱుపనగునా యని కొంతతడ వాలోచించి యాపురుషునకుఁ దనపైఁ గల యవ్యాజప్రేమ కుత్కలికఁ జెందుచుఁ దాను తెలివొందినది మొద లప్పటివఱకును జరిగినసమాచారమును మాత్రము తెలిపెను. అది విని వీరపాలుఁడు "కోమలీ! అట్టిసమయోచితసహాయముచే మనలను జోరుల బారినుండి తప్పించి రక్షించినమహాశూరుఁ డెవ్వఁడో నీ వెఱింగితివా?" అని యడిగెను. అందుపై లలితాకన్య "ఆమహాశూరుఁ డెవ్వఁడో నే నెఱుంగను. కాని వానినోటనుండి వెలువడిన కొన్నిమాటలచే నా పుణ్యాత్మునకు మీరు పూర్వపరిచితులే యనట్లు తెలిసికొంటిని. అతఁడు బాహ్యవేషముచే బోయవానివలె నున్నాఁడు." ఆమాట వినినంతనే వీరపాలుఁడు సంభ్రమాశ్చర్యంబులు మనంబునఁ బెనంగొన "లలితా! ఆపురుషుఁ డేమనియె?" ననియడిగెను అందుపై లలిత "మున్నొకప్పుడు యమునానదీవిప్లవోపద్రవము నుండి మిమ్ము రక్షించితి నని యామహాపురుషుఁడు వచించెను" అని చెప్పెను. ఆమాట వినినంతనే యావీరాగ్రేసరుఁడు తాను చూడఁగోరినబోయయువకుఁడే యని నిశ్చయించి యత్యుత్సాహముతో "లలితా! ఆమహాపురుషుఁడు నాకు మూఁడుసార్లు ప్రాణదాత యయ్యెను" అని పులివేఁటయొక్కయు యమునానదీవిప్లవముయొక్కయు వృత్తాంతములను సమగ్రంబుగ వివరించెను. ఆవృత్తాంతములను వినుచున్నంతసేపును లలితకన్నుల నుండి యశ్రుజలము సంతతధారాపాతంబుగఁ గాఱుచునేయుండెను.

అదిచూచి వీరపాలుఁ డవ్యక్తభావోర్మికలఁ దూఁగాడుచుఁ "దరుణీమణీ! ఏడ్చుచుంటివా? నాపై నీ కింతజాలి కలుగుటకుఁ గారణం బేమి? కుసుమసుకుమారివైన నీ వీతీవ్రాతపంబున నీకంటకశిలాభిరామతలంబున నాయొద్ద నెంతసేపటినుండి కూర్చుండియుంటివో కదా! పరమదుర్మార్గులైన మనుష్యరచోరుల కర్కశహస్తంబులలోఁ జిక్కి శిరీషపుష్పకోమలంబగు నీతనువల్లి యెంతవలిగిపోయెనో కదా! నిన్ను రక్షింపఁబూని తోడ్కొనివచ్చి నీ కింతటికీడుఁ గలుగఁజేసిన క్రూరహృదయుండగు నీకటికవాని యవస్థలకై జాలినొందుచుంటివా? నీ ప్రియపూర్వకమైన సముపచారంబులచే నాకు బాగుగా స్వస్థత కలిగినది. ఆ బోయవాఁడు నాకుఁ బ్రాణరక్షకుఁ డగుటయేగాక నాజన్మసార్థక్యమ్మునకుఁ గూడ కారణభూతుం డయ్యె. ఎట్లన వాని నన్వేషించుచు నీ ప్రాంతంబునకు వచ్చుటచేత నేకదా నీవంటిసుగుణరాశి యగు జగన్మోహనాంగిసందర్శనభాగ్యము లభించుటయేగాక యాలేమ హృదయధనంబునుగూడ సంపాదింపఁగలిగితిని? ఇంతకన్న నాజన్మకు సాఫల్యము వేఱొండు కలదా?" అని పలికెను. ఆమాటలు విని లలిత భావోద్వేగం బాపికొనఁజాలక వెక్కివెక్కి యేడువనారంభించెను. అది చూచి వీరపాలుఁడు తత్తరముతో "లలితా! లలితా! ఏల యేడ్చెదవు? నీహృదయం బెఱుంగక యే నీ కయిష్టమైన యవివేకసంభాషణంబుచే నీ మనస్సు నొప్పించితినా యేమి? అట్లైనచో నాతప్పు మన్నింపుము. త్వరపడి నాహృదయకూలంబు నధిగమించి పొంగిపొరలు భావతరంగంబుల వెలిఁబడనిచ్చుటచే నేనిట్టి శిక్ష కర్హుండనైతిని కాఁబోలు! అకటా! నే నెంతకఠినచిత్తుండను. అంధకారమయంబగు నాహృదయగోళమును బ్రకాశింపఁజేయ నేపూర్ణచంద్రముఖి నగు వెన్నెల నపేక్షించితినో యేజగన్మోహనకీరమును మదీయహృదయపంజరాంతరంబున బంధించియుంటినో యాపద్మాక్షి నలనుండి పద్మదళంబులు ము

త్యములను బ్రసవించుచుండెనో యన నశ్రుబిందువులు జాలువాఱ నేడ్పించుచుంటిని. నావంటిపాపకర్ముఁ డెందైన నుండునా? ఇఁక నీక్రూరచిత్తుని నీహృదయవీథినుండి తఱిమివేసి సుఖానందముల వర్ధిల్లుము" అని పలికెను. ఆమాటలు విని లలిత మందహాససుందరవదనారవిందయై ప్రేమమయమైన చూడ్కు లానందసాగరంబున నీదుచుండెనో యన వానిపైఁ బ్రసరింపఁజేయుచు గద్గదకంఠయై "ప్రాణేశ్వరా! ఎన్ని జన్మములకైనను మీరే నాప్రాణము. మీరే నాదైవము. మీరే నా సర్వస్వము. మీరు కానరానిలోకము నాకంధకారమయము. మీరట్లు మాట్లాడుచుండిరేని నేను బ్రతుకఁజాలను." అని పట్టరానితమకంబున వీరపాలునియెదపై వ్రాలి సంతోషపరవశయై మూర్ఛిల్లెను.

ఆసమయమునఁ బ్రతాపసింహుఁడు వచ్చి లలితావీరపాలురను జూచి యమితానందముఁ జెందెను. వీరపాలుఁడు ప్రతాపసింహునిఁ జూచినంతనే లలితను గ్రిందఁ బరుండఁజేసి దిగ్గన లేచి వాని రెండు చేతులను బట్టికొని "పుణ్యపురుషా! నీవు నాకు మూఁడవసారి ప్రాణదాతవైతివి. భగవంతుఁడు నిన్ను నారక్షకదేవతగా భూమిపై సృజియించెఁ గాఁబోలు. నే నాజన్మాంతమును నీకుఁ గృతజ్ఞతాబద్ధుండనైతిని. నాతండ్రి నిన్ను మఱియొకసారి చూడఁగోరి మధురాపురంబునకు దోడ్కొనిరమ్మని విధించుటచే నే నీప్రాంతంబునకు వచ్చి నిన్ను దర్శించితిని. మనరాకకై తండ్రిగారు నిరీక్షించుచుందురు. కావున మన మీ లతాంగిని బుష్పగిరిఁ జేర్చి మధురాపురమున కేగుదము" అని పలికెను. ప్రతాపసింహుఁడు వివిధభావపరీతచేతస్కుండై యందుకు వల్లె యని సమ్మతించెను.

అంత నొకయాశ్వికుఁ డెక్కడనుండియో హుటాహుటి నరుదెంచి వీరపాలునిఁ జూచినంతనే గుఱ్ఱమును డిగ్గి వానికి నమస్కరించి

"యువరాజచంద్రమా! బోయయువకునిజాడ నరయ మీరు సహాకారిగ నుండవలసిన దనియు వానిని గలిసికొనినపిదప నాయువకునితో నన్ను మధురాపురము రావలసిన దనియు నెద్దియో కార్యావసరముపై మీరు కుళింద కేగవలసినదనియు మీ కచ్చోటనే యాకార్యావసరము విశదము కాఁగలదనియుఁ జెప్పి నన్నుఁ బుత్తెంచినారు. బోయయువకుఁడు లభించినాఁడు గనుక మహారాజుగారి యాజ్ఞను నెఱవేర్చెదరా?" అని పలికెను. ఆమాట వినినంతనే వీరపాలుఁడు నిరుత్సాహుఁడయ్యుఁ గొంచె మనుమానించి "ఆశ్వికా! నీమాట నెట్లు విశ్వసింపనగు? నాతండ్రిగారి యాజ్ఞాపత్రి మేమైనఁ గలదా?" అని యడిగెను. ఆప్రశ్న వినినంతనే యాయాశ్వికుఁడు నిరుత్సాహుఁడై లేదని మెల్లగఁ బలికెను. అట్లయినచో నేనే యీయువకుని మధురాపురమునకుఁ గొనిపోయి యాకార్యావసరమును మాతండ్రిగారివల్లనే తెలిసికొనియెదను." అని యందఱును బుష్పగిరిమార్గమున బయలుదేఱిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

పండ్రెండవ ప్రకరణము.

శా. మీఁదే మౌనో యెఱుంగలేక తులువల్ మెలంచుచున్ దుష్క్రియల్
మోదంబార నొనర్తు రైనఁ దుది మేలుం గాంచిరే వారు ప్ర
హ్లాదున్ మున్ను నృసింహరూపమున నుద్యల్లీల రక్షింపఁడే
శ్రీదుం డౌ హరి యాహిరణ్యకశిపున్ శిక్షించి వాత్సల్యతన్.

ఒకనాఁడు సాయంకాలమునఁ గోసలరాజ్యరమాకళత్రుండగు చంద్రశేఖరమహారాజు వాడుకప్రకారము వాహ్యాళి కేగెను. మహారాణీచిత్రాంగి నిజాంతఃపురంబున నేకతంబ కూర్చుండి తనలో "ఆదిని నేను పన్నినతంత్రము జయప్రదముగ నెఱవేఱిన దని యనుకొంటిని. వజ్రాలహారమును గుఱించి నాభర్తకుఁ గలిగినయనుమానమును బోఁగొట్టఁ గలిగితిని. నా దారికడ్డముగనున్న నాసవతిని రూపుమాపితిని. బ్రదికియున్నను జచ్చినను నామెజాడ మనుజమాత్రున కెన్నండును దెలియనేరదు. కాని నాప్రియతమురాలైన యిందుమతి తిరుగ వచ్చి నా కంటఁ బడకుండుటచే నామనం బేలొకో చెయివెట్టి కలఁచినట్లు కల గుండు పడుచున్నయది. ఆమె నన్ను మోసము చేయునా? ఒకవేళ నామె కేమైన యపాయము వాటిల్లెనేమో! అట్లైన మేలే. ఆమె చేయఁబూనిన కార్య మేమయ్యెనో? ఈమధ్య కల్యాణగడమున నొక వృద్ధనారి పదునెనిమిదేండ్లప్రాయము గలయువకునితోఁగూడ యమునానదీతీరమున నొకగుడిసెలో నివాసము చేయుచుండె ననియు నా యిరువురు నానదీప్లవంబున మడిసిరనియు వినియుంటిని. ఆమె యిందుమతియే యైనచో నిరువదిరెండేండ్లప్రాయము గల యాయువకుఁ

డెవ్వఁడైయుండును? అతఁడు నాసవతిబిడ్డకంటె రెండేండ్లు పెద్దవాఁడు. అతఁ డామె విలాసపురుషుఁడేమో! నాయనుఁగుపుత్తుఁడైన నీరపాలుని రక్షించిన బోయయువకునిఁ జూచినప్పటినుండియు నాభర్తకేమేమో యనుమానములు కలుగుచుండెను జరాభారము హెచ్చినకొలఁది పురుషుల కనుమానములు హెచ్చుచుండుట సహజమే. ఆ బోయయువకుఁ డెవ్వఁడైనను వాని నియ్యెడకు రాకుండ నెట్లైన బాధించవలసిన దని నాయన్న పేర లేఖ వ్రాసితిని. వెంటనే యొకగూఢచారునిచేఁగూడ వానికి వర్తమాన మంపితిని. వానియొద్దనుండి జవాబేమియు లేకుండుటచే నాకు భయము కలుగుచున్నది. భయపడిన నేమిలాభము? కోటిలోఁదలఁదూర్చి రోఁకలిపోటులకు వెఱవనగునా?" అని యనుకొనుచుండఁ జేటి యొకయుత్తరముఁ దెచ్చి యామె కొసంగెను. ఆలేఖ నత్యాతురతతోఁ జిత్రాంగి తనలోఁ జదువుకొనియెను. అం దిట్లు వ్రాయఁబడియున్నది: —

"శ్రీరస్తు చిరంజీవియు సౌభాగ్యవతియు నగు నాప్రియసోదరి చిత్రాంగిమహారాణికి తదీయశ్రేయోభిలాషి యగు కామపాలుఁడు దీవించి వ్రాయునది: — ప్రియసోదరీ ! మనహృదయవిహంగంబులింతవఱకు గగనవీథిని స్వేచ్ఛగ విహరించుచున్నను విపక్షిమూతంబులు దట్టముగ మింట నలముకొనుచుండుటచే నయ్యవి యధోగతిపాలు గావలసివచ్చునేమో యని భయపడుచున్నాను. నీవు నాపేర కొన్నిరహస్యములతోఁ గూడిన లేఖ వ్రాసితి వని వినియుంటినే గాని చక్షురక్షురసంయోగంబుఁ గావింపఁజాలనైతిని. నీవు పంపిన వర్తమానమువలనఁ గర్తవ్య మెఱింగితిని. ఆరహస్యలేఖను నీభటుఁడు నాయొద్దకుఁ గొనివచ్చుచుండ నాప్రబలశత్రు వద్దాని సంగ్రహించి సుదర్శనున కొసంగెనని తెలియవచ్చినది. నాహృదయకంటకుండగు భానుమంతుఁడు నీదాసీ యిందుమతియు నిప్పుడు సుదర్శనునియొద్దనే యు

న్నారు. నీ కెప్పటికైన నపాయము వాటిల్లనున్నచో నాతట్టునుండి యే రావలయు ననియెంచి విష్ణువర్ధనునివలెనే వానినిఁగూడ రణరంగంబున నిర్జింపఁగోరి వానిపై దాడి వెడలఁదలంచి నీప్రేమలతాబద్ధుండును నామిత్రుండు నగు శూరసేనునిఁ బ్రోత్సహించితిని. మొదట బయలుదేఱుట కుద్యుక్తుం డయ్యె. తరువాతఁ జోరులబారినుండి విడివడి లలిత యింటికివచ్చినతోడనే యుపేక్షాపరుఁ డైనట్లు తోఁచుచున్నయది. నీచాతుర్యముచే వానికి రణోత్సాహమును గలిగించితి వేని మనప్రయత్నము సఫలము కాఁగలదు. నీనాజీవితము లీరణోద్యమపరిణామంబుపై నాధారపడియుండుటచే నీ నేర్పంతయు వినియోగించి నాసంకల్పమును జయప్రదముగ నెఱవేర్చెద వని నమ్ముచున్నాను. నీవు నన్ను నగ్నిగా నా కప్పగించినవిషయము తగుజాగ్రత్తలోనే యుంచఁబడియున్నది. అందువిషయమై నీ వెప్పటికిని భయపడవలసినపని లేదు.

ఇట్లు, కామపాలుఁడు."

ఆలేఖఁ జూచినంతనే చిత్రాంగికి మిన్నువిఱిగి మీఁదను బడినట్లు తోఁచెను. భయవిహ్వలయై వడవడ వడఁకసాగెను. అట్లు కొంతతడవు చతికిలంబడి నిశ్చేష్టురాలై బిచ్చవడినచూపులతో నల్వలంకుల నిర్లక్ష్యముగఁ జూచుచుఁ గూర్చుండి దీర్ఘనిశ్వాసంబు విడిచి యిందుమతి నుద్దేశించి "ఓసీ ! స్వామిద్రోహురాలా ! ఎంతటిదారుణంబున కొడిగట్టితివే! పసితనంబునుండియు నన్నెంత ప్రేమతోఁ బెంచిన నీవే యింత ద్రోహము నామెడలఁ దలంచెద వని స్వప్నమునందైన నమ్మనైతిని. నీ వింత కాలమును బాలుపోసి పెంచుచుఁ బ్రక్కలోఁ బెట్టికొనిన క్రూరవిషసర్పంబ వని యెఱుంగనైతినే. నే నిప్పు డేమనుకొనిన నేమిలాభము. ఇప్పుడైనను మిగిలిపోలేదు." అని వ్రాంతబల్లయొద్ద కేగి యొకలేఖ వ్రాసి కామపాలునియొద్ద కనిపెను.

అప్పటికి చీఁకటి పడినది. చంద్రశేఖరమహారాజు వాహ్యాళి నుండి సపరివారముగఁ దిరిగివచ్చిరి. మహారా జంతఃపురంబులోని కేగినతోడనే చిత్రాంగి దివ్యవస్త్రాలంకారభూషితయై మహీతలంబున కవతరించిన రతీదేవియో యన మహారాజున కెదురుగవచ్చి యాలింగనం బొనర్చి లోనికిఁ గొనిపోయి పడకకుర్చీపైఁ గూర్చుండఁజేసి మెల్లగఁ బాదము లొత్తుచుఁ "ప్రాణేశ్వరా! మనవీరపాలుఁ డింకను రాకుండుటచే నా కేమియుఁ దోఁచుటలేదు. మనకు మహోపకారియైన బోయయువకుఁడు వాని కింకను గనిపించెనో లేదో? వానిఁజూడకున్న నే బ్రదుకఁజాలను. వానిని శీఘ్రంబుగ రప్పించరా?" అని దైన్యముదోఁపఁ బలికెను. అందుపైఁ జంద్రశేఖరుఁడు "ప్రియా! మన కాంక్షితార్థంబులెల్ల నీశ్వరుఁడే సిద్ధించును. త్వరపడకుము. వీరపాలునిఁ జూచువేడుక నీ కెంతకలదో నాకు బోయయువకునిఁ జూచువేడుక యంతియే కలదు" అని పలికెను. ఆమాట విని "మీ రాకిరాతయువకునే పుత్త్రునిగ భావించుచుండిరి కాఁబోలు. నాథా! కడుపారఁ గనిపెంచిన వీరపాలునకన్న యాబోయపిల్లవానిపైఁ దమ కంతయెక్కువప్రేమ యెట్లుజనించెనో తెలియరాకున్నది" అని పలికెను. అందుపై మహారాజు చిఱునవ్వునవ్వుచు "ప్రేయసీ! నీ వాయువకునిఁ జూడలేదు కనుక నట్లనుచున్నావు. వానియందు మహారాజలక్షణము లెన్నియో కలవు. అతఁ డెద్దియో కారణాంతరంబుచే బోయకులములోఁ బెరిఁగిన యుత్తమక్షత్రియపుత్త్రుఁడు గాని కిరాతుఁడు కాఁడని నానమ్మకము. వాని వయస్సిరువదిసంవత్సరములనుటచే, బరివ్రాజకునిమాట స్మరణీయమగుచున్నది" అని పలికెను. ఆమాట విని చిత్రాంగి మనంబు తల్లడిల్లుచున్నను ధైర్య మవలంబించి "ప్రాణేశ్వరా! ఏలినవారు కేవలము భూతదయాస్వరూపు లగుటచేఁ దమదృష్టికి నల్పులుగూడ నధికులుగఁ గాన్పింతురు. ఏనుఁగుకంటికిఁ బేలపుగింజ పెద్దదిగఁ గన్పట్టదా? అం

తియకాని పైకి జిగిదళుకొత్తుచున్నంతమాత్రమున నమూల్యమగు మాణిక్యముతో నద్దపుముక్క సాటి యగునా? సూర్యకాంతిలో నద్దపుముక్కకుఁ దేజము హెచ్చగునట్లు దేవరవారి కృపాకటాక్షదీధితులచేఁ గిరాతయువకునియందు మహారాజలక్షణములు ప్రకాశించెఁ గాఁబోలు. ఇంతకును జగదేకశ్లాఘ్యంబైన సుక్షత్రియకులంబునందుఁ బుట్టిన యర్భకునిఁ గిరాతున కొసంగ నెవరికి చేతులు వచ్చును?" అని పలికెను. అందుపై మహారాజు "ఏమీ! లోకములో రాజ్యలుబ్ధులగు స్వార్థపరులును మత్సరగ్రస్తులు నెంతెంతటిద్రోహముల నొనర్చుటలేదు? మున్నయోధ్యారాజ్యమును దనకుమారుఁ డగు భరతునకు రాఁగోరి కైకేయి శ్రీరామచంద్రు నరణ్యంబున కనుపలేదా? రాజ్యలుబ్ధుండయియేగదా నీయన్న విశ్వాసఘాతుకుండై తనయన్నను వదినెను జంపి యన్నకొమరునిఁ జంప నిప్పటికిని యెన్నియోవిధములఁ బ్రయత్నించుచుండె? నీవు పట్టితెలివితక్కువదాన వగుటచే నట్లు పలికితివి. కాని లోకములో దురాశాబద్ధులగు రాజద్రోహు లెందఱెందఱో కలరు" అని పలికెను. అందుపై మాఱుమాటాడఁజాలక "మహారాజా! అజ్ఞానురాలనగు నాయవివేకసంభాషణమునకు క్షమింపుఁడు."

వారిట్లు మాట్లాడుచుండ సమీపంబున నొక తెర చలించినట్లు మహారాజు భ్రమించి దిగ్గనఁ గుర్చీనుండి లేచి యదేమియో యని యాచెంతకేగెను. అప్పుడొకవ్యక్తి తొందరగ మేడమెట్లు దిగుచున్నట్లు తోఁచెను. చిత్రాంగి చకితదృష్టులఁ జూచుచుండెను. మహారాజు మేడమెట్లు దిగెను. మెట్లక్రింద నొకవ్యక్తి "మహారాజుగారు వచ్చుచున్నారు జాగ్రత్త" అను రహస్యోక్తి యస్పష్టముగ వినవచ్చెను. కుతంత్రమేదియో జరుగుచుండెనని యనుమానించి తిరుగఁ దనకుర్చీయొద్దకు వచ్చెను. చిత్రాంగి యచ్చట లేకపోవుటచే భార్యపైఁగూడఁ గొంతయనుమాన ముదయించెను. తనలోఁ దా నేమేమో యాలో

చించికొనుచు మరల కుర్చీలోఁ గూర్చుండఁ గొంతసేపటికి చిత్రాంగి యేమియు నెఱుంగనిదానివలె నవ్వుచు వచ్చి "ప్రాణనాథా! మీ మనంబు నట్లు భ్రమింపఁజేసిన విషయమేమో యని నేను శయనాగారంబున కేగి చూచితిని. రాణివాసపుఁ బరాజవాసైన యొకమండుఁడు బాగాలను గొనివచ్చి శయ్యచెంత నుంచి చనియె. నాథా! నేఁడు మీ రేదో మఱియొకవిధముగ నున్నారు. కారణం బేమి?" అని సవినయంబుగ నడిగెను. అందుపై మహారాజు "ఏమియు లేదు. నీవెద్దియో కార్యసంభ్రమంబున నుంటివి కాఁబోలు. పొమ్ము. నీపనిఁ జూచికొనుము" అని తిరస్కారముగఁ బలికెను. దానఁ జలింపక చిత్రాంగి "జీవితేశ్వరా! నాకు మీచరణసేవకన్న వేఱొకకార్య మేమున్నది? చాలా రాత్రి యైనది. వీరపాలుఁడు బోయయువకునితో నీరేయికి రాఁడని తోఁచుచున్నది. వ్యర్థముగ నిద్రమానిన దేహమునకు నస్వస్థత కలుగునేమో! శయనాగారంబులోని కేగుదము రండు." అని ప్రేమపూరితదృగ్వీక్షణంబుల వానిపైఁ బరగించెను. మహారాజు కళత్రద్వితీయుండై శయ్యాగృహంబులోని కేగెను.

*   *   *   *   *   *

తెల్లవాఱినది. మహారాజు మంగళతూర్యనాదంబులతోడను వందిమాగధుల విజయపాఠరవంబులతోడను మేల్కాంచి ప్రాహ్ణకృత్యంబుల నిర్వర్తించి యథావిధిగ దర్బారున కేతెంచి రత్నఘటితకనకసింహాసనంబుపైఁ గూర్చుండెను. మంత్రిభటసామంతులెల్లఁ దమతమనియమితస్థానంబుల నలంకరించిరి. అంత దేవిడీయొక్క ప్రాంగణంబున నెద్దియో కోలాహలము వినవచ్చెను. అదేమని మహారాజడుగుచుండ ముప్వరాశ్వికులు వచ్చి సింహద్వారమునొద్ద గుఱ్ఱములను దిగిరి. "వీరపాలమహారాజచంద్రమునకు జై" అను స్తుతినాదము మహారాజు చెవిని బడియెను. మహారాజత్యుత్కంఠముతో వేచి

యుండ నామువ్వురను దర్బారులోని కేతెంచి- మహారాజునకు నమస్కరించిరి. మహారాజు "నాయనా! నిన్ను సురక్షితునిగఁ దిరుగఁదీసికొనివచ్చి నాకుఁ గనఁబఱిచినపరమేశ్వరునకు నమస్కరించెదను. కుమారా! నీ కీబోయయువకుఁ డెట్లు లభించె? నీయుద్యమం బింత కాలము పట్టుటకుఁ గారణ మేమి? సవిస్తరముగఁ దెలుపుము." అని యడిగెను. వీరపాలుఁడు తాను వెంటఁగొని రానెంచిన బోయయువకుఁడు సుదర్శనమహారాజుగారి యాస్థానవైద్యుఁడగు వీరధన్వి యను నొక కిరాతునిపుత్రుఁ డని విని హేలాపుర మేగుచుఁ దోవలోఁ జోరులచేఁ గారాగారబద్ధుఁ డైనది మొదలు పుష్పగిరిసమీపంబునఁ జోరులచే ఖడ్గక్షతుండై పడిపోయి బోయయువకునిచే రక్షింపఁబడినంతవఱకును లలితకును దనకును గల ప్రేమబంధంబును వెల్లడింపకుండఁ దెలిపి "తండ్రీ! ఎల్లయెడల నన్నుఁ గంటిని ఱెప్పవలెఁ గాచి రక్షించుచున్న నా రక్షకదేవతయగు నీబోయయువకుని వాల్లభ్యలకటాక్ష మెంత కాలము నాపైఁ బ్రసరించునో నే నంత కాలమును సురక్షితుండనే యని నమ్ముఁదు." అని యాబోయయువకుఁడు తనను బ్రదికించినవిధ మెఱిగించి యాశ్వికభటునికిఁ జూపి "తండ్రీ! నే నట్లు పునరుజ్జీవితుండనై యీవీరపురుషునితో నియ్యెడకు రా నెంచుచుండ నీయాశ్వికుఁ డెటనుండియో హుటాహుటి మాయొద్దకు వచ్చి బోయయువకునిఁ దాను తమసన్నిధికిఁ దోడ్కొనిపోవలసిన దనియు నే నెద్దియో కార్యావసరముపై నామేనమామ యగు కామపాలుని యొద్ద కేగవలసిన దనియుఁ దము రాజ్ఞాపించి రని వచించె. ఆమాట వినినంతనే మొదటనే నిరుత్సాహుండ నయ్యుఁ దమయాజ్ఞాచిహ్నము లెవ్వియుఁ జూపింపకపోవుటచే వానిమాటలను విశ్వసింపఁజాలక యది యెద్దియో ద్రోహబుద్ధితోఁ బన్నినపన్నుగడ యని భావించి వీనినిగూడ వెంట నిడికొని యియ్యెడకు వచ్చుచుండ నే ననుకొనినట్లే త్రోవలో నేఁబదిమంది యాశ్విక

భటులు ఖడ్గపాణులై మమ్ముఁ జుట్టికొనిరి. తత్క్షణమే యీద్రోహి నా కొఱకు భయపడుచున్నట్లు నటించుచు నాసంగతి తమ కెఱింగించుమి షపైఁ బాఱిపోవనెంచెను. ఆయత్న మెఱింగి బోయయువకుఁడు వీనిని బట్టి బంధించి యామువ్వురభటులతో నొకగంట యతిభయంకరం బుగ యుద్ధ మొనర్చెను. ఆరిపువీరులలోఁ బెక్కండ్రు హతులైరి. హత శేషులు పలాయితులైనపిదప వారలనుగుఱించి మే మెన్నివిధములఁ బ్రశ్నించినను వీఁడు మారుమాటాడనందున వీనినిఁగూడ తమసన్ని ధికిఁ దోడ్కొనివచ్చితిమి" అని పలికెను.

ఆవృత్తాంతము వినినంతనే చంద్రశేఖరుఁడు రోషకషాయితా క్షుండై బంధితుఁడైన భటునిఁజూచి "ఓరీ! రాజద్రోహి! మావీర పాలునితో నట్లు చెప్పవలసినదని నిన్నెవ్వ రాజ్ఞాపించిరి? నిజము చెప్పు ము. అసత్యమాడితివేని నీశిర స్సిప్పుడే ఖండించెదను. నిక్కవముచె ప్పితివేని నిన్ననుగ్రహించెదను" అని పలికెను. అందుపై నా భటుఁడు గజగజ వడంకుచు "మహారాజా! నాకుఁ దలతిరుగుచున్నది. కనులు పచ్చబడుచున్నవి. ఇప్పుడు నే నేమియు మాట్లాడఁజాలను. అనుగ్రహింపుఁడు" అని పలికెను. అందుపై మహారాజు కోపోదగ్రుం డై చివాలున గద్దియనుండి లేచి వరనుండి ఖడ్గమును దీసి వానిని ఖం డింప నుద్యుక్తుఁ డయ్యెను. వీరపాలుఁడు తండ్రిని శాంతింపఁజేసి "జన కా! ఈదుర్మార్గుని సంహరించినందువలన మన కేమిలాభము? వీని సాహసకృత్యమువలన నెద్దియో ప్రబలమైన రాజద్రోహతంత్రము నిగూఢంబుగ జరుగుచుండె నని నాకు గొప్పయనుమానము కలుగు చున్నది. ఈబోయయువకుని నాయొద్దనుండి విడఁదీసి వాని నొంటిపా టుగ శత్రువుల కొప్పగించుతలంపుతో నట్టిపన్నుగడఁ బన్నియుండు ట ద్రోవలో శత్రువులు వచ్చి మమ్ము మార్కొనుటచే నిరూఢంబగు చున్నది. కావున నయముననో భయముననో వీనివలన నిజమును

దెలిసికొనుట ముఖ్యకర్తవ్యమని నాయభిప్రాయము. తరువాతఁ దమ చిత్తము" అని పలికెను. "మహారాజా! ఆశాబద్ధుఁడై యజ్ఞానవశంబున రాజద్రోహుల దురుద్యమంబుల కొక్కింత సహకారియైనంతమాత్రమున నిజవృత్తాంత మెఱుంగకుండ నీభటుని రాజద్రోహిగ నెంచి వధించుట న్యాయమా? యువరాజుగారి యభిప్రాయము రాజనీతియుతంటఁగ నాబుద్ధికిఁ దోఁచుచున్నయది" అని వీరపాలునియభిప్రాయమును బోయయువకుఁడు బలపఱచెను. ఆమాటలు విని మహారాజు శాంతించి పార్శ్వవర్తులగు భటులతో "భటులారా! మీ రీనిరాభాగ్యునిఁ గొనిపోయి యేకాంతకారాగారంబున బంధించి జాగ్రత్తగ ఘారాయుంచి రండు" అని యాజ్ఞాపించెను. భటు లట్లుచేయ నాభటునిఁ దోడ్కొనిపోయిరి.

తరువాత మహారాజు బోయయువకునిఁ జూచి "నాయనా! నీ మహోదారవీరచరితంబులు వినినకొలఁది నీ వీకోసలరాజవంశోద్ధరణకై యవతరించిన మహాపురుషుఁడవు గాని కిరాతుఁడవు కావని తోఁచుచున్నయది. నీతల్లిదండ్రు లెవరు? నీనివాసం బెద్ది? నీవృత్తాంత మేమో నాకు సవిస్తరముగ నెఱింగించి కర్ణోత్సవ మొనరింపుము" అని సాదరంబుగఁ బలికెను. అందుపైఁ బ్రతాపసింహుఁడు సవినయంబుగ "మహారాజా! నాతల్లిదండ్రు లెవ్వరో నే నెఱుంగను. నేను సుదర్శన మహారాజుగారి యాస్థానవైద్యుఁడును గిరాతకులజుండును నగు వీరధన్వనే తండ్రిగ భావించి వానియొద్దనే యింతవఱకును బెరిఁగి ధనురాద్యాయుధవిద్యల నభ్యసించితిని. నేజన్మించినపిదప నాతల్లి పరలోకగతయయ్యె ననియు నాఁటనుండియు నే నావీరధన్వచే సాఁకఁబడుచుంటిననియు నంతియేగాని నేను బోయకులజుఁడను గాననియు నాజన్మవృత్తాంత మతినిగూఢమైనదనియు నాచే యమునానదీవిప్లవమునుండి రక్షింపఁబడిన యిందుమతి యను నొకవృద్ధవనిత యొకప్పుడు సుద

ర్శనమహారాజుగారితోఁ జెప్పుచుండ వినియుంటిని. ఇంతియే నే నెఱింగిన నిజవృత్తాంతము” అని సవినయంబుగఁ బలికెను. ఆమాట లు వినినంతనే మహారాజుహృదయము జల్లుమనియెను. అత్యుత్కలిక చే వివశుం డగుచు నొక్కింత యొల్లంబోయి వెంటనే తెలివిఁ జెంది ప్రతాపసింహునితో గద్గదస్వరంబున “నాయనా! ఇప్పుడు నీ నిజవృత్తాంత మొక్కింత నాకు స్ఫురించుచున్నయది. సర్వాంతర్యామియగు పరమేశ్వరుని చేష్టలు లవిమృశ్యంబులు. తగునిదర్శనములు లేకుండ నామనోగతాభిప్రాయంబును వెల్లడింప వలనుగాకున్నయది. ఎల్లి తగుప్రయత్నములు గావించెదను. అంతవఱకు నీవు ప్రయాణబడలిక ను దీర్చికొనుటకై పోయి విశ్రాంతిఁ జెందుము. నాయనా! వీరపాలా! నీ వీపురుషునికి సహకారివై మజ్జనభోజనాదిసత్కారంబులనెల్ల నెఱవేర్పుము” అని పలికెను. “మహాప్రసాదము తండ్రీ!” అని వీరపాలుఁడు తన్ద్రిని వీడ్కొని బోయయువకునితో నిష్క్రమించెను.

మహారాజారోజుకు దర్బారు చాలించి “ఓభగవానుఁడా! ఉపరిపీఠిఁ జరుచున్న నామనోరథమును దయామయుండవై గమ్యస్థానమునే చేర్చెదవో నన్ను నిర్భాగ్యునిగఁ జేయ నధోగతిపాల్సేసెదవో తెలియరాకున్నయది” అని సింహాసనము నుండి లేచెను. అందలి పౌరభటభృత్యామాత్యసామంతనికురుంబంబు లేచి నిలువంబడి యుండిరి.

ఆసమయముననే యొకయాశ్వికుఁడు దర్బారులోని కతిసంభ్రమంబుగ వచ్చి మహారాజుమ్రోల సాష్టాంగ మెఱఁగి లేచి “మహారాజా! సుదర్శనమహారాజుగారు మీచేతి కిమ్మని యీలేఖ నొసంగిరి. చిత్తగింపుఁడు” అని యొకలేఖను చంద్రశేఖరున కొసంగెను. మహారాజద్దానిఁ గైకొని విప్పగా నందులో మఱియొకలేఖ యిమిడియుండెను. అ ది ట్లు వ్రాయఁబడి యున్నది:—

"మహారాజశ్రీ కోసలరాజ్యరమామనోహరు లగు చంద్రశేఖరమహారాజుగారి సన్నిధికి:—ఏలినవారి శ్రేయోభిలాషి యగు సుదర్శనుఁడు వ్రాయు విజ్ఞప్తి. మహారాజా! ఇంతకుముం బంపిన లేఖావిషయంబులవలనఁ గామపాలునకును మీభార్య యైన చిత్రాంగీ మహారాణికిని మధ్య నెవ్వియో రాజకీయరహస్యతంత్రములు జరుగుచున్నట్లు వెల్లడియగుచున్నయది. మన యిర్వురకును మహోపకారి యగు ప్రతాపసింహునిపై నాయిర్వురకు నంత కార్పణ్యము కలుగుటకు హేతు వేమో తెలియకున్నయది. నన్ను నిర్జింపఁగోరి శూరసేనుఁడును గామపాలుఁడు నాపై యుద్ధమునకు బయలుదేఱుచున్నారు. నేనును రణసన్నాహములో నే యున్నాను. ఇట్లు,

సుదర్శనుఁడు."

ఆయుత్తరముల రెంటిని జదివినంత నే మహారాజునకు మితిలేని కోపము వచ్చెను. తనమనంబు నావరించియున్న సంశయజీమూతపటలంబున కాలేఖావిషయంబులు ఝంఝామారుతంబు లయ్యెను. వెంటనే సేనానాయకుని బిలిపించి మఱునాఁ డరుణోదయంబునకుఁ జతురంగబలంబును యుద్ధసన్నద్ధంబుఁ గావింపు మని యాజ్ఞాపించి యంతఃపురంబున కేగెను.

ఈసమావేశవృత్తాంతమంతయు మేడపైనుండి చూచుచున్న చిత్రాంగి యాలకించుచునే యుండెను. ప్రతాపసింహుని మాటలు విని నంత నే యామెగుండెలు బ్రద్దలయ్యెను. మోము వెల్లనయ్యెను. పెదవులు తడియారి నోట మాట రాకుండెను. దేహము కంపించుచుండెను. చూపులు తీక్ష్ణవహియెను. కొంతతడవు పిడుగువడిన చాతకంబుకైవడి నోడ లెఱుంగక పుడమిపయిం బడి మఱలఁ దెప్పరిల్లి లేచి తనశయ్యాగృహంబున కేగి పానుపుపై బోరగిలఁ బరుండి వెక్కి వెక్కి యేడువసాగెను. అంత వాసంతిక వచ్చి యామె నోదార్చుచుండెను.

చెలికత్తియమాటలు చిత్రాంగి చెవుల కెక్కుటయే లేదు. "ఇంతతటస్థించునని యెఱుఁగక సకలకార్యనిపుణుం డని నమ్మి నాయన్న పేర నంతగట్టిగ వ్రాసితిని. నాదుష్టగ్రహమైన యీయువకుని నాతఁడు బంధింపలేకపోయెను. వాని నెన్నుపై మత్స్యాకారమగు పుట్టుమచ్చను మహారాజు చూచెఁగాఁబోలు! నాసందేశహరుఁ డగుభటుఁడు కారాగృహబద్ధుఁడై యుండె. ఏమి సేయుదును? ఇప్పుడు సుదర్శనుఁ డంపిన లేఖ నేను వ్రాసిన లేఖావిషయమై యుండదుకదా! అట్లైనచో నేఁటితో నాయాశలన్నియు నిరాశ లగుటయే గాక నాజీవితము గూడ నంతమగుట నిశ్చయము. కానిమ్ము. "యావజ్జీవమ్ తావత్సికిత్స" యనునట్లు నాకంఠమునఁ బ్రాణము లున్నంతవఱకుఁ బట్టినపట్టు విడువక "యశోవా మృత్యుర్వా" యని పనిచేసెదను." అని వాసంతికను జూచి "చెలీ! వాసంతికా! మందారకు నతిరహస్యముగ నిటకుఁ దోడ్కొ రమ్ము" అని చెప్పెను. వాసంతిక వల్లె యని పనివినియెను.

రాత్రి రెండుయామములైనది. ప్రతాపసింహుఁడు కడచిన రేయెల్ల నిద్రలేకుండుటచేతను రణపరిశ్రాంతిచేతను చంద్రశేఖరుఁడు పలికిన తనభావిభాగ్యోదయసూచకంబులగు పలుకులచే సుస్వప్న సుఖాంభోనిధి నోలలాడుచు నొకవిశాలభవనములో గాఢముగ నిద్రించుచుండెను. అంత నిరువురుచోరులు నల్లనిముసుఁగులతో నా నికివచ్చి చిన్నసీసాలోనిద్రవముచే జేబురుమాలును దడిపి ప్రతాపసింహుని నాసికారంధ్రములపై నొక్కింతతడ వుంచి దాన నాతఁడు మిక్కుటంబుగ మత్తుగొనియుండుటఁ దెలిసికొని వాని కరచరణంబులను బంధించి మూఁపున నిడికొని యమునానదీతీరమున కేగి యొక యున్నతప్రదేశమునుండి వాని నానదిలోఁ బడవైచిరి. నీటిలోని చప్పుడు వినఁబడినంతనే చోరులు వెడలిపోయిరి.

అరుణోదయ మైనది. చైత్రయాత్రారంభసూచకంబుగఁ బ్రస్థానభేరీ మ్రోఁగఁదొడంగెను. మహారాజు బోయయువకునిఁ దోడ్కొని రమ్మని వీరపాలు ననిపి తాను రణోత్సాహపూరితుండై ప్రయాణసన్నాహంబుఁ గావించి చిత్రాంగియొద్ద కేగి "ప్రియా! పరమకృతఘ్నురాలగు నీదాసీ యింనుమతిని సుదర్శనుండు చెంతఁ జేర్చి యాదరించుచుండె నని తెలియవచ్చుటచే వానిని శిక్షింపఁగోరి నే నిప్పుడు హేలాపురముపై యుద్ధమున కేగుచున్నాను. తిరుగ నాదుర్మార్గురాలి నీచోటికిఁ దోడ్కొనిరమ్మనెదవా?" అని సాదరంబుగఁ బలికెను. చిత్రాంగి నివ్వెఱఁగంది లోలోన సంతసించుచుఁ "ప్రాణేశ్వరా! నాప్రణయుని దానులగు తమకు నాపై నిండుప్రేమ కలదనుటకు మీ రింతటి దారుణోద్యమంబును నాకొఱకుఁ బూనుటయే నిదర్శనము. అయిన నాదుష్టజరభి సుదర్శనునియొద్దనున్న మన కేమి యమునియొద్దనున్న మన కేమి? ప్రభువులకు రానివారిని బిలువ వేడుక కాఁబోలు! మీచిత్తమువచ్చినట్లు చేయుఁడు. మీకు జయమగుఁగాక" అని పలికెను. చంద్రశేఖరుఁడు వెలికి వచ్చెను. ప్రతాపసింహుని రాకకై నిరీక్షించుచుండెను.

అంత వీరపాలుఁడు దీనవదనుఁడై వచ్చి "తండ్రీ! బోయయువకుఁడచ్చటను గానరాఁడయ్యె. వాని కేవిధంబుననో హానివాటిల్లియుండునని తలంచుచున్నాను" అని పలికెను. ఆమాట వినినంతనే మహారాజుగుండె బ్రద్దలయ్యెను. "ఏమేమీ! ప్రతాపసింహుఁడు కనుపించనిచో మన కీయుద్ధముతోఁ బనియేమి? భటులారా! నేఁటి కీప్రయత్నము జగించి మీరందఱు నానాముఖంబుల బయలుదేఱి ప్రతాపసింహునిజాడ నరయుఁడు" అని పలికి మరల నిజాంతఃపురంబున కేగెను.

శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## పదుమూఁడవ ప్రకరణము.

ఉ. తాను దలంప నొక్కటి విధాత మఱొక్కటిఁ దలంచు మానవుం
డూనిన కార్యసిద్ధికిఁ గడు నద్ధతిమైఁ బని సేయుచున్నఁ గా
లానుగతిం దటస్థ మగునట్టివిపత్తుల నంతరాయ మై
దైవ ఘటిల్లినన్ ఫలము నందు నతండు మఱొక్కరీతిగన్.

రాత్రి రెండుయామములు దాఁటినది. యామినీకాంత గాఢనిద్రాముద్రితయై యుండెనో యన నెల్లయెడల నిశ్శబ్దముగ నుండెను. గగనలక్ష్మి నిర్మలమై నిర్మేఘమై యుండుటచే ధవళపుష్పవికీర్ణంబైన నీలాంబరవితానంబో యనఁ దారకాగణసముచితంబై శోభిల్లుచుండెను.

అట్టినిశీథినీసమయంబున యమునానదిలో బెస్తలు కొందఱు చేఁపలను బట్టుటకై యానదియిరుకూలంబుల వలలను బన్నియుంచి వేఁటనావల నదీగర్భంబున సంచరించుచుండిరి. అంత మధురాపురతీరమున గుభుల్లను శబ్దము వినిపించినతోడనే యెద్దియో పెద్దచేఁప పడియె నని తలంచి బెస్త లత్యుత్సాహముతో నాదిక్కున కేగి యాదిక్కునఁ బన్నియుంచిన వల నతికష్టముగఁ బైకి లాఁగిరి. ఆజాలమునం దొకపురుషుఁడు బంధితుఁడై చిక్కియుండుటఁ దెలిసికొని వెంటనే వానిని వలనుండి పైకిఁ దీసి వానిమేనఁ బ్రాణము లుండెనో లేదో యని పరీక్షించిరి. వానికలేజ మింకను బనిచేయుచుండుటఁ దెలిసికొనఁజాలక చనిపోయియుండు నని భావించి యతివేగంబున నవలిగట్టుపైఁ జేర్చి యచ్చో విడిచి వెడలిపోయిరి.

అప్పుడే ప్రతాపసింహునకు మత్తు వదలెను. కొంచెము తెలివి వచ్చి కనులు తెఱచి చూచెను. తనయునికియుఁ దనకొదవిన విపత్తు ను దెలిసికొనియెనుగాని యందుకుం గలకారణ మెఱుంగలేకుండెను. "ఓహో జగద్రక్షకా! ఆపద్బాంధవా! దిక్కులేని దీనుండ నగు నాపై నీకరుణామృతంబును వర్షించి నన్నుఁ బునరుజ్జీవితునిఁ గావించి తివి. నీయనంతదయ నే నెంతని కొనియాడుదును. నీసంకల్పంబు లవిమృశ్యంబులు." అని నిమీలితనేత్రుండై భగవంతుని భక్తిపూ ర్వకముగ ధ్యానించి మెల్లన లేచి పుష్పగిరిమార్గాభిముఖుండై బయ లుదేఱెను.

అట్లు బయలుదేఱి ప్రతాపసింహుఁడు తనలో "మధురాపుర ములో నన్నుఁ జంపఁగోరు శత్రువు లెవ్వరుందురు? మహారాణీచిత్రాం గిమాత్రము నాయందొకింత యసూయ కలిగియున్నదని వీరపాలు నిచే నెఱింగితిని. ఆమెయే తనకింకరులచే నీదారుణకృత్యమును జే యించెఁగాఁబోలు. తనకంటికిఁ బ్రాణము గాచుటకు నేనామె కేమి యుపకార మొనరించియుంటిని? ఆమె కామపాలుని యనుంగుచెల్లెలు కాదా? అదియునుగాక యిందుమతియుదంతంబును బట్టియుఁ జంద్ర శేఖరమహారాజు నామెడలఁ జూపిన యవ్యాజప్రేమగౌరవంబులను బట్టియుఁ జిత్రాంగి యొనరించిన యీదారుణకృత్యమును బట్టియు నా కాదిని గలిగినయనుమానము మఱింత బలపడుటచే నామనం బత్యు త్కలికఁ జెందుచున్నయది. ఎట్లైనను నానిజస్థితి నెల్లడియగువఱకు నేను ప్రచ్ఛన్నవృత్తి సంచరించెదను." అని తలపోసికొనుచుఁ బుష్ప గిరిపరిసరంబుఁ జేరెను.

అప్పటి కరుణకిరణుండు ప్రాగ్గిరిశిఖరం బలంకరించెను. పుష్ప గిరిలో రణసన్నాహసంరంభకోలాహలము మిన్నంటుచుండెను. ఒక వంక నాళీకదళంబులు చెరలాడుచుండెను. వేఱొకయెడ గజయూ

ధంబులు బృంహితధ్వానంబుల సంచరించుచుండెను. ఒకచక్కి మత్త మహిషకదంబము శతఘ్నిశకటంబుల లాగుచుండెను. ఒకకేడ్వఁ గాల్బలంబులు నేలయీనినపోల్కి సతూర్యగర్జితంబులై ఖడ్గాదిసాధనంబులు గైకొని యనేకదళంబులుగ నేర్పడుచుండెను. ఆయార్భాటంబునకుఁ గారణ మేమైయుండునో యని యోజించుచుఁ బ్రితాపసింహుఁడు తన కభిముఖులై వచ్చెడుపౌరజనసంభాషణంబులవలన శూరసేనుఁడు కామపాలునితోఁగూడి సుదర్శనునిపై దాడివెడలుచుండిరని తెలిసికొని యతిత్వరితంబుగ హేలాపురంబుఁ జేరవలయు నను తలంపుతోఁ బయలుదేఱెను.

పుష్పగిరిలో రణసన్నాహ మంతయుఁ బూర్తియైనది. చైత్రయాత్రారంభసూచకంబుగఁ బ్రస్థానభేరి మ్రోఁగింపఁదొడంగిరి. శూరసేనుఁడు లలితను వెంటనిడికొని మరల మేడపై కేగెను. అం దిరువురుఁ గుర్చీలపై నభిముఖంబుగఁ గూర్చుండిరి. శూరసేనుఁడు లలితను సాదరంబుగ నవలోకించి "కుమారీ! నీ కాచోరులవలనఁ గలిగిన యిక్కట్టులన్నిటికిని సుదర్శనుఁడు ముఖ్యకారకుఁ డని తెలిసికొనుము. ఆదుర్మార్గుఁడు కేవలము పయోముఖవిషకుంభము సుమా! ఆగోముఖవ్యాఘ్రమే చోరులకు ముఖ్యపోషకుఁ డని నాకుఁ దెలియవచ్చినది. నీతల్లి గతించినపిదప వానినిజవృత్తాంతం బెఱుంగక జనశ్రుతిని బట్టి భ్రమఁజెంది వానికొమరితయైన చంద్రికళ నాకు భార్యగ నొసంగుమని వానికి వర్తమాన మంపితిని. దుర్గర్వోపహతుండగు నాఖలుఁ డందు కిచ్చగింపఁడయ్యె. ఈమధ్య నాకన్నియ నెవ్వరో బలాత్కారముగఁ గొనిపోవయత్నించి విఫలమనోరథులైన విషయమును నీవు వినియే యుంటివి కదా. ఆతుచ్ఛతరకార్య మొనర్చినది నేనే యని భావించి నాపైఁ గసిదీర్చుకొనుటకై తనమిత్రులైన చోరులచే నాతఁ డట్టిదారుణవిపత్తును నీకుఁ గలుగఁజేసె. దైవానుగ్రహమున నీవు నాకు మర

లఁ దక్కితివి. లేకున్న నాగతి యేమికావలయు? ఆసంగతి నాకు నిహా షంబుగఁ దెలియవచ్చినది. ఆహేతువుచే నే నిప్పు డాద్రోహిని శిక్షిం చుపొంటు వానిపై దాడివెడలఁ దలంచితిని. ఈమారణకర్మంబునకు వివేకసంపన్నుండును గుణవంతుఁడును రూపవంతుండును నగు నామి త్రుఁడైన కామపాలుని సహాయ మపేక్షించి యున్నాను. ఆపీరుని సహాయమువల్లనే కదా వంగరాజ్య మంతయు స్వాధీనముఁ జేసికొనఁ గల్గితిని. ఆతండు చిరకాలమునుండి నీయందు బద్ధానురాగుండై యు న్నవాఁడు. నీకు నాయందుఁ గల పితృభక్తి యపార మని యెఱింగియు న్నవాఁడనగుటచే నాయభిప్రాయంబునకు నీవు వ్యతిరేకింపవని నమ్మి యుద్ధానంతరమున జయలక్ష్మి నన్ను వరియించినచో నాభాగ్యలక్ష్మి వైన నిన్ను వానికిచ్చి వివాహముఁ జేయుట కంగీకరించి మాట యిచ్చి యుంటిని. తల్లీ! నీవు నాకు మాటదక్కించి నాగౌరవమును గాపాడె దవని నమ్ముచున్నాను" అనిపలికెను. ఆమాటలు విని లలిత నిర్విణ్ణు రాలయ్యెను. వెలవెలఁబోవు లేటమొగంబుతో జిచ్చవడిన చూపుల తో మాటాడలేక నిట్టూర్పువిడుచుచుఁ గొంతతడ వూరకుండి "తండ్రీ! చోరులకు ముఖ్యస్నేహితుఁడు కామపాలుఁడు గాని సుదర్శనుఁడు కాఁ డు. నాపైఁగల నిరర్థకమోహంబున నన్ను బలాత్కారముగఁ జేపట్టఁ దలంచి కామపాలుఁడే తనమిత్రులైన చోరులచే నన్నట్లు చెఱసాల బంధింపఁజేసె. చోరుల కాతఁ డిరువదివేలరూపాయ లందుకుఁ బారి తోషికంబుగ నిచ్చియుండుటఁ జోరులసంభాషణమువలన నేను తెలిసి కొంటిని. ఆతఁడే చంద్రికళనుగూడ నన్నుఁజేసినట్లే చేయుటకు య త్నించి విఫలమనోరథుఁడయ్యెనఁట. మీరా రావంచకునిమాటలను నమ్మి మోసపోవుచున్నారు" అని పలికెను. ఆమాటలు విని శూరసేనుఁడు కినుక నభినయించి "లలితా! నా కమర్యాద సేఁదలంచితివా? కన్న తండ్రినని నన్ను గౌరవింపఁదలంచితివేని నాకు మాట దక్కింపుము"

అని పలికెను. అందుపై లలిత "తండ్రీ! నా కొక్కనిముషమైన గడు విచ్చినంగాని నానిరూఢాభిప్రాయం బెఱింగింపఁజాలను" అని పలికెను. "మంచిది. పదినిముషములు గడు వొసంగితిని. నీవు బాగుగ యోజించికొనియే జవాబు చెప్పుము. పితృకార్యనిర్వాహణధురీణవై యశంబుఁ గాంచుము" అని కామసేనుఁడు వెడలిపోయెను.

లలిత తనగదిలోని కేగి క్రిందఁ జతికిలంబడి లోన నత్యూర్జితంబుగ నుప్పతిల్లుచున్న విచారలహరిం జిక్కి మనంబు కలగుండుపడుచుండఁ గొంతతడవు వెక్కి వెక్కియేడ్చి యెట్టకేల కొక్కింత శాంతిఁ గొని "హా! దైవమా! నే నిప్పు డేమిసేయుదును? మాయలమారి కామపాలునిమాటలను నమ్మి నాతండ్రి నన్నాక్రూరమృగంబునకు బలి యివ్వఁదలంచె. నాయిక్కట్టు లన్నిటికి నామర్మార్గుఁడే కారణభూతుఁడని యెంతచెప్పినను నామాట వినఁడయ్యె. కానిమ్ము. నాతండ్రి నన్నుఁ గనిపెంచుటచే నాబాహ్యదేహ మొరుల కొసంగుటకే యధికారము గలదు గాని నాయంతరాత్మ నొసంగుటకు వాని కేమియధికారము గలదు? నే నద్దాని నిదివఱకే యొకనికిఁ గైంకర్య మొనర్చి యుంటిని. అయ్యో! ఏమిలాభము? స్వార్థపరుఁడును దుర్వ్యసనసంసక్తుఁడును దురాశాబద్ధుఁడును గ్రూరకర్ముఁడు నగు కామపాలుని చేయిఁబట్టి నే బ్రిదుకఁగలనా? దైవమా! నన్ను నీవిలాసకందుకంబుగఁ జేసి యాడించుచుంటివి. అప్పు డావిధంబుగ నొకమహనీయమోహనాకారుని జూపితివి. వానిని మనస్ఫూర్తిగ వరించి తన్మయత్వంబుఁ జెందియున్న నన్నీకిరాతునిపాలు సేయింపఁ దలంచితివి. నన్నట్లు కొండ యెక్కించి యిప్పు డీవిధంబుగఁ గ్రిందః బడఁద్రోయఁ జూచుచుంటివా? నాతండ్రి మాట నుల్లంఘించితినేని పరమకృతఘ్నురాల నగుదును. అనుకూలించితినేని వ్యాఘ్రిబుఁ జేపట్ట నంగీకరించు లేడిపిల్ల నగుదును. నామానప్రాణరక్షకుండును నాచిత్తచోరుండు నగు వీరాధివీరుని మరలఁ జూడ

గలుగుదునా? నే నిప్పు డీదుర్మార్గునకు బలియగుట కిచ్చగింపవలసిన దేనా? అయిన యుద్ధానంతరమునఁ గదా నా కష్టములు వాటిల్లుట! అప్పటి కా నీచుని దుష్టస్వభావము నాతండ్రికిఁ దెలియకుండునా? నా ప్రాణేశ్వరుఁడు నన్నుఁ గాపాడకుండునా? అప్రతిహతం బగు దుర్విధి నా కట్టిదుర్గతియే సంభవించేయెడల నా కొక్కమరణమే శరణము. "హాహా! మదీయమానప్రాణరక్షకా! వీరపాలా! వీరపాలా! ఈ లోకమున బ్రదికియున్నంతకాలము నీపాదపద్మముల సేవించుభాగ్యము నాకు లేకున్నను నా కెన్నిజన్మముల కైన నీవే నాదైవంబవని హృదయపూర్వకముగ నమ్మియున్నదానను. నీకుఁ గైంకర్యమొనర్చిన యీనాదేహము మఱియొకనియధీనము గావలసివచ్చునేని వెంటనే యీపాడుదేహము నగ్నిహోత్రిన కాహుతి గావించి పరిశుద్ధసూక్ష్మదేహముతోఁ బరలోకంబున నీకై వేచియుండెదను." అని కృతనిశ్చయురాలై తిరుగఁ దండ్రియొద్దకు బయలుదేఱెను.

శూరసేనుఁ డట్లు లలితను వీడి యొకవివిక్తప్రదేశంబున కేగి తనలోఁ దా నిట్లు వితర్కింపఁదొడంగెను. "కామపాలుఁడు నా కెంతయో పరమాప్తుఁ డని నమ్మియుంటిని. తనకుఁ గలిగినయిక్కట్టు లన్నిటికిని గామపాలుఁడే కారకుఁ డని నాయనుంగుఁబట్టి చెప్పుచున్నది. అతఁ డెంతదుర్మార్గుఁడైన నంతటిమిత్రద్రోహ మొనర్ప సాహసించునా! వానిని వరించుట కిష్టములేక నన్ను వానియెడల విముఖునిఁ జేయుట కట్లనియె నేమో? చోరులసంభాషణలచేఁ దాను తెలిసికొని నట్లు చెప్పుచున్నది. అది యసత్యమే కావచ్చును. చంద్రికళనుగూడఁ జోరులచేఁ బట్టింపయత్నించిన వాతఁడేనఁట! అది నిక్కువమే కావచ్చును. చోరులకు సుదర్శనుఁడే పోషకుఁడైనచో వానియనుంగు బట్టిని జోరులు పట్టనెంతురా? దుర్నయశీలుఁ డగు కామపాలుఁడే చోరులకుఁ బోషకుఁడై యుండవచ్చును. స్వార్థపరుఁ డగు నామా

యలమూరివలలోను నా ప్రియురా లగుచిత్రాంగివలపుటురులలోను జిక్కి యుద్ధసన్నద్ధుండ నైతిని. రాయబారులసంధియత్నములను భంగ పఱచితిని. ఇప్పుడు నే నామారణకర్మ ముజ్జగించితి నేని పిఱికిపంద నని నన్ను లోకులు నిందింతురు. ఏమైనను సరే! 'యశోవా మృత్యోర్వా' యని యుద్ధమొనర్పక తప్పదు." అని యనుకొనుచుండ లలిత తండ్రిచెంత కేతెంచి "జనకా! యుద్ధానంతరమునఁ గల్లలమూరికామ పాలుఁడు నాకుఁ దగినవరుఁ డని మీకుఁ దోఁచెనేని నే నిదివఱకే మఱియొకనికిఁ గైంకర్యము చేసియున్న నాయంతరాత్మపై మీ కధికా రము లేకున్నను దల్లిపోయిననాఁటనుండియు నల్లారుముద్దుగఁ బెంచిన యీనిరర్థకదేహముపై మీకు సంపూర్ణాధికారము కలదు. కావున మీ రద్దాని నెవరికొసంగినను సరే! నాయభ్యంతరము లేదు. కాని మీ రొసర్చిన నిమేషమునుండియు మీ లలిత భూమిపై నుండ దని నూఁహించ నమ్మియుండుఁడు" అని పలికెను. మహారాజా జామాటలు విని "బిడ్డా! నీయిష్టానుసారమే జరిగించెదను. విచారింపకుము. పొమ్ము." అని సాదరంబుగఁ బలికి మహారాజు యుద్ధమునకుఁ బయలుదేఱెను.

కామపాలుఁ డత్యుత్సాహపూరితుఁడై తనచతురంగబలంబు తో హేలాపురపరిసరంబున కేగి యచ్చో నిగూఢంబుగ సైన్యమంత యు నుంచి తా నొక్కరుండ శస్త్రాస్త్రధారుండై శూరసేనుఁడు నిజవాహి నీసహితుండై యింకను రాకుండుటకు హేతు వేమైయుండునో యని యనుమానించుచు స్వయముగఁ దెలిసికొనుటకై తిరుగఁ బుష్పగిరి మార్గమున వచ్చుచుండెను. అట్లు వచ్చుచుఁ దనదక్షిణపార్శ్వంబునం గల యొకకొండక్రిందఁ గూర్చుండియున్న యొకనూతనపురుషునిఁ జూచెను. ఆపురుషుఁడు మేనంతయు విభూతిఁ బూసికొని పాదములవ ఱకును జీరాడు కాషాయబురకాను ధరించి కంఠమున రుద్రాక్షమాల లు వేసి నెన్నుదుట నళికనేత్రంబునాఁ గుంకుమబొట్టిడి సాష్టాంగప్రణం

డో యన వ్యాఘ్రాజినంబుపై సమాధిస్థు నుండెను. ఆమహానుభావుని సందర్శించి వాని యాశీర్వాదమును వడయఁగోరి కామపాలుఁ డాపరి వ్రాజకునిచెంత కేగి “ఓమహాపురుషా! భూతలంబునం గల మాదృశ పామరజనంబుల యజ్ఞానతిమిరంబు నడంపఁగోరి యవతరించిన దివ్యజ్ఞానప్రభాకరులగు స్వాముల కిదే కుళిందరాజ్యాధిపతి యగు కామపాలుఁడు నమస్కరించుచున్నాఁడు.” అని సాష్టాంగనమస్కారముఁ గావించి లేచి కృతాంజలియై వానిమోల్రి నిలఁబడియెను.

సన్యాసి ధ్యానమగ్నత నొక్కింతతడవు నిమీలితనేత్రుఁడై యుండి పిదపఁ గనులు తెఱచి కామపాలుని వీక్షించి కోప మభినయించుచు “ఓరీ దుర్గర్వోపహతకా! ఎవఁడవురా నీవు? సర్వసంగపరిత్యాగులమగు మాయొద్దకు రాఁ గతం బేమి? మా సమాధిభంగముఁ గావించితివి కలుషాత్మా!” అని కఠోరంబుగఁ బలికెను. కామపాలుఁడు భీతచిత్తుఁడై తనలో “నీమహానుభావుఁడు తనసమాధిభంగముఁ గావించితి నని నాపై నాగ్రహోదగ్రుం డయ్యె. శపించునేమో కదా!” అని గజగజ వడంకుచు “స్వామీ! నాయపరాధములను క్షమింపుఁడు. సర్వేంద్రియనిగ్రహులగు తముబోటి మహానుభావులు పిపీలికపైఁ జండాస్త్రయుధ మన్నట్లు పామరుండ నగు నాపైఁ గినియఁదగునా? నేను కుళిందదేశాధిపతి యగు కామపాలుండను. తమమహదాశీర్వాదంబును వడయఁగోరి తమచరణసన్నిధి కేతెంచితిని. నన్ననుగ్రహింపుఁడు” అని మరల సాష్టాంగ మెఱఁగి లేచెను. అందుపై సన్యాసి ప్రసన్నవదనుఁడై “వత్సా! నీకు మాయాశీర్వాద మేల కావలసివచ్చె?” నని యడిగెను. అందుకుఁ గామపాలుఁడు “మహానుభావా! తమరు సర్వసంగపరిత్యాగు లయ్యు నెల్లయెడల సంచరించుచు సమస్తవిషయంబులను బ్రజ్ఞాదక్షులై తెలిసికొనుచు సభక్తి నాశ్రయించువారి కోరికల నవ్యాజకరుణ నెఱవేర్చుచుందురు. భూతభవిష్యద్వర్తమానవిష

యపరిజ్ఞానచణులగు తమ కెఱుఁగరాని పెుదును గలుగనేరదు. స్వామీ! నే నిప్పు డొక్క కార్యమునకై కడంగి యద్దానిపరిణామ మెట్లుండునో ముందు తెలిసికొనఁగోరి తమ చెంత కేతెంచితిని. నేఁ దలంచిన కార్యములన్నియు జయప్రదముః లగునటుల న న్నాశీర్వదించి కృతార్థునిఁ జేయఁ బ్రార్థించెదను" అని సవినయంబుగఁ బలికెను.

ఆమాటలు వినినంతనే సన్యాసి దరహసితముఖుండై సమాధి మగ్నుండునుంబోలె నిమీలితనేత్రుండై తనలో "నీదుర్మార్గుఁడు నన్ను గుర్తింపలేకపోయె. వీని తుచ్ఛతరోద్యమములన్నియు జయప్రదములు కావలయునఁట! ఆకార్యము లెవ్వియై యుండునో? నేను పంచత్వంబు నొందుటయుఁ, దా నూనిన మారణకర్మంబున జయము కలుగుటయు, లలిత తనకుఁ జేఁజిక్కుటయునై యుండవలయును. ఈమూఁడు కోరికలును నెఱవేఱునవి కావు. అట్లని వీని నిరుత్సాహపఱుప నేల?" అని యొక్కింత యాలోచించి కామపాలునితో "బాల్జ! నీవు కేవలము స్వార్థాభిలాషివై బలవంతుఁడైన మిత్రుసాహాయ్యమును బురస్కరించికొని శత్రుజిగీష నొకమారణకర్మంబునకుఁ బూనియుంటివి. ఒకసారి గెలిచినపందె మన్నిసార్లును గెలుచుట దుర్ఘటము. నీ విప్పట్టున మిత్రులని భావించుచున్నవారందఱును శత్రువులే యని తెలిసికొనుము. నీవు చేసినప్రయత్నము లన్నియు విఫలములయ్యెనే కాని యొక్కటియు సఫలము కాలేదు. నీవు నీయాప్తమిత్రులసహాయముచేఁ బట్టితెచ్చి పంజరములో నుంచిన రాచిలుక కాలవశంబున నెగిరిపోయె. నీవుచంపఁదలంచిన యొకపురుషుని యమునానదిలోఁ ద్రోయఁబడియె. కాని ప్రశ్నసమయప్రభావముచే నాతఁడు మరణించియుండలేదని యే తోఁచుచున్నది. నీగోచారమును బట్టి నీవు పూనిన ప్రస్తుతోద్యమంబునఁ గృతార్థుఁడ వయ్యెదవనియే తోఁచుచున్నయది. నీకశుభమగుఁ గాక పొమ్ము." అని తనకుడిహస్తము నెత్తివాని నాశీర్వదించిన

ట్లభినయించెను. కామపాలుఁడు విస్మయానందంబుల యతిప్రవరునకు నమస్కరించి వెడలిపోయెను.

సన్న్యాసి వెంటనే యచ్చోటు వీడి హేలాపురపరిసరంబునఁ గల యొకపాతదేవాలయంబుఁ జేరెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## పదునాలుగవ ప్రకరణము.

చ. విలసితరాగసంపద సువిశ్రుత మా పితృభక్తి నైజవ
త్సలతఁ బ్రతాపశీలవిలసద్గుణయుక్తి దయాప్రసక్తి ను
జ్జ్వలతరకీర్తి నామృలత చందము శౌర్యము సౌకుమార్యమున్
గలిగి వెలుంగుచుందురు జగంబున వీరలతాంగు లెప్పుడున్.

ఒకనాఁడు ప్రాతఃకాలమున హేలాపుర మంతయు రణసంరంభ విజృంభణంబులఁ గోలాహలముగ నుండెను. ఏవంకఁజూచిన నాయుధ పాణులగు భటులు వీరాలాపము లొనర్చుచుఁ జెరలాడుచుండిరి. కోట బురుజులపై నరుణపతాకము లుదయభానుబింబంబుల విడంబించుచుఁ జెన్నలారుచుండెను. రథనేమీనిస్వనంబులును హయహేషాధ్వనులు ను గజబృంహితధ్వానంబులును జెవుల బధిరీభూతంబులఁ గావించుచుం డెను. శిల్పులు ప్రాకారకుడ్యంబుల శిథిలం బగుభాగంబుల మరల దృఢముగఁ గట్టుచుండిరి. ఏయెడఁజూచిన స్త్రీపురుషాదు లాబాలగో పాలము రణోత్సాహపూరితు లైయుండిరి.

జాముప్రొద్దెక్కువఱకును సుదర్శనమహారాజు శయ్యాగృహము నుండి వెలికి రానేలేదు. అతఁడునిద్రించుచుండెననియు నేకారణముచేత నో మేల్కొనకుండెననియుఁ బౌరు లనుకొనుచుండిరి. కాని మహారా జునకు రేయెల్ల నిదురయే లేదు. ప్రతాపసింహునియెడలఁ గృతజ్ఞతాబ ద్ధుం డగుటయేకాక చిత్రాంగి కామపాలునిపేర వ్రాసిన లేఖావిష యంబులను జూచిననాఁటనుండియు నాయువకునివిషయమై యేమే మో యాశాంకురంబులు వానిహృదయక్షేత్రంబున మోసు లెత్తు

చుండెను. "దైవమా! నాయాశాంకురంబుల సఫలంబులు గావింప సమర్థురా లగుదాసీ యిందుమతి హంతకులచే మృతిఁజెందె. వానిజన్మ వృత్తాంతమును విస్పష్టముగఁ దెలిసికొనుటకుం గల ముఖ్యసాధనము గతించుటచే నితికర్తవ్యతామూఢుఁడనై చీఁకటిలోఁ దెరలాడువానివలె నెన్నియో వ్యర్థప్రయత్నములను జేయుచుంటిని. మఱియు నాయనుంగుఁబుత్రికయగు చంద్రికళ వానిపై బద్ధానురాగయై రేయుంబవళ్లు వానికై పలవించుచున్నయది. ఆపురుషసింహుని యాభిజాత్య మెఱుంగకుండుటచే ననురాగవిషయంబున నేను వానికిఁ దగినంత హెచ్చరికను గలుగఁజేయనైతిని. నాపుత్రికహృదయము తనపైఁ దగిలియుండుట యెఱింగి ముగ్ధుండై తన యనిశ్చితాభిజాత్యంబునకు సిగ్గుఁజెందుచు నియ్యెడకు రాఁజాలకుండె. ఏమిసేయుదును? నాముద్దులపట్టి వానిం జూడఁగోరి నిద్రాహారంబుల వర్జించి కృశించుచుండె. పైఁగా గోరుచుట్టుపై రోఁకలిపో టనునట్లు దుర్జనులకుతంత్రంబుచే నిప్పు డీమారణకర్మంబుగూడఁ దటస్థించె" అని పలుతెఱంగులఁ దలపోయుచుండెను. రణసంరంభకోలాహలం బాలకించి కర్తవ్యంబు నెఱపకున్న బహుజనద్రోహంబు వాటిల్లు ననుభయంబున వెలికి వచ్చి కొలువుసాగింప నాజ్ఞ యొసంగెను.

చంద్రికళ రేపకడనే మేల్కాంచి యేకతంబ యుద్యానవనంబున కేగి పుష్పపరాగవికీర్ణంబగు నొకనికుంజాంతరంబునఁ గూర్చుండి "ఓభగవానుఁడా! కామదేవా! ఏల నన్నింత చలపట్టి వేఁచుచుంటివి? ఆనాఁ డామహాపురుషునిమోహనాకార మేల నాకంటఁబడవలయు? కంటఁబడినంతనే యాయద్వితీయసౌందర్యమూర్తి నాహృదయఫలకంబున నేలచిత్రింపఁబడవలయు? కొద్దిరోజులలోనే వచ్చి నాయాతిథ్యమును హృదయపూర్వకముగ గ్రహించెద నని చెప్పి నాహృదయమును మాత్రము గ్రహించి పోయి నాయాతిథ్యముఁ గొన నేఁటిపఱకిని రాఁడ

య్యో. పరితాపసింహా! పరితాపసింహా! నిన్ను వీడినది మొదలు దిన మొకయుగంబుగఁ గడపుచుంటిని. స్థిత్యంతరంబు కారణంబుగఁజేసి నన్ను నీహృద్వీథినుండి తఱిమివేసితివా? అటులైన నా శోకమునకుఁ బరిలేదు. ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! నిన్నెడఁబాసి నే నింకొక్క క్షణ మైనను బ్రదుకఁజాల" నని భావోద్వేగంబున వివశురాలై మూర్ఛిల్లెను. అంత మధురిక వచ్చి చంద్రికళయవస్థను గాంచి యాక్రోశించుచు నెన్నియో శైత్యోపచారము లొనరించెను. కొంతసేపటికి చంద్రికళ మూర్ఛ తెలిసి లేచి "ప్రాణేశ్వరా! యమునానదిలోఁ గొట్టికొని పోవుచున్నాను. నన్ను విడిచిపెట్టకుము" అని మధురికను బిగియారఁ గౌఁగిలించెను. అంత మధురిక "సఖీ! చంద్రికళా! నన్నెవ్వరని భావించితివి? నేను నీచెలికత్తియను. మధురికను. భ్రమసితివి కాఁబోలు"నని ప్రబోధించెను. అందుపైఁజంద్రకళ సిగ్గుచెంది యలుకగదుర"మధురికా! నదీగర్భంబునుండి నన్నెవ్వ రుద్ధరించిరి? ఇది కలయా నిక్కమా?" అని యడిగెను. అందుపై మధురిక "ప్రియసఖీ! కలయే కాని నిక్కము గాదు. సమయాసమయవిచక్షణ లేకుండ శత్రువులు మారణకర్మంబునకుఁ గడంగి యిప్పుడో యింకనో మనపైఁ బడనుండ వీరలతాంగివగు నీ విట్లు బేలవై తన్మయత్వంబును జెందవచ్చునా? నీకతంబుననే మహారాజుగా రిప్పటివఱకును శయ్యాగృహంబును విడువక నీయవస్థకు జాలినొందుచుఁ బ్రాజ్ఞులగుటచేఁ గర్తవ్యం బెఱింగి యిప్పుడే కొలువుకూటంబున కేగిరి. మన మీవిప్లవమును సురక్షితముగ దాఁటినపిదప మనహృదయాదర్శములఁ బాటింపవచ్చును" అని చెప్పి మెల్లగ నామె నంతిపురంబునకుఁ గొనిపోయెను.

సుదర్శనమహారాజు నిండోలగమున నారోజు కర్తవ్యములఁ దీర్చుచుండెను. పౌరభటభృత్యామాత్యసామంతజనులెల్ల రాసన్నరణోత్సాహపూరితులై మహారాజునకు హెచ్చరికఁ గలిగించుచుండిరి.

పురసంరక్షణార్థమై వలయునేర్పాటులనెల్లఁ గావించెను. మహారాజు దర్బారు చాలించి లేచుటకు సిద్ధముగ నుండెను. ఆసమయమున మధురాపురమునుండి వార్తాహరుఁ డొకలేఖను దెచ్చి మహారాజున కొసంగెను. సుదర్శనుఁ డద్దాని విప్పి కొంతవఱకుఁ జదివి యాలేఖను జాఱవిడిచి "హా! హా! పరమేశ్వరా! నాయాశ లన్నియు నిరాశ లయ్యెనా?" అని దుఃఖావేశంబున వివశుఁడై సింహాసనముపై మూర్ఛిల్లెను. పరిచారకు లెల్లయెడల నాక్రోశించుచు వైద్యుల నరయ నతిసంభ్రమంబున బహుముఖంబులఁ బరువిడుచుండిరి.

కొంతసేపటికి వీరధన్వి వచ్చి మహారాజునకు వలయు నుపచారములఁ గావించెను. మహారాజున కొక్కింత తెలివి వచ్చి "అయ్యో! ప్రతాపసింహా! ప్రతాపసింహా! నాయాశల నన్నిటి నొక్కసారి నీతోఁబాటు యమునానదిలోఁ గలిపితివా నాయనా!" అని దుఃఖాక్రాంతచిత్తుఁడై మరల మూర్ఛిల్లెను. తండ్రి మూర్ఛిల్లె నని విని చంద్రకళ దర్బారులోనికిఁ బరుగిడివచ్చుచుఁ దండ్రియార్తాలాపము నాలించి తన దుస్వప్నమును జ్ఞప్తికిఁ దెచ్చికొని "హా! హా! ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!" అని గాఢముగ మూర్ఛిల్లి భూమిపైఁ బడెను. పురజనుల హాహారావంబులు పిక్కటిల్లెను. వీరధన్వి యెన్నిచికిత్సలుచేసినను చంద్రకళ తెలివిఁ జెందలేదు.

మహారాజు మరలఁ దెలివి జెంది పుత్రికయవస్థఁ గాంచి "అయ్యో! చంద్రకళా! నీవు నన్ను విడిచి స్వర్గపు కెక్కడ కేగు చుంటివా? నీవు లేకున్న నాకీలోకముతోఁ బనిలేదు. నన్నుఁ గూడ నీవెంటఁ గొనిపొమ్ము తల్లీ!" అని దుఃఖించుచుండ భానుమంతుఁ డతిసంభ్రమంబున వచ్చి మహారాజుచెవిలో నేదియో చెప్పెను. వెంటనే మహారాజు భానుమంతునిఁ గౌఁగిలించికొని "నాయనా! భానుమంతా! నన్నును నాపుత్రికను బ్రదికించితివి. నాయాశాంకురంబులు ఫలింపఁజేసితివి.

నేను నీకుఁ గృతజ్ఞుఁడను." అని పలికి యత్యుత్కటప్రేమగౌరవంబుల నాదరించెను.

అంతఁ జంద్రికళ తెలివిఁ జెంది దిగ్గన లేచి "నాజీవితేశ్వరుఁ డేఁడీ? నాదైవ మేఁడీ? నాప్రతాపసింహుఁ డేఁడీ? అదిగో కొట్టికొని పోవుచున్నాఁడు. నానాథుని బ్రదికించికొనియెదను. నన్నుఁ బోనిండు." అని పరుగిడఁబోవ సుదర్శనుఁ డామెను గట్టిగఁ బట్టికొని చెవిలో నద్దియో రహస్యముగఁ జెప్పెను. ఆమంత్రప్రభావ మేమోకాని చంద్రకళ ప్రసన్నవదనయై "తండ్రీ! ఈవిషయము మీ రెట్లెఱింగితిరి? సంగతంతయు సకృత్స్నము నా కెఱింగింపవలయును" అని పలికెను. "బిడ్డా! మంచిది. రమ్ము" అని యాశేఖరు మరలఁ గైకొని పుత్రికతో నంతిపురంబున కేగెను.

అప్పటికి పరాహ్ణమైనది. దర్బారులోని జనులందఱుఁ బునరుత్సాహపూరితులై తమతమ నెలవుల కేగిరి. మఱునాఁడు సూర్యోదయంబునకే యుద్ధము ప్రారంభ మగునని యెల్లయెడలఁ జాటించిరి. పౌరజనభట సంఘంబులు తమతమపనులయం దప్రమత్తులై యుండిరి. జనులకు రణోత్సాహమును బోషింప రణశంఖంబులు మ్రోఁగుచునే యుండెను.

మహారాజు పుత్రికాసహితుఁడై యంతిపురంబున కేగినతోడనే చంద్రికళ తండ్రిఁ జూచి "జనకా! మీయాక్రందనమును విని నాయిష్టదైవమైన ప్రతాపసింహునకేదియో హాని వాటిల్లెనని భయావేశపరవశురాల నైతిని. అంతియే కాని సమాచార మెఱుంగ నైతిని. ఏమిజరిగెనో తెలిపెదరా?" అని యడిగెను. అందుపై మహారాజు "తల్లీ! నేను దర్బారులోని కేగినతోడనే నాబావగారైన చంద్రశేఖరమహారాజునొద్దనుండి నాకొకలేఖ వచ్చినది" అని పలికెను. "తండ్రీ! అందేమి వ్రాయఁబడియుండెనో నాకొకసారి చదివెదరా?" అని యడి

గెను. అందుపై సుదర్శనుఁడా లేఖను యిట్లు చదివెను:—

"మహారాజరాజశ్రీ పాంచాలరాజ్యరమామనోహరు లగు సుదర్శనమహారాజుగారి సన్నిధికి: తమ యాప్తమిత్రుండును బంధుండు నగు చంద్రశేఖరుఁడు వ్రాయు విజ్ఞాపనము:—మహారాజా! మీ తోఁబుట్టువును రూపగుణశీలంబుల నద్వితీయయు నగు చారుమతిని నేను ధర్మపత్నిగ స్వీకరించి యామెయందు బద్ధానురాగుండన య్యుఁ బురుషసంతానకాంక్షచే మీయందఱి యనుమతిపైఁ జితాంగిని సహధర్మపత్నిగఁ జేకొంటిని. గుణమునందును రూపమునందును శీలమునందును జారుమతికిని జితాంగికిని హస్తిమశకాంతరము కలదు. తరువాత రెండుసంవత్సరములకుఁ జారుమతి యొకమగశిశువుదయించి పదియవరోజునే మృతిఁజెందినసంగతి మీరును వినియే యుండిరి. చారుమతి పుత్రశోకార్తిచే గ్రుంగుచుండ రెండేండ్లనపిదపఁ జితాంగికి వీరపాలుఁడు జన్మించుటయు మీ రెఱింగినదే. అనంతరము చారుమతి పుత్రశోకానలంబున గ్రాగ్గిపోయి యమునానదిలోఁ బడి యదృశ్య యయ్యె. ఈమధ్య నొకపరివ్రాజకుఁడు నా కిద్దరు భార్యలు కలరనియు వారిరువురకు నిరువురుపుత్రులు పుట్టి పెరుగుచుండిరనియు జ్యేష్ఠభార్యయు నామెపుత్రుఁడును మృతిఁజెంది రని లోకము భ్రమించుచుండెనే కాని వా రుభయులు సజీవులై నిగూఢంబుగ నుండిరనియు వచించిపోయెను. తరువాత నొకబోయయువకుఁడు వీరపాలుని యమునానదీప్లవమునుండి యుద్ధరించి వానికిఁ బ్రాణదాత యయ్యెను. చారుమతికిఁ బుట్టినపుత్రునియందుఁ గలలక్షణము లన్నియు నాబోయయువకునియందుఁ బ్రతిఫలించుటయే కాక యాశిశువు వెన్నున నేఁ గనిన మత్స్యాకారముగల పుట్టుమచ్చ యాయువకుని వెన్నుపైఁ గాన్పించె. నాఁటనుండియు వానివృత్తాంతమును విమర్శింపఁగోరి మరలఁ జూచువేడుక వీరపాలు నంపి యాయువకుని మధురాపురము

రప్పించితిని. మొన్న యుదయముననే వా రుభయులు నిచ్చటికి వచ్చిరి. త్రోవలోఁ గామపాలుఁ డా బోయయువకుని సంహరించుట కెంతయో ప్రయత్నించి విఫలమనోరథుఁ డైనట్లు తెలియవచ్చినది. రెండవ సారి నే నాయువకునిఁ జూచినపిదప నాకుఁ గలిగిన యానందము నకుఁ బరిమితి లేదు. తరువాత మీరు వ్రాసినరహస్యలేఖలోని విష యములనుబట్టి నాచారుమతియు సజీవయై కామపాలుని యధీ నములోనే యుండవచ్చు నని యూహ పొడముటచేఁ జతురంగబల సమేతుండనై మీ యొద్దకు రా నుద్యుక్తుండ నైతిని. అంతలో నా బోయయువకుఁడు యమునానదిలోఁ బడి మృతిఁ జెందె నను ఘోర వార్త పిడుగువలె నాచెవినిబడియె. వానికళేబర మెచ్చటను గాన రాలేదు. కాని మొన్న రేయి నెవ్వరో యొకయువకుని మత్తుమం దిడి కరచరణంబులు దృఢముగ బంధించి రాత్రి రెండుయామము లైనపిదప మధురాపురతీరమునుండి యమునలోఁ బడవైచి రనియుఁ దా రదివఱకే యచ్చోటఁ బన్నియుంచిన వలలోఁ జిక్కిన యాపురు షుని మత్స్యభ్రాంతిచే బెస్తలు పైకి దీసి కట్లు విప్పి యనలగట్టునకుఁ గొనిపోయి చికిత్సలు గావించిరనియు నెంతచేసినను దెలివి రానందున నాపురుషుఁడు మృతిఁ జెందె నని భావించి వాని నచ్చోటనే విడిచి చని రనియు వారు తిరుగవచ్చుసరికి నాయువకుఁ డచ్చోటఁ గానరాలేదని యుఁ దెలియవచ్చినది. వానిని హంతకులే యదృశ్యము గావించిరో లేక దైవవశంబున నాపురుషుఁడు తెలివిఁ జెంది యెచ్చోటికైన నేగెనో తెలియరాదు. నే నట్టిపుత్రభాగ్యమునకుఁ బెట్టిపుట్టలేదు కాఁబోలు. మీరుగూడ మీగూఢచారులచే నెల్లయెడల వెదకింపఁగోరెదను. దుః ఖాక్రాంతచిత్తుండనై యుండుటచేఁ జతురంగబలసమేతుండనై వచ్చి యాసన్నసమరంబున మీ కొక్కింతసాహాయ్యము సేయఁజాలనందుకు

క్షమించవలెను. నాముద్దుకోడలైన చంద్రికళ కభినందనములు.

ఇట్లు,
చంద్రశేఖరుఁడు."

సుదర్శనుఁ డాలేఖను జదువుట ప్రారంభించినదిమొదలు ము గించువఱకును జంద్రికళ వివిధభావపరీతచేష్టల నయనయుగ్మంబు నుండి యశ్రుకణంబులు సంతతధారాపాతంబుగఁ గురియుచునే యుండె ను. అంత పట్టరానితమకంబున "హా! ప్రాణప్రియా! ప్రాణప్రియా!" అని పేరెలుంగున రోదన మొనర్చుచు మరల వివశురాలై పడిపోయె ను. సుదర్శనుఁ డామెకు వలయునుపచారంబులను జేయ చేటీజనం బును నియోగించి కొలువుకూటంబున కేగెను.

అప్పటికి మంత్రిసామంతాదిజనము లెవ్వరును దర్బారునకు వచ్చియుండలేదు. సుదర్శనుఁడు సేనానాయకునిఁ బిలిపించి "సేనానీ! సన్నిహితభండనంబునకు వలయుసన్నాహ మంతయుఁ బూర్తిఁ గా వించితివా? స్వకీయ పరకీయ బలతారతమ్యంబులఁ దెలిసికొంటివా?" అని యడిగెను. అందుకు సేనాపతి "మహారాజా! శత్రుబలముకన్న మనబలము చాలాతక్కువగ నున్నయది. మనచతురంగబలములో గుఱ్ఱపుదళ మైదువందలు గజయూధ మేఁబది రథములు నూఱు కా ల్బలము నాలుగువేలుమాత్రమే. శత్రుసైన్యములో గుఱ్ఱపుదళము రెండువేలు గజము లాఱువందలు రథములు నాలుగువందలు కాల్బల మిరువదివేలు నని తెలియవచ్చినది. అయినను మనకుఁగల శతఘ్నులు శత్రువులకంటె నధికమగుటచేతను వాని మనప్రాకారబురుజులపై దృఢముగ నెలకొల్పియుండుటచేతను శత్రువులు మన పురప్రాకార మును సమీపింపగను సాధ్యమగు నని నానమ్మకము. మఱియు మన పురజనులందఱు రణోత్సాహపూరితులై యేలినవారికొఱకుఁ దమ ప్రాణముల నర్పింప సంసిద్ధులై యున్నారు. కావున నాదుష్టశాత్రవులు

తమయంత్యకాల మాసన్నమగుటచేఁ బ్రభువువారిపైకి వచ్చుచుండి రని రూఢిగ నమ్మియుండుఁడు." అని యింకను నేమో చెప్పుచుండ శూరసేనుఁడు సైన్యసమేతుండై వచ్చుచుండె నని యొకచారుఁ డాక్రోశించుచు వచ్చి మనవి చేసెను. ఆమాట విని మహారాజు వలయు నేర్పాటులను గావింపుమని సేనాని కాజ్ఞ యొసంగి తాను నేతత్ప్రయత్నంబునకుఁ గట్టాయితుండు గా లోని కేగెను. చంద్రికళ తెలివిఁ జెందెను. తండ్రి తనచెవిలో నుచ్చరించిన మాత్రరహస్యమును విశ్వసింపలేక ప్రతాపసింహునిగూర్చి కళవళపడుచుండెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## పదునైదవ ప్రకరణము.

చ. ఇహసుఖ మేది వంగధరణీశ్వరుఁ డాలములోనఁ జావఁగా
సహగమనం బొనర్చెను భృశంబుగఁ దత్సతి వారిపుత్రి దు
స్సహతరదుఃఖభారమునఁ జావఁగనుండియు దైవశక్త్యుపక్
బహువిధసౌఖ్యలీలలను భాసిలదే వరయోగభూతిచేక్.

"అపారకరుణాసముద్రుండ వగు నోపరమేశ్వరా! దీనజనశరణ్యుండ వగు నీవు దక్క నీలోకంబున నాకు దిక్కెవ్వరు లేరని నిరాశఁ జెందియున్న నాకఖండదిక్కును గలుగఁజేసితివి. నీయనవద్యప్రభావముచే గడ్డిపరక మేరువ యగుచున్నది. మేరువ గడ్డిపరక యగుచున్నది. నీయపారకృపాంబుధి నోలలాడు భాగ్యవంతున కేమిలోపము గల్గును? ఎంతటి బాహుశాలియైనను నీయనుగ్రహమునకుఁ బాత్రుఁడు గానిచో నాదైవోపహతుండు కలకాలము సుఖభోగియై మననేర్చునా? కాలము తప్పిరా నెంతవారికైన నాపదలు రాకమానవు. వీరాగ్రేసరచక్రవర్తు లయ్యుఁ బరమధర్మచారిత్రు లయ్యు నిఃశేషించి భవదీయవాల్లభ్యలక్ష్మీకటాక్షసంపన్ను లయ్యు నుత్తమక్షత్రియవంశజులైనపాండవేయులు మున్ను దుర్యోధనాదులచేఁ గడునిడుమలఁ బడలేదా? చివర కాదుర్యోధనుం డేమయ్యె? ఓరీ కామపాలా! గురుద్రోహివై రాజ్యకాంక్ష నాతల్లిదండ్రుల నంత మొందించి కుళిందరాజ్యము నక్రమముగ స్వాధీనముఁ జేసికొని కులుకుచుంటివి. నే నింతదనుక యనన్యగతికుండనై యుండుటవలన నీయాటలు సాగినవి. మున్ను పాండవేయులకు శ్రీకృష్ణునియండ లభించినట్లు నా కిప్పుడు

సుదర్శనమహారాజుగారియొద్ద లభించినది. వారియాశ్రితకదళమున కధికారినై యుంటిని. ఇటుపై నీయాటలు సాగనివ్వను. ఏమి నాయవివేకము ! నేను దగ్ధపాపిని. నేనుజన్మించినంతనే నాతల్లిదండ్రులు చనిపోయిరి. మేనమామయింట నడుగుపెట్టి కళత్రసహితుండుగ వాని రూపుమాపితిని. ఇప్పు డీమహారాజుగృహమున నడుగుపెట్టుటచేతనే కదా రణవిప్లవ మాసన్నమైనది? ఈ యూహావాంబుధిఁ దరించినపిదపఁ గదా నే నేమైనఁ జేయఁగలుగుట? దైవసంకల్పం బెట్లుండెనో తెలియరాదు. ఏమైనను నావంటి నిర్భాగ్యున కీజన్మంబున నిట్టిగౌరవోపేతంబగుజీవనము లభించునని కలనైనం దలంచితినా ! ధర్మప్రభువైన సుదర్శనమహారాజుగారి యఖండవాల్లభ్యలక్ష్మీకటాక్షవీక్షణంబులు నిదాఘశోషితజలవిహంగంబులను తుషారకిరణునివలెఁ జల్లని కాంతులను వెదచల్లుచు నలరించునట్లు పరితాపసదనంబగు నాహృదయంబునకు సమ్మోదం బాపాదించుచుండె. ఏమిది ! గాఢాంధకారబంధురంబగు రోదసీకుహరంబు నాకస్మికముగఁ బ్రకాశింపఁజేయు విద్యుల్లతవలె నామధురికను జూచిననాఁటనుండియు నామించుఁబోణి మధురాపాంగవిలోకనంబులు విపజ్జీమూతాచ్ఛాదితంబై గాఢతిమిరావృతంబగు నాహృదయాకాశము నప్పటప్పటఁ బ్రకాశింపఁజేయుచుండె. మఱచిపోవుదమన్నను నాలేమ మోహనరూపము నాహృదయమునఁ బాదుకొనియుండుటచే మఱవఁజాలకుంటిని. చంచలాప్రకాశము చంచలమే కాని స్థిర మెట్లు కాఁగలదు? "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" అనునట్లు పరమదరిద్రుండగు నావంటి నిర్భాగ్యున కెన్నికోరికలు కలిగినను నయ్యవి విలీయములు గావలసినవే కాని సఫలంబు లెట్లగును? ఓరీ భానుమంతా ! నీ వెంతబుద్ధిహీనుఁడవు! ఆలేమవృత్తాంత మెట్టిదియో యెఱుంగవైతివి. నీ వాయెలనాఁగపై బద్ధానురాగుండ వైతివా యేమి ? నీవర్తమానవిపద్దశ నాలోచింపక

యే విషయలోలుఁడ వగుచుంటివి. ఛీ! నీ వెంతసిగ్గుమాలినవాఁడవు. సర్పమునోటఁ జిక్కినకప్ప సన్నిహితంబుగ నెగురు మక్షికంబును గ్రహింపఁజూచునట్లు మిత్తివాతఁ జిక్కియుండియుఁ గొంతయువకాశ మొదవెఁ గదా యని గొంతెమకోరికలను గోరుచుంటివా? పరమదరిద్రుఁడవైన నీవేడ భాగ్యరాశియైన మధురికయేడ? నీపాపపుజిహ్వతో నుచ్చరించిన నామెమధురనామముగూడ చెడిపోవును ” అని మఱియు నేమేమో తలపోసికొనుచు నొకనాఁటిసాయంకాలమునం దొకతటాకముచెంతనున్న గజ్జెమావిగున్నక్రింద భానుమంతుఁ డేకతంబ కూర్చుండియుండెను.

ఆసమయమున నొకయెలజవ్వని మేలిముసుఁగు వైచికొని భానుమంతునియెదుటనుండియే పోవుచుండెను. ఆమెకరద్వయంబునఁ గుంకుమహరిద్రాక్షతపుష్పంబులతోడను ధూపదీపనైవేద్యాదిసాధనములతోడను నింపిన రజితపళ్ళెరంబు కలదు. దానింబట్టి యాజవ్వని దేవాలయంబున కేగుచుండెనని భానుమంతుఁడు తెలిసికొనియెను. అత్తఱి నిశాకాంత నీలాంబరంబును ధరియించి గాఢసుషుప్తిమునింగియుండెనో యన నాప్రదేశము కటికచీఁకటిచేఁ గప్పఁబడి కడు నిశ్శబ్దముగ నుండెను. అట్టినిశాసమయంబున నాలేమ పురపరిసరంబునంగల దేవాలయంబునకు నొంటిగఁ బోవుచుండుటకుఁ గారణమేమైయుండునో కనిపెట్టవలయుననియు నామె కేయపాయమును గలుగకుండఁ గాపాడవలయుననియుఁ దలంచి భానుమంతుఁ డామెకుఁ దెలియకుండ వెనువెంట నిగూఢంబుగ బయలుదేఱెను.

హేలాపురోపకంఠంబునఁ బ్రవహించు జాలానదిపైఁగల వంతెన కనతిదూరంబున భవానీదేవాలయ మొండు గలదు. ఆయాలయము చిరకాలమునాఁటిది యగుటచేతను బురబాహ్యప్రదేశంబున బహుజనసేవ్యంబుగానిదిగా నుండుటచేతను మిక్కిలి శిథిలమై యుండెను.

దానిచుట్టును గలప్రాకార మక్కడక్కడఁ బడిపోయియుండుటచే నా యామెడల రక్కసకంపలు విశేషముగ బలిసియుండెను. నిశాసమయములయం దాప్రదేశ మతిభయంకరంబుగ నుండుటయేకాక యాశీవిషోరగంబులు దారుణఫూత్కారంబు లొనర్చుచు నాప్రాంతమం దెల్లెడల స్వేచ్ఛగఁ దిరుగుచుండును. ఆకారణముచే నెంతధీరుఁడైనను రాత్రులయం దచ్చోటికేగుటకు సాహసింపలేకుండెను. ఆనాఁడు మధురికయొక్కర్తె నట్టినిశాసమయంబున నాదుర్గమప్రదేశంబునకు నిర్భయంబుగఁ బోయి దేవ్యాలయములోఁ బ్రవేశించుట భానుమంతుఁడు చూచి యామెకంటఁబడకుండఁ దానుగూడ నిగూఢంబుగ వెన్వెంట లోనికిఁ జని యామెవెనుక నున్న ఱాతికంబముచాటున నొదిగి కూర్చుండెను. అప్పటికి భానుమంతుఁడదివఱకచ్చోఁ గాంచిన సన్న్యాసి యెచ్చోటికో వెడలిపోయెను. ఆసమయంబున భవానీదేవి చెంత దీప మొకటి బలముగ వెలుఁగుచుండెను. అప్పు డాదేవిచెంత నాసాదారుఁడుకూడ లేఁడు.

ఆజవ్వని దేవికి భక్తిపూర్వకముగ సాష్టాంగదండప్రణామం బాచరించెను. అట్లామె సర్వాంగలిగితమహీతలయై భవానీదేవి మ్రోల భక్తిరసనిమగ్నతమైమఱచి యుండ నాగుఁబా మొకటి బుస కొట్టుచు నెటనుండియో నామెపాదముల చెంతకు వచ్చి యాభోగ భోగియై కాటువేయుటకు సిద్ధముగ నుండెను. భానుమంతుఁ డాదుష్టోరగంబును వీక్షించి వెంటనే యొలనుండి కైజారు దీసి యొక్కవ్రేటున దానిశిరస్సు రెండుచీలికలు గావించెను. పన్నగము మృతిఁ జెందెను. ఈసంగతి మధురిక భక్తిపారవశ్యంబున నుండుటచే నెంత మాత్రము నెఱుంగదు. భానుమంతుఁడు మరల యథాస్థానంబున కేగి కూర్చుండెను.

కొంతసేపటికి మధురిక లేచి తాను దెచ్చిన పూజాద్రవ్యము లతో దేవిని భక్తిపూర్వకముగనర్చించి కరకమలంబులు మోడ్చి నిమీలితనేత్రియై "దేవీమతల్లీ! దీనజనకల్పవల్లీ! ఎన్నటికైన నీకు నాపైఁ గరుణకలుగునటమ్మా కాళీ! భవదీయకృపారసంబు నొక్కింత నాపైఁ జిలికించి రక్షింపఁ దఱి వచ్చినది. జననీ! దీనురాలనగు నాకుయ్యాలింపవా? నన్నుఁ బాలింపవా? నా కీశోకంబున వేఱొండుదిక్కు లేదు నీవే గతియని నీపాలఁ బడితిని. నన్ను నీటముంచెదవో పాలముంచెదవో నీదే భారము. కుళింద దేశప్రజలపాలిటి ప్రత్యక్షమృత్యుదేవతయైన కామపాలుఁడు శూరసేనునిసాహాయ్యంబున మాతండ్రిరాజ్యముపై నిష్కారణంబుగ దండెత్తివచ్చి రణరంగంబున నాచనచే నాతండ్రిని సంహరించె. పతివియోగంబు సహింపనోపక నన్నొక విశ్వాసపాత్రురాలైనదాసీ కప్పగించి భర్తతో సహగమనం బొనర్చి దివంబున కేగె అప్పటికి నేను మూఁడేండ్ల బాలికను. పరమదుర్మార్గుఁడైన శూరసేనుఁడు వంగరాజ్యమును నిష్కంటకంబుగ స్వాధీనముఁ జేసికొనఁగోరి రాజబంధువులనెల్ల సంహరించెను. నన్నుఁ జంపుట కెన్నియోప్రయత్నము లొనరించి చివరకు మూఁడేండ్లవయస్సుగల యొకబాలికను నేననే భ్రాంతిచే సంహరించి యారాజ్యమంతయుఁ దనకళింగ రాజ్యములోఁ గలిపికొనియె ఆక్రూరహంతకునిచే నా కెప్పటి కేమియుపద్రవము వచ్చునోయని పురుషవేషమున నన్నియ్యెడకు రహస్యోచితంబుగఁ గొనితెచ్చి ధర్మప్రభువైన సుదర్శనమహారాజున కావృత్తాంతము నెఱింగించి వానిగర్భకుక్షిఁ బోషింపన నప్పగించి యాదాసీ చనియె. నాఁటనుండియు దీనజనచింతామణియగు నీమహారాజుచే నతిగౌరవంబునఁ బోషింపఁబడుచు వీనిపుత్రికారత్నం బగుచంద్రకళాకన్యకకుఁ బ్రియసఖినై కన్నతల్లిదండ్రులను మఱచి సమస్తమహారాజభోగముల ననుభవించుచు నత్యంతసుఖాంబుధి నోలలాడుచుంటిని. కటికరక్కసుఁ

డైన కామపాలుఁ డావిధంబుగ నాతల్లిదండ్రులను బొట్టను బెట్టికొనుటయేగాక నామేనత్తను నామెభర్తనుగూడ మ్రింగివేసెను. అంతటితోఁ దనివిసనక యాదురాత్ముఁడు నామేనత్తకొమరుఁడైన భానుమంతుని తనమిత్రులైన చోరులచే నంతమొందించెనని తెలియవచ్చినది. హా! పరమేశ్వరీ! నే నెంతకాల మీయొండిబ్రతుకు బ్రదుకుదును. తిరుగ నాదుష్టచిత్తుఁ డిప్పట్టున మరల శూరసేనునితోఁగూడి యీమహారాజుపై యుద్ధమునకు వచ్చుచుండె. హేదేవీ! భవానీ! ఆశ్రితజనకల్పసాలంబును దీనచకోరచంద్రోదయంబు నగు సుదర్శను నే జయలక్ష్మి వరించునట్లుఁ జేసి దుష్టులను శిక్షింపవేఁడెదను. నాకుఁ దల్లియుఁ దండ్రియు గురువు దైవము నీమహారాజే యని నమ్మి నే నీపదియేం డ్లనుండియు వీనిగర్భాగుప్తినే వర్ధిల్లుచుంటిని. నన్నేవిధంబున రక్షించెదవో కదా తల్లీ!" అని భక్తిపారవశ్యంబున దేవికి మరల సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి నిజమందిరంబున కేగ నుద్యుక్తురాలై మరలెను.

దీపపువెలుతురునఁ బెగిపడియున్న పా మామెకంటఁ బడియెను. దానిని జూచినంతనే మధురిక తుళ్ళిపడి తన్నుఁ గఱచుటకే యాలేవిహీన మచ్చోటికి వచ్చెననియు భవానీదేవికటాక్షంబునఁ దన కాయాపద తొలంగెననియు భావించెను. కాని యాకాకోదరము శిరస్సునం బెవ్వరో కన్నాలుగియుండి నాకొదవినయాపదను చూచి వచ్చి ఖండించియుండనోపు నని యూహించి యాపురుషుఁడు దేవిమ్రోలఁ దాను నివేదించినవృత్తాంత మంతయు వినియుండు ననియుఁ దానఁ దన కేమికీడు వాటిల్లనున్నదో యనియు నత్యుత్కటభయావేశంబున "హా! దేవీ! భవానీ! రక్షింపుము; రక్షింపుము!" అని వివశురాలై మూర్ఛిల్లెను. తత్క్షణమే భానుమంతుఁడు స్తంభముచాటునుండి వెలికివచ్చి మూర్ఛిల్లియున్న మధురికను మూఁపుపై నిడికొని యతివేగంబునఁ దటాకతీరం

బున కేగి యచ్చటఁ గల శాలతృణాంకురశీతలప్రదేశంబున నామెను బరుండఁబెట్టి తటాకోదకంబును దెచ్చి మోముపైఁ జల్లి చెంతఁ గూర్చుండి యుత్తరీయాంచలంబుచే విసరదొడంగెను.

ఆసమయంబున భానుమంతుని హృదయాంబుధి నెన్నియో భావతరంగము లుప్పొంగుచుండెను. తనమేనమామకొమరిత జీవించి యుండుటయేగాక సంతాపతిమిరావృతం బగు తనహృదయవీథిని శీతరశ్ములఁ బ్రకాశింపఁజేయుచున్న రాకాచంద్రముఖ యామెయే యని తెలిసికొని యానందపారావారంబున నోలలాడుచుండెను. ప్రియదావేశంబున నామెను బిలువఁగోరియుఁ ద్వరపడిన నాబిబ్బోకవతి కేమికీడు వాటిల్లునో యని సంశయించి యూరకొనెను. చనిపోయెనని నమ్మియున్న భానుమంతుఁడు తానే యని తెల్పినచో నమ్మునో నమ్మకుండునో! ఎట్టులైన నిప్పటికిఁ దనవిషయము గోప్యముగ నుంచుటయే మేలని నిశ్చయించెను. తనభావిభాగ్యోదయంబున కీసంఘటనము ప్రబలసూచకమని తలంచి నిండుభక్తి నంతర్ముఖుండై "పరమేశ్వరా! అఘటితఘటనాపటిష్ఠుండవగు నీలీల లత్యద్భుతంబులు నవిమృశ్యంబులు గదా! కావుననే నీమహిమ యవాఙ్మనసగోచరమని ప్రాబల్కులుగ్గడించె. జలోత్సృష్టకాష్ఠసంచయం బొక్కచో నిడివడినను వేఱొక్కయెడఁ గలియునట్లు కులిందవంగవంశాంకురంబుల మొదట నావిధంబుగ నెడఁజేసియు నిప్పు డీవిధఁబుగఁ గలిపితివి. ఆహా! నీయఖండమహిమను నే నెంతనికొనియాడుదును. దేవా! మహానుభావా! సర్వజ్ఞుండవు దయామయుండవు నగు నీవు న్యాయాన్యాయవిచక్షణుండవై దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు లోకమున ధర్మమును సముద్ధరించుపొంటె యుగయుగమునందును వివిధనామరూపగతుల మెలంగెడివాఁడ వయ్యు నీ విప్పట్టునఁ గామపాలాదిదుష్టుల నేల ప్రబల నిచ్చుచుంటివి? దయామయా! నీకృపాతరణిపైఁ జేర్చి యపారవిపత్సా

గరంబున మాజీవనయాత్రి నింతవఱకును గొనసాగఁజేసితివి. ఎప్పటికి మమ్ము గమ్యస్థానముఁ జేర్చెదవో గదా? చెట్టుమీఁదిపిట్టలవలె నిరాశ్రయులమైయున్న మా కీదీనవిహంగశరణ్యం బగు నృపమందారంబుఁ జూపి జన్మసాఫల్యంబుఁ గావించితివి. ఇప్పు డాసుదర్శనపారిజాత భూజంబుపైఁ బడనున్న దుష్టజనప్రేరితదారుణరణోల్కాపాతంబును వారించి మమ్ము రక్షింపుము" అని భగవంతుని బ్రార్థించుచుండెను.

అంత మధురిక తెలివిఁ జెంది కనులు తెఱచి తనచెంతఁగూర్చుండి యుపచారము లొనర్చుచున్న భానుమంతునిఁ జూచి దిగ్గన లేచి "పుణ్య పురుషా! నే నిచ్చో డ కెట్లువచ్చితిని?" అని యడిగెను. అందుపై భాను మంతుఁడు "తరుణీమణీ! నేనే నిన్ను భవానీదేవ్యాలయమున మూర్ఛాక్రాంతవై యుండ నిచ్చోటకుఁ గొనివచ్చితిని. నేను నీ కాప్తబంధుండను గాని శత్రుండను గాను. భయపడకుము. నీ వాయాలయంబున భవానీదేవికి నివేదించిన యావద్వృత్తాంతమును వినియుంటిని. అయ్యది ముందు మనయుభయులమేలునకే కారణ మగునుగాని దాన నెట్టికీడును గలుగనేర దని త్రికరణశుద్ధిగఁ జెప్పుచున్నాను." అని తనసంగతి లేశమైనను వెల్లడింపక జరిగినసమాచార మంతయు నామె కెఱింగించెను. మధురికచిత్త మొక్కింత కుదుటఁబడెను. కాని యాజవ్వని భానుమంతుని గుర్తింపలేకపోయెను.

తరువాత నిరువురు నచ్చోటు వదలి బయలుదేఱి జాలానదివంతెనను దాఁటి పురప్రాకారప్రాణిద్వారంబు దరిసిరి. ఆసమయమున 'నెవరువారు? నిలువుఁడు' అను నొకగంభీరధ్వని పిడుగువలె నాలేమ చెవిని బడెను. అధ్వనివినినంతనే చకితహరిణాక్షి యగుమధురిక భయకంపితయై ద్వారమున కిరుబుజంబుల నిలిచియున్న ఖడ్గపాణు లగు నిరువురుయోధులను జూచి మొదట వారు సుదర్శనునిద్వారరక్షకభటులేమో యని భావించి రెండడుగులు ముందుకుసాగినంత నాయోధు

లాద్వారపార్శ్వంబుల వీడి సమీపంబునంగల పొదలమాటునఁ గన్నో
అంగిరి. అదికనిపెట్టి భయవిహ్వలయై "హా! దేవీ! భవానీ! శత్రువులు
వచ్చి పట్టణంబును ముట్టడించిరి కాఁబోలు! ఇఁక మాగతియేమి?" అని
మఱలి పరుగిడుచుఁ జీఁకటియగుటచే వెనుకనుండి వచ్చుచున్న భాను
మంతునియెదపై వ్రాలి మూర్ఛిల్లెను. భానుమంతుఁ డాయలభ్య
యోగగాఢాలింగనసౌఖ్యంబున కుత్కలికఁ జెందుచు వివశురాలగు
నాలేమను మూఁపుపై నిడుకొని యామె నొకసురక్షితం బగుప్రదేశం
బున నుంచి తిరుగవచ్చి యాసంగతి నెఱుంగఁగోరి తానుగూడ మఱలి
జాలానదివంతెన కభిముఖంబుగ బయలుదేఱెను.

భానుమంతుఁ డావిధంబుగ వంతెనఁ జేరుసరికి మఱియొక యో
ధుఁడు నురగలుగ్రక్కుచున్న వల్లదశ్వంబుపై వాని కభిముఖంబుగ వ
చ్చుచుండెను. అప్పటికింకను వంతెన నెత్తివేయలేదు. భానుమంతుఁడు
సింహద్వారముగుండా పురంబులోఁ బ్రవేశింప నల్లెనుపున వచ్చెను.
అప్పటికి చంద్రోదయమైనను దన కభిముఖంబుగ వచ్చుచున్న యో
ధుఁడు కామపాలుఁడే యని తెలియక సింహద్వారంబు దరియఁబోవు
చుండెను. అంత నాయోధుఁడు భానుమంతునిఁ జూచి "ఎవఁడవురా
నీవు? నిలువుము. నిలువుము." అని యదలించుచు గుఱ్ఱము నతివే
గముగ వానిపైకి దుమికించుచుండెను. అదిచూచి భానుమంతుఁడు
మెల్లగ వంతెనక్రింద కేగి తనమూఁపుపై నున్నమధురిక నానదీజల
సమీపమునఁ బరుండఁబెట్టి తనమొలనుండి పిస్తోలు దీసి తనయాశ్విక
సైన్యమును బిలువ నీలవేయుచు వెలికి వచ్చి నాయోధునిపైఁ బిస్తోలు
గుఱిపెట్టి కాల్చెను. దైవవశంబున గుండుదెబ్బచే నాయోధుఁ డెక్కిన
గుఱ్ఱము చచ్చి పడిపోయెను. వెంటనే యాయోధుఁడు క్రింద కుఱికి
"ఓరీ! దుర్మార్గా! ఎవఁడవురా నీవు? కుళిందదేశాధీశ్వరుఁడైన కామపా
లునియెదుటనే నిలువ సాహసించుచుంటివిరా! ఇదిగో చచ్చితివి" అని

వరనుండి కత్తిదీసి భానుమంతునిఁ గదిసెను. భానుమంతుఁడు నేర్పుతో వానిపోటుఁ దప్పించికొని కామపాలునిపైఁ దనకసిఁ దీర్చికొన నదియ యదనని తలంచి తానునొరనుండి కత్తినిదీసి సాముర్గాపహాసంబుగ "ఓరీ! రాజరూపచండాలుఁడా! నే నెవ్వాడనో నీవు ముందెఱుంగఁ గలిగెదవు. అన్ననుజంపి కుళిందరాజ్యమా నక్రమంబుగ నాక్రమించు కొని విఱ్ఱవీగుచుంటివి. నీతుచ్ఛకృత్యంగుకాల మాసన్నమైనది. కుక్క కు నేయిఱుందునా! రమ్ము ఇచ్చటనే నీవు పరిపాలింపఁదగిన యా యనుగుల రాజ్య మిచ్చెదను. శాశ్వతముగ ననుభవింపుము." అని వీరా వేశంబునఁ గామపాలునిపై కుఱికెను. ఇరువురు నట్లు ఖడ్గాఖడ్గిఁ బోరా డుచుండ భానుమంతుని యాశ్వికదళము హుటాహుటి నయ్యెడ కే తెంచెను. అది చూచి కామపాలుఁడు జాలానదిలో దుమికి యీఁది యవలిగట్టుఁ జేరి పాఱిపోయెను. ఆశ్వికభటులు వానిని వెంబడించిరి.

జాలానదీజలంబునుండి వీతెంచు చల్లనిపిల్లవాయువులవలన మధురిక మూర్ఛఁదెలిసి లేచి ఖడ్గపాణియైనభానుమంతుని వానిఁ బరి వేష్టించియున్నయాశ్వికభటులను జూచి తననుబట్టి బంధించుటకై శత్రువులు వచ్చియుండి రని భీతిల్లుచుఁ "బుణ్యపురుషా! పాముపాతఁ బడనున్న నన్నుఁ గాపాడి యిప్పుడు శత్రువులచేతిలోఁ బడవేయు దువా? నన్ను రక్షింపుము. రక్షింపుము" అని కుయ్యిడెను. వెంటనే భానుమంతుఁడామెచెంత కేగి "తరుణీమణీ! భయపడకుము. నాకం ఠములోఁ బ్రాణవాయువు లున్నంతవఱకు శత్రువులు నిన్నుఁ గన్నెత్తి చూడఁజాలరు. ఇఁక వంతెన నెత్తివేసెదరు. పురంబులోని కేగు దము రమ్ము." అని మధురికను వెంటనిడికొని భానుమంతుఁ డాశ్విక భటులతోఁ బురప్రవేశం బొనరించెను. వంతెన నెత్తివేసిరి.

తెల్లవాఱినది. హేలాపురాంతరంబున నాసన్నరణోద్రేకవి స్రంభసంభాషణంబులఁ గోలాహల మతిశయించెను. వీరుల కట్టాయి

త్రోత్సాహనాదంబులును రణదుందుభినిస్వాణంబులును బ్రచండశం ఖారావంబులును రథనేమీనిస్వనంబులును హయహేషార్భాటంబులును గజబృంహితధ్వానంబులును బదాతివర్గంబుల రోషభీషణాలాప కలకలంబులును సంకులంబై యొక్కమొగి విరామములేక మిన్నంటుచుండెను.

శూరసేనుఁడమితమైన చతురంగబలముతో వచ్చి హేలాపురసింహద్వారంబున కెదురుగఁ గొంతదూరమున శిబిరముల నిలిచియుండెను. పురప్రాకారంబుపైనుండి సుదర్శనుని యోధులు శూరసేనుని సైన్యసాగరమును జూచి ఘోరసంగ్రామం బగు నని యుత్సహించుచుండిరి. సుదర్శనమహారాజునకు జయముగలుగుటకై తమ యిష్టదైవములఁ బ్రార్థించువారు కొందఱును మ్రొక్కులిడువారు కొందఱును సద్వ్రతము లొనరించువారు కొందఱును దేవమాతృకలకు నైవేద్యము లిడువారు కొందఱును నై పురజనులందఱుఁ బరిపరి విధంబుల సంభ్రమించుచుండిరి.

కామపాలుఁడు జాలానది దాఁటి యాత్రికుల నేఁగఁబుచ్చి తన సైన్యమును గలిసికొని పూర్వాలోచితక్రమంబు ననుసరించి పురపాణిద్వారంబున కనతిదూరంబున శిబిరంబుల నిలిచియుండెను. వారిం దఱిమిన భానుమంతుని యాత్రికభటులు విఘ్నపఱియుత్తులై తిరుగఁ బురప్రవేశం బొనరించిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

(౦)

## పదునాఱవ ప్రకరణము.

---

శా. కాంతాపుత్రవియోగదుఃఖదసుసౌఖ్యప్రాప్తిమార్గంబు ప్రా
చ్చింతామూల మఘౌఘసాధకలనాశీలంబు దుర్దగ్ధభా
వాంతశ్శల్యము దుర్వ్యథాకలిత మత్యంతావమానైక శో
దాంతంబౌ బలవద్విరోధ మది యాహా యేమి కావింపదో.

ప్రళయమహావిప్లవంబో యన సంగరసంరంభజృంభమాణాయమాన హేషాపరిస్ఫాలితతురంగతరంగములతోడను ఘోషవారసంఘట్టనోద్భూతబధిరీకృత రోదసీకుహరఘీంకారభయంకరోన్నతమత్తమాతంగనగంబులతోడను ధవళాతపత్రచామరానేకడిండీరనిచయంబుతోడను ప్రతాపప్రభాపటలప్రహసితచండకరానుకారవీరనికరకరఘటితఖడ్గాయమానకరవాలమీనంబులతోడను వివిధాలంకారస్థగితరత్నకాంతిచ్ఛటాభాసమానంబై సముజ్జ్వలితకోపారుణనయనగోళకీలితకీలాలజాలవిశాలంబై నితాంతవాహినీసంగతంబై ఘోరసేనునివీరవారాశి యత్యూర్జితచమూతరంగమాలికాకల్లోలికల విజృంభించుచు పరిపంథిజనగేహోన్మూలభీషణోగ్రాగ్నిసమారుతాహతిసంక్షుభితంబై ఘూర్ణిల్లుచు హేలాపురసింహద్వారంబు దరియ నేతెంచుచుండెను. తదీయార్భటంబునకు బెదరి యట్టిట్టుఁ బఱచుగోగణంబులు నజామహిషీకదంబంబులుఁ జెల్లాచెదరగుచుండెను. పురప్రాకారోపరిశతఘ్నుల నుండి సుదర్శనునిభటులు చండతరోష్ణగోళంబుల విరామములేక వర్షించుచుండిరి. ఆఘోరసేనునిసైన్యములో ననేకులు కూలుచుండిరి. వానివీరవారాశి ముందుకు సాగలేకుండెను.

ఆపరిస్థితిఁ జూచి శూరసేనుఁడు తనసైన్యమంతయు రెండుభాగములుగఁ జేసి యందొక్కభాగమును గూఁతవేటుదూరంబున నచ్చటచ్చట నిలిపి తక్కినభాగమును మూఁడుదళములక్రింద విభజించెను. అందొక్కదళములోఁ గొందఱు వంతెనను బడఁగొట్టఁ బ్రయత్నించుచుండిరి. మఱికొందఱు ప్రాకారోపరిశత్రువీరులఁ జండశరాసారంబున ముంచి హింసించుచుండిరి. మఱికొందఱు ప్రాకారకుడ్యంబును జేరుటకై నదిలో దుమికి యవల కీఁదుచుండిరి. వారిలో ననేకులు ప్రాకారోపరివైరివీరుల తీవ్రభల్లపరంపరాహతుల నంతమొందుచుండిరి. కొదువరెండుదళములు నానదిని దాఁటువెఱవు నాలోచించుచుఁ బశ్చిమోత్తరదిశలఁ దిరలాడుచుండిరి.

అపరాహ్ణమైనది. మధ్యందినమార్తాండుఁడు తనతీక్ష్ణకిరణంబుల నామారణకర్ములఁ దపింపఁజేయుచుండెను. దుర్నిరీక్ష్యుఁడగు నా వేఁడివెలుంగుప్రతాపరశ్ములు కనులు పొడుచుచుండుటచే శూరసేనునిసైనికులు పైకిఁ గనులెత్తి చూడలేకుండిరి. ఆకారణమున వా రాప్రాకారోపరిశత్రువీరులప్రచండకాండాహతులచేఁ గుప్పలుగఁ గూలుచుండిరి. అయినను గొందఱుకళింగసైనికు లతికష్టంబున జాలానదిని దాఁటి ప్రాకారంబు దరిసిరి. ఆసమయముననే యుత్తరదిశను దిరలాడుచున్న శూరసేనునిసైనికదళ మొకచో నానదిని దాఁటి ప్రాకారముచెంతఁ జేరెను. పశ్చిమదిశ నున్నదళము తిరిగి తిరిగి నదిని దాఁటుటకుఁ దగినవెఱ వెచ్చోటను లభింపనందునఁ దిరుగవచ్చి మధ్యదళముఁ జేరెను.

అప్పటికి శూరసేనునిమధ్యదళము చాలాభాగము హ్రస్వమయ్యెను. సుదర్శనునియోధులలో నొక్కఁడును జావలేదు. సూర్యుఁ డస్తంగతుఁ డగువఱకు నావిధముగ శూరసేనుఁడు తనసైనికులఁ జంపికొనుచుండెనేకాని సింహద్వారమునైన సమీపింపఁజాలఁడయ్యెను.

జయము లభించుట దుర్ఘట మని నిరాశఁ జెంది శూరసేనుఁడు రణ విముఖుఁడై సైన్యమును మఱలింప యత్నించుచుండెను.

ఆసమయమునఁ గామపాలుఁడు వచ్చి శూరసేనునిరణవైముఖ్యతఁ గనిపెట్టి "మిత్రమా! రణకోవిదుండ వగు నీవే యీపాటివిషమపరిస్థితికి నిరుత్సాహమును జెందుచుంటివా? శత్రు వనుకూలస్థానమునం దుండుటచేతను మనము ప్రతికూలస్థానమునం దుండవలసి వచ్చుటచేతను నీవిషమపరిస్థితి కలిగినది. ఇంతమాత్రముచే నీవంటి వీరాధివీరుఁడు నిరుత్సాహముఁ జెందవచ్చునా? వేఁటగాఁడు దుష్టమృగముల వెల్లడికిఁ దోలించి బారిసమరినట్లు మనము కపటోపాయంబున స్వల్పసంఖ్యాకు లగు సుదర్శనునిసైన్యము సింహద్వారమును దెఱచి వెలికివచ్చునట్లు చేసితిమేని మనకు జయము సులభముగ లభించును. మఱియుఁ జుండకరుండపరగిరిశిఖరంబు దరియుచుండుటచేఁ బరిస్థితులు మాఱినవి. బాహుబలముచేఁ గాకున్న బుద్ధిబలముచే నైనఁ బ్రత్యర్థిని లొంగఁదీయుట వివేకవంతుని లక్షణము. నాకొక్క యుపాయము తోఁచుచున్నయది వినుము. మీరు జయమునందు నిరాశఁజెంది కాందిశీకు లగుచున్నట్లు శిబిరంబుల నెత్తివేయించి ప్రాకారమునదాపున నున్నసైన్యముఁ బొదలమాటున డాఁగియున్న సైన్యముఁ గాక మిగిలినసైన్యముతోఁ వెనుకకు మఱలి యదృశ్యులు కావలయును. అంత శత్రుసైన్యమంతయు మిమ్మును వెన్నంటి తఱుమ నొక్కసారి వెలికివచ్చును. అప్పుడు మనకార్య మశ్రమంబుగ నెఱవేఱును. ఈయుపాయంబుచే నీవు నీసైన్యముతోఁబురంబులోనికిఁ బ్రవేశించెదవు. పిమ్మట నిన్నడ్డగించుటకై హతశేషు లైన సుదర్శనుని సైనికు లందఱు నెక్కుమొగి నీవున్న యెడకు వత్తురు. ఆసమయమునఁ బాశీద్వారముగుండ నేను నాసైనికులతోఁ బురంబులోఁ బ్రవేశించి

ఆదుస్థితిఁ జూచి శూరసేనుఁడు తనసైన్యమంతయు రెండుభాగ ములుగఁ జేసి యందొక్క భాగమును గూఁతవేటుదూరంబున నచ్చ టచ్చట నిలిపి తక్కిన భాగమును మూఁడుదళములక్రింద విభజించెను. అందొక్కదళములోఁ గొందఱు వంతెనను బడఁగొట్టఁ బ్రయ త్నించుచుండిరి. మఱికొందఱు ప్రాకారోపరిశత్రువీరులఁ జండశరా సారంబున ముంచి హింసించుచుండిరి. మఱికొందఱు ప్రాకారకుడ్యం బును జేరుటకై నదిలో దుమికి యవల కీఁదుచుండిరి. వారిలో ననేకులు ప్రాకారోపరిస్థవైరివీరుల తీవ్రభల్లపరంపరాహతుల నంతమొందుచుం డిరి. కొందువ రెండుదళము లానదిని దాఁటుటెట్లని నాలోచించుచుఁ బశ్చిమోత్తరదిశలఁ దిరలాడుచుండిరి.

అపరాహ్ణమైనది. మధ్యందినమార్తాండుఁడు తనతీక్ష్ణకిరణంబుల నామారణకర్ములఁ దపింపఁజేయుచుండెను. దుర్నిరీక్ష్యంబగు నా వేఁడివెలుంగుప్రతాపరశ్ములు కనులు పొడుచుచుండుటచే శూర సేనునిసైనికులు పైకిఁ గనులెత్తి చూడలేకుండిరి. ఆకారణమున వా రాప్రాకారోపరిశత్రువీరులప్రచండకాండహతులచేఁ గుప్పలుగఁ గూలుచుండిరి. అయినను గొందఱుకళింగసైనికు లతికష్టంబున జాలానదిని దాఁటి ప్రాకారంబు దరిసిరి. ఆసమయముననే యుత్తర దిశను దిరలాడుచున్న శూరసేనునిసైనికదళ మొకచో నానదిని దాఁటి ప్రాకారముచెంతఁ జేరెను. పశ్చిమదిశ నున్నదళము తిరిగి తిరిగి నదిని దాఁటుటకుఁ దగినతెఱ వెచ్చోటను లభింపనందునఁ దిరుగవచ్చి మధ్య దళముఁ జేరెను.

అప్పటికి శూరసేనునిమధ్యదళము చాలాభాగము హ్రస్వ మయ్యెను. సుదర్శనునియోధులలో నొక్కఁడును జావలేదు సూర్యుఁ డస్తంగతుఁ డగుపఱకు నావిధముగ శూరసేనుఁడు తనసైనికులఁ జంపి కొనుచుండెనేకాని సింహద్వారమునైన సమీపింపఁజాలఁడయ్యెను.

జయము లభించుట దుర్ఘట మని నిరాశఁ జెంది శూరసేనుఁడు రణ విముఖుఁడై సైన్యమును మఱలింప యత్నించుచుండెను.

ఆసమయమునఁ గ్రామపాలుఁడు వచ్చి శూరసేనునిరణవైముఖ్యతఁ గనిపెట్టి "మిత్రమా! రణకోవిదుండవగు నీవే యీపాటివిషమపరిస్థితికి నిరుత్సాహమును జెందుచుంటివా? శత్రు వనుకూలస్థానమునం దుండుటచేతను మనము ప్రతికూలస్థానమునం దుండవలసి వచ్చుటచేతను నీవిషమపరిస్థితి కలిగినది. ఇంతమాత్రముచే నీవంటి వీరాధివీరుఁడు నిరుత్సాహముఁ జెందవచ్చునా? వేఁటగాఁడు దుష్టమృగముల నెల్లడికిఁ దోలించి బారిసమరినట్లు మనము కపటోపాయంబున స్వల్పసంఖ్యాకు లగు సుదర్శునిసైన్యము సింహద్వారమును దెఱచి వెలికివచ్చునట్లు చేసితిమేని మనకు జయము సులభముగ లభించును. మఱియుఁ జండకరుండపరగిరిశిఖరంబు దరియుచుండుటచేఁ బరిస్థితులు మాఱినవి. బాహుబలముచేఁ గాకున్న బుద్ధిబలముచే నైనఁ బ్రత్యర్థిని లొంగఁదీయుట వివేకవంతుని లక్షణము. నాకొక్క యుపాయము తోఁచుచున్నయది వినుము. మీరు జయమునందు నిరాశఁజెంది కాందిశీకు లగుచున్నట్లు శిబిరంబుల నెత్తివేయించి ప్రాకారముదాపున నున్నసైన్యముఁ బొదలమాటున డాఁగియున్న సైన్యముఁ గాక మిగిలినసైన్యముతో వెనుకకు మఱలి యదృశ్యులు కావలయును. అంత శత్రుసైన్యమంతయు మిమ్మును వెన్నంటి తఱుమ నొక్కసారి వెలికివచ్చును. అప్పుడు మనకార్య మశ్రమంబుగ నెఱవేఱును. ఈయుపాయంబుచే నీవు నీసైన్యముతోఁ బురంబులోనికిఁ బ్రవేశించెదవు. పిమ్మట నిన్నడ్డగించుటకై హతశేషు లైన సుదర్శనుని సైనికు లందఱు నెక్కమొగి నీవున్నయెడకు వత్తురు. ఆసమయమునఁ బాణిద్వారముగుండ నేను నాసైనికులతోఁ బురంబులోఁ బ్రవేశించి

వెనుకతట్టునుండి శత్రువును బొదివెదను. అప్పుడు సుదర్శనుఁ డిరుకునఁ బడి మనకు లొంగిపోవును" అని చెప్పెను.

ఆమాటలు విని శూరసేనుఁ డమితానందముఁ జెంది "శహబాస్! మిత్రమా! కడుచక్కనియుపాయ మాలోచించితివి. అటులనే జరిగించెదను" అని పలికెను. అందుపైఁ గామపాలుఁడు "మిత్రమా! యుద్ధానంతరమున నీవు నాకుఁ జేసినవాగ్దానమును మఱచెదవు సుమీ!" అని శూరసేనుని వీడ్కొని తనశిబిరంబున కేగెను. అప్పటికిఁ జీఁకటి పడుటచే నారోజు యుద్ధము నాఁపివేసిరి.

నాఁటిరాత్రి సుదర్శనుం డేకతంబ కొలువుకూటంబున కేగి భానుమంతునిఁ బిలిపించి "నాయనా! భానుమంతా! నీ వాబోయయునకుఁడు సజీవుఁడై యున్నసంగతి నెవరిచే నెఱింగితివి? ఆవీరవ్రతుఁడు సజీవుఁడైయున్నచో నియ్యెడ కేలరాకుండును? వితర్కించినకొలఁది యాసంగతి యసత్యమేమో యని భయముకలుగుచున్నది" అని పలికెను. అందుపై భానుమంతుఁడు "మహారాజా! మనపురోపకంఠంబునంగల భవానీదేవ్యాలయంబునకు మహానుభావుం డగు నొకయతిప్రవరుఁడు వచ్చియుండె నన విని నిన్నటిరోజున వానిదర్శింప నేగితిని. యతీశ్వరుఁడు "బాబ్జీ! నీయేలిక యగుసుదర్శనమహారాజునకుఁ గుశలమేనా? వానియేకైకపుత్రిక యగుచంద్రకళ సుఖసంతోషంబుల వర్ధిల్లుచున్నదా?" అని ప్రసన్నవదనుఁడై యడిగెను. ఆమాటలు వినినంతనే యేలినవారిని యేలినవారిపుత్రికామణిని యాసన్యాసి యెట్లెఱుంగఁగలిగెనో యని యొక్కింత సంశయించి యతీశ్వరులు సర్వజ్ఞులగుటచే వారెఱుఁగరాని దొందును నుండ దని యనుకొని సర్వసంగపరిత్యాగు లగు నాయతిచంద్రుల కేలినవారిక్షేమ మరయఁగోరుటకు హేతు వేమైయుండునో యని విస్మయాకులితచిత్తుండనై "స్వామీ! వారుభయులుఁ గుశలులే. కాని నేఁటియుదయమున మధురాపురము

నుండి యెద్దియో యపర్తమానము వచ్చుటచే నద్దాని వినినంతనే యియువు రును దుఃఖావేశంబున మూర్ఛిల్లిరి. ఎన్ని చికిత్సలొనర్చినను వారి కిం కను దెలివి రాలేదు. శత్రువులు యుద్ధమునకు వచ్చుచున్నారు. మహా నుభావు లగు తమరు మ మ్మీవిపత్సాగరమునుండి యుద్ధరింపవేఁడె దను" అని వారిపాదములపై వ్రాలితిని. అంత నాసన్యాసి నన్ను వత్స లత్వంబున లేవఁదీసి "బాబా! భయపడకుము. వారి దుఃఖావేశ కారణము మే మెఱుఁగుదుము. మే మొకమంత్రమును నీ కుపదేశించెదము. అద్దాని వారిచెవిలో నుచ్చరింపుము" అని యాసంగతిని దెలిపి మఱియు నాసన్నరణోత్పాతంబునకు బెదరవద్దనియు వెఱవెఱింగి ప్రమత్తరిపుశుండాలంబుల నంతమొందింపఁ బ్రతాపసింహం బేతెంచు ననియుఁ దెలిపి తన్ను పీడ్కొలిపె" నని విన్నవించెను. ఆమాటలు విని నంతనే సుదర్శనునియంతరంగంబునఁ బట్టరానిసంతోష ముప్పొంగఁ దొడంగెను. భానుమంతుని జూచి 'నాయనా! ఆయతిప్రవరుఁ డింకను నాదేవాలయంబున నుండునా?" అని యడిగెను. అందుపై భానుమం తుఁడు "నేను కొండొకకార్యార్థమై నిన్న రేయి దేవాలయంబునకు మరల నేగితిని. అప్పు డాయతిప్రవరుఁ డుండెచ్చటను లేకుండుటచేఁ బాత్రస్ప్రకుంకకమున్నె వా రెయ్యెడకో చనియుందు రని తలంచితిని" అని పలికెను. తరువాత భానుమంతునకు సెలవొసంగి సేనాధిపతిని బిలిపించి మఱునాఁటిభండనంబునకు వలయునేర్పాటులను నిర్ణయించి పరిహృష్టాంతరంగుండై శయనాగారంబున కేగెను. ఈసమాచార మేమియుఁ జంద్రికకు దెలియంగదు. తనహృదయచోరుం డగు ప్రతాపసింహుఁడు సజీవుఁడై యుండునా యనియు బ్రదికియున్నచోఁ దను కొదవిన యీసమరోపద్రవమును వినియుండకుండునా యనియు విని యు నావీరాధివీరుండు సిద్ధయుండై తన్ను రక్షించుటకు రా నుపేక్షిం

చునా యనియుఁ బరిపరివిధంబులఁ దలపోయుచు మైమఱచి పల్వరిం చుచు మాటిమాటికిఁ ద్రుళ్ళిపడి లేచుచు నారేయెట్టులో వేగించెను.

తెల్లవాఱినది. సుదర్శనుని యోధులు ప్రాకారముపై కేగిరి. వారిదృక్పథంబున శత్రుసైన్యము కానరాలేదు. "పిఱికిపంద యగు శూరసేనుఁడు జయమునందు నిరాశ కలిగి యసువులపై నాసచే సైన్యసమేతంబుగఁ గాందిశీకుం డయ్యెఁ గాఁబోలు. శిబిరములనుగూడ నెత్తివేసిరి." అని యుత్సాహపూరితులై సింహనాదం బొనర్ప లో నున్న సుదర్శనుని భటులు వంతెనను జాఱవిడిచి సింహద్వారమును దెఱచిరి. సుదర్శనుని యాశ్వికదళమంతయు శత్రువును వెన్నంటి తఱు ముటకై యాద్వారమును నిర్గమించి వెలికివచ్చెను. అంత హఠాత్తుగ నదివఱకే నదిని దాఁటి ప్రాకారముచెంత నొదిగియున్న శూరసేనుని భటులా యాశ్వికశత్రుదళంబుపైఁ బడి యమితశౌర్యమునఁ బోరాడఁ దొడఁగిరి. పొదలమాటున డాఁగియున్న సైన్యముకూడఁ గలిసికొని యెను.

అప్పుడు దవ్వులనుండి యీపరిస్థితిని గాంచి తనతంత్రము ఫలిం చెఁగదా యని సంతసించి శూరసేనుఁడు సైన్యసమేతంబుగఁ దిరుగ వచ్చి శత్రుదళంబును మార్కొనియె. అప్పుడు పోరు మఱింత ఘోర మయ్యెను. లోనుండి సుదర్శనుని కాల్బలమా యాశ్వికదళమునకు బాస టగ నుండుటకై గుంపులుగుంపులుగ వచ్చుచుండెను. కాని యసమ సమరం బగుటచేఁ దప్తలోహంబునఁ జిలికిన నీటిబిందువులవలె వా రందఱు నదృశ్యు లగుచుండిరి. ఒక్కగంటలో సింహద్వారముప్రోల పాలికలనంతయు నతిభీభత్సం బయ్యెను. ఎయ్యెడఁ జూచిన విదళిత పుష్కరకుంభసనాథంబులై పీనుంగులై పడిన యేనుంగులును విఖం డితనిగాళకింకిణీసంకీర్ణంబులై యొఱఁగిన తురంగంబులును వికటకో పకుటిలవదనులు విస్ఫారవిరాలాపవివృతముఖులునై పడియున్న పదాతి

వాృతంబును విచ్చిపడిన హతశేషులును వ్రస్సిన వివిధాయుధంబులును దుృళ్ళిపడిన శిరంబులును దెృళ్ళిన రక్తాప్లావితకబంధంబులును దుృంగిన కరంబులును భగ్నంబులైన కపోలంబులును రుగ్నంబులైన కపాలంబులును బొృవులగు పేృవులును దుర్గమంబులగు మాంసకర్దమంబులును గలిగి రణరంగం బతిభీభత్సమై కనువేృగుగఁ జూపట్టుచుండెను. ఏవంకఁజూచినను రణనిహతవీరనికాయ్యంబు కాఁకుంబుల భక్షింప గృధ్రసంఘాతఫేరవానీకంబును రుధిరపానాసక్తి భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ ప్రముఖ పరేతగణంబులును జెలరేగుచుండెను. ఇంకను నుభయపక్షపువీరులుఁ బిఱుదివియని బీరంబులతోఁ బెనఁగులాడుచుండిరి. సుదర్శనునిసైన్యము చాలాభాగము హాృస్వమైపోయెను. అప్పటికిని హతశేషులగు నీరు లుడివోనిమత్సరంబున స్వామిభక్తిపరాయణులై తమ్మంతయో ప్రేముడి నాదరించెడు ధర్మప్రభువైన సుదర్శనమహారాజుప్రాణంబులఁ గాపాడుటకై తమప్రాణంబుల నర్పింపఁగోరి వెనుదీయక పోరాడుచుండిరి. కాని స్వల్పసంఖ్యాకులగు సుదర్శనునిసైనికు లత్యధికసంఖ్యాకులగు శూరసేనుని సైనికులతో నెంతసేపు పోరాడఁగలుగుదురు. సూర్యుఁ డపరదిక్కుడ్యంబు సమీపించునరికి శూరసేనుని హతశేషసైన్య మంతయుఁ బురంబులోనికిఁ జొరఁబడి కోటను సమీపించుచుండెను. కోటలో హాహారావము లుప్పతిల్లెను.

ఆసమయమునసే కోటపాణిద్వారమున నొకకోలాహలము వినవచ్చెను. శూరసేనుఁ డట్లు నిజసైన్యనివహంబుతోఁ బురంబులోఁ బ్రవేశించినసంగతిని దెలిసికొని కామపాలుఁడు పాణిద్వారమును ముట్టడించెను. వానికడిందిశూరులు కొందఱు ద్వారమును బ్రద్దలుగొట్టుటకుఁ బ్రయత్నించుచుండిరి. కొంద ఱాప్రాకారకుడ్యంబుపై కెగఁబ్రాఁకుచుండిరి. సుదర్శనునిసైనికదళములు హ్రాస్వముగుటచేతను

హత శేషమైనికదళము లన్నియుఁ గోటరక్షణార్థమై సుదర్శనునకు బాసటగా నుండవలసివచ్చుటచేతను గామపాలుని సైన్యవిజృంభణ మును వారింప వలనుపడకుండెను.

కోటరక్షకులైన భటులతో సుదర్శనుఁడు శూరసేనునిఁ గవి సెను. సింహము సింహముఁ గలియుఁబడి పోరాడునట్లు నిరుపమానపౌ రుషవంతులైన యామహారాజు లిర్వురును హృదయోద్ధతరోషాగ్ని జ్వాలల నుమియుచుండిరో యన నికటగ్రంధిలభ్రుకుటీలలాటులై కోప ఘూర్ణమానతారకులై దంతసందష్టవిశృంఖలవిరాలాపవివర్ణవదనులై భయానకమూర్తులై యనఁ బోరఁదొడంగిరి. వారిద్వంద్వయుద్ధ మతి భయంకరముగఁ బ్రవర్తిల్లుచుండెను. వారిఖడ్గసంఘర్షణంబులచే నిప్పురవ్వలు పై కెగురుచుండెను. శూరసేనుఁడు సుదర్శనునిఁ జూచి “ఓరీ వృద్ధజంబుకమా! రాజరూపచండాలుఁడా! చోరులకు యజమా నివై చౌర్యమున మెలంగుచుఁ గాలనేమివలెఁ బైకి శాంతభావంబున నటించి యసహాయలగు రాజకన్యకల ముచ్చిలింపఁ గోరుచుంటి విరా దురాత్మా! పయోముఖవిషకుంభమవై పరమసాధులగు నమా యకప్రజల నిచ్ఛకంబులచే వంచించి తడిపోచఁ గుత్తుకలు కోయుచుం టివి. నీకపటవృత్తికిఁ దగిశిక్ష నిప్పుడే నీచేత ననుభవింపఁజేయు చున్నాను. కాచికొనుము.” అని రౌద్రాకారంబున విస్రంభవిరా లాపము లాడుచు సుదర్శనునిశిరంబు ఖండింప కత్తియెత్తి హుమ్మని యాడుగఁ బై వేసెను. ఆవ్రేటు నేర్పుతోఁ దప్పించికొని సుదర్శనుఁడు రోషకషాయితాక్షుండై సామర్షావహాసంబుగ “నోరీ! శూరసేనా! రాజకులపాంసనా! నీవేల నిరర్థకంబుగఁ గల్లబొల్లిమాటలచే వాక్పరి శ్రాంతిఁ జెందెదవు? వట్టితుంపరులవలనఁ బ్రయోజన మేమి? మా యోపాయంబునఁ బురంబులోఁ బ్రవేశింపఁగలిగితినని గర్వింపకుము. నీ విప్పట్టున వంటింటికుందేలు వైతివి. ఇంక నీ వెందుఁ బోయెదవు?

క్రియా కేవలము త్తరమ్ అనునట్లు మదోన్మత్తుండ వగుచి కొసంగఁదగిన యుత్తరం బిదియే" అని ప్రచండపరాక్రమంబున శూరసేనుని జరణ హాతిఁ దెళ్ళ్ఁజేసెను. ఆపుస్థితిఁ జూచి శూరసేనునిభటులలో రణ కర్కశులు కొందఱు సుదర్శనునిపైఁ బడిరి. అది చూచి భానుమంతుఁ డతివేగంబున వచ్చి యాకళింగసైనికులశిరంబుల నొక్కనిముషము లో ఖండించి మహారాజునిఁ దెరల్చెను. వానిసమయోచితసాహస కృత్యంబునకు మహారా జమితానందముఁ జెందెను. అంతలో శూర సేనుఁడు లేచి మరల సుదర్శనునితోఁ దలపడియెను. విజయోత్సా హులగు శూరసేనుని యధికసంఖ్యాకులగు యోధులను స్వల్పసం ఖ్యాకు లయ్యు మహాపౌరుషవంతులగు సుదర్శనునియోధులు మా రొన్కనిరి. వారందఱొక్కయెడఁ గనిమసంగి పోరాడుచుండిరి. అయ్యెడఁ బో రెంతయు ఘోరమయ్యెను. ఆమహాభయంకరసంకుల సమరంబున మిన్ను మన్ను గానరాకుండెను.

శూరసేనుసైన్య మప్పటికి చాలాభాగము హ్రస్వమయ్యెను. కాని యయ్యది సుదర్శనునిసైన్యముకంటె నింకను మూఁడురెట్లధి కముగ నుండెను. కోటసమీపమున నట్టివిషమోగ్రభండనంబు ప్రవ ర్తిల్లుచుండఁ బులిమీఁదపుట్ర యనునట్లు కామపాలుఁడు పాణిద్వా రమును బ్రద్దలుకొట్టి నిజసైన్యనివహంబుతోఁ గోటలోపలఁ బ్రవే శించెను. శూరసేనకామపాలురు వరూధినీసహితంబుగ సంధింపఁగలిగి నచో జయలక్ష్మి వారికి సుకరంబుగఁ గరగతం బయ్యెడిది.

కామపాలుఁడు నిజవాహినీసహితంబుగఁ గోట దరియుచుం డుటఁ గని కోటపాణిద్వారమును గాచుచున్న పాంచాలరాజభటులు భయోద్రేకంబున నాక్రోశించుచుఁ గోటలోనికిఁ బోవుచుండ దుష్టశా త్రవమదోన్మూలనోద్యుక్తమానసుండును, వీరగంధవిలేపనదీపితుం డును, వివిధాలంకారశోభితమనోహరాకారుండును, విరచితకవచధార

ణాదిసకలసన్నాహసంరంభశుంభత్సముత్సాహుండు నగు నొకసుందరయువకుండు ధనుర్బాణంబులు గైకొని నెన్నడుము వామభాగంబున నిశితకరవాలంబు వ్రేలఁ గోటలోనుండి వెలికివచ్చి చెదరినవీరభటుల కమితోత్సాహమును గలిగించి వారల వెంట నిడుకొని కామపాలుని సైన్యమును మార్కొని ప్రావృణ్మేఘంబుక్రియ శరధారల ననర్గళంబుగఁ గురియఁజొచ్చెను. ఆశరాసారంబున మునింగియుండియు నెట్టకేల కతికష్టంబునఁ దెరలి యతిసాహసుండగు నాసుందరయువకుఁ డెవ్వఁడైయుండునో యని కామపాలుఁడు విస్మయాకులితచిత్తుండై కాలాగ్నిరుద్రుండో యన విజృంభించి యాయువకుని సంహరింపఁ దనచేతిలోని నిశితకరవాలంబును బైకెత్తి వానిపైఁ దనగుఱ్ఱమును దుమికించెను. అంత హఠాత్తుగ 'ద్రోహము. ద్రోహము' అని కెవ్వున నొకకేక వైచి చేతిలోనిఖడ్గమును జాఱవిడిచి కామపాలుఁడు గుఱ్ఱముపై నుండి క్రిందఁబడెను. వానిపై నిరువది చూచి వీరావేశంబున నాసుందరయువకునిపైకేగి యడ్డువచ్చినవానిభటులఁ బెక్కురఁ బెగటార్చి హతశేషులఁ బలాయితులఁ గావించి యాసుందరయువకునితో నొక్కమొగిని దలపడిరి. ఆయువకుఁడు వరనుండి కత్తిని దీసి నిరుపమానశౌర్యసాహసంబులఁ దనశస్త్రవిద్యాకౌశలంబు పెంపుదీపింప నొక్కండయ్యుఁ బెక్కురిపువీరులఁ జక్కాడఁజొచ్చెను. ఇట్లాయువకుఁడు సుకుమారుండయ్యుఁ గుమారుఁడో యన నొక్కింతతడవు విజృంభించి యున్మత్తశుండాలంబులమధ్యఁ జిక్కిన కేసరికిశోరంబుపగిదిఁ బోరాడి యలసి సొలసి మోహాటించుచుండ నెవ్వఁడో దుర్మార్గుఁడు వానిగుఱ్ఱమును బడఁగొట్టెను. అంత నాసుందరయువకుఁడు "హా! హా! ప్రతాపసింహా! ప్రతాపసింహా!" అని భూమిపైఁ బడి మూర్ఛిల్లెను.

ఆసమయంబున నెవ్వఁడో యొకపరివ్రాజకుఁ డశ్వారూఢుండై హుటాహుటి నయ్యెడ కేతెంచి పడియున్నసుందరయువకుని బంధింప యత్నించుచున్న యిరువురభటులఁ బడగొట్టెను. అంత విధువక కైతవసన్యాసి యగు నామహావీరుఁడు మారిమసంగినట్లు తననుజుట్టి కొనినశత్రునివహంబు నంతపిరిచిపుచుటకైన నవకాశ మియ్యక ప్రళ యకాలమార్తాండమండలంబుకగిది నిజకరఘటితనిశితకరవాలంబును మండలాకారంబుగఁ ద్రిప్పుచు నాశత్రువీరుల మస్తకంబులను బరిపక్వతాళఫలంబుల రాల్చినట్లు భూమిపైఁ ద్రొల్లఁజేయుచుండెను. ఒక్కనిముషములోఁ గుళిందసైన్యనివహ మంతయు నామైకశేష మయ్యెను.

ప్రతాపసింహుఁడు—సన్యాసిరూపంబున వచ్చిన మహావీరుఁ డతఁడే—వెంటనే గుఱ్ఱమును డిగ్గి యాసుందరయువకుని బంధవిము క్తునిఁ గావించి యారజ్జువుచే బాణహతినివేదనఁ జెందుచు భూమిపై స్పారిబ్బంగి పడియున్న కామపాలునికరచరణంబులను దృఢముగ బంధించి వానిని గొనిపోయి యొకయేకాంతకారాగారంబున నుంచి యచ్చో నిరువురుభటులను గాపుంచి తిరుగ నాసుందరయువకుని యొద్ద కేతెంచెను.

అప్పటికి చంద్రికళ—ఆసుందరయువకుఁ డామెయేయని మా చదువరు లిదివఱకే గ్రహించియుందురు—తెలివి జెంది లేచి నల్వలం కులఁ గలయఁజూచి పొలికలన శత్రువు లెవ్వరు లేకుండుట కచ్చెరు వొందుచుండెను. అప్పుడే ప్రతాపసింహుఁ డాలేమచెంత కేతెం చెను. చంద్రికళ వానిని గుర్తించలేదు. నిజమైన పరివ్రాజకుఁడే యని భావించి వానికి సాష్టాంగమెఱఁగి "స్వామీ! తమ రీపాంచాల రాజ్యలక్ష్మిని దుష్టశత్రులబారినుండి తప్పించి రక్షింప సన్యాసిరూ

పంబున నవతరించిన పరమపురుషులై యుండనోపు. స్వామీ! సుదర్శనమహారాజిప్పుడు శూరసేనునితో విషమసమరం బొనర్చుచుండె. కామపాలహతకుని బారినుండి నన్ను రక్షించినట్లే యామహారాజును గూడ రక్షింపవేడెదను” అని పలికెను. అందుపై బ్రతాపసింహుడు చిఱునగవుతో “బాలామణీ! నీవు కలియుగనరకాసురుడైన కామపాలునిపాలిటి సత్యభామ వైతివి కాబోలు!” నని పలికెను. ఆమాట వినినంతనే చంద్రికళహృదయము జల్లు మనియెను. ఆపురుషుడు తనచిత్తచోరుం డగు ప్రతాపసింహుడే యని యప్పుడు తెలిసికొని యానందపారవశ్యంబున నొక్కింత యొల్లంబోయి వెంటనే తెలివిం జెంది వ్రీడాభరంబున నవనతవదనపంకజయై ముసిముసినగవుల నోరచూపులు సారించుచు “శ్రీకృష్ణునియందు గలిగిన భాగ్యవతి యగు సత్యభామవలె నేనును దగువంటివీరాధివీరులయందు గాంచగలభాగ్యవతి నైతినని యట్లగుట యబ్బురమా!” అని యల్లన బలికెను. ఇరువురును గోటముఖద్వారము చెంత కేగిరి. అప్పటికి సూర్యుడస్తంగతుం డగుచుండెను.

శూరసేనసుదర్శనుల ద్వంద్వయుద్ధ మింకను జరుగుచునే యుండెను. అప్పటికి కాళింగసైన్యము చాలాభాగము హతమయ్యెను. కాని యది సుదర్శనుని సైన్యముకంటె నింకను నెనుమడుంగులుండెను. అట్టివిషమసమరం బొనర్చుచు మహాపరాక్రమశాలియైన సుదర్శనుండు శత్రుదుర్నిరీక్ష్యుండై నిజకరఘటితనిశితకరవాలంబును వలయాకారంబుగ ద్రిప్పుచు నిరుబుజంబుల దన కొత్తడి గలిగించు శత్రువీరుల జెండాడుచు శూరసేనుని ఖడ్గప్రహారంబుల నొప్పించుచు వానినోటోపం బడిపెను. శూరసేనుడు నిరుత్సాహుడై రణవిముఖత జెంది పలాయితుడుగా నుద్యుక్తుండగుచుండెను. సుదర్శనుని యోధవీరులు సింహనాదంబు లొనర్చుచుండిరి. జయలక్ష్మి శూర

సేనునివీడి సుదర్శనునిఁ జేబట్టుటకు సిద్ధముగనుండెను.

ఆసమయమున సుదర్శనుం డాగ్రహోదగ్రుండై శూరసేనుని పేరురమ్మునఁ బొడువఁబోవుచు దురదృష్టవశమునఁ బడియున్న యొక యోధుని మృతకళేబరము కాలికిఁ దగులుటచే బోరగిలఁబడెను. సుదర్శనుని సైన్యంబున హాహారావము లెసంగె. అప్పుడే శూరసేనుఁడు పడియున్న సుదర్శనుని కుత్తుకఁ ద్రొక్కిపట్టి కత్తియెత్తి వాని పేరురమ్మునఁ బొడువ యత్నించుచుండెను. అంతలో నెటనుండియో యొక బాణము రివ్వునవచ్చి శూరసేనుని దక్షిణభుజం బుచ్చిపోవుటచే శూరసేనుఁడు త్రుళ్ళిపడి చేతిలోని ఖడ్గమును జారవిడిచి యా వేదనఁ జెందుచుండియు నుడివోనిమచ్చరంబున నాబాధ సరకుఁగొనక యాబాణము నూడఁబెఱికి మఱియొక ఖడ్గమునుగొని సుందరయువకుని పైకుఱికెను. దవ్వుల సంకులసమరం బొనర్చుచున్న ప్రతాపసింహుఁ డాయుపద్రవమునుగాంచి వెంటనే పరుగిడివచ్చి శూరసేనునిఁ దన కభిముఖునిఁ గావించి "మహోగ్రకోపంబున "ఓరీ నికృష్టుఁడా పరమపాతకీ. క్షత్రియకులపాంసనా. శూరసేనా. నీదుష్టవర్తనము లన్నియు మాకుఁ దెలియవచ్చినవి. అందుకుం దగినఫల మిప్పుడే యనుభవించెదవు. నీదుర్మార్గకృత్య భాగధేయుండగు కామపాల హతకున కేమిగతి వాటిల్లెనో నీకును నాగతియే గలుగఁజేయుచున్నాను. కాచికొనుము." అని ప్రళయకాల దావానలంబు పగిదిఁ బ్రజ్వరిల్లు కోపాగ్నిజ్వాలలఁ దన తీవ్రదృష్టులఁ బఱగించుచు నావేశంబుగఁ దాకెను. శూరసేనుఁడు కోపఘూర్ణమానతారకుండై పండ్లు పెటపెటఁగొఱుకుచు, "ఓరీతులువా. యతివేషధారివగు నీ వెవఁడవురా. నాకు నీవు సోదె చెప్పఁగడంగితివా? నాతో యుద్ధముచేయ నెంచితివా? నిన్నిప్పుడే భూతబలి యొసంగుచున్నాను. కాచికొనుము." అని ప్రతాపసింహునిఁ గదిసెను. ఇరువురు నత్యుగ్రంబుగఁ గొంతతడవు

పోరాడిరి. ప్రతాపసింహుని ధాటి సైరింపఁజాలక శూరసేనుఁడు ఖడ్గ క్షత నిష్యందరక్తాప్లావిత దేహుఁడై పూచినరక్తాశోకంబువలె నొప్పుచుఁ బలాయితుండయ్యెను. హతశేషులైన వానిసైనికులు నల్దెసలఁ బాఱిరి. అప్పటికి సుదర్శనుఁడు తెలివిఁజెంది లేచెను. ప్రతాపసింహుఁడు శూరసేనునిఁ బట్టికొనుటకై వానిని వెన్నంటి తరుముచుండెను. యుద్ధము సమాప్తియగుటచే యందఱును తమతమ నెలవులకుఁ జనిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## పదునేడవ ప్రకరణము.

మ. సకలాశాగతనూత్న పల్లవములాస్వాదింపఁగాఁ గోరుచుం
త్సుకతన్ సూనశరప్రసక్తిఁ బ్రియునిం జూడఁగ మదింగోరి యో
పిక మాకంద సమాశ్రయంబున నహోభీతిల్లెదే యిప్పుడో
పికమా కందము సుస్థిరంబె ప్రియుని న్వీక్షింపవే యామనిన్.

"మానసకీరమా. అందరాని పండుకొఱకు కఱ్ఱుసాపెద వేల? వట్టియడియాసయేగాని నీకది దుర్లభము. అయ్యో, మఱచిపోవుద మన్నను మఱపురాకున్నయది. ఏమిసేయుదును. నాప్రాణవల్లభుఁడు త్వరలోనే వచ్చెదనని యేగి యీసరికిని రాఁడయ్యె. నాతండ్రి నన్ను మాయావియగు కామపాలునకిచ్చి పెండ్లిసేయఁదలంచిన సంగతిని విని నాయెడల విరక్తిఁజెందియుండెనాయేమి. అట్లైనచో నేజీవింపఁ గలనా. ఆనాఁడు నాకర్ణాంజలిపుటంబుచే నొక్కసారి క్రోలిన యా ప్రేమరసామృతమాధుర్యము నాయంతరేంద్రియములఁబట్టి యిప్పటికిని విడువకున్నయది. ఆమోహనాంగుని సరసముగూర్చుండి తదీయ ప్రేమరసపూరితమంజు మధురసరసాలాపంబుల ననుభవించుభాగ్యమునా కీజన్మమున మరల కలుగునా. రాజ్యకాంక్షచే నన్ను జేఁపట్టఁగోరి యనుసరించియున్న కామపాల దుష్టగ్రహము నాకట్టి యదృష్టమీ జన్మమునఁ గలుగ నిచ్చునా. నాతండ్రి యాజ్ఞను మన్నింపవలసి వచ్చినచో నా యాశాంకురంబు లన్నియు శోషిల్లకుండునా. ఆ యాశాంకుర వినాశముతోఁబాటు నా యీయభాగ్యదేహముకూడ నశించుట నిశ్చయము. ఎన్నిజన్మములెత్తినను నేను నాహృదయపీఠం

బున నిలిపి నిరంతరము పేమపుష్పంబులఁ బూజించుచున్న యా నాదైవమును విడుతునా. విడిచి బ్రతుకగలుగుదునా. వీరాగ్రగణ్యుఁడును సుగుణఖనియు రూపవిజిత మన్మథాకారుండునగు మదీయనయనోత్పల చంద్రుండు నాహృదయ చాతకంబును దనరుచిరకలామృతంబుచే నలరించుచుండియు నా నేత్రకుముదంబుల నేల వికసింపఁ జేయకుండెనో కదా! ఓకాంతులారా. నన్నేల బాధించెదరు. నిర్భాగ్యురాలనగు నన్ను విడిచి భాగ్యవతులచెంత కేగుఁడు. ఓహస్తమా. నీవొక్కసారె నెలయేటినీరు దావించునెపంబున నాసుందరాంగుని రుచిరాధరంబునంటి కృతార్థురాలవైతివి. వామాంకమా. నీవా జగన్మోహనున కొక్కసారె పర్యంకంబ వై ధన్యతను గాంచితివి. తనువల్లీ. ఎంతతపస్సు చేసినను నీవా పారిజాతభూజంబు నల్లికొనఁ జాలవైతివికదా. నీయభాగ్యత్వము నేమని చెప్పుదును. నీకంతియే ప్రాప్తి కాఁబోలు. ప్రాణరక్షకా. నన్ను నీహృదయపంజరాంతరంబున బంధించితినంటివే. ఇప్పుడేమి కారణంబున విడిచితివి? వంచకుల కుటిల తంత్రంబులచే నేనెట్టికష్టముల ననుభవింపవలసివచ్చినను వీరాగ్రేసరుండవగు నీహృదయపంజరంబునఁ జేరితిసికదా. నాకేమి భయమని సంతసించితిని. ఇక నాకెదిక్కెవ్వరు. ఏమహాపురుషుఁడు నా కేడుగడయని నమ్మియుంటినో యాపూజ్యుని యనుగ్రహమును బడయఁజాలనైతిని. ఇంక నే నీమేన నెవనికొఱకై ప్రాణములను ధరించియుండవలయును. ఛీ. ఛీ. నిర్భాగ్యురాలా. లలితా. నీవింకేమిఁజూచికొని భూమిపై మనఁగోరుచుంటివి. ఆసుహాసిుని నగుమొగంబుఁగనులారఁ జూచుచు వాని మంజుమధుర వాక్సుధారసమును గర్ణపుటంబులఁ దనివితీరఁ గ్రోలుచు వాని ప్రేమమయదరహాసచంద్రికల నోలలాడుచు వాని నిండుకౌఁగిటఁ జేరి మనసార మదనసామ్రాజ్య మెప్పు డనుభవించెదవో యప్పుడే నీజీవితము సార్థకముకాఁగలదు. అంతవఱకును

నీవు పట్టి నిర్భాగ్యురాలవే. భావమరీదికలచే మాటిమాటికి వంచింపఁబడుచు శోషిల్లుచుండియు నసువులపైఁ గాంక్ష విడువలేకుంటివి. నీ హృదయాలవాలంబునఁబుట్టి యత్యూర్జితంబుగ వర్థిల్లిన యాశాలత యాపాపిష్ఠి వాయువులఁబైకి వెడలకుండ బంధించెఁగాఁబోలు. ప్రాణవల్లభా. ఆనాఁడు చెఱసాలలో నీమోహనరూపమేల నాకంటఁ బడవలయు. పిదప నరణ్యంబున నీకొక్కింత సేవఁజేయుభాగ్యము నాకేల గలుగవలయు. వీరాగ్రగణ్యా. నిరుపమానతేజః ప్రభాభాసితంబై ప్రతాపదీధితుల వెలుంగు నీవదన బింబోదయంబుఁ గానక పవళ్ళును నీదరహాసచంద్రికలు లేక రాత్రులును నొక్కరీతి నాకు గాఢాంధకార బంధురంబులై యుండుటచేఁ దడవికొనుచు గతిఁగానక చెరలాడుచున్న నాకు నీ సుస్వరూపకాంతిచేఁ ద్రోవఁజూపవా.” అని నిటలతటఘటితకరకమలపుటియై నిట్టూర్పువిడుచుచుఁ బుష్పగిరి కేళీవనాంతరంబునఁ జంద్రశిలావేదికపై లలితయేకతంబగూర్చుండి తన మనోహరుండగు వీరపాలునిగొఱకు బహుప్రకారంబులఁ బనవించుచుండెను.

అంత నంతికంబున నెట్టియో కలకల ముప్పతిల్లెను. అప్పుడే చేటియొక్కర్తు రోదన మొనర్చుచు లలితయున్న చోటికిఁ బరుగిడివచ్చి “అయ్యో! ప్రియసఖీ! లలితా ఇంకేమున్నది. కొంపమునిఁగినది.” అని గద్గదకంఠయై కుయ్యిడెను. ఆకుయ్యి చెవినిఁబడినంత లలితత్రుళ్ళిపడిలేచి చేటినిఁజూచి “ఏమిదీ! సఖీ! ఏమంటివి. ఏమి యుపద్రవము తటస్థించినది?” అని యత్యార్తితో నడిగెను. అందుకు చేటి దుఃఖాతిశయంబున మాటాడఁజాలక యెట్టకేలకు “హా! ప్రియసఖీ! శూరసేన మహారాజుగారు—” అని వాపోవఁదొడంగెను. అందుపై లలిత “అయ్యో! సఖీ! ఏమిజరిగినదో చెప్పవేమి. రణరంగంబున నా తండ్రి పరాజితులైరా యేమి? వారి కేక్షేమము కలుగ లేదుకద” అనెను.

అందుపై చేటి శూరసేన మహారాజుగారు భండనంబున నోడి పలాయితులై రనియు వారిజాడ యొంతవెదకినను గానరాలే దనియు శత్రువులు పుష్పగిరికోట ముట్టడింప వత్తురేమో యనియు హతశేషులైన రాజభటులలో నొకడువచ్చి చెప్పెనని పలికెను. పిడుగువలె నానుడి చెవినిఁబడినంతనే లలిత "హా! తండ్రీ తండ్రీ" అని దుఃఖవివశురాలై పుడమిపయింబడి మూర్ఛిల్లెను. చేటివెంటనే శీతలోదకంబులను దెచ్చి యామె ముఖముపైఁ జల్లి పైఁటచెంగుతోఁ దుడిచి చెంతఁగూర్చుండి పద్మదళతాళ వృంతంబుచే విసరుచుండెను. అంత మఱియొక చెలికత్తియకోటను బట్టికొనటకు శత్రువులు వచ్చుచుండిరని యాక్రోశించుచు వచ్చి యచ్చోనున్న చేటియుఁ దాను మూర్ఛమునింగియున్న లలిత నెత్తికొని యరణ్యములోఁ జొరఁబడి యందొక దట్టమైన గుజ్జులేమావితోపులో డాగియుండిరి.

కొంతసేపటికి చెలికత్తియలశైత్యోపచారంబులవలన లలిత తెలివిఁజెంది లేచెను. రిచ్చవడిన చూపులతో నల్వలంకులు గలయఁజూచి "చెలులారా! మనమియ్యెడ కేల్లు వచ్చితిమి? ఇచటికి రాఁగతంబేమి? శత్రువులు వచ్చి కోటను స్వాధీనఁబఱచికొనిరా యేమి?" అని యడిగెను. అందుపై జరిగిన సమాచారమంతయు వారు తెలుపఁగోపవిషణ్ణహృదయయై లలిత "వివేకహీనులారా! ఇఁకను మనకు శత్రువులవలనఁ గలిగెడు నపకారమేమి యుండును? వారు చేయఁగలిగిన హానియేమో చేసిరి. ఇంతకు మిక్కిలి వారేమి సేయఁగలరు? నాకొఱకై జీవయాత్ర జరుపుచున్న నాతండ్రిని మ్రింగివేసిరి కదా. దిక్కుమాలిన పరమనిర్భాగ్యురాల నగు నేనేమైన నేమి. అనాథయై యున్న కళింగరాజ్యలక్ష్మి యింక యెవరిపాలైన నేమి? శత్రువులు నన్నుఁ గనినచో నాకేమైన గీడు గావింతురేమో యని భయపడితిరి కాఁబోలు. పిఱికిపందలారా! బుద్ధిహీనులారా! నేను భూమిపైఁ బడి

నతోడనే కన్నతల్లినిఁ జంపితిని. నాటనుండియు నెవ్వాఁడు నన్నతి గారాబముతోఁ బెనుచుచు నెట్టి దుర్లభవిషయముల నైనఁ గోరుట తడవుగా నెరవేర్చుచు నన్నుల్లసింపఁ జేయుటకే తన జీవిత శేషమును వినియోగించుచుండెనో యెవ్వాఁడు నాకొఱకు దుర్భర క్లేశముల ననుభవించెనో అట్టి నాతండ్రిని నే డీవిధంబునఁ జంపితిని. మనసార ప్రేమించిన హృదయవల్లభున కీపేరాశారాల నైతిని. ఇట్టి పాపాత్మురాల నగు నేను జీవించియుండిన నెవరి కేమిలాభము. ఇంక నేనెవ్వని కొఱకు భూమిపై జీవించియుందును? హా తండ్రీ! నాకేమి గతిఁజూపి పోయితివి? స్వర్గసుఖభోగంబుల నాసించి నీముద్దుల బిడ్డనైన నన్ను మఱచితివా. ఇంతకాలము నాయెడల జూపిన ప్రేమచు నీవెట్లు వీడఁగల్గితివి. నేను బరువైతినా." అని యరణ్యమంతయుఁ బ్రతిధ్వనించు నటులఁ బేరెలుంగున నేడువసాగెను. "అయ్యో! ప్రియసఖీ! ఊరడిల్లుము. ఊరడిల్లుము. రాజభటుఁడు మహారాజుగారు పలాయితులైరని చెప్పెనే గాని మఱియొక విధముగఁ జెప్పియుండలేదు. ఊరకయేల వాపోయెదవు. వారు సజీవులైయుండ నీవిట్లు విలపింపనగునా. ఊరడిల్లుము." అని చెలికత్తియలు బహుప్రకారంబుల నామె నోదార్చుచుండిరి. లలిత వారి మాటలు వినిపించికొనకయే కొంతసే పేడ్చియేడ్చి పుష్పసుకుమారి యగుటచే నలసటఁజెంది సొమ్మసిల్లి నేలఁ ప్రాలెను. సఖీజనం బతిసంభ్రమంబున నామెకు వివిధోపచారంబుల నొనర్చుచుండిరి.

ఆసమయమున దవ్వుల గుఱ్ఱపు డెక్కలచప్పుడు వినవచ్చెను. శత్రువులు తమ జాడఁదెలిసికొని తారున్నయెడకు వచ్చుచుండిరేమో యని చెలికత్తియలు భయకంపితు లగుచుండిరి. అప్పుడొక యాశ్వికుఁ డాయబలలఁ గాంచి వారి చెంతకేతెంచి "సుందరీమణులారా! మహారాజుగారి యేకైకపుత్రిక యగులలితాకన్యయెచ్చో

టనున్నదో మీరెఱుంగుదురా ?" అని యడిగెను. చెలికత్తియలు చకితదృష్టుల వానిం జూచుచు మిక్కుటంబగు భీతిచేఁ బెనుగాలిలోఁ జలించు శిరీషకుసుమంబులవలె గజగజవడంకుచు నోటమాటరాక ప్రత్యుత్తరమేమియు నొసంగజాలరైరి. అంతలో లలిత దిగ్గనలేచి రాజభటు నవలోకించి "ఆశ్వికా. నీవెచ్చోటనుంచి వచ్చుచుంటివి? నాకొఱకై వచ్చితివి కాఁబోలు. నాతో నీకేమి పనికలదో వచింపుము." అని ధైర్యముతోఁ బలికెను. అందుపై నాయాశ్వికుఁ డమితానందముఁ జెంది "తల్లీ నేను హేలాపురమునుండి వచ్చుచుంటిని. శూరసేన మహారాజుగారి యాంతరంగిక భటుండను. దురదృష్టవశమున మహాశూరులును వీరశిఖామణులు నగు కళింగ రాజభటు లందఱు హేలాపురయుద్ధములోఁ జనిపోయిరి. మహారాజగారు సర్వాంగక్షతులై రక్తాప్లావితదేహులయ్యు సజీవులై యీ సమీపముననే యొకరహస్యస్థలమునఁ జికిత్స నొందుచున్నారు. మిమ్ములనుఁ జూడఁగోరి పుష్పగిరికేగి మహారాజ సౌధములో మీకొఱకెల్లచోటుల నన్వేషించితిని. కనిపించిన వారినెల్ల నడిగితిని. ఎంత ప్రయత్నించినను మీజాడ తెలికపోవుటచే వ్యర్థుండనై తిరుగ నేగినచో నుపద్రవము తటస్థించును కదా యని విచారించుచుఁ జేయునదేమియు లేక యీదిక్కున వచ్చుచుండ నాభాగ్యవశంబున మీరిచ్చోటఁ గాన్పించితిరి. తల్లీ తమచేతికే యిమ్మని మహారాజుగారీలేఖ నొసంగిరి. వారు చాలా యుపద్రవములో నున్నారు. చిత్తగింపుఁడు" అని తనజేబులో నుంచి యొకలేఖను దీసి లలితచేతి కిచ్చెను. అత్యార్తితో నాలేఖనందికొని లలిత యద్దానివిప్పి చదువుకొనెను. అందిట్లు వ్రాయఁబడి యున్నది.

"నాముద్దుల లలితా. నాపైఁగల నిర్హేతుక మాత్సర్యంబునఁ జోరులచే నీకట్టి కారాగారక్లేశంబును గలిగించిన పరమద్రోహియగు సుదర్శనుని శిక్షింపఁగోరి వానిపై దాడివెడలివచ్చి పాంచాలసైన్యము

నంతయు రూపుమాపితిని. శత్రుపురములోనికిఁ బ్రవేశించి కోటగుమ్మము దరిసితిని. సుదర్శనునిఁ బడఁగొట్టితిని. జయలక్ష్మి చేతికిఁ జిక్కెనని తలంచితిని. కాని దైవము నాయెడలఁ బ్రతికూలుఁడై యుండుటచేఁ గాఁబోలు నాసమయమున నామురదృష్టదేవతయో యనునొక కపటసన్యాసి యశ్వారూఢుండై వచ్చి నాసైన్యము నంతయు హతముగావించి నాకీయపజయంబును గలిగించెను. నీకొఱకై బ్రతుకుచున్నవాఁడ నగుటచే నాయవమానమును సహించి శత్రుచేతిలోఁ జిక్కకుండఁ బలాయితుండనై నిన్నుఁ జూడఁగోరి పుష్పగిరి కేతెంచుచుండ నాకపటసన్యాసియే నను వెనువెంటఁ దరిమికొనివచ్చి యీయరణ్యమధ్యమున నొకకొండపై నన్ను మాఱ్కొనియె. మిక్కుటముగ నలసియుండుటచేతను పూర్వరణక్షత వేదనలచేతను బడలియున్నవాఁడనయ్యుఁ గొంతతడవు వానితో సరాసరిఁ బోరాడితిని. ఇరువురి ఖడ్గంబులును భగ్నంబు లగుటచే మల్లయుద్ధంబునకుఁ గడంగితిమి. అట్లు కలియఁబడి పోరాడుచుండ నెవఁడో దుర్మార్గుఁడు నావెనుకనుండి వచ్చి కత్తితో నావీపుమీఁదఁ బొడిచెను. ఆదెబ్బచే విస్మృతుండనై కొండపైనుండిదొర్లి క్రిందఁబడితిని. పిదప నీరాజభటుఁడు నన్నీ యేకాంతస్థలంబునకుఁ గొనివచ్చి తగుచికిత్స యొనరింపఁ దెలివిఁజెందితిని కాని నేనింక జీవించను. నిన్నొక్కసారి కనులారఁజూచి మనసారఁ గడసారిముద్దుఁగొని దివంబున కేఁగఁదలంచి యతికష్టంబున నీలేఖ నీపేర వ్రాయించితిని. వివేకవంతురాలవగు నీవు దుఃఖవివశత నుపేక్షింపక తక్షణ మీరాజభటునితో బయలుదేరివచ్చి మృత్యుముఖంబుననున్న యభాగ్యుఁడగు నీతండ్రి చివరకోరికఁ దీర్చెదవని నమ్ముచున్నాను.

ఇట్లు శూరసేనుఁడు."

ఆయుత్తరముఁ జదువుచున్నంతసేపు లలిత కంటికి నేలకు నొక్క ధారగా నేడ్చుచుండెను. కన్నీరు మాటిమాటికిఁ దుడిచికొనుచు

నందలి విషయములను గ్రహించి వివేకవంతురాలగుటచే సంశయాకు లితచిత్తయయ్యు గుండె రాయిఁజేసికొని యాలేఖ తనయొద్దనే యుంచికొని "సఖులారా! నేనిప్పుడు నాతండ్రియొద్ద కేగుచున్నాను." అని రాజభటునితో బయలుదేరెను.

ప్రతాపసింహుఁ డదృశ్యుఁడైనపిదపఁ జంద్రశేఖరమహారాజు మఱియు విచారగ్రస్తుఁడయ్యెను. వానియాజ్ఞపైఁ బ్రతాపసింహుని చమరాగొని వానిజాడ నరయ నెల్లయెడల నన్వేషింప రాజభటులుకొందఱు బయలుదేరిరి. కొందఱు నిపుణులైన గూఢచారులు పురములోను పల్లెటూళ్లలోను వెదకుచుండిరి. ఎవ రెంత వెదకినను లాభము లేకపోయెను. చిత్రాంగి వానిజాడ తెలిసికొని తోడ్కొని వచ్చినవానికి తన మెడలోని చంద్రహారము బహుమతిగ నిచ్చెదనని యెను వీరపాలుఁడు తండ్రియొద్దకేగి "జనకా! నేనుఁగూడజని యాయువకునిజాడ నరసివచ్చెదను సెలవొసంగెదరా. ఆపురుషునిఁ జూచినప్పటినుండియు దైవప్రేరణచేతనో వానియందుగల యద్భుతమైన నొక రహస్యమహిమచేతనో నాహృదయము మయస్కాంతముచే నాకర్షింపఁబడు లోహశలాకవలె వానియందుఁ దగిలియున్నది. ఆమహానీయుని దైవమెవ్విధంబుననో రక్షించియే యుండునని నానమ్మకము. తండ్రీ! అనుగ్రహించి సెలవియ్యరా" అని సవినయంబుగ నడిగెను. ఆమాటలు వినినంతనే మహారాజుహృదయము మఱియు క్షోభించెను. "నాయనా! వీరపాలా! నీకు వానిపై సంతప్రేమకలుగుట సహజమే" అని బాష్పాంబుపూరితలోచనుండై నిట్టూర్పువిడిచి గద్గదకంఠంబునఁ బలికెను. వీరపాలుని హృదయక్షేత్రంబున నిరువది సంవత్సరముల క్రిందట నదృశ్యుఁడయ్యెనని వినియున్న సోదరుఁడు జ్ఞప్తికివచ్చి యేమేమో నూతనాశాంకురంబులు మోసులెత్తసాగెను. అంత

భావోద్వేగంబు నడంపఁజాలక "తండ్రీ! వానిఁజూచుటకు నామనం బేలనో దుర్భరంబుగఁ దత్తరపడుచున్నయది. నేను వానిని దైవానుగ్రహంబుచేఁ జూడగలిగితినేని వానిని నాపూజ్యసోదరునిగ భావించి తదీయచరణసేవయందే నా జీవితమంతయు వినియోగింపవలయునని నాకోరిక. నాకు సెలవొసంగరా." అని తత్తరపాటుతో నడిగెను. "నాయనా! భగవంతుఁడు నీకోరికసిద్ధింపఁజేయుఁగాక. పోయిరమ్ము." అని ప్రియపూర్వకంబుగ ననుజ్ఞ యిచ్చెను. తక్షణమే వీరపాలుఁడు శ్యామాఘనుండై బయలుదేరెను.

వీరపాలుఁడట్లు బయలుదేరి యమునానదిపైగలవంతెనను దాటి యేదిక్కున కేగుదునాయని యోచించుచు నొక్కచోట నిలఁబడియెను. వానికనతిదూరంబునఁ గొందఱు పల్లెవాండ్రు వలలాఱవైచికొని యొకకుజచ్ఛాయను వలత్రాళ్ళ నల్లికొనుచుండిరి. వారిలో నొకఁడు "ఓరయ్య నిన్నరేయి మనము రచ్చించిన కోడెగాఁడెవ్వఁడో గాని వాఁడెంతగట్టిపిండమురా. సచ్చిపోయెనని యనుకొంటిమేగాని సావలేదోసి. ఆయడుగుజాడలు నీవు గుఱ్ఱించినావురా." అని పలికెను. ఆమాటలు వీరపాలునకు వినఁబడియెను. వెంటనే వీరపాలుఁడా బెస్తలున్నయెడ కేగి యడుగుజాడలను జూచి వాని ననుసరించి బయలుదేరి పుష్పగిరిఁజేరెను.

అప్పటికి సూర్యాస్తమయమయ్యెను. అప్పటికే పుష్పగిరి నిర్మనుష్యంబై నిశ్శబ్దంబై యుండెను. అట్లుండుటకుంగల కారణ మరయఁగా శూరసేనుఁడు కామపాలునితోఁగూడి సుదర్శనునిపై యుద్ధమునకేగెననియు నతఁడు రణరంగంబునఁ బరాజితుండై యపాయస్థితిలో నుండెననియు వానిఁజూచుటకై లలితాకన్య యేగెననియు శత్రువులు పుష్పగిరికోట స్వాధీనపఱచికొనుట కేతెంచుచుండిరనియు విని పురజనులు భయోద్రేకంబునఁ దమయిన్నులవీడి పనమ్మున కేగిరనియుఁ

దెలియవచ్చెను. తక్షణమే వీరపాలుఁడు హేలాపురమునుగూర్చి బయలుదేరెను.

చీకటి పడినది. వీరపాలుఁడు బదరీగిరిగహ్వరంబు సమీపించుచుండెను. ఆసమయమున "హా తండ్రీ! హా. ప్రాణవల్లభా! వీరపాలా! మరల చోరులచేతిలోఁ జిక్కితిని. జీవితేశ్వరా! నేనీజన్మంబున మరల నీముద్దుమోముఁ జూడఁజాలనుకాఁబోలు వీరపాలా!" అను నార్తనాదము వినిపింప వీరపాలుఁడు తన మనోరమయగులలిత చోరులచేతిలోఁ జిక్కి యాపదఁ జెందుచుండుటఁ దెలిసికొని రౌద్రమూర్తియై యత్యావేశంబున నాధ్వనివచ్చిన దిక్కునకుఁ దనగుఱ్ఱమును దుమికించి బాణవేగంబునఁ జనియెను. ఒక్కచో నొకచోరుఁడు—కపటలేఖను లలితకొసంగిన యాశ్వికుఁడతఁడే—లలితనోటిలో గుడ్డలుకుక్కి మూపుననెత్తికొనఁ బ్రయత్నించుచుండెను. అదిచూచి వీరపాలుఁడు రోషానలోద్రేకంబునఁ గనులనుండి విస్ఫులింగంబు లెగయ వెంటనే వరలోనుండి కత్తినిదీసి యొక్కవ్రేటున వానిశిరంబునఁ బెద్దగాయమును గలిగించెను. ఆదెబ్బతో వాఁడు వివశుఁడై క్రిందఁబడియెను. వెంటనే మూర్ఛిల్లియున్న లలితనోటిలోని గుడ్డలను దీసి యామెను మూపుపైనిడికొని గుఱ్ఱమును కళ్ళెముబట్టి వెంటనడిపించుచు జాలానదీతీరమున కేగెను. అచ్చటి ప్రదేశమంతయు నతిభీభత్సంబుగ నుండెను. జాలానదీతీరంబున లలితను పరుండఁజేసి యానదీజలంబును లలితమోముపైఁ జల్లి తనయుత్తరీయాంచలంబుచేఁ జెంతగూర్చుని విసరుచుండెను.

అట్లుండ లలిత కొంతసేపటికి తెలివిఁజెంది కనులెత్తిచూచి చకితయై మరల కనులుమోడ్చెను. వీరపాలుఁడతిసంతోషముతో "లలితా. లలితా. భయపడకుము. నేను చోరుఁడనుగాను. నీయనుమతిపై నిన్నువిడిచి మధురాపురంబునకేగినదిమొదలు నేటివరకును

నీపై విరాళిఁజెందుచు విరహానిదాఘతప్తుండనై నీదరహాసచంద్రికల నపేక్షించివచ్చిన దీనచకోరకంబైన వీరపాలుండను. మరల నిన్ను చోరులబారినుండి రక్షించి దక్కించికొనఁగలిగితిని. నే నెంతయు నదృష్టవంతుండను." అని పలికెను. లలితకనులు తెఱచిచూచి వీరపాలుని గుర్తించి దిగ్గనలేచి "ఓహో ప్రాణవల్లభా! వచ్చితివా!" అని యానందపారవశ్యంబున మాటాడలేక వీరపాలుని మెడపై వ్రాలి మరల మూర్ఛిల్లెను. అంత వీరపాలుఁడు వలయు నుపచారము లొనరింప లలిత తెలివిఁజెంది "ఏమి! నేను కలగనుచుంటినా! లేక నిజముగ నాజీవితేశ్వరుఁడు వచ్చెనా!" అని యచ్చెరు వందుచుండ వీరపాలుఁడు "ప్రియసీ నేను వీరపాలుఁడనే. చెంతనున్న నన్ను గుర్తింపలేకుంటివా!" అని ప్రియమార ముద్దుబెట్టికొనియెను. లలిత పూర్తిగఁ దెలివిఁజెంది యానందరసనిమగ్నయయ్యు వీరపాలునిఁ జూచి "ప్రాణవల్లభా! ఇది నాకు సంతోషసమయము కాదు. నాతండ్రి యుద్ధమునఁనోడి రణక్షతంబులతో శత్రువుచేతిలోఁ జిక్కి మరణావశిష్టుండై యుండెనట. నే నిప్పుడు మీ సహాయంబున హేలాపురంబునకేగి నాతండ్రి కుపచారము లొనర్పఁ గోరుచున్నాను" అని దీనదృష్టులఁ బలికెను. అందుకై వీరపాలుఁడు "ప్రియురాలా! నీసంకల్పం బెంతయు శ్లాఘనీయమైనది. సుగుణరాశివగు నీసదుద్యమంబునకు భగవంతుఁ డంతరాయము గలిగించునా! పోవుదము రమ్ము." అని యిరువు రావంతెనను దాటి పురసింహద్వారంబు సమీపించిరి. సింహద్వారము మూయఁబడి యుండుటచే నా యిరువురుఁ బురములోని కేగుటకు వలనుపడక యాద్వారము చెంతనే కూర్చుండిరి. అప్పుడు వీరపాలుఁడు లలితతో "ప్రియురాలా! వివేకవంతురాల వయ్యు నబలవగు నీవు వంచకుల మాయాతంత్రంబులకు లోనై యొక్కతవైన విమర్శింపకుండ నట్లేకతంబ రా సాహసింపవచ్చునా!" అని మందలించెను. అందుపై లలిత జరిగిన

సమాచార మంతయు నెఱింగించెను. వీరపాలుం డుగ్రుండయ్యెను. లేఖాసమాచారములో నగ్గడించిన కపటసన్యాసి యెవ్వఁడై యుండునో యని యోజించుచుండెను. అంతట తెల్లవాఱుటచే బురసింహద్వారంబును దెఱచిరి. వెంటనే యాయువతీయువకులు పురములోని కేగిరి.



# ప్రతాపసింహ.



## పదునెనిమిదవ ప్రకరణము.



చ. నిజముగ పుత్రవత్సలత నేర్పుగ రాజ్యము నేలు సత్ప్రభుం
డజిత పరాక్రమస్ఫురణ నాజివిసర్జిత వైరియామ ది
గ్విజయ విభూతివర్ధిలఁడె విశ్రుతకీర్తి నతండు రాజ్యమున్
బ్రజలది గా నెదం దలచి పాటుపడున్ శ్రితకింకర స్థితిన్.

యుద్ధానంతరమున హేలాపురమతి నిశ్శబ్దముగనుండెను. సుదర్శన మహారాజు రణపరిశ్రాంతిచేఁ బానుపుపైఁ బవ్వళించెనే గాని నిదురింపలేకుండెను. మాటిమాటికిఁ దుల్లిపడుచు లేచి కూర్చుండుచు మైమఱచి పల్వరించుచుఁ బరిపరివిధంబుల మనోవేదనను జెందుచుండెను. శత్రువుల నిర్జించి రణంబున జయలక్ష్మీవరుండైనను వాని కిసుమంతయైన సంతోషము లేకుండెను. పాన్పుపైఁ గూర్చుండి తనలో "హేదేవా! నేను పరమపాపాత్ముండను. నావంటి నిర్దయుని నీవేల యనుగ్రహించి రక్షించితివి. నన్నైహిక దుఃఖంబులచే శిక్షింపఁదలంచితివా. అకటా! నెల్లవాఱినపిదప బిడ్డలను దలంచి దుఃఖించెడు తల్లిదండ్రుల యాక్రందనలను దల్లిదండ్రులఁ దలంచి పలవించెడు బిడ్డల రోదనంబులను భర్తలఁదలంచి శోకించు భార్యలవిలాపములను నేనీ పాపపుచెవులతో వినవలయునుగదా. నిర్హేతుకంబుగనైన నేమి సహేతుకంబుగనైన నేమి పరహింసాసక్తులపైఁబడినతఱిఁ బ్రజలను రక్షించుటకై వీరోచిత సుక్షత్రియవంశ సంభూతుండనగు నేను యుద్ధమున కెల్లు వెనదీయుదును. ఈయకారణ యుద్ధమును వారించుటకై యెన్నియో రాయబారములు జరిపితివి. రక్తతృష్ణాపరుండగు క్రూరశత్రువు ముష్క

రుండై తాను పూనిన దారుణోద్యమమును మానఁడయ్యె. నా ప్రజలాగ్రహోదగ్రులై విశృంఖల రణోత్సాహంబున విజృంభించిరి. నేనేమిసేయుదును యుద్ధము ప్రజాక్షయకరంబని యుపేక్షించితి నేని నే నసమర్థుండనని జనులు నన్ను ధృణీకరింపకుందురా. అట్లుపేక్షించుట శత్రువునకు మఱింత హెచ్చరికను గలుగఁజేయుటయే. ప్రజాకింకరుండనగు నేను ప్రజల యభిప్రాయానుగుణ్యంబుగ బ్రవర్తింపక తీరునా. ఈ క్షత్రియధర్మ మెంతకష్టమైనది. నామూలంబున నేగదా యీపురంబున కింతటి విపత్తుకలిగినది. ఈ రాజ్యప్రజల జీవధనంబులకు నేనే బాధ్యుండనగుటచేఁ బ్రజలువచ్చి "నిన్ను నమ్మి నీయధీనములోనుంచిన నాబిడ్డఁడేఁడీ? నాసోదరుఁడేఁడీ? నాతండ్రియేఁడీ?"అనినన్నడిగినవారికి నేనేమిజవాబుచెప్పుదును. ఓయీ శూరసేనా. నిర్హేతుకంబుగ నాకింతటి ఘోరవిపత్తుఁ గలిగించుటకునీకు నే నేమియపకార మొనరించితిని. నీవు నాపై నారోపించిన నేరములను బట్టిచూడ నీ నిర్హేతుక దారుణకర్మం బెవరి ప్రోత్సాహంబుననో చేయఁబూనితివికాని నీస్వబుద్ధిని కాదని తోచుచున్నయది. అయిన నొకరిననవలసిన పనియేమి! నాదురదృష్టదేవతయే నిన్నీ మారణ కర్మంబునకుఁ బ్రోత్సహించి యుండనోపు" అని పరిపరివిధంబులఁ దలపోయుచుండెను.

ప్రక్కగదిలోఁ జంద్రకళయు నిద్రపట్టక పాన్పుపైలేచి కూర్చుండి యేమేమో తలపోయుచుఁ గళవళించుచుండెను. "అపారకృపాసముద్రుండవగు నో దేవా. నీయనంతదయచేతనేగదా మేమీ దారుణవిపత్తునుండి వెలిఁబడఁగల్గితిమి. ఆసన్యాసి యెవ్వఁడైయుండునో తెలియరాదు. వానినిఁ జూచినప్పటినుండి నామనఃకీరము పై కెగురనుద్రేకించుచున్నయది. ప్రచ్ఛన్నాకృతి నున్నను పూర్వపరిచితుని వలెఁ జూచినంతనే నన్ను గుర్తించి నాక్షేమముఁగోరి నన్నట్లు నుందలించె ఆమహాపురుషుఁడు నాహృదయాధిష్ఠిత దైవంబగు ప్రతాప

సింహుఁడే కావలయు. కానిచో నేకారణంబుననో యతివేషధారియై ప్రచ్ఛన్నంబుగ విహరింపుమ నన్నును నాతండ్రిని నీపాంచాలరాజ్య లక్ష్మిని రక్షింపవచ్చిన నారక్షకదేవతయో యైయుండవలయును. ఆవీరపురుషుఁడు ఘోరసేనుని వెన్నంటి చని తిరుగరాఁడయ్యె. వాని కేకీడైనఁ గలిగియుండదుకదా. ఆనాఁడు నే నీమహావీరునిచేఁ జోరుల నుండి రక్షింపఁబడితినో యెదమాయమయుఁడు వెనుగాలిలో నన్ని యో యిపుమలకులోనై నన్ను మహారణ్యమున వెంటఁ గొనివచ్చుచు నా తండ్రిని మృత్యుముఖంబునుండి తొలఁగించి రక్షించెనో యేజగన్మో హనమూర్తిని మదీయ హృదయపీఠంబున నిలిపి నాటనుండియు నే ననవరతముఁ బ్రేమపుష్పంబులఁ బూజించుచుంటినో యావీరశిఖా మణియే నేడు మద్భాగ్యవశంబున రక్షింపఁగడంగి వచ్చియుండుట నిశ్చయము. ప్రాణప్రియా! నీవేలకొన్నాళ్ళాగి నన్నిట్లలయించెదవు? యుద్ధము ముగిసినది మొదలెప్పుడు ప్రతాపోదయంబగునోయని వే చియున్నదానను. ఎప్పటికి తెల్లవారునో. ఎప్పుడాయుదయప్రతాప దీధితులఁగనులార గాంచఁగలుగుదునో. హృదయమా. తహతహఁజెం దకుము. కాంక్షలారా. తాళుఁడు. తాళుఁడు. అట్టిమహాభాగ్య మీ చంద్రికకు కబ్బునా. హేదేవీ. భవానీ! ఆజగన్మోహన వీరపురుషుని చరణదాస్యము నాకీజన్మమున లభించునా? నిక్కంబుగ నే నట్టి మహాభాగ్యమునకు నోచియున్నదాననే యైనయెడలఁ గొద్దిరోజులలో వచ్చి నాయొక్కయు నాతండ్రియొక్కయు నాతిథ్యమును హృదయ పూర్వకముగ గ్రహించెదనని వాగ్దానమొసంగి నాహృదయమును మాత్ర మప్పుడేగ్రహించి చని యేలరాకుండును? ఆమహావీరుఁ డా డినమాట తప్పునా. వచ్చిన యతివేషధారుఁడు నానాధుఁడే. అభాగ్య రాలనగు నేనే వానిని వెన్నంటియుండఁజాలనైతిని. అయ్యో! ఏమి సేయుదును." అని పరిపరివిధంబులఁ దలపోయుచు నెమ్మనమ్మున ద

ఘూర్ణితంబుగ నుప్పతిల్లు భావతరంగంబుల దొప్పదోఁగుచు మాటిమాటికిఁదుళ్ళిపడుచు నిట్టూర్పువిడుచుచుఁ దనలోఁ దానేమేమియోఁ గొణికికొనుచు వివిధచేష్టలఁ దనయంతరంగ భావోద్వేగంబున కెడమీయజాలక ప్రణయభరంబున లోకంబునుమఱచి తన్నుమఱచి తన్మయత్వంబున నుండెను.

తెల్లవాఱినది. విజయపాఠకుల మంగళగీతంబులును తూర్యనాదంబులును చెలంగ సుదర్శనమహారాజు లేచి ప్రాహ్నకృత్యంబులు నిర్వర్తించి భగవంతునకు భక్తిపూర్వకంబుగ వందనములర్పించి స్వచ్ఛవస్త్రాలంకార భూషితుండై వందిమాగధులు కైవారంబులు సేయుచుండ వేత్రహస్తులు ముందునడువ దర్బారునకేతెంచి రత్నమయకనకసింహాసనంబుపైఁ గూర్చుండెను. హేలాపురమంతయు విజయఘోషంబుల ఘూర్ణిల్లుచుండెను. ఎల్లయెడల విజయపతాకంబులును బచ్చలతోరణంబులును జెలువారుచుండెను. పురవీధులన్నియుఁ జిత్రరత్నమౌక్తికరంగవల్లికలచేఁ జిత్రింపఁబడియుండెను. కుంకుమహరిద్రాచూర్ణంబుల గృహగేహళులు శోభిల్లుచుండెను. బధిరీకృతదిఙ్మండలంబుగ విజయభేరీకాహళతూర్యనాదంబులు మిన్నుముట్టుచుండెను. ఏవంకఁజూచిన విజయలక్ష్మి తాండవమాడుచుండెను. దర్బారునందు మంత్రిభటసామంతులందఱు నుచితాసనంబులఁ గూర్చుండిరి. జయలక్ష్మీశోభితుండగు నామహారాజును సందర్శింపఁ బురజను లాబాలగోపాలమువచ్చి దర్బారుచుట్టును వలయాకారంబుగ నిలిచియుండిరి. దర్బారు నిండు వేడుకల మెండుగ నలరారుచుండెను. సౌధోపరిభాగంబునఁ జంద్రికళ నిజచేటీజనపరివృతయై దర్బారువేడుకలఁజూచుచుఁ గూర్చుండి యుండెను.

దర్బారు మర్యాదలన్నియు యథాక్రమంబున జరిగినపిదప సుదర్శనమహారాజు సింహాసనమునుండి లేచి యానిండుసభకు సమ

స్కరించెను. "జై. సుదర్శనమహారాజునకుజై, దుర్మదారాతిగజకే సరీంద్రునకుజై దిగ్విజయ రమాధురంధరునకుజై" అని యత్యుత్సాహంబునఁ గేకలిడుచు దస్యులుచేయుకరతాళధ్వనులు కర్ణపుటంబుల నదరఁజేయుచుండెను. మహారాజుసభయంతయు నిశ్శబ్దమైనపిదప నంత టను గలయఁజూచి "వీరభట భృత్యామాత్య సామంతనికురుంబంబు లారా. ఏజగదాద్యుఁడు ధర్మసంస్థాపనార్థమై యుగయుగమునందును వివిధరూపావతారంబుల దుష్టులశిక్షించుచు శిష్టులరక్షించుచుండునో యేమహామహుఁడు పరమాణువుమొదలు బ్రహ్మాండము వరకును గల సమస్త చరాచర జంతువస్తుసంతానంబుల నేలుచుండునో యే లోకరక్షకుఁడు నిఖిలజీవకోటినిఁ గంటికిఱెప్పవలెఁ దోడునీడయై జాగ్ర త్స్వప్నసుషుప్తులయందును నాగంతుకోపద్రవములయందును నాధి వ్యాధులయందును గాచి రక్షించుచుండునో యేయాపద్బాంధవుం డార్తత్రాణబిరుదాంకితుండై నమ్మిన గజేంద్రప్రహ్లాదాదిభక్తులకు య్యాలించి రక్షించెనో కరుణాసముద్రుండగు నాపరమేశ్వరుని య నంతదయచేత నేఁగదా విప్లవకారుల దురుద్ధతిని నిర్హేతుకంబుగ సం ఘటించిన దారుణవిపదబ్ధి లంఘించి మనమందఱము నేఁడిటు మరల కూడఁగలిగితిమి. రణరంగంబున శత్రువులఁ బరాజితులఁగావించి విజయలక్ష్మీవరులమైతిమని మీరందఱు విజయోత్సాహపూరితులై వివిధచిహ్నంబుల నిరర్థకవిజయముఁ బ్రకటించుచున్నారు ఇది మన కందఱకుఁ బశ్చాత్తాపసమయము గాని యుత్సాహసమయము గాదు. ఇది కేవలము మన పాంచాలరాజ్యలక్ష్మీ దురదృష్టదేవతావిజయ ముగాని మన విజయముగాదు. ఈయుపద్రవంబున కేవిధంబుననో నేనే కారణభూతుండనుగావలయు. నాయందమితభక్తి విశ్వాసం బులుగలిగి వర్తించుచు నిండువేడుకల నెంతకాలమో బ్రతుకఁగోరిన నాబిడ్డల నెందఱినో కఠినహృదయుఁడనై విప్లవకారులపాల్బడు పెట్టి

నందుకా నాకు గైవారము లొసంగుచుంటిరి? నేను పరమపాపాత్ముండను. కృతఘ్నుండను గాని శ్లాఘ్యుండను గాను. మిమ్ముల నందఱను సుఖసంతోషంబుల వర్ధిల్లఁ జేయుచు మీ కెప్పట్టునను నేహానియుఁ గలుగకుండఁ గన్నబిడ్డలను వలె వత్సలత్వంబునఁ గాపాడుచుండుట కేగదా మీరు మీ రాజ్యమును నాయధీనముఁ గావించితిరి. అట్టివిషయములో నే నేమిచేసితిని. రక్షించుటకు మారు మీలో నెందఱినో భక్షించితిని. ఇట్టికౄరకర్ముని మీ రిక నెట్లువిశ్వసించెదరు?

రాజ్యపరిగ్రహణము దుర్భరభారవహనముగాని భోగైకసంగ్రహణముగాదు. రాజ్య మనునది కల్పవృక్షమువంటిది. కల్పశాఖ యు నానావిధపక్షిజాతంబులను ఫలపల్లవంబుల నెట్లు పోషించుచుండెనో యావిధంబుననే రాజ్యముగూడ నాశ్రితజీవకోటినిఁ బోషించుట కేర్పడినదిగాని యొక్కఁడిస్వేచ్ఛానుభవమున కేర్పడినది గాదు. మఱియు రాజ్య మనునది ప్రజలసొత్తుగాని రాజుసొత్తుగాదు. ప్రజలను రంజించువాఁడే రాజుగాని మిగిలినవారు తరాజులుఁ గందారాజులు. దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు ధర్మబుద్ధిగలిగి న్యాయపథంబుఁ దప్పక ప్రజల నందఱ సమదృష్టినేలగల సమర్థునే ప్రజలు రాజుగా నంగీకరించి తమ రాజ్యమును వాని స్వాధీనముఁ జేయుదురు. ఆతఁడు నావలెనే నిర్దయుండై తన ప్రజల నీవిధంబున మిత్తి వాతఁబడఁ ద్రోయుచున్నచోఁ బ్రజలు వానిని విశ్వసింతురా? నేను మీకు రాజుగానుండఁ దగినవాఁడను గాను. పరమాప్తులైన పౌరులారా! సుహృద్వరులారా! ఇంతటితో నన్ను విడిచిపెట్టుఁడు. మీకు ప్రభువుగ నుండఁ దగిన సమర్థుని మఱియొకని నెన్నుకొని వానికీరాజ్యము నొసంగుఁడు. నే నెన్నియో జన్మములనుంచి చేయుచున్న సంచితపాపకర్మఫలంబుగ నీ జన్మమున నీ విధంబుగ బహుజన దుఃఖకారణుండ నైతిని. అనుక్షణమును మనంబెరియుచుండ భోగాసక్తి రాజ్యలోభంబున నెత్తురు

చూపుడిసజాలను. నన్ను మన్నించి మీ రాజ్యమును మీరు తిరుగ గ్రహించి యేలికొనుచుఁ జిరాయుర్భాగ్యంబుల వర్ధిల్లుఁడు. ఈయుకారణ రణమూలంబున నాకొఱకై ప్రాణముల నర్పించిన నాబిడ్డల కాత్మ శాంతిఁ గలిగింపుమని భగవంతునిఁ బ్రార్థించుచుఁ బరితాపసదనంబగు నాహృదయమును గుహట బఱచికొనుట కెందేని వానప్రస్థుండనై తపోనియతినుండఁ దలంచితిని. ప్రియపూర్వకంబుగ మీ రందఱు నా కనుజ్ఞనీయ వేఁడెదను" అని పలికి కూర్చుండెను

ఆమాటలు నిర్ఘాతపాతంబులకైవడిఁ దమధైర్యభూధరంబుల భగ్నముఁ గావింపఁ బౌరభటభృత్యామాత్య సామంతజనంబులెల్ల దుఃఖాక్రాంతచిత్తులై యేకకంఠ్యంబుగ "మహారాజా! మాతృగర్భంబున జన్మించినవాటనోలె మాయీదేహంబుల నేలినవారే పెంచితిరి. తమ సంరక్షణమున వర్ధిల్లిన మాదేహప్రాణములను దదీయపోషకులైన యేలినవారి కర్పించుట శోచనీయ మెట్లగును? మాపోషకులైన తమయొక్క కార్యమునకు మేము తోడ్పడుట మాకార్యమును మేము చక్కఁబెట్టుకొనుటయే గాదా. దేహము నాశ్రయించియున్న జీవ సంరక్షణార్థము మస్తకమునకుఁ గరచరణాద్యవయవంబులు తోడ్పడుచుండుట లేదా? రాజ్యసంరక్షణార్థమై తదాశ్రితాంగములలోఁ బ్రధానాంగమైన యేలినవారికిఁ గరచరణాద్యవయవములవంటి మేము తోడ్పడుట సహజముగాదా! ఏలినవారీశ్వరభూతంబులైన భూతంబులన్నిటియందును శత్రుమిత్రాదిభేదంబు లెంచక శాంతసౌహార్దాది సద్భావములతో నిత్యప్రసన్నులైయుండు సంపూర్ణదయామయు లగుటచే నవనీత కోమలంబగు హృదయము కలుగుటవలన నట్లనుచుంటిరేగాని మీ రసమర్థు లైతిరి? "నావిష్ణుః పృథివీపతిః" అను నార్యోక్తి మీయందే రూఢిగవర్తించుచున్నది. మమ్మింతగఁ బ్రేమించు నాశ్రితజనవత్సలులును మహో

దారుగుణాఖ్యులు నగు నేలినవారికొఱకు మేమెన్నిజన్మములు మా ప్రాణము లర్పించినను తమఋణముఁ దీర్పఁజాలము. కాలకర్మవశంబునఁ దటస్థించిన యీవిపత్తున కేలినవారెట్లు బాధ్యులయ్యెదరు? ప్రజలరాజ్యమును శత్రువులబారినుండి తప్పించి కాపాడుచు బ్రజల నుసుఖలీలలవర్ధిల్లఁజేయు బాధ్యతను మీరు నెరవేర్చుచునేయుంటిరి. మర్త్యుని జననమరణాదులకు రాజు కర్తయగునా? 'జాతస్యమరణాధ్రువమ్' అను జనశ్రుతి లేదా! జననమరణాదులు కర్మానురూపంబులు గాని మనుష్యకృతంబులుగావు. 'అవశ్యమనుభోక్తవ్యమ్ కృతంకర్మ శుభాశుభమ్' అను నార్యోక్తి వినలేదా. భగవంతుఁడే కర్మబద్ధుఁడగుచుండఁ గర్మానుబంధవిషయంబుల నతిక్రమించుటకు మనుష్యమాత్రుఁడే పాటివాఁడు. ఇదివరకే యేలినవారి సాంద్రతరయశశ్చంద్రికారుచులు దిగ్వాటంకంబులఁ బ్రకాశింపజేయుచుండుట లేదా. ఇంతకు నీవిపత్తు మీరు ప్రేరేపించినదా? ఏలినవారిధవళకీర్తి సహింపజాలని విప్లవకారుల దురుద్యమంబులకు మీరెట్లు బాధ్యులయ్యెదరు? మీరు లేకున్న మాకీలోకముతోనే పనిలేదు. ఏలినవారట్టి దృఢసంకల్పముతోనుంటిరేని రణనిహతులైన మాసోదరులతోఁబాటు మాకుఁగూడ నాత్మశాంతినిఁ గలిగించుటకై భగవంతునిఁ బ్రార్థింపుఁడు. మేమిదే మాప్రాణంబులనుగూడ నేలినవారిచరణసరోరుహంబులపై నర్పించుచున్నారము." అని వరలనుండి కత్తులనుదీసి తమకంఠంబులపై నిడి నఱకికొనుటకు సిద్ధముగనుండిరి.

ఆయావేశంబును జూచి మహారాజు భీతిల్లి గజగజవణంకుచు దిగ్గనలేచి "భిక్షులారా! శాంతింపుఁడు. శాంతింపుఁడు. మీకొఱకుఁ బాటుపడవలసిన వాఁడనగుటచే నేను మీసేవకుఁడను. మీయనుమతిఁ గొనకుండ నేనేమియుఁ జేయఁగూడదు. సాహసించి చేసినచో స్వామిద్రోహినగుదును. మీరు నాయుద్యమంబున కనుమతింపలేదు గావున

నా ప్రయత్నం బుజ్జగించితిని. మీరందఱు నిశ్చింతతో నుండుఁడు." అని పలికి కూర్చుండెను.

అమృతోపమానములైన యీపలుకులు వినినతోడనే పౌరులందఱుఁ బరమానందభరితులైరి. భృత్యామాత్యసామంతులు మహారాజు మహోదారగుణంబు నెంతయో కొనియాడిరి. అందఱుఁ దమకుఁగలిగిన యానందముఁబట్టజాలక "మహారాజా! ధన్యులమైతిమి". అని బాష్పపూరితనేత్రులై యామూలసమున్మీలితద్రుమసమానులై సాష్టాంగంబుగఁ బ్రణమిల్లిరి. తనపైఁ బ్రజలకుఁ గల యద్వితీయభక్తివిశ్వాసముల కమితానందముఁజెంది యశ్రుపూరితలోచనుండై సుదర్శనమహారాజు గద్దియుడిగ్గి వచ్చి యత్యాదరంబున వారినందఱ నిజకరంబుల లేవదీసెను. అందఱును హర్షపులకితగాత్రులైరి. మహారాజు మరల సింహాసనమధ్యాసించెను.

తరువాత సుదర్శనమహారాజు సేనానాయకునిఁజూచి, "సేనానీ, నేను ప్రమాదవశంబున రణమధ్యంబునఁ బడినపిదప యుద్ధమెట్లు ప్రవర్తిల్లె?" అని యడిగెను. అందుపై సేనానాయకుఁడు లేచి "మహారాజా! ఏలినవారు శత్రుశేషంబుఁ దీర్చుచున్నతఱి దురదృష్టవశంబున మృతకళేబరంబొకటి కాలికిఁదగులుటచే బోరగిలఁబడిరి. వెంటనే యాదుష్టశత్రు వేలినవారికుత్తుకను ద్రొక్కిపట్టి పొడిచివేయుటకు గత్తిపైకెత్తెను. మన సైన్యమునందు హాహారావము లెసంగెను. అప్పుడే యెక్కడనుండియో యొకబాణము రివ్వునవచ్చి వాని దక్షిణభుజమునఁ గ్రుచ్చుకొనియెను. తక్షణమే యాక్రూరశత్రువు త్రుళ్ళిపడి చేతిలోనికత్తిని జారవిడిచిలేచెను. ఆసమయమున నొకసుందరయువకుఁడు క్రూరసేనుని సమీపించి "ఓరీ! తులువా! వశముదప్పి పడియున్నవారిని జంపనెంచుట వీరధర్మమేనా? నీకు పౌరుషము గలదేని నాతో యుద్ధమునకురమ్ము" అని కత్తిద్రిప్పుచు డగ్గరియెను. అంత

శూరసేనుడు క్రోధావేశంబున మఱియొక ఖడ్గమునుగొని యాసుందరయువకునిపైకుఱికెను. అప్పుడే సాఖొచ్చిపుట్టెనో యన యతివేషధారియగు నొకమహావీరుఁడు "ఓరీ శూరసేనా! జాల్మా! నీపౌరుషము బలలమీఁద నాచూపఁగడంగితివి నిలువుము. నిలువుము." అని యుదలించుచువచ్చి యేలినవారినట్లు సమయోచితంబుగఁ గాపాడినసుందరయువకుని నేలినవారినిఁ గాపాడుట యొకాకి శత్రుసైన్యమునుమాఱిమసగినట్లురూపుమాపి శూరసేనునిఁబలాయితునిఁగావించెను. ఆవిధంబుగ మనకు జయలక్ష్మి లభించినను రక్తతృష్ణాపరుండగు శూరసేనుఁడు సజీవుఁడై పలాయితుండగుటచే నాద్రోహి పరాజయపరాభవాగ్ని మ్రగ్గుచు నింకను నేమేమికుట్రలు పన్ని దారుంతకృత్యము లొనర్ప నెంచునో. శత్రుశేషమును దీర్పజాలమైతిమని విచారించుచున్నాను." అని సవినయముగఁ బలికెను. ఆమాటవినిసుదర్శనుఁడు "సేనానీ! శూరసేనుఁడే కేవల మీరణవిప్లవమునకుఁ గారకుఁడుగాఁడని నాయభిప్రాయము పరమదుర్మార్గుఁడగు కామపాలుని ప్రోత్సాహంబున నంగరాజ్యవిప్లవమునకుద్యుక్తుండైనట్లేయీవిప్లవమునకుఁగూడ నాతఁడేయ్యేకొని యుండును. అయిన నీరణపరాజయపరాభవశిక్షచే శూరసేనుఁ డింక పరితప్తహృదయుఁ డగుననియే నమ్మెదను. కామపాలుని సంగతి యేమయ్యెనో తెలుపవైతివి" అనిపలికెను. అందుపై నొకసరదారుఁడు లేచి "కామపాలుఁడు పాశివ్వారముగుండా లోనికి సైన్యసమేతంబుగ వచ్చి కోటను సమీపించుచుండ నప్పుడే యంతఃపురమునుండి క్రిందకు దిగివచ్చిన సుందరయువకుఁ డొక్కశాతభల్లంబున వాని గుఱ్ఱముపైనుండి క్రిందఁబడఁగొట్టుటయు నదిచూచి వానిసైనికులందఱు నొక్కుమ్మడి నాసుందరయువకునిఁగవియుటయు నాతఁడు పిఱుఁదివియక ధీరంబున నతితీవ్రంబుగ వారందఱితోఁ బోరిపోరి యలసి సొమ్మసిల్లుటయు శత్రుసైన్యమాసుందరయువకుని బంధింప యత్నించుచుండుటయుఁ జూచి

యతివేషధారియగు నాసుహాసీనుఁ డశ్వారూఢుఁడై హుటాహుటి నయ్యెడకువచ్చి శత్రుసైన్యము నొక్కనిముషములో నగ్గొనర్చి సుందరయువకుని కట్లువిప్పి వానిచేఁబడియున్న కామపాలుని కరచరణములంటగట్టి యేకాంతకారాగారంబున నుంచి యచ్చో నిరువురు భటులఁ గాపుంచి యియ్యెడకువచ్చి యట్టియద్భుతపరాక్రమమును బ్రకటించెను." అనిచెప్పెను. ఆమాటలు వినినంతనే మహారాజమితానంద భరితుఁడై యాసుందరయువకుఁడు తనపుత్త్రికయగు చంద్రికళయే యని తెలిసికొని 'యతివేషధారియగు మహావీరుఁడేఁడీ' యని యత్యాతురముతో నడిగెను. అందుపై సేనాని యాకైతవయతి శూరసేనుని వెన్నంటి తఱిమికొనిపోయెననియు నాతఁడు తిరుగరాకుండుటచే నాశ్వికుల నెందఱినో వానిజాడ నరయ బహుముఖంబుల కనిపితిననియుఁ దెలిపెను. మహారాజు విషణ్ణహృదయుఁడయ్యెను తనను దనపుత్త్రికను బాంచాలరాజ్యలక్ష్మిని నావిధంబుగఁ గాపాడిన యతివేషధారి యెవ్వఁడై యుండునో యని యోజించుచుండెను. ప్రతాపసింహుఁడే సజీవుఁడై యారూపంబున వచ్చియుండెనని యుత్కలికఁజెందుచుండెను. వానినరసి తోడ్కొనిరా సేనానికి దృఢముగ నాజ్ఞనొసంగెను.

ఆసమయమున భానుమంతుఁ డతిసంభ్రమంబున వచ్చి "మహారాజా..........." అని యేమో చెప్పఁబోయి చెప్పలేక మహారాజు పాదములపై వ్రాలెను. మహారాజు త్రుళ్ళిపడి లేచి "భానుమంతా! ఏమియుపద్రవము జరిగినది?" అనియడిగెను. అందుపై భానుమంతుఁడు "దేవా! మనమింతదనుక ననుభవించిన మహానందసుధారసమిప్పుడు విషమిశ్రితమైనదని చెప్పవలసివచ్చినది. అయినను ద్వరపడితిమేని యీమహాపురుషుఁడు జీవించునేమో" అని పలికెను. ఆమాట కదటుజెందుచు మహారాజు "భానుమంతా, నీవు భావగర్భితముగ మాట్లాడుచుంటివి. నీవెఱిఁగింపఁదలఁచినది స్పష్టముగ వచింపుము"

అని మందలించెను. అందుపై భానుమంతుఁడు "మహారాజా ! క్షమిం పుఁడు. నేనీయుదయమున సేనానాయకుని యనుజ్ఞపై నింకను శత్రు సంచార మెటనైన నుండెనేమోయని పరీక్షించుట కశ్వారూఢుం డనై యరణ్యమార్గమున బయలుదేరితిని. కొంతదూర మేగినపిదప నొకకొండప్రక్క యతీశ్వరు డొకఁడు భూమికి షుమారిరువదిగజముల యెత్తుగల యొకచెట్టుమోఁడు నానికొని రక్తాప్లావితదేహుఁడై వికృ తాకారంబునఁ బడియుండెను." అంత సౌధోపరిభాగంబున నెద్దియో క్రిందబడినట్లు చప్పుడయ్యెను. వెంటనే "అయ్యో! ప్రియసఖీ! చంద్ర కళా!! చంద్రికళా!!! మూర్ఛిల్లితివే" అని యాక్రందించు చెలికత్తియ ల కలకలంబు వినవచ్చెను. సభ్యులందఱుఁ గలఁగుచు వడుచుండిరి. మ హారాజు సింహాసనమునుండి లేచెను. అంత "ప్రియసఖి రణవృత్తాం తమును వినుటచే భీతిల్లితివి కాఁబోలు లోనికిఁ బోవుదమురమ్మా" అను మఱియొకపలుకు వినిపించెను. అందుపై మహారా జూఱటఁజెంది "భా నుమంతా. ఆ యతీశ్వరుఁడెవ్వఁడో తెలిసికొంటివా. అతఁడు జీవించి యుండెనా" అని యడిగెను. అందుపై భానుమంతుఁడు "మహారాజా పాపమెవ్వఁడో సన్యాసి కొండపైనుండి ప్రమాదవశంబున కాలు జారిపడి క్రిందకుదొర్లుచుఁ జెట్టుమొదలకువచ్చుటచే దాని నంటి యుండెఁ గాఁబోలునని తలంచి యాపురుషుఁడు జీవించియున్నచోఁ జేతనైనసహాయము సేయనెంచి యయ్యెడ కేగితిని. మహారాజా ! వా నినిఁ జూచినంతనే నిశ్చేష్టుఁడనైతిని. ఆమహాపురుషుఁడే కారణంబు ననో యతివేషమును ధరించివచ్చి నిన్నటిరోజున నేలినవారిని సుందర యువకుని రక్షించి శత్రుసైన్యమును తూలశకలంబులట్లు యెగురగొట్టి యీపాంచాలరాజ్యలక్ష్మిని నిలబెట్టిన మహావీరశిఖామణియగు ప్ర తాపసింహుఁడే." అని పలికెను. ఆమాట వినినంతనే మహారాజు దుః ఖావేశంబున "హా ప్రతాపసింహా! అప్రతిమాన ప్రతాపవంతుడవై

యున్నత్తనైరిగజసింహుఁడనగుట నన్వర్థనామధేయుఁడవై యొందటికో కంటిలోని నెరసువలెయుండి యెందఱెందఱు నిన్నంత మొందింప యత్నించినను మాయదృష్టవశంబున సజీవుండవై వచ్చి మాకొఱకు నీయమూల్యప్రాణంబు నర్పించితివా" అని వివశుండై యొల్లఁబోయి వెంటనే తెలివిఁజెంది "నాయనా! భానుమంతా. ఆపురుషుని మేనఁ బ్రాణములుండెనో లేవో తెలిసికొంటివా?" అని యడిగెను. అందుపై భానుమంతుఁడు "దేవా! ఆవీరశిఖామణి యింకను జీవముతోనే యున్నాఁడు. క్రిందనున్న పల్వలములోని నీరుఁదెచ్చి వానికుపచారము నొనరింప నెంచి క్రిందకు మెల్లగ దిగుచుంటిని. ఆయిదారుగజములు దిగినపిదప మఱియొకపురుషుఁడు ముళ్ళపొదలోఁ జిక్కియుండుటఁ గాంచితిని. ఆతండును చైతన్యరహితుఁడయ్యె యుండెను. కాని యీతఁడింకను జీవించియేయుండెను. ఆపురుషుఁ డేలినవారిప్రబలశత్రువగు ఘోరసేనుఁడే."

ఆవృత్తాంతమునువిని సుదర్శనుఁ డాయిర్వురు జీవించియున్నందుకు సంతసించి రాజభటులతోను శిబిరోపకరణములతోఁడను నాందోళికలతోఁడను వలయు పరివారంబుతోఁడను సుదర్శనమహారాజు భానుమంతుని ముందిడికొని బయలుదేరెను. వీరధన్వి వలయు నోషధుల సంగ్రహించి వారి వెనువెంటఁ బయలుదేరెను.

అందఱును కొండదరిసిరి. యతివేషధారిణియైన ప్రతాపసింహుని యొద్ద నెవ్వరో లలితాంగి యొకర్తు విలపించుచు గూర్చుండెను. ఆ మెలనాగ చంద్రికళయే. తన హృదయాధిష్ఠిత దైవమగు నామహాపురుషుఁడింకను జీవముతోనే యుండెనని వినినతోడనే యత్యాసక్తి నోడలేక వానికుపచరింప వలనుపడునేమోయని చెలికత్తెయలతోనైనఁ జెప్పక జలపూరితకలశంబును గొని యొక్కరిత బయలుదేరి వచ్చెను. మహారాజామెను జూచి ప్రేమబలంబున కచ్చెరువం

దును "అమ్మా! చంద్రకళా! కుసుమసుకుమారివగు నీవిట్టికఠంబ యరణ్యమునకు రా సాహసించవచ్చునా తల్లీ." అని మందలించెను. అందుపై చంద్రికళ "తండ్రీ! దుష్టులశిక్షించి నిన్ను నన్ను ననేకప ర్యాయములు మృత్యుముఖంబునుండి తొలఁగించి రక్షించుటయేగా క నేను పాంచాలరాజ్యలక్ష్మని శత్రువుల బారినుండి తప్పించి రక్షిం పనవతరించిన యీ నాయిష్టదైవమిట్లు పడియుండెనని విని నేను ని లువగలనా? తండ్రీ! ఈమహాపురుషుని తోడిదే నాకీలోకము. ఈ తఁడే నాదైవము నాప్రాణము నాసర్వస్వము నీకఁడే. నీయనుమతి గొనకయే నీవు కనిపెంచిన యీ నాదేహాత్మల వీనికిదివరకే కైంక ర్యముఁజేసి యుంటిని. క్షమింపుఁడు. ఈపురుషుఁడు లేనిచో నేనును లేనిదాననని యే నమ్ముఁడు" అని ధీరచిత్తయై దృఢముగఁ బలికెను. ఆమాటలు వినుచున్నంతసేపు మహారాజు విశాల నేత్రములనుండి యశ్రుబిందువులు సంతతధారాపాతంబుగ జాలువారుచుండెను. "తల్లీ నీపైని నింతటి గాఢమైన ప్రేమకలుగుట సహజమే వీని జన్మవృత్తాం తరహస్యము వెల్లడియైన పిదప లోకమంతయు నీ స్వయంవరవిష యమును వేనోళ్ళఁ గొనియాడును. అని వీరధన్వితో "వైద్యా వీని నిప్పుడు పురంబులోనికిఁ గొనిపోవనగునా?" అని యడిగెను. అం దుపై వీరధన్వి యప్పటికిఁ దగినచికిత్సల గొన్ని యొనరించి పిదప సు దర్శనుని యనుమతిపై శూరసేనునకుఁ గూడ వలయు చికిత్సలను గా వించెను. తరువాత నాయిరువుర నాందోళికలనుంచి వారల వెంటఁగొని యందఱును పురాభిముఖులై బయలుదేరిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## పందొమ్మిదవ ప్రకరణము.

చ. నిశలుఁ బవళ్ళు మీ దెఱుఁగనేరక చేసి దురంతకృత్యముల్
వశుఁడయి యుండి వైరికిన వార్యమనోరథవాహినిన్ నిరం
కుశముగ నీఁదియీఁది నుడిగుండము నందునఁ జిక్కినట్టి బా
లిశుఁడు తృణాగ్రమె నెమ్మికిఁ జలింపకయుండఁడె జీవకాంక్షచేన్.

"హా హతవిధీ! ఉడువీథిని నెగురుచుండు నాచిత్తవిహంగంబును నీదృశవిపదుల్కాపాతంబున నధోగతిపాల్సేయఁ దలంచితివా! ఎప్పటికైన నే నీచెఱసాల వీడఁగలిగెదనా! నాచోరమిత్రులీరాత్రివచ్చి నన్నేయుపాయంబుననో కారాగారవిముక్తుని గావించెద మని నమ్మించిరి. వారి సముద్యమంబున కేయంతరాయమునుఁ గలుగకుండ వలయును గదా! నా యదృష్టమెట్లున్నదో. నా సహస్రారక్షేత్రంబున నెన్నియో యాశాబీజంబుల నాటితిని. అయ్యవి యూసరక్షేత్రమయ్యెఁ గాఁబోలు. అట్లు గానిచో సాటిలేని తంత్రజ్ఞుఁడ నగు నా ప్రయత్నంబుల కిట్టి యంతరాయంబు లేలకలుగును. కానిమ్ము. కార్యసాధకుండెట్టివిఘ్నములు తటస్థించినను నిరుత్సాహియై పూనిక నుజ్జగింపరాదు. సువర్ణుఁడు చెయిదాటిపోయినను లలిత నాకైవసంబయ్యెనేని యెప్పటికైన నామనోరథము గమ్యస్థానముఁ జేరఁగలదు. నేనిప్పట్టున నాచోరమిత్రుల సహాయముచే జెఱవిముక్తిని గాంచలేనిచో నుత్సహించిమాత్ర మేమిచేయఁగలను. శూరసేనుఁడును మహావీరుఁడైన యాకపటసన్న్యాసియు ద్వంద్వయుద్ధమున మృతిఁజెందిరని వినియుంటిని. ఆకపటయతి ప్రతాపసింహుఁడే గావలయును. అటులైనచో వాని

జన్మరహస్యము వానితోనే యంతరించును. చేతికిఁ జిక్కిన యామి
వంబునుఁ గద్ద తన్నుకుపోయినట్లు నామిత్రులస్వాధీనములో నుంచిన
లలితను నామేనల్లుఁ డవివేకంబునఁ గొనిపోయి పుష్పగిరిఁజేర్చె. అం
దుకు వీరపాలుని బోయయువకునితోఁ గూడ శిక్షింపయత్నించియు
నిష్ఫలమనోరథుండనైతిని. మాయోపాయంబునఁ దిరుగఁ బట్టితెచ్చు
టకై శూరసేనునకు వ్రాయించినట్లొక లేఖవ్రాసి యిచ్చి నాయాంత
రంగికమిత్రుఁడైన యొకచోరుని నాకార్యమునకు నియోగించితిని.
వాని ప్రయత్నమేమయ్యెనో తెలియరాదు. నాచోరమిత్రులు తమ
వాగ్దానము నెరవేర్పగలుగుదురో లేదో; ఇప్పుడు నేనేమి సేయుదు
ను. సుదర్శనుని పాదములపైఁబడి యీమారణకర్మమునకు కేవల
ము శూరసేనుఁడే కారకుఁడని నమ్మించి నన్నుక్షమింపుఁడని వేఁడు
దునా? ఆమాయకుడగు నాధర్మప్రభువు సులభహృదయుఁడగుట
చే నామాటవిశ్వసించి నన్ను బంధవిముక్తునిఁ గావించునేమో. ఏమిది
నాకు మతిపోయినదా యేమి. నిజముఖప్రదర్శిత తంతువర్గ ప్రకల్పి
తంబైన నిర్గమద్వారశూన్యగేహంబున స్వబుద్ధిచేఁ జిక్కియుండు కంబ
ళపురుగుచందంబున స్వకీయమాయాతంత్రోపార్జితంబైన నిర్గమద్వా
రశూన్యంబగు నీకారాగారంబునఁ జిక్కి యుండుటచే నాబుద్ధిమా
ఱిపోవుచున్నది కాఁబోలు. అయిననేమి? ఏయుక్తిచేనైన నే నీచెఱ
వీడఁగల్గితినేని భుజబలంబుననో బుద్ధిబలంబుననో సుదర్శనుని నాచే
తికిఁ జిక్కించి కొనలేకపోదునా? భగవంతుఁడిట్టి విపత్తులను సంఘ
టించియే మహోద్యోగుల బుద్ధిబలంబును బరీక్షించుచుండును.
ఇట్టి కఠినపరీక్షలకు నిలిచినవాఁడే యభీష్టసిద్ధినిఁ జెందును. నామా
ర్గనిరోధకుండగు భానుమంతుఁడు యమునానదీప్లవంబునం బడి
మృతిఁజెందెనని నాగూఢచారులచే విని సంతసించితిని. ఇందుమతి
నిదివఱకే యమసదనంబున కనిపితిని. నిరర్థకబంధుమోహంబున

కు లోనుగాక నా మేనల్లుఁడైన వీరపాలునిఁ గూడ నిందుమతియొద్దకని పితినేని నాచెల్లెలు నాచేతిలోని కీలుబొమ్మయగును. ఇంతకును నేటి నాచోరమిత్రుల ప్రయత్నము జయప్రదముగ నెరవేరవలయునుగదా" అనియేమేమో దలపోయుచుఁ గామపాలుఁడు యుద్ధమైన మఱునాఁడు సాయంకాలమునఁ గారాగారగవాక్షములోఁ గూర్చుండి యుండెను.

ఆ కారాగృహము వెనుకతట్టున సుదర్శనుని పుష్పోద్యానవనము కలదు. అయ్యది నానావిధపరిమళ వికచప్రసూన శోభితంబులగు లతాద్రుమంబులతోడను లోచనోత్సవ ప్రదంబులగు బహుళతర చిత్రవిచిత్రజల యంత్రంబులతోడను పుష్పపరాగ వికీర్ణ నికుంజశయ్యాతలంబులతోడను నొప్పారుచుండెను. ఆవనమధ్యంబున నొకరమణీయ జలాశయంబుఁ గలదు. అందలి పద్మషండంబుల నెస కొంకువిహరించు రాజమరాళదంపతులు మందమరుత్కిశోర ప్రభూతంబులగు జలతరంగమాలికాడోలికలఁ దూఁగుటుయ్యేలల నూఁగుచుఁ గలరవంబులొనర్చుచుండెను. కామపాలుఁడా గవాక్షములో నుంచి యాయుద్యానవనశోభను తిలకించుచుండెను. కాని నిఖిలజనాహ్లాదకరమైన యాప్రకృతిసౌందర్యము వానిమనస్సున కెక్కుట లేదు. ఎవనికొఱకో సత్యాసక్తితో వేచియున్న వానివలె నల్వలంకులఁ బరికించిచూచుచుండెను.

ఆసమయమున గవాక్షముక్రింద నేవరో మాట్లాడుచున్న సడివిని శ్రద్ధగా నాలకించుచుండెను. "దీనశరణ్యుండవగు నోపరమేశ్వరా! ప్రశోచితంబగు సుక్షత్రియకులంబునఁ బుట్టిన నన్నెంతకాలము పరుల పంచ బ్రతుకఁ జేసెదవు. పరమధర్మస్వరూపుండును మహోదారవీర శిఖామణియునగు సుదర్శనమహారాజు కటాక్షంబునకుఁ బాత్రుండనై తదీయవాల్లభ్య లక్ష్మీప్రసన్నత నమితసౌఖ్యంబుల నోలలాడుచుం

డుటచే నాజన్మహాక్కునం దింతవరకును విస్మృతిఁజెందియుంటిని. ఆ శ్వేకదళమునకు నాయకుండనై క్షత్రియోచిత వీరవిహారంబుల మహారాజు మెప్పువడయుచుంటిని. కామపాలుఁడు కారాగారంబునఁ జిక్కియుండెఁగదా. యతివేషధారియగు వీరశిఖామణి పూర్ణారోగ్యస్థితికివచ్చినతోడనే శూరసేనకామపాలురపైఁ గల రాజద్రోహనేరములు విచారణకువచ్చును. వారికన్నదండన విధించినపిదప మహారాజు నాయభీష్టమీడేర్పకుండునా! హృదయమా! నీవింకను జలించెదవేల, నామేనమామ కొమరితయగు మధురిక చనిపోయెనని నిరాశఁజెందియుండ నామె సజీవయై పూర్ణారోగ్యముతో నుండుటయు నాలేమను శత్రువులబారినుండి తప్పించి రక్షించుభాగ్యము కూడ నాకొదవుటయుఁ దటస్థించుటవలన నీవడియాసలను తహతహఁ బొందుచుంటివా. సంభ్రమింపకుము. అఘటితఘటనా పటిష్ఠుండగు ప్రహ్లాదవరదుని కటాక్షమున్నచో నీకాంక్షితార్థం బచిరకాలములోనే సిద్ధించును. రాజద్రోహియు గురుద్రోహియునగు కామపాలుని ప్రేరణచే నాహృదయేశ్వరి కంతటివిపత్తును గలుగఁజేసిన శూరసేనుఁడు చెయిదాటిపోయెనని తలంచితిని. అదృష్టవశంబున నాదుష్టశాత్రవుఁడు మరల జీవముతోఁ జిక్కుటచేఁ గృతకృత్యుండనైతిని" అనియేమేమో యనుకొనుచుండెను. కామపాలుఁడా మాటలువిని విస్మయాకులితచిత్తుఁడయ్యెను.

అప్పుడాకస్మికముగ భానుమంతునకొక యార్తాలాపము వినవచ్చెను. వెంటనేయాతఁడా ధ్వనివచ్చినదిక్కునకుఁ బరుగిడి తటాకము జేరెను. అచ్చో నిరువురుచోరులు తమ ముఖములను నల్లనిముసుఁగులచే మూసుకొని తటాకములో మొలబంటి నీటిలోనుండి యొక స్త్రీవ్యక్తినిఁ బైకి లేవదీయుచుండిరి. ఆవ్యక్తినిఁ జూచి మధురికయే యని తెలిసికొని భానుమంతుఁడు రోషకషాయావేశంబున వరనుండి

కత్తినిదూసి తటాకములోనికి దుమికి యొక చోరునిశిరస్సు ఖండించెను. అది చూచి రెండవచోరుఁడు భయోద్రేకచిత్తుఁడై మధురికను మరల నీటిలోఁబడవైచి పాఱిపోయెను. వెంటనే భానుమంతుఁ డాలేమను నీటిలోనుండి పైకిలేవదీసి తనమూఁపుపై నిడికొని గట్టుపైకేతెంచి యచ్చో నొక కుజచ్ఛాయనుగల సాంద్రతర బాలతృణాంకురశీతల ప్రదేశంబున నామెనుఁ బరుండఁబెట్టెను. మధురికకు చైతన్య మిసుమంతయును లేదు. గాఢముగ మూర్ఛమునింగియుండెనేగాని మృతిఁ జెందియుండలేదు. భానుమంతుఁ డాసమీపంబునంగల శుష్కపత్రంబుల నేరి తెచ్చి ప్రోవుచేసి యింగలంబంటించి జ్వాలఁజేసి యామె యార్ద్రదేహమంతయుఁ గాచెను. తరువాత నామె తెలివిఁజెందుటకై చెంతఁగూర్చుండి వివిధోపచారములొనర్చుచుండెను. కొంతసేపటికి మధురిక కొక్కింత తెలివివచ్చెను. కనులెత్తిచూచి భయకంపితయై మరలఁ గనులుమూసెను. తక్షణమే భానుమంతుఁడు నిర్మలోదకంబునుఁ గొని తెచ్చుటకేగెను. కామపాలుఁ డిదంతయు గవాక్షములోనుంచి చూచుచునేయుండెను. కాని యాదుర్మార్గుఁడు మధురికాభానుమంతులను గుర్తించలేదు. చోరులు తనకు సహాయమొనర్చుటకావనంబుననే డాఁగియుండిరని యుత్కలికఁజెందుచు నాయువతియువకులెవ్వరై యుందురో యని యోజించుచుండెను.

భానుమంతుఁడొక పర్ణపుటంబుతో నిర్మలోదకంబును గొని తెచ్చెను. మధురికయింకను తెలివిఁజెందలేదు. భానుమంతుని విచారమునకుఁ బరిమితిలేదు. "ప్రియా! మధురికా! నిన్నె నాడుచూచితినో నాటనుండియు నీముఖరాకాచంద్రబింబము దుఃఖాంధకారపూరితంబైన నాహృదయాకాశంబున నిలిచి యద్దానిఁ బ్రకాశింపఁజేయుచు నందు విహరించు నాజీవుని నత్యుత్సాహపూరితునిఁ గావించి యానందడోలికలనూఁగించుచుండెను. పరమదుర్మార్గుఁడైన శు-

రసేనహతకునిచే నీకు గలిగినవిపత్తు వినినతోడనే హతాశుఁడనై ప్రాణత్యాగముసేయు నెంచియు నాగ్రహపై నాకసిఁదీర్చుకొనఁ బ్రతికియుంటిని. భవానీదేవి కటాక్షంబున నీవు సజీవురాలవై యున్నావని యెఱింగినప్పటినుండియు నాభాగ్యదేవత నాయండనుండ నింక నాకేమిలోపమని యుప్పొంగుచుంటిని. పరమదుర్మార్గులైన శూరసేనకామపాలురు నాచేతిలోఁ జిక్కియుండుటచే నేను చాలాభాగము కృతకృత్యుండనైతినని సంతోషించుచుంటిని. ఆకూరకర్ముల చేతనే పసితనంబునఁ దల్లిదండ్రులనుఁ బాసి దిక్కుమాలినపక్షులమైయున్న నీవును నేనునుఁ గూడియున్నచోఁ గాలవైపరీత్యంబుచే మనమెన్నెన్ని దురవస్థలపాలు గావలసివచ్చినను నొకరిదుఃఖమొకరు పాల్గొనుభాగ్యమొదవునుగదా యని యుత్కలికఁ జెందుచుంటిని. అయ్యో! మోహినీ! మధురికా, నాయాశాంకురంబులను నిర్దయురాలవై తుంచివేసెదవా? నీమేనత్తకొమరుఁడనైన నన్నుఁ జిన్నతనమున నీతోనాడికొనిన భానుని మఱచితివా? ప్రియా! పలుకవేమి? ఒక్కసారి కనులు తెఱచి నీచల్లనిచూపుల నాయుల్లమును బల్లవింపఁజేయుము. నాపైయలుకఁజెంది నన్నుఁ జూచుటకైన మనసొప్పక కనులుమూసికొనియుంటివా ప్రేయసీ!" అని యశ్రుపూరితలోచనుండై యాక్రందించుచుండ వానికంటినీరామెముఖంబుపైఁ బడెను. తక్షణమే మధురిక త్రుళ్ళిపడి లేచి భానుమంతునిఁ జూచి "ఓహో. ఏమినాభాగ్యము! భా...అ...అ...ను......" అని యానందపారవశ్యంబున భూమిపై వ్రాలి మరల మూర్ఛిల్లెను. భానుమంతుఁ డత్యుత్కంఠ నామెకువలయు శైత్యోపచారము లొనరించుచుండెను. కొంతసేపట్లు మైమఱచియుండి మరల తెలివిఁజెంది వెక్కివెక్కియేడువనారంభించెను. అదిచూచి భానుమంతుఁడు సంభ్రమాశ్చర్యంబులు మనంబునఁ బెనగొన విషణ్ణహృదయుండై "అయ్యో! ప్రాణప్రియా! మధురికా! నిన్నేడ్పిం

చుచుంటినా? కఠినహృదయుఁడనై నీమనస్సునకెట్టికష్టమును గలిగించితినోగదా! పట్టరానితమకంబున నోడలెఱుంగక నీకు బాధకరములైన యప్రియవాక్యము లేమైనఁ బలికితినికాఁబోలు. నాయవివేకమును క్షమింపుము. తల్లిదండ్రులను బాసి వంగరాజ్యలక్ష్మిని విడనాడి మహారాజపుత్రికనైన నీవు పరులపంచనాడికంపు చేసియనై నికృష్టంబుగ దాస్యవృత్తిఁ జీవించుచు నదివరకే మనోవేదనల నలయుచుంటివి. నిన్ను నిర్దయుండనై మఱియు బాధించుచుంటినా? నీవలెనే నేనును దిక్కులేనిపక్షినై యొకదాసీదానిచేఁ బోషింపఁబడుచు యమునానదీ విప్లవంబునఁ జిక్కి యమసదనంబున కేగుచు దైవవశంబున మరలి యిచ్చ్యోడకేతెంచి నా మేనమామ కొమరితనైన నీవు జీవించియుండుటఁ దెలిసికొని నాజీవయాత్ర సురక్షితంబుగ నెరవేర్చుటకై ప్రేమ తరణి నడిపింపదగిన మార్గ్మ లభించెగదా యని నాభాగ్యదేవతను వేనోళ్ళఁ గొనియాడుచు నత్యుత్సాహముఁ జెందుచుంటిని. నిన్ను త్రికరణశుద్ధిగఁ బ్రేమించియున్నాను. నీహృదయసామ్రాజ్యభోగి మఱియే యదృష్టవంతుఁడైన నున్నచో దెలుపుము. నాయీయభాగ్యజీవమునైన విడిచెదనుగాని నిన్నుఁగష్టపెట్టుట కోర్వను.” అని పలికెను. భానుమంతుఁడట్లు మాట్లాడినంతసేపు మధురిక దుఃఖ మంతకంత కతిశయితంబుగఁ బొంగిపొరలుచుండెనేగాని యొక్కింతయైన శాంతింపలేదు. అదిచూచి భానుమంతుఁడు తత్తరముతో ప్రియా, మధురికా, నల్లకలువలఁ గేరు నీ కాటుక కనులనుండి జాలువారు నశ్రుకణంబులెల్ల వాడిములుకులై నాహృదయమును వేధించుచున్నయవి. భరింపఁజాల. భరింపఁజాల ఇంకనైన నీదుఃఖకారణమెఱిఁగింపనా యెడలఁ బ్రిసన్నురాలవుగాఁజాలవేని యిటుపై భానుమంతుఁ డీలోకంబున లేఁడని యనుకొనుము. ఇదే నేఁ బోవుచుంటిని.” అని లేవఁబోవుచుండ మధురిక చివాలునలేచి వానిచెయ్యిఁ బట్టికొని యానందబాష్పము

లగుండా వానిపైఁ బ్రసన్నపుష్పముల బఱగించుచుఁ జిఱునగవుతో వాని మోముఁ దిలకించి "ప్రాణవల్లభా! నాపైఁ గోపింపకుము. నేనీ యానందము నొక్కసారి భరింపఁజాలనైతిని. నేను నీదానను. నన్ను విడువకుము. నాసర్వస్వమును నీవ. నే నెన్నిజన్మము లెత్తినను నాహృదయాధిష్టాన దైవంబవునీవ. నాదేహేంద్రియాత్మల నేనిదే నాహృదయపూర్వకంబుగ నీకు సమర్పించి యీవిధంబుగ నేకత్వసిద్ధి నొందఁ గోరుచున్నాను." అని సోత్కలికవాని మెడపై వ్రాలి బిగియారఁ గౌఁగలించి మనసార ముద్దుపెట్టుకొనియెను.

అప్పటికి నిండువెన్నెల పిండారఁబోసినట్లెల్లయెడల వ్యాపించి యుండెను. మధురిక వానికౌఁగిటనుండి విడివడి "నాథా. నేనొకవనమాలికను గొనితెచ్చుటకై వచ్చితిని. చాలాసేపైనది. చంద్రికళ నాకై వేచియుండును. పోయివచ్చెదను. సెలవొసంగెదరా." అని యుల్లసబలికెను. "నీవు కోరినవనమూలిక లభించెనుకాదా." అని చిఱునగవుతో భానుమంతుఁడు పలికెను. ఆమాటకు సిగ్గుచెంది ముసిముసినగవుల శిరంబువాల్చి "నాథా. కైతవయతి చికిత్సార్థమై బోయవెజ్జుచెప్పినవనమూలికకై యిచ్చోట కేతెంచితిని. నేనామూలికను న్వేషించుచుండఁ గొందఱు పొదమాటున డాఁగి యీరాత్రియే కామపాలుని బంధవిముక్తునిఁ గావించుటకై యేమేమో తంత్రములు పన్నుచు రహస్యముగ మాట్లాడుచుండిరి. అంత వారు నన్నుఁజూచి తమరహస్య సంభాషణ వింటిననియు నావల్ల తమప్రయత్నము భగ్నమగుననియుఁ దలంచి నన్నావిధంబుగఁ గొనిపోవఁబ్రయత్నించి విఫలమనోరథులైరి." అనిచెప్పి గవాక్షములోని కామపాలునిఁ జూపి మధురిక వివిధభావతరంగంబులఁ దోఁగుచు తిరిగితిరిగి చూచుచు వెడలిపోయెను.

భానుమంతుఁ డత్యంతానందరసనిమగ్నుండై యవ్యాజకృపచే దైవము తన మనోరథములను నెరవేర్ప ననుకూలించుచున్నందుకు భక్తిపూర్వకవందనము లర్పించుచు నుత్కలిక నచ్చోటు వదలి కారాగారము చెంత కేగెను. కామపాలు నాగదినుండి తప్పించి యొక పాతాళ కారాగారంబున నినుపసంకెళ్ళ దృఢముగ బంధింపఁజేసి తనకు విశ్వాసపాత్రుఁడైన యొకభటుని మొదట కామపాలుఁడున్న గదిలో నుంచి వానికిఁ గర్తవ్యం బెఱింగించి తనయాంతరంగికులైన భటుల నల్వుర బ్రచ్ఛన్నవేషంబుల వెంటఁగొని మరల యుద్యానవనంబున కేతెంచెను. గవాక్షములో గూర్చుండి యొకపురుషుఁడు మెల్లగ నీల వేయుచుండెను. భానుమంతుఁడు తనయనుచరులతో నతినిగూఢంబుగ నాగవాక్షమున కభిముఖంబుగఁ గొంతదూరముననున్న పొదలమాటున నక్కియుండెను.

రాత్రి రెండు యామములైనది. చోరులజాడేమియుఁ గానరాదయ్యె. వారాయుద్యమంబా రేయికి విరమించిరి కాఁబోలు ననితలంచి భానుమంతుఁడు నిజానుచరులతో వెడలిపోవనుద్యుక్తుఁడగుచుండెను. ఆసమయముననే కొందఱుమనుష్యులు నల్లముసుఁగులు వైచికొని కాలిమునివ్రేళ్ళపై నడుచుచు భానుమంతాదులు డాఁగియున్న పొదప్రక్కనుంచి తక్కుచుతారుచుఁ బోవుచుండిరి. రాజభటు లూపిరిబిగబట్టి నిశ్శబ్దముగనుండిరి. అప్పటికి చంద్రుఁ డస్తంగతుఁడగుచుండెను. నలుగురుచోరు లాగవాక్షముచెంత కేగిరి. వారు తమ వెంటఁగొనితెచ్చిన త్రాటినిచ్చెనను పైకివిసరివైచిరి. అదంతయు రాజభటులు చూచుచునేయుండిరి. గవాక్షములోనున్న పురుషుఁడద్దానింబట్టికొని గవాక్షపునినుపఖడ్డీల కద్దానింబిగించి కట్టి పైకిరమ్మని సంజ్ఞగా వానిచ్చెన నూఁగించెను. వెంటనే క్రిందనున్నచోరులలో నిరువురు పైకెగబ్రాకుచుండిరి. మిగిలినయిరువురు క్రిందఁ గాపారాయుచుండిరి. పైకెగబ్రాకిన

చోరులు గవాక్షముచు జేరిరి. వారిరువురాకు రాళ్ళంతో నాయినుప ఖడ్డీలను నటికి యూడదీసిరి. లోనున్న పురుషుఁడు కామపాలుఁడేయని తలఁచి వెలికి రమ్మని త్వరపెట్టిరి. ఆపురుషుఁడా యిరువురు చోరులను లోనికి రానిచ్చి యొకవిధంబుగ నీలవేసెను. తక్షణమే కారాగృహద్వారము తెఱవఁబడియెను. ఇరువదిమంది రాజభటులు తళతళలాడు కత్తులను చేతఁబట్టి లోనఁబ్రవేశించిరి. కామపాలుఁడుగ నటించిన రాజభటుఁడును తన వరనుండి కత్తిదీసి ఝళిపించుచు "చోరులారా. పరమనీచులారా. మీ దుష్టపరివర్తనమున కవసానకాలము వచ్చినది. చిక్కితిరి. మీరెందుఁబోయెదరు" అని యాచోరుల నిరువురను బట్టి దృఢమైన రజ్జువులచే కరచరణముల బంధించి యొక యేకాంత పాతాళగృహంబున నుంచిరి.

ఈలసడి వినినతోడనే యాసన్న నెఱిఁగి భానుమంతుఁడు నిజానుచరులతో గవాక్షముచెంత కేతెంచి యచ్చో ఘారా యిచ్చుచున్న యిరువురు చోరులనుఁ బడగొట్టి వారినిఁగూడ దృఢమైన రజ్జువులచేఁ గరచరణంబుల బంధించి యాత్రాటి నిచ్చెనకుఁ గట్టి పైకె గలాగించెను. గవాక్షముఁ జేరినంతనే యటనున్న రాజభటు లాయిరువురు చోరులను గొనిపోయి వేఱొక యేకాంత పాతాళగేహంబున నుంచిరి.

భానుమంతుఁడు తాను పన్నిన పన్నుగడ సఫలమైనందుకు సంతసించుచుఁ దన యనుచరుల వారి వారి నెలవుల కనిపి తా నొక్కరుండ బయలుదేరి కామపాలుఁ డున్న పాతాళకారాగారంబున కేగెను.

కామపాలుఁడు తన కట్లు స్థానభ్రష్టత్వము కలుగుటకుఁ గారణ మేమైయుండునో యని యోజించుచుండెను. బుద్ధిహీనులైన తన చోరమిత్రుల యవివేకంబున వారి సాహసోద్యమము రాజభటులకు

దెలియుటచేఁ దన కీముప్పు వాటిల్లెనని హతాశుఁ డయ్యెను. అప్పుడే భానుమంతుఁడు లోనికి వచ్చెను. కామపాలుఁడు వానినిఁ జూచి నిర్విణ్ణుఁ డయ్యెను. మోము తెల్లవడియెను. చూపులు రిచ్చవడియెను. దేహము కంప మొందుచుండెను. ఉల్లము పల్లటిల్లుచుండెను. నోట మాటరాక "భా-అ-అ-అ- ను-ఉ ఉ-ఉ- మం-అం-త-అ-అ-" అని భయవిహ్వలుఁడై పలికెను. భానుమంతుఁడు నవ్వుచు వానిని సమీపించి "బాబా నన్నుఁ జూచి భయపడియెదవేమి? నేను మృతిఁజెందితి నని నమ్మియున్నవాఁడవు కావున నన్నుఁ గనినంతనే పిశాచమునైఁ వచ్చితినని భయఁబడుచుంటివి కాఁబోలు. నేను మృతిఁజెందలేదు. నేను భానుమంతుఁడనే నీయన్న కొమరుండనే. నీయనుగ్రహముచే నాతల్లి దండ్రులు స్వర్గమున కేగిన పిదప నాకు సర్వశరణ్యంబవైన నీవు పుత్రవాత్సల్యముతో నీయొద్దకుఁ దోడ్కొని రమ్మని నీభటుల నంపితివే ఆప్రేమ యిప్పు డేమాయె. నన్నుఁ గొనిపోవచ్చిన నీభటులు నీయాజ్ఞలను నెఱవేర్ప లేకపోయిరి కాఁబోలు. పాపము నాకొఱకు నీ వెంతశ్రమ పడితివి. ఎంతద్రవ్యమును ఖర్చుపెట్టితివి. నీఋణము నే నిదివఱకుఁ దీర్చుకొనలేక పోయితిని కొద్దిరోజులలోఁ దీర్చుకొనియెదను. నీఋణము పూర్తిగఁ దీర్చినంగాని నే నెదపై చేయుంచి నిద్రింపఁజాలను. బాబా! భయపడకుము. నన్నుఁ జూడకుండ నీచోరమిత్రుల సాహాయ్యంబునఁ బాఱిపోవ నెంచితివా! మాపినతండ్రివగు నిన్నేమరియుందు ననుకొంటివా! రమ్ము" అని కామపాలుని సమీపించెను. కామపాలుఁడు భయకంపితుఁడై వెనుక వెనుక కేగుచు "నాయనా! భానుమంతా! ఏల నీవింత దారుణమ్ముగ నిష్ఠురోక్తు లాడెదవు. నీ కెవ్విధంబునను హానిఁజేయుటకుఁ బ్రయత్నించ లేదు. కుళిందరాజవంశమున కెల్ల నీ వొక్కండవే మొలకవైయుండ నే నితరుల కొఱకీరాజ్యమును వృద్ధిఁజేయఁ బాటుపడుదునా? నా

శత్రువు లెవ్వరో నన్ను నిన్ను మోసముఁజేసి మన రాజ్యము నపహరింపవలెనని యెన్నియో దారుణకుతంత్రంబులం బన్ని నీకును నాకును విరోధముఁ గల్పింపఁ బ్రయత్నించుచున్నారు. అంతియేఁగాని నే నేమియు నెఱుంగను." అని పలికెను. ఆమాటలు వినినంతనే యత్యూర్జితంబుగ నుప్పతిల్లు విలయకోపానలంబు లోలోన నడంచికొనుచు "బాబా! అటులనా! నాకొఱకు రాజ్యమును వృద్ధిపఱచుటకై నీ వింక శ్రమపడ నక్కఱలేదు. యుక్తవయస్సు వచ్చిన వాఁడనగుటచే నాతండ్రి రాజ్యమును నేనే వృద్ధిఁ జేసికొనియెదను." అని పలికెను. ఆమాట వినినంతనే "ఓరీ మూర్ఖా! కుళింద రాజ్యము నాయది. దానిపై నీతండ్రికి గాని నీకు గాని యేవిధమైన హక్కును లేదు. పొమ్ము." అని కామపాలుఁడు గద్దరించి పలికెను. అందుపై భానుమంతుఁడు "బాబా! ఇంక నీయశక్తి దుర్జనత్వమువలన లాభము లేదు. కుళింద రాజ్యముపై నీ కెట్టి యధికారముగలదో యద్దాని వృద్ధిపఱచుటకుఁ గళింగ పాంచాల రాజ్యముల నొక్కసారె కబళింప నీ వేమేమి ప్రయత్నములు చేసితివో కొద్దిరోజులలో లోకవిదితములుగానై యున్నయవి." అని పలికెను. కామపాలుఁడు కాలాగ్నిరుద్రుఁడై యనుపసంకెళులచేఁ గదలలేకుండియు భానుమంతునిపై కుఱికి "ఓరీ! దుష్టచిత్తా! పరమపాతకీ! గురుద్రోహివై నీవు నామనోరథమార్గముల కెల్ల నడ్డువచ్చుచుంటివి. నీవు నాకంటఁ బడకుము. నాకంటఁ బడకుము. పొమ్ము. నిన్ను నేఁ జూడఁజాల. చూడఁ జాల." అని రౌద్రంబుట్టిపడఁ బలికెను. ఆయావేశంబునుఁ జూచి భానుమంతుఁడు పక్కున నవ్వి "బాబా! శాంతింపుము. శాంతింపుము. ఏల వాగ్పరిశ్రాంతిఁ జెందెదవు? నీప్రయత్నంబులలో నేను దేని కడ్డువచ్చితిని? తీర్థయాత్రల కేగిన నాతల్లిదండ్రులఁ జంపించి కుళింద రాజ్యము నాక్రమించుటలో నేను నీ కేమి యడ్డువచ్చితిని? వంగదా

జ్యమును శూరసేనుని యాధీనముసేయుటలో నీవొనర్చిన దారుణహత్యలకు నేనేమైన నడ్డువచ్చితినా ? లలితాకన్యను నీచోరమిత్రులచేఁ జెఱఁబెట్టించి యసత్యవక్రిసంభాషణంబుల శూరసేనునిఁ బ్రోత్సహించి వానితో నీపేపాంచాలప్రభువుపై దాడివెడలుటలో నీకేమైన నడ్డువచ్చితినా? ఎందుకుపల్లిదంబులాడెదవు ? మానవలోకభారభూతా ! క్షత్రియకులకళంక !! ఇంకను తలయెత్తఁగోరుచుంటివిరా బాలిశా. లలితాకన్యను మరలచెఱఁబెట్టించుటకై నీవుచేసిన దుష్ప్రయత్నము తిరుగ విఫలమైనదని తెలిసికొనుము. నీమిత్రులైన చోరుల కేమిగతి వాటిల్లినదో నీకంతకన్న నెక్కువదుర్గతియే సంభవించునని నిశ్చయించికొనుము. ఇప్పుడైనఁ బశ్చాత్తప్తుఁడవై యాత్మశాంతిఁ గలిగించికొనఁ బ్రియత్నింపుము.” అని భానుమంతుఁడు గిరుక్కున మరలి వెడలిపోయెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## ఇరువదియవ ప్రకరణము.

చ. నెలయుదయింపదే కమలినీయిటులేటికిఁ గుందుచుంటి వు
జ్జ్వలగతి నేమహామహుని భాగమునఁ మన నిల్పి తత్పదం
బుల ననురాగసూనములఁ బూజయొనర్పఁగఁ గోరుచుంటివో
సలలితుఁడాప్రతాపుఁడు భృశంబుగ నిన్నలరించుఁ దాళి. ౯.

హేలాపురములో మహారాజసౌధాంతరంబున హంసతూలికా తల్పంబుపై నొకపురుషుఁడు వేదనాభరంబున మైమఱచి పరుండియుండెను. వానిపాన్పున నొకప్రక్క భయవిహ్వలచిత్తయు దీనవదనయు నైన చంద్రికళాకన్యయు రెండవప్రక్క వీరధన్వియుఁ గూర్చుండి యుండిరి. అప్పటికి జాము రాత్రియైనది. మహారాజాపురుషుని స్థితిగతులను దెలిసికొనుటకై యప్పుడే యాగదిలోని కేతెంచెను. మహారాజును జూచినంతనే వీరధన్వి భయవినయసంభ్రమంబులు మనంబునఁ బెనంగొన దిగ్గనలేచి యెదురుగఁజని నమస్కరించెను. మహారాజు "వీరధన్వీ! దుష్టశాత్రవకాంతార వీతిహోత్రుండును పాంచాలరాజ్య రమారక్షకుండును విశేషించి నాకును నాపుత్రికారత్నంబునకును ప్రాణప్రదాతయు నైన యీయతివేషధారియగు జగదేకవీరు నేమిఁ జేసితివి? కృతజ్ఞతాబద్ధులమైయున్న మనకీమహావీరుఁడు దక్కునా? ఆనాఁడరణ్యములో నావిషయమై చూపిన నీవైద్యక్రియాకౌశలము వీనియందేమైన పనిసేయుచుండెనా? ఈవీరశిఖామణి కెంతవరకుఁ జికిత్సఁ గావించితివి? ఇప్పుడెట్టిస్థితిలోనుండె?" అని య

డిగెను. అందుపై వీరధన్వి "మహారాజా కేవలము మూర్తీభవించిన భూతదయాది సర్వసద్గుణ సంపన్నులును దీనవిహంగాశ్రితసురవృ మంబులునగు నేలినవారియొద్దఁ జేరిన వారి కేలోపమైన రానేర్చు నా? ప్రభువువారి పాదధూళి శిరంబున మోయుచు బ్రతుకఁదలంచి న యల్పనరకీటకంబనగు నే నేలినవారి ప్రియతమవిషయమునందు ప్రమత్తుండనై యశ్రద్ధసేయుదునా ? రూపరేఖావిలాసములనుబట్టి యీపురుషుఁడు నేనుపెంచిన ప్రతాపసింహునివలెఁ గన్పట్టుచున్నాఁ డు. మఱియు నీతఁడు ధరించిన యుక్కుకత్తళము నేనొసంగినదే. అది యెంతవాడిగల కత్తిదెబ్బనైన లక్ష్యపెట్టునది కాదు. ఇప్పుడద్దాని శై థిల్యము ఖండనోద్దండతను వెల్లడించుచున్నది. ప్రభుకటాక్షబలంబు న నాయోపినంతవట్టు పనిఁజేయుచుఁ గార్యకారణ కర్తయైన పరమే శ్వరుని నాకృషిసఫలంబుసేయఁ బ్రార్థించుచున్నాఁడను. ప్రప్రథమ మున గాయములనుండి స్రవించి పేఱికొనిన రక్తమును గడుగుటకై వీనికాషాయ బురకాను దీయయత్నించితిని. ఆబురకా లోనిభాగము న ధరించినయుక్కుకత్తళపు తీగెలుతెగి కొన్ని బురకాలోను కొన్ని దేహమునందును గుచ్చికొనియుండుటచే వానినిఁ గదిపిన నీపురుషు న కుపద్రవము వాటిల్లునేమోయని సంశయించి కొన్ని యోషధుల తో నాబురకాపైనే కట్టుగట్టియుంటిని. ఆయోషధీరసము దేహము నందలి గాయముల కేపాటితగిలిన నవిమోటుదేరి నిర్బాధకంబుగ నుండును. పిదప నీపురుషున కొకింత తెలివివచ్చును. అప్పుడాతీగె లను బెఱికినను వీనికి బాధకలుగదు." అని పలుకుచుండఁ బ్రతాప సింహుఁడు 'ఊఁ- ఊఁ- ఊఁ.' అని మూలుగారంభించెను.

అది విని వీరధన్వి యమితానందంబున "మహారాజా ఈవీర పురుషునకుఁ దెలివివచ్చుచున్నది. ఓషధీరసము పనిచేసినది. చిత్త గింపుడు" అని సంభ్రమించి తానన్నప్రకార మావీరపురుషుని దుస్తు

లనశ్రమంబుగఁ దీసివేసి గాయములను గడిగి శుభ్రపఱచి నూతన్నౌషధలేపనం బొనర్చి మరల కట్లుగట్టెను. మహారాజంతవరకును బాష్పపూరితనేత్రుండై నిలుచుండియే యాకఠినచికిత్సను విలోకించుచుండెను. చంద్రికళ చూడఁజాలక భావోద్వేగంబున వివశురాలై మూర్ఛిల్లెను.

అట్లు తనకర్తవ్యమును నెరవేర్చి వీరధన్విసుదర్శనునిపాదంబుల కెఱఁగి లేచి "మహారాజా! ఏలినవారివాల్లభ్యవిభూతిచేతను దైవకటాక్షముచేతను మనకీవీరపురుషుఁడు దక్కినాఁడు. ఈతఁడు తెల్లవాఱినతోడనే యేలినవారితో ధారాళముగ మాట్లాడఁగలుగును కాని యీసేవకుని మనవి యొకటి యాలింపవేడెదను. మహాప్రభూ. వీని నెంతమాత్రమును కదలకుండఁ బరుండనీయవలెను. వీనికిక నొకగంటకు తీవ్రమైన జ్వరము వచ్చును. ఆజ్వరమాంద్యముచే గాఢమైననిద్దుర పట్టును. తెల్లవాఱినంగాని మెలఁకువరాదు. అప్పుడప్పుడు జ్వరతీవ్రతచే దాహమని సంజ్ఞ సేయుచుండును. వెంటనే యుష్ణోదకము కొంచెమిప్పించుచుండవలెను. జ్వరాతిశయంబుచే నేమేనిపలవరించినను భీతిఁజెంది మాట్లాడించఁగూడదు. ప్రమాదవశముననైన వీనికి నిద్రాభంగముఁ గలిగించినచో నీపురుషున కుపద్రవము తటస్థించుట నిశ్చయము. అప్పుడు నన్ను శిక్షించినను లాభముండదు. నేనిప్పు డేలినవారి యనుజ్ఞపైఁ జనినపిదప వీనికి సమయోచిత దాహాద్యుపచారము లొనరింప నెంతయో నేర్పుగలిగి ధీరచిత్తయై యేమరకయుండఁగల యొకపరిచారికను మాత్రమే వీనిచెంత విడువకుండ నుండునటుల నేర్పాటుచేయవలయును. నేను తెల్లవారినతోడనే వచ్చి యేలినవారినిదర్శించెదను. నాకు శెలవొసంగెదరా?" అని సవినయంబుగఁ బలికెను. మహారాజమితోత్సాహంబున వీరధన్విచెప్పిన చొప్పు జరిగించుట కంగీకరించి శెలవొసంగెను. పిదప నావైద్యుఁ డాగారమునఁ జైతన్యరహితుఁడై పడి

యున్న శూరసేనునకు వలయుచికిత్సల నొనరింపఁ బనివినియెను.

అప్పటికి చంద్రికళ తెలివిఁజెంది లేచి యత్యాతురతఁ దండ్రి చెంత కేగి "జనకా. వీరధన్వ యేమనిచెప్పెను? ఈమహాపురుషుఁడు జీవించునని చెప్పెనా ? నిజము చెప్పుము." అని యార్తితో నడిగెను. అందుపై మహారాజు వీరధన్వచెప్పిన సంగతులన్నియుఁ జంద్రికళకెఱింగించి "బిడ్డా! చంద్రికళా. వీరధన్వకట్టడిప్రకారము వీరిని కుపచారమొనరించుభారము నీవేవహింపవలయును. ఇతరులను నేను విశ్వసింపఁజాలను. నీవేమఱక వీని బహుజాగ్రత్తతోఁ గాపాడెదవని నమ్ముచున్నాను." అని పుత్రికను హెచ్చరించి మహారాజు నిజశయ్యాభ్యాంతరంబున కేగెను.

శూరసేనుఁడు కారాగారమునకుఁ గొనివచ్చినప్పటనుండియుఁ చైతన్యరహితుఁడుగానే యుండెను. వీరధన్వ చికిత్సాప్రభావంబున నట్టకేలకొక్కింత తెలివిఁజెందెను. దాహముదాహమని సంజ్ఞఁజేసెను. ఉష్ణోదకమొసంగిరి. దానఁదృప్తిఁజెంది కనుఱెప్ప లెత్తిచూచెను. వాని చెంతనొక బాలజవ్వని దీనవదనయై కూర్చుండి యుపచారమొనరించుచుండెను. శూరసేనుఁ డామెనింకను గుర్తింపలేదు. తండ్రికిఁ దెలివి వచ్చుటఁ జూచికొని యత్యుత్సాహమున వానియెదపైవ్రాలి "హా, తండ్రీ. బోయవెజ్జు నేర్పుమూలంబున నాకుఁ దక్కితివా. జనకా. నీముద్దులలలితను నేనే. నిన్నుఁ జూడఁగోరివచ్చితిని. ఒక్కసారికను లెత్తిచూడుము." అని వెక్కివెక్కి యేడువనారంభించెను. అంత శూరసేనుఁడు కనులు తెఱచి లలితను గుర్తించి "బిడ్డా. నాముద్దులలలిత. నీచిన్నారిముద్దుమోము నేఁ జన్మంబున మరలఁ జూడఁగలిగితినా తల్లీ. నాకింకభయములేదు. కన్నతల్లీ ఏడువకుము" అని యామె శిరోజంబుల నివురుచు నమితానందముఁ జెందుచుండెను. లలితయుఁ దనతండ్రిని బునరుజ్జీవితునిగాఁ జేసిన భగవంతునకు భక్తిపూర్వకవందనసహస్రం

బు లర్పించుచుండెను. శూరసేనుఁడు వీరధన్వయొసఁగిన యోషధీమిళిత దుగ్ధపానంబుచేఁ బుష్టిజెంది లేచికూర్చుండి లలితను బ్రియమారఁగాఁగిట గదియించి "అమ్మా నాముద్దులలలితా. మాయలమారి కామపాలునికుతంత్రంబులకు లోనై నీమనస్సు నొప్పించుటయేగాక కేవలము నిరపరాధియు ధర్మప్రభువునగు సుదర్శనమహారాజునకు దారుణమైన యపకారమొనరించితిని. ఆదురాత్ముఁడు నాపేర నొక లేఖ వ్రాసి యంపినాఁడు. నేను పోలికలను వీడి పలాయితుండనై యరణ్యమార్గమునఁ బోవుచుండ నొక యాత్రికుఁడు వచ్చి యద్దానినాకొసంగి చనియె. నేనాలేఖను చదివినంతనే యతివేషధారియగు వీరుఁడు నన్ను మా[illegible]ని నాకిట్టియవస్థఁ గలిగించె. ఇదిగో చూడుము." అని తనజేబులోనుంచి యొకలేఖను దీసి లలితచేతికిచ్చెను. లలిత దానిని విప్పి చదివికొనియెను. అందిట్లు వ్రాయఁబడినది.

"మిత్రమా. శూరసేనా. నేను శత్రువుచేతిలోఁ జిక్కి బందిగంబుననుంటినని నిరుత్సాహమునఁ జెందకుము. నీవు రణంబునఁ బరాజితుండవై పలాయితుండవైతివని విని నీమేలుఁగోరి నే నీలేఖ వ్రాసితిని. నీవు పుష్పగిరి కేగవద్దు. బదరీవనగిరిప్రాంతమున నాకై వేచియుండుము. నామిత్రులసాహాయ్యంబున నేనీచెఱవీడివచ్చి నిన్నచ్చోఁ గలిసికొనియెదను. నీకుమారీమణియగు లలితను నీవచ్చోటనే గాంచెదవు.

ఇట్లు,

కామపాలుఁడు"

ఆలేఖఁ జదివినంతనే లలిత కమితమైన విచారము గలిగెను. వేడిబాష్పవిడిచి "తండ్రీ, అదృష్టవశంబున మన పాలిటి మృత్యుదేవతయైన కామపాలుని బారినుండి మనము వెలిబడఁగల్గితిమి." అని పలికెను. అందుపై శూరసేనుఁడు "అమ్మా నీవియ్యెడ కెట్లురాగలిగితివి?" అని యడిగెను. అందుపై లలిత "తండ్రీ. నేనును

నామాయలమారి నా పేర వ్రాసిన లేఖవల్లనే వంచింపఁబడియు నా హృదయాధిష్ఠితదైవముచే రక్షింపఁబడి నిన్నుఁ జూడఁగలిగితిని. అని తనయొద్దనున్న లేఖను తండ్రిచేతికిచ్చెను. శూరసేనుఁ డద్దానిఁ జదివినంతనే కాలాగ్నిరుద్రుఁడై చివాలున లేచి వరనుండి కత్తినిదీసెను. ఆయావేశకృత్యముచే వానిగాయము లుడిలి మరల రక్తము స్రవింప నారంభించెను. వెంటనే వీరధన్వ యారక్తమును గడిగి శుభ్రపఱిచి దివ్యౌషధీలేపనంబుల మరల కట్లు గట్టి మాట్లాడనీయవద్దని విధించి వెడలిపోయెను.

వీరధన్వ చెప్పినప్రకారము ప్రతాపసింహునకు తీవ్రమైన జ్వరమువచ్చెను ఆజ్వరమాంద్యముచే గాఢమైన నిద్రపట్టెను. అప్పుడు చంద్రికళ చేయునది యేమియు లేక నిజాంతరంగంబున నుప్పతిల్లుచుఁ బొంగిపొరలు భావతరంగంబుల మునుఁగుచుఁ దేలుచు నీఁదులాడుచుండెను. కొంతతడవట్లుండి పర్యంకంబుచెంత మోకరించి కరాంజలిపుటంబుఁ బైకెత్తి నిమీలితనేత్రయై "ఓ పరమేశ్వరా! దీనజనశరణ్యా! నన్ను నీటనుముంచఁదలంచితివా, పాలనుముంచదలంచితివా? ఏమహావీరుని మోహనవిగ్రహమును నాహృదయపీఠంబున నిలిపి రేయుంబవలు లారాధించుచుంటినో యేజగదేకశూరుని శౌర్యసంపదచే నేనును నాతండ్రియు నెన్నియో పర్యాయములు మృత్యుముఖంబు నుండి వెలిఁబడఁగల్గితిమో యేయనవద్యగుణనిధి పరవ్రతుఁడై దీనజనరక్షణార్థమో మఱియేయితర కారణంబుననో నిజగోత్రనామంబులను గుప్తపఱిచి యజ్ఞాతచర్యుఁడై యాపత్సముద్రమున మునింగియున్నవారి నుద్ధరించుచుండెనో యెవ్వానినాజీవితంబునకెల్ల భాస్కరోదయంబుగ భావించుచుంటినో యెవ్వానిదాసినై తదీయచరణపంకజంబుల నిరంతరముఁ దదేకలక్ష్యంబుగ సేవించుచుఁ బ్రేమపుష్పంబులఁ బూజించుచు ధన్యతనొందఁగాంక్షించుచుంటినో యానాప్రాణే

శ్వరుఁడు నాదైవము నాసర్వేంద్రియారాధనలక్ష్యము నాజీవనాధార ము నాప్రాణము నేడివ్విధంబునఁ బడియుండఁ గనులెరియఁజూచు చు మేన ప్రాణంబులు నిలుపఁగలుగుచుంటిని. నావంటికఠినహృద యు లెందైన నుందురా, అయ్యో! దాహాకాంక్షయైన సూచింపఁసుం డె. ఈదుర్దుర చివరకెట్లు పరిణమించునో. నాయదృష్టమెట్లున్నదో. హేదేవా. నీవు నాయందనిలిచి నీయుపాసనహేతువే నాకు సమయ సముచితధైర్యమును గలిగింపుము." అని యేమేమో యనుకొనుచుం డఁ బ్రతాపసింహుఁడు కనులుతెఱువకయే దాహకాంక్ష సూచింప నోరుతెఱువనారంభించెను. ఆసన్నసఖీంగి చంద్రికళ గ్గనలేచి వాని చేనుష్ణోదకంబును నేర్పుగఁ ద్రాగించెను. ప్రతాపసింహుఁడు మరల గాఢనిద్రాముద్రితుండయ్యెను చంద్రికళయు మరల నాభావోద్వే గతరంగంబులంబడి మునిఁగి తేలుచుండెను ఈసారి నామెకొక్కింత యుత్కలిక జనించుటచే నామెహృదయాంబుధినిఁ గొన్ని నూతన భావోర్మికలుప్పతిల్లఁదొడంగెను. చంద్రికళ యుత్సాహోత్సాహంబు నఁ దన్నుదా సంబోధించికొని "భాగ్యవతివైన చంద్రికళా. నీవు నిర్మించికొనుచున్న వాయుహర్మ్యములు ప్రత్యక్షానుభవనీయములు గా నున్నవని గర్వించి మైమఱవియుండకుము. ఆహర్మ్యములు పేక గీములు గాకుండవలయునుగదా. నీవుధైర్యమును చిక్కఁబట్టి తదేక లక్ష్యంబుగ నొక్కింతతడవు వేచియుండుము నీకాంక్షితార్థంబులు సిద్ధించునేమో. ఏమిది! నాకు మతిపోవుచున్నది కాఁబోలు. నాదైవ మిట్లుపడియుండ నాకుకాంక్షితార్థంబులా. సిద్ధించుట!. ఎంతయవివే కము! ఇంతటిమహాపురుషుని యర్ధాంగినగు భాగ్యము నాకున్నను లేకపోయినను నేనిప్పట్టున నీమహానీయమూర్తినిఁ జేయూరి సేవించుచు మనసార స్మరించుచుంటిని. నాకంతియేచాలును. ఎద్దానికైన ముం దుగ నువ్విళులూరుట భావిఫలోదయసూచకము కాదు. కాఁకుండా

రా. మీరిట్లు నాపైమూఁగుచు నిర్దయత్వంబున నాకపకారమొనర్పకుఁడు. ఈమహాత్ముని విశాలహృదయవీధిలో నాకేమూలనైన నిలువ బ ొదవెనో లేదో. నే నీమోహనమూర్తి యర్ధాంగినై నిరుపమాన భక్తిపూర్వకదాస్యంబుచే వీనినలరించుచు నీచతురుని మహనీయమంజుల మధురాలాపంబులఁ దనివితీర నాకర్ణాంజలిపుటంబులఁ గ్రోలుచు నీమహావీరుని యనుగంతనై తదీయదిగంత విశ్రాంత యశశ్చంద్రికల విహరించుచు నీనవమన్మథునిఁ గూడి మదనసామ్రాజ్యం బనుభవించుచు ననవరత మానందతరంగమాలికాడోలికలఁ దూఁగుచుండుటకుఁ బెట్టిపుట్టితినో లేదో." అని యింకను నేమో యనుకొనుచుండ "చంద్రికళా!" అను సన్నని పిలుపస్పష్టముగ వినవచ్చెను. ఆసన్నని యెలుంగు వినినతోడనే చంద్రికళ త్రుళ్ళిపడి లేచి తన్నెవ్వరట్లు పిలిచిరో తెలిసికొనంజాలక యమితాసక్తిఁ బరితాపసింహుని మోము విహ్వలచిత్తయై తదేకదృష్టిఁ జూచుచుండెను. పరితాపసింహుఁడు మరల సన్నని యెలుంగుతో "ప్రాణప్రియా. చంద్రకళా" అని పిలిచెను. అదివినినంతనే చంద్రికళ హర్షపరవశయై "ఓహో. ఏమి నాభాగ్యము. ఈవీరశిఖామణి నన్నుఁ బ్రేమించియుండె. వీనిహృదయసామ్రాజ్యము నాకులభించె. నేను ధన్యురాలనైతిని" అని యత్యుత్కలిక "ప్రాణేశ్వరా. ప్రాణేశ్వరా. నేనే చంద్రికళను. నీ చరణసన్నిధినే యున్నదానను. దాసురాలి కేమియాజ్ఞనొసంగెదవు?" అని వానిచెంత మోకరించి యానందతరంగంబులు పొంగి పొరలి పైకుబుకుచుండెనో యనఁ గన్నీరు మున్నీరై ప్రవహింప వానియెదపై నిటలంబు మోపి భావోద్వేగంబున వెక్కివెక్కి యేడువసాగెను.

అప్పటికి భళ్ళున తెల్లవారెను. దోషపరిహార భయంకరుండగు పరితాపుఁడు నిజతేజంబున వెలుంగ నుదయింపనుండె ననితెలుపు శకుంత సంతానంబులు కలకిలారావంబుల సర్వప్రాణులను మేల్కొ

లుపుచుండెను. శత్రుజన జీవనహర్తయు నాశ్రితజన జీవనప్రదాతయు నగు నాప్రతాపునిఁ జూడఁగోరి సుదర్శనమహారాజాగదిలోనికి వచ్చెను. చంద్రికళ యేడ్చుచుండుటఁ జూచి తత్తరముతో "అమ్మా చంద్రికళా ఏడ్చుచుంటివేమి? నీపురుషుఁ డింకను మేల్కొనలేదా యేమి?" అని యడిగెను. చంద్రికళ తండ్రినిఁ జూచి తనమనోగత రహస్యమును జనకుండు తెలిసికొనియెనని సిగ్గు చెంది వ్రీడాభరంబున నవనతవదనయై యూరకుండెను. అంతట ప్రతాపసింహుఁడు మేల్కొని కనుల విచ్చి నల్దెసలంకులు దేఁచూచి నివ్వెఱగందుచు "నేనిపు డెచ్చోటనుంటిని?" అని యడిగెను. వీరధన్వి చెప్పిన ప్రకారము జరిగెఁ గదా యని మహారాజమిత నందముఁ జెంది ప్రతాపసింహుని చేరంజని వాని దక్షిణకరంబుఁ గ్రహించి "వీరశేఖరా నీ వెచ్చోటనుండ వలసినవాఁడవో యచ్చోటనే యుంటివి. నీయనవద్య శౌర్యధైర్య సాహసోదారభుజబల ప్రతాపంబులఁ బ్రతుకఁగలిగిన సుదర్శనునకును జంద్రికళకును నతిథివై యుంటివి. నీచే దుష్టశత్రువుల పాలఁబడి ఖిలముగాకుండ రక్షింపఁబడిన పాంచాలరాజ్యలక్ష్మి పాత్రిలిలో నుప లాలింపఁబడుచు నీహృదయసామ్రాజ్యభోగినియగు చంద్రకళచే నుప చరింపఁబడుచుంటివి. అనంత పయోనిధుద్రిం డగుపరమేశ్వరుని కృప చేతను వీరధన్వి యద్భుతవైద్య క్రియాకౌశలము చేతను నమూల్యమైన నీప్రాణములను మాకొఱకు రక్షింప వీరశయ్య నలంకరించి యుండియుఁ బునరుజ్జీవితుండవై మాకు దక్కితివి. నాయనా దిగంత విశ్రాంత నితాంత యశశ్చంద్రికళా భోగవిభవుండవై యాచంద్రతారార్క మీభూమిపై దుష్టజన శిక్షణంబును శిష్టజనరక్షణంబు నొనర్చుచు నాశ్రిత జన మందారంబవై వర్ధిల్లెదవుగాక" అని పలికెను. ఆమాటలు విని ప్రతాపసింహుండు బాష్పకలితలోచనుండై "ఏమేమీ!" అనియేమీ చెప్పఁబోయి మాట్లాడలేక పెదవులాడించుచుఁ గనులుమూసెను.

అంత వీరధన్వ ప్రవేశించి మహారాజునకు నమస్కరించెను. పిదపఁ బ్రతాపసింహుని నాడిఁ బరీక్షించి కన్నులు విప్పిచూచి సహర్షంబుగ "మహారాజా. ఈవీరపురుషుని జ్వరము హరించినది. ఓషధీరసమహిమచే గాయములు చాలాభాగము మానినవి. వీని కింక భయములేదు." అని శేషించిన గాయములకు పూతపత్రికయుఁ గట్టుకట్టి "నాయనా ప్రతాపసింహా. మేల్కొనకుంటివేమి? నిన్నభినందింప మనయేలుగడయగు మహారాజుగారు వచ్చియున్నారు. కనులెత్తి చూడుము. నీయారోగ్యస్థితి నెఱింగింపుము" అని వాని భుజంబుపై చేయివేసి లేపెను. ఎంతలేపినను ప్రతాపసింహుఁడు లేవలేదు. మాటాడలేదు. మహారాజును చంద్రికళయు భయవిహ్వలు లగుచుండిరి. భావోద్వేగతరంగితాంతరంగు లగుటచే మరల వానికేమి కీడు వాటిల్లెనో యని భయసంభ్రమాక్రాంతహృదయులై "వీరధన్వీ. ఈమహోపకారి యింకను లేవకుండుటకుఁ గారణ మేమి?" అని యడిగిరి. అందుపై వీరధన్వ "మహారాజా జ్వరము నిశ్శేషమైనది. కాని యింతకు పూర్వ మీపురుషుఁడు తీవ్రముగ మాట్లాడియుండెనో విశేషవార్త యెద్దియైన వినియుండెనో వీని హృదయము మతితంబుగ నుద్వేగించుటచే ధాతువు నీరసించినది. ఇది నిస్త్రాణగాని స్మరగాదు. కొంచె మావుపాలు దెప్పించి యీయౌషధ మందుంచి కాచి చల్లనైన పిదప నాపాలను వీనిచే ద్రాగించితిరేని పుష్టిఁజెంది లేచి కూర్చుండఁ గలుగును." అని చెప్పెను. ఆమాట వినినంతనే చంద్రికళ పట్టరాని సంతోషంబున లోనికిఁ బరుగిడి యావుపాలప్పుడే పితికించి స్వయముగఁ గొనితెచ్చెను. బోయవెజ్జుచెప్పిన ప్రకారము జరిగించిరి. ప్రతాపసింహుఁ డాపాలుద్రాగినంతనే పుష్టిఁజెంది కనులు తెఱచి చంద్రికళనుజూచి చిఱునవ్వు నవ్వెను. చంద్రికళ యానందబాష్పపూరితనయనయై వ్రీడాభరంబున శిరంబు వంచి క్రేగంటి చూపులతో సుందర దరహాసరుచుల వానికి నివాళి

యొసంగెను. కొంచెము సేపైనతరువాత ప్రతాపసింహుఁడు లేచి కూర్చుండి మహారాజునకు నమస్కరించెను. సుదర్శనుఁ డత్యాదరంబునఁ బ్రతాపసింహుని గాఁగలించికొని తరువాత వాని కరంబు మరల గ్రహించి "నాయనా ప్రతాపసింహ. కోసల పాంచాల రాజవంశముల నుద్ధరింప నవతరించిన మహావీరుఁడ వగు నిన్ను గొంతకాలము పురాకృతకర్మ పరిపాకంబు పేర్మిఁ బెక్కుకష్టంబుల నలయించినను దయాసముద్రుం డగుపరమేశ్వరుఁడు నిన్నుఁగంటిని ఱెప్పవలెఁ గాపాడి రక్షించి మాకొసంగె. మేమెంతయుఁ జరితార్థులమైతిమి." అని పలికెను. ఆమాటలు విని ప్రతాపసింహుఁ డచ్చెరువందుచు "మహారాజా. ఏలినవారు పలికెడు పలుకులచే జన్మవృత్తాంత రహస్యమెఱుంగని నాహృదయాంబుధి యపూర్వ భావోర్మికల దుర్భరంబుగ సంక్షోభించుచున్నయది మితిమీరిన దురాశాంకురంబులు పెల్లుగ మోసులెత్తుచున్నవి ఆయంకురంబుల నేలినవారు ప్రేమరసపూరిత వాక్యామృతంబుచేనభివృద్ధిఁ జేయుచున్నారు. చివరకవి యెట్టిఫలంబుల నొసఁగునో తెలియదు. మదీయమనోవిహంగ మిట్లనవరతముద్గమించి యుపరివీధి నెగురుచుగమ్యస్థానముఁ జేరఁగలుగునో చివరకధోగతిపాలగునో కన్నతల్లిదండ్రుల నెఱుంగక బంధుప్రేమ యెఱుంగక గతిమాలియేకాకినై కులశీలంబులు లేని కిరాతకుల సంజాతుండనని లోకముచే గ్రాహ్యంపఁబడుచున్న నన్ను సుక్షత్రియవంశాలంకారులగు నేలినవారింతగ ప్రేమించుటచే నాచిత్తంబు తల్లడిల్లుచు విందుచున్నయది పరమధర్మస్వరూపులును నప్రతిమాన భూతదయాళుచిత్తవృత్తులును నగు రాజాగ్రగణ్యుల నగు మీవంటి సత్ప్రభువుల వాల్లభ్యలక్ష్మీకటాక్షు సంపన్నులగువారి కొఱఁదలు రానేర్చునా? వచ్చినను భయమొదవునా? నా కట్టిసంపదఁ గలిగించిన భగవంతున కిదే వందనసహస్రంబు లర్పించుచున్నాఁడను. వెనుక నే మీకుఁజేసియున్న వాగ్దానముప్రకారము

మీసన్నిధికేతెంచి మీచేతను మీకొమరితచేతను ప్రాణాతిథ్యమును గ్రహించితిని. నాకర్తవ్యమును నెరవేర్చితిని. ఇంక నాకీలోకవృత్తముతో సంబంధములేదు. కావున నే నింతటినుంచి తురీయాశ్రమంబు స్వీకరించి దేశద్రిమ్మరిగ శివయాత్రఁ గడప దలంచితిని. మహారాజా. నాకు సెలవొసంగుడు. పోయివచ్చెదను." అనిపలికి వాక్పరిశ్రాంతివివశుండై పడిపోయెను. చంద్రికయే తత్క్షణమే యోషధిమిశ్రిత గోక్షీరంబును వానిచే ద్రావించెను. దానఁబ్రతాపసింహుఁడు మరల నొక్కింత పుష్టిఁజెంది లేచికూర్చుండి నేమియో చెప్పఁబోవుచుండ సుదర్శనుఁడు "నాయనా నీవు చాలాయలసియున్నావు. కొంచెముసేపు సుఖనిద్రాముద్రితుండవై విశ్రాంతిఁ జెందుము ఇప్పట్టున నీమనస్సు చెదరియున్నది మాటాడక పరుండుము." అని సాదరంబుగఁ బలికెను. అందుపైఁ బ్రతాపసింహుండు "మహారాజా! నామనస్సు వివిధభావతరంగంబుల గలగుండుపడుచున్నయది. జ్ఞానమువచ్చినది మొదలునే నెవ్వరిని హింసించి యుండలేదు. బుద్ధిపూర్వకంబుగ నెవ్వరిమనస్సు నొప్పించియుండలేదు. ప్రత్యుపకార మపేక్షించి యాశాబద్ధుండనై వాంఛపడియుండలేదు. అగతికుండనగు నేనెవ్వరిసన్మనోరథంబునకు మార్గనిరోధకంబుగ వర్తించియుండలేదు. ఆపత్సమయముల నుదాసీనుండనై యుండలేదు. అయినను ప్రారబ్ధవశంబున నెందరికో హృదయకంటకుండనై యున్నాను. వారు నాచావునపేక్షించి విశ్వప్రయత్నములు చేయుచున్నారు. ఇట్లు జనకంటకుండనై బ్రతుకుట యేమిపురుషార్థము?" అని పలికెను. అందుపై సుదర్శనుఁడు "వీరాగ్రణీ రాజ్యలోభంబున దురాశాబద్ధులగు దుర్జనులెవ్వరో నీవంటి గుణమణుల కపకారము చేయనెంచిరని లోకమంతయు దుర్జనవికీర్ణమేయని భావించు టుచితమా." అని పలికెను. అంత ప్రతాపసింహుఁడు "మహారాజా. అజ్ఞాత జన్మసంభవుండనగు నాకును రాజ్య

ఉబ్ధులకును సంబాధ మేమియుండును?" అని సవిస్మయంబుగ నడిగెను. అందుపై సువర్ణుడు "నాయనా. నీవజ్ఞాత జన్మసంపన్నుండవగుటచేతనే సంబంధవృద్ధియో యుండవచ్చునని నేనునమ్ముచున్నాను. ఆసంబంధ మచిరకాలములో వెల్లడికానై యున్నయది. నీవొక్కింత తడవు నిద్రింపుము. దర్బారుసమాచారముల నెఱింగిమరలవచ్చెదను" అని పుత్రికతో "అమ్మా! చంద్రికళా నీవు నీభవనంబునకేగుము. నీచేటీజనంబుల నీసమీపంబున నిలిపి యవసరమైనచో నాకు వర్తమానమంపుము." అని కట్టడిచేసి యాగది వెడలివచ్చుచుండ మధురికవచ్చి "సఖీ చంద్రికళా ఇందుమతి బట్టలపెట్టెలో నాకీపత్రపుటంబు లభించినది. ఇదిగో గైకొనుము." అని చంద్రికళచేతి కొకకాకితపు మడత నొసంగెను. అదిచూచి మహారాజుమరలి "అమ్మా చంద్రకళా ఆపత్రమిట్లు తెమ్ము. ఇందుమతి లేని లోటీపత్రము తీర్చునేమో" అని యాపత్రమందికొని దర్బారునకేగెను. ప్రతాపసింహుండు నిద్రించెను.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఇరువదియొకటవ ప్రకరణము.



ఉ॥ కానిపనుల్ స్వలాభమునకై పచరించెదు మాయలాడివై
తీయమాటల న్విని పతి న్విడనాడుచు చేరఁ గీయవే
మా వుఁ గాఱఁడొందు నవమానము పొందియుఁ గీ దకుండునే
మానిక మున్న దంచు ఫణిమచ్చికఁ జేఁగొనఁ గాటు వేయదే.

జీవనహర్తయు జీవనప్రదాతయునగు జీవనజాప్తుఁడు జీవనజం
బుల నలరించి మకరందాసక్తిఁ దత్కర్ణికలఁ జిక్కియున్న బంభరంబుల
నుల్లసింపఁజేయుచు నిద్రాముద్రిత జీవకోటిని నిజకరంబుల మేల్కొ
లుప సరాగుఁడై యుదయగిరిశిఖరం బలంకరించెను. చంద్రశేఖర
మహారాజుగారి పుష్పోద్యానవనంబున బాలభానూదయ సమయస
ముచిత ప్రకృతిసౌందర్యంబును దిలకించుచు నవనవోత్ఫుల్లకుశేశ
యంబులపై వ్రాలి కమ్మతేనియ లాస్వాదింప స్వైరవిహారవిలోలంబు
లగు నుద్భ్రమద్భ్రమర గానంబుల కానందించుచు శుకపికశారికాదిశ
కుంతసంతానంబుల కలకలంబుల కుత్కలికఁ బొందుచు బరిమళ మిళిత
మందమలయమరుత్కిశోరంబు లంతస్తాపంబున గ్రాగు మేనిపై బొలయ
హాయిని బొందుచుఁ దన యాంతరంగిక చేటియగు వాసంతిక యింకను
రాకుండుటకు హేతువేమై యుండునో యని యోజించుచుఁ బ్రతా
పోదయంబు సహింపఁజాలనిదయ్యుఁ బ్రతాపోదయ సమయంబున
నా కేళీవనములోఁ జిత్రాంగి యేకతంబ విహరించి విహరించి యొకమల్లె
పొదరింటిలోఁ బుష్పపరాగ వికీర్ణశయ్యపైఁ గూర్చుండి తనలో "నా
ప్రేమార్థియైన శూరసేనుఁడు ప్రతిఫల రహితుఁడయ్యు నేఁ గోరుటలద

వుగా నెట్టి దుష్కార్యోద్యమములనైన నెరవేర్చి నాకెన్నియో యుపకారము లొనరించుచుండె. తనయందు నాకుఁ గల ప్రేమ బలంబు నెఱింగియే కదా నాపైఁ దనకుఁ గల గాఢానురాగంబు కతన ద్వితీయ వివాహం బొల్లఁడయ్యె. అట్టిప్రియుని యెడల నేనెంతయో కృతఘ్నురాలనై ప్రవర్తించుచున్నాను. ఆనాప్రియుఁ డీనుప్యమోహాతిరేకంబున నా యొద్దకువచ్చి తమిమీరి యుద్రేకించినను పశ్చాత్తాపంబుచే వారించి నిష్ఫల మనోరథునిఁగావించి పంపివేసితిని. అయినను నాపై యలుంగక నాకోరికప్రకారము నాయన్నతోఁగూడి సుదర్శనునిపై యుద్ధమునకేగె. వ్యర్థమనోరథుఁడగుటచే తనజీవితమునందు విరక్తిఁబొంది సాహసించెనేమో. రణపరిణామ మేమయ్యెనో తెలియరాకున్నది. తెలిసికొని వచ్చెదనని యేగినమందారకుఁ డింకనురాఁడయ్యె. నాప్రియుఁ డెప్పుడు మరలనాకంటఁబడునో. ఎప్పుడు నాకృతజ్ఞతాఫలమును వారికి నివేదింపఁగలుగుదునో" అని యనుకొనుచుండ మందారకుఁడు వచ్చి చిత్రాంగియెదుట నిలువఁబడియెను. వానిఁజూచి చిత్రాంగి "మందారకా. ఏమన్నుంటివి? రణరంగంబున శూరసేన కాముపాలుర కపజయము కలిగెనాయేమి? వారు సజీవులైయుండిరా?" అని యడిగెను. అందుపై మందారకుఁడు నవ్వుచు "జగన్మోహినీ. ఇంకనువారి రాక నాసించుచుంటివా? వారు రణంబుననోడి సుదర్శనునిచే నేకాంతకారాగారంబుల బంధితులై జీవన్మృతులనే యున్నారు" అని పలికినంతనే చిత్రాంగి హతాశురాలై "హాసోదరా! హాశూరసేనా!! నా నిమిత్తమునగదా మీకిట్టియాపద ఘటిల్లినది. ఇకనాగతి యేమగునో". అని నిట్టూర్పు విడిచెను. అదియదనని మందారకుఁ డామెసరసకేగి "మోహినీ నీముందుగతి నీచేతిలోనే యున్నయది. ఇప్పట్టున నీమానప్రాణములను గాపాడుటకు నేనొక్కండనే సమర్థుండను. ఆరెంటిను నాచేతులోనుంచి నన్ను విశ్వసించితివేని నీకోరికను గలుగనివ్వను.

వెనుక నీను దరదరహాసరుచి నపేక్షించియేగదా మహాసాహసుండైన యాకిరాతయువకు నంత మొందింప నట్టి సాహసకృత్యం బొనరించితివి. తరువాత నీపరమశత్రుండైన యీకామునిని సుస్వర్గసదనంబు నుండి తొలఁగించి యమసదనంబునకుఁ జేర్పించితిని. నీవు నాకొక్కఁ డిచ్చినవేని నేను నీ కామరసాంతకింకరుండ నయ్యెదను. ఏమునియో దప్పి?" అని పలికెను. ఆమాటకుఁ బ్రత్యుత్తర మీయఁజాలక "హా! దైవమా! చివరకు నా కీగతి కలిగెనా. పరమనీచుండైన యీచోరుని పాలఁబడవలసి వచ్చెఁగదా! ఏమి సేయుదును." అని నిట్టూర్పు విడిచి కోపంబున మందారకునిఁ జూచి "చోరుఁడా! నీకొఱకయ్యెది?" అని యాసీమను అంతపై మందారకుఁ డుద్రేకించి "మోహిని. చక్కుకు వచ్చి యుంతదాఁపనేల? ఒక్కసారి నీతో మదనసామ్రాజ్యం బనుభవింపవలె నని కోరుచున్నాను." అని పలికినంతనే చివాలున లేచి రోషకషాయితాస్యయై చకితదృష్టుల నల్వురకును గలయఁజూచుచు "ఛీ! ఛీ! మాతృద్రోహీ. నీవెవ్వరితో మాట్లాడుచుంటివో యెఱుంగకుండ కాఱు లాడుచుంటివిరా బాలిశా! కష్టపడి నన్నుఁ గని నన్నింత చులకఁగ నెంచుచుంటివా! ఉత్తమక్షత్రియకులంబునఁ బుట్టిన మానవతి పాణిభంగమునకైన నోర్చును గాని మానభంగమును కోర్చు ననుకొంటివిరా తుచ్ఛుఁడా! ఓరీ నిచాధమా. నీ విప్పటినుంచి నాకంటఁబడకుము. పొమ్ము" అని గద్దించి పలికెను. అది విని మందారకుఁడు పక్కునవ్వి "చిత్రాంగీ. కోపింపకుము. నే నిప్పుడే చంద్రశేఖర మహారాజుగారి యొద్దకేగి కిరాతయువకుని జన్మవృత్తాంత రహస్యమున్ను కామపాలుని పాతాళగృహా వృత్తాంతము నెఱిఁగించి పోయెదను. తరువాత నావృత్తాంతములను లోకవిదితంబు గావించెదను. నీమర్యాదం బాచంద్రతారకంబుగ భూమిపై నిలబెట్టెదను." అని చివాలున మరలెను.

అంత చితాంగి తనలో "ఎట్టులైన నీ కట్టిడిని మట్టుపెట్టక తీరదు." అని కృతనిశ్చయురాలై "మందారకా! మందారకా! నాపైఁగోపింపకుము. ఒక్కసారె నీకోరికఁ దీర్చినచో వారసేన కామ పాలురను చెఱ విముక్తులను గావించి చంద్రకళా సుదర్శనులను గిరాతయువకుని నంత మొందించెదవా?" అని దరహసితవదన పంకజయై యల్లనఁ బలికెను. కామాంధుఁడైన మందారకుఁ డామె హాతాశురాలై తనకు లొంగెనని నమ్మి సముత్కలిక మరల నామె చెంతకేగి "ప్రియురాలా! సందేహమేమి? నీప్రేమావలోకన పరిభావంబుచే నే నీభూమండల మంతయు బంతిగైవడిఁ ద్రిప్పివేయు మన్నను ద్రిప్పి వేయఁగలను. నాప్రాణముల నర్పింపవలసి వచ్చినను వెనుదీయక నీ యభీష్టముల నీడేర్చుటకే నాజీవితమును ధారవోసెదను" అని నిలు వజాలని తమకంబునఁ జితాంగిని గౌఁగలింపఁ గమకించెను. చితాంగి నేర్పుతోఁ దప్పించుకొని "ప్రియ మందారకా నా చెలికత్తియ యి ప్పుడే రానున్నయది. తమిమీరి త్వరపడినచో ఫలభంగమగుటయే గాక మన యుభయులకు హానికలుగుట నిశ్చయము. ఈ రాత్రి మహారాజుగారు నిద్రించిన పిదప రహస్యముగ మేడమెట్ల క్రింది గదిలోనికి వచ్చెదను. నీ వచ్చో నారాక వేచియుండుము." అని వాల్గాచికలఁ బలికెను.

ఆగదిలోన మృత్యుప్రదంబు లగు దారుణయంత్రము లన్నియు నెలకొ గియున్నవాఁడగుటచే మందారకుఁడు చిత్రాంగి కపటోద్దేశ్యమును గ్ర హించి కుపితుఁడై "చితాంగీ! నీకుప్రయత్న మెల్ల గిలిసి. నీవెంత మాయలాడివైనను మాయాకౌశలంబున మందారకుఁడు నీకుఁ దీసి పోవువాఁడు కాఁడని యెఱుఁగియుండుము. పిచ్చివానా. జంబుకం బునకు జిత్తులు నేర్పెదవా! నీవు బ్రతుకఁదలఁచితివేని యేమైనను సరే యిచ్చోటనే నాకోరిక నెరవేర్చి తీరవలయును. జగన్మోహాసం

బగు నీ సౌందర్యంబుఁ గాంచి యొక నిమిషమైనఁ దమినిలు
పఁజాలను. రమ్ము. నన్నలరింపుము." అని యామెకరం బొడి
సిపట్టి బలాత్కారముగఁ గౌఁగిటఁ గదియింపుమనఁ జిత్రాం
గి తన మొలనున్న పిడియఁదీసి వాని కుత్తుకలోఁ బొడిచెను.
ఆపోటుతో మందారకుఁడు గిక్కురుమనకుండ భూమిపైఁబడి విలవిల
దన్నుకొని ప్రాణములువిడిచెను. వెంటనే చిత్రాంగి యాకైదాను
నూడఁబెఱికి పరులకంటఁబడకుండ రక్తసిక్తములైన దుస్తులతో నంతి
పురంబునకేగి యామస్తులనువిప్పి యొకపెట్టెలోఁబెట్టి తాళమువైచి
వేఱువస్త్రములను ధరించి శృంగారమందిరమున కేతెంచెను.

చంద్రశేఖరమహారాజు హేమాపుర ప్రయాణోన్ముఖుండై
యుండెను. ఆసంగతి చిత్రాంగి యెఱుంగును. ప్రతాపసింహుని
యమునానదిలోఁ బడద్రోచినది మొదలు మహారాజు చిత్రాంగితో
మాట్లాడుటయే లేదు. ఆదురంతప్రయత్నము చిత్రాంగియే చేసియుం
డునని చంద్రశేఖరునకు దృఢమైనయనుమానము కలిగెను. అది
మొదలు ప్రతాపసింహునిపై మఱియు విశేషంబుగఁ బరితపించుచుం
డెను. ఆమహారాజు పరమసాధ్వీమణియైన తన జ్యేష్ఠభార్యయగు చా
రుమతి ప్రతిబింబమగుటచేతను నాఁడదృశ్యుఁడై యిరువదిసంవత్స
రములగుటయు వాఁడిప్పు డిరువదివత్సరముల వయస్సుకలిగియుం
డుటయు వాని వెన్నుపై మత్స్యాకారమైన పుట్టుమచ్చయుండుటయు
మొదలగు కారణములచేతనే గాక చిత్రాంగి వానిపై నంతద్వే
షము వహించి వానినిఁ జంప యత్నించుటచే నామహారాజు తన
జ్యేష్ఠభార్యాపుత్రుఁడగుట నిశ్చయమేయని నమ్మి యెప్పుడు తన
కాపుత్రగాత్ర పరిష్వంగసుఖంబు కలుగునాయని తత్తరించుచుఁ
దానుగూడ వానిఁజూడఁగోరి హేమాపురంబునకేగఁ బ్రయాణసన్న
ద్ధుఁడయ్యెను. అప్పుడే వీరపాలుఁడువచ్చి తండ్రికి నమస్కరించెను.

చంద్రశేఖరుఁడు కౌముదునిఁజూచి "నాయనా! వీరపాలా! సురక్షితుఁడవై వచ్చితివా? నీవు వెళ్ళినపనియేమైనది? " అని యాతురితతోనడిగెను. అందుపై వీరపాలుఁడు "తండ్రీ! ప్రతాపసింహుఁడు మృతిజెందలేదు. శత్రులచే నావిధంబున రక్షింపఁబడిన పిదప నా పురుషసింహము యతివేషధారియై హేలాపురంబునకు సమయోచితంబుగ నేగి యొక్కండె పెక్కండ్రు శత్రువులయుక్కడంగించి శూరసేన కామపాలురఁజెఱ బద్ధులగావించి దారుణరణక్షతవేదనాభరంబునఁ బ్రాణావశిష్టుండై సుదర్శనుని యంతఃపురమునందున్న వాఁడు. వీరధన్వి వానికి వలయు చికిత్సల నొనరించుచుండె. చంద్రకళ వానికుపచారములు సేయుచుండె. సుదర్శనమహారాజు రాజకార్యవిముఖుండై యనవరతమూ పురుషసింహునిచెంతనే చింతాక్రాంతుండై కూర్చుండెను." అని యింకను తానేమో చెప్పఁబోవుచుండఁ జంద్రశేఖరుండు "హా! కుమారా! ప్రతాపసింహ" అని దుఃఖావేశంబున మూర్ఛిల్లెను. కోటలో హాహారావము లుప్పతిల్లెను. ఆసమాచారమును విని చిత్రాంగి మూర్ఛిల్లెను. పరిచారకు లతిసంభ్రమంబున వారలకుపచారము లొనరించుచుండిరి. వీరపాలుఁడు విస్మయాకులితమనస్కుఁడై కళవళపడుచుండెను. కొంతసేపటికి మహారాజు తెలివిఁజెంది లేచి వీరపాలునిఁజూచి "నాయనా! నీవాపురుషునిఁ జూచితివా? ఆతఁడిప్పుడెట్టిస్థితిలోనుండెను? వానినిగురించి నీమామయేమనియె? " అని యడిగెను. అందుపై వీరపాలుఁ డుత్కంఠఁ దండ్రికి నమస్కరించి "జనకా నేనువానినిఁ జూచుసరి కాతండు వీరధన్విచికిత్సాప్రభావంబుచే లేచికూర్చుండియుండెను. మామయు వానిచెంతఁగూర్చుండెను. నన్నుఁజూచినంతనే మామయ్యనన్నతిప్రేమతోఁగౌఁగిలించి ప్రతాపసింహునిఁజూపి యాతండు కోసలపాంచాల రాజవంశముల నుద్ధరించుటకె ధరాతలంబున కవతరించిన కుమారుండనియు వాని నిగూఢ

జన్మవృత్తాంత మచిరకాలములోనే లోకవిదితము కాఁగలదనియుఁ జెప్పెను. ఆమాటవినినంతనే యామహాపురుషుండు నాకగ్రజుండై యుండునేమోయని సాశ్చర్యవదనుండై యాసంగతి మీకెఱింగింప నతిత్వరితంబుగ వచ్చితిని. తండ్రీ. నిక్కువంబుగ నాకట్టియగ్రజుని సాహచర్యభాగ్యంబు లభించునా?" అని పలికెను. ఆమాటలు వినినంతనే చంద్రశేఖరుని నేత్రము లానందబాష్పపూరితము లయ్యెను.

చిత్రాంగి యింకను మూర్ఛమునింగియే యుండెను ఎన్నిచికిత్సలొనరించినను నామెకు తెలివిరాలేదు. జ్వరాతిశయంబుచే నేమేమో యసంబద్ధప్రలాపము లొనర్చుచుండెను. ఆమె చేటియగువాసంతిక చెంతనుండి శైత్యోపచారములు సేయుచుండెను. కొంతసేపటి కామె యొకింత తెలివిఁజెంది చెలికత్తియనుజూచి "వాసంతికా. నేనిపు డెచ్చోటనుంటిని" అని యడిగెను. అందుపై వాసంతిక "సఖి. మహారాజుగారు మూర్ఛిల్లిరని వినినంతనే దుఃఖావేశంబున వివశురాలవై మూర్ఛిల్లితివి. నీమనస్సింకను కలఁతనొందియుండుటచే భ్రమఁ జెందుచుంటివి కాని నీవు నీశయ్యాగారమందిరములోనే యున్నావు. మహారాజుగారు పూర్తిగఁ దెలివి జెందియున్నారు. వీరపాలయువరాజుగారును వారిగారితో మాట్లాడుచున్నారు నీ వెంతమాత్రము భయపడనక్కఱలేదు. మఱికొంచెముసేపు పాన్పుపైఁ బవ్వళించి నిద్రింపుము." అని పలుకుచుండ నపరాధశోధకుఁ డొకఁడువచ్చి సవినయంబుగ "హంతకురాలని మహారాణీగారిపై నభియోగము తేఁబడినందున నామెను ఖయిదీగఁ దీసికొనిపోయి గిరిదుర్గంబున నుంచవలసినదిగా మహారాజుగారి సెలవైనది. అమ్మా నా వెంట వచ్చెదరా." అని పలికెను. ఆమాటవిని పిడుగుపడినంతనే చాతకంబు కూలునట్లు చిత్రాంగి భూమిపైఁ బెళ్ళి యొక్కింతతడవునకు తెలివిజెంది ధీరచిత్తయై "అపరాధశోధకా! మహారాజుగారి యాజ్ఞననుసరించి నీ వెటకుఁ

గొనిపోఁదలంచినను రావలసినదాననే. నమువుము." అని బయలు దేరెను.

మహారాజుగారు హేలాపుర ప్రయాణోన్ముఖులై యుండ నేలీ వనపాలకుఁ డొకఁడువచ్చి మహారాజునకు సాష్టాంగమెఱఁగి లేచి "దేవా. ఏలినవారి పుష్పోద్యాన వనంబున నెవఁడో యొక నూతనపురుషుఁడు హంతకులచేఁ జచ్చి పడియున్నాఁడు. ఆతఁడెవ్వఁడో దెలిసికొనఁ గోరి పరీక్షింప వాని జేబులో నీయుత్తరము లభించినది చిత్తగింపుఁడు" అని యొక లేఖ మహారాజుచేతి కొసంగెను. చంద్రశేఖరుఁ డద్దాని విప్పి చదివినంతనే నిశ్చేష్టుఁడై భావోద్వేగంబున సొమ్మసిల్లి పడిపోవుచుండ వీరపాలుఁడు వానినిఁ బట్టికొని సేదఁదేర్చెను. తరువాత మహారాజు తెలివిఁ జెంది వనపాలకునిఁ జూచి "ఓరీ. వనపాలకా నేను నీవిందుమూలమున నాకొనర్చిన మహోపకారమునకు నీకొక జాగీరొసంగితిని." అప్పుడే మహారాజచిహ్నములతో శాసనపట్టా వ్రాసి యిచ్చెను. వనపాలకుఁ డపరిమితానందభరితుఁడై మహారాజును వీడ్కొనియెను. అనంతరము చంద్రశేఖరుఁడు వీరపాలునిఁ జూచి "నాయనా. వీరపాలా. నీవు ముందుగ హేలాపురంబున కేగి నీమామకు నా రాక నెఱింగింపుము. నేనీహత్యావిషయమేమో తెలిసికొని వచ్చెదను" అని పలికెను. అందుపై వీరపాలుఁడు సంతోషాతిశయంబునఁ దల్లినిఁ జూడకయే వెడలిపోయెను.

మహారాజు చతురంగబలమును కట్టాయితంబుఁ గావింపుమని సేనానికాజ్ఞనొసఁగి తానపరాధశోధకుని వెంటనిడికొని పుష్పోద్యానవనంబున కేగెను. అచ్చో నొక మల్లెపొదరింటిలోఁ బడియున్న రక్తాప్లావితదేహుండగు నొకపురుషునిఁ జూచి యాతఁడు రామపాలుఁడు చిత్రాంగికి పరిచారకుఁడుగానుండఁ బంపిన మందారకుఁడని తెలిసికొని వాని కట్టి దుర్మరణము కలుగుటకు హేతువేమైయుండునో

యని యోజించుచు నా ప్రదేశమంతయు విమర్శించుచుండ నాపొద రింటిలోనే యొకచో రక్తసిక్తమైన జేబురుమా లొకటి పడియుండుటఁ గాంచెను. అయ్యది చిత్రాంగిదేయగుటఁ దెలిసికొని యాహంతకు రాలామెయేయని నిశ్చయించి యుదగ్రక్రోధుండై యపరాధశోధకుని చెవిలో నద్దియోచెప్పి తాను తిరుగ వచ్చి సబలుండై బయలుదేరెను. పాఠకమహాశయులారా. దేవుని చెయిదము లెంతవిచిత్రములైనవో చూచితిరా. చిత్రాంగి నిజసౌందర్యగర్వంబున భర్తయైన చంద్రశేఖరమహారాజు నింతకాలముఁ దనచేతిలోని కీలుబొమ్మవలె నాడించి యెన్నియో దారుణకృత్యములచే తన మార్గనిరోధకుల నెల్లఁ దొలగింపఁజేసి కోసలసామ్రాజ్యమున కెల్లఁ దానే నిరంకుశాధికారిగ నుండవలయునని పుట్టెడాసతోనుండి చివర కివ్విధంబునఁ గారాగారంబునఁ జిక్కి పెక్కుతెఱంగుల విలపింపఁదొడంగెను. ఆత్మహత్యఁ జేసికొనుటకై యెన్నియోవిధములఁ బ్రయత్నించియు సాహసింపలేక పోయెను. ఒక దినమంతయు నట్లు తల్లడిల్లి మఱునా డొక్కింతధీరచిత్తయై తన్నుఁదాన బోధించికొని "చిత్రాంగీ. నీవెంతపిఱికిదానవు. నీప్రబల శత్రువగు నిషాదయువకుఁడు మృతిఁజెందక బ్రతికియున్నను వాని జన్మరహస్యమెఱింగినవారు నల్వురు నీవు- నీయన్న కామపాలుఁడు- దాసి యిందుమతి- మందారకుఁడు- వీరిలో నిందుమతియు మందారకుఁడును లోకాంతరగతులైరికదా. నీవు నీయన్నయు, బ్రాణములనైన నొసంగుదురు గాని యారహస్యమును వెల్లడింతురా. పుట్టుముచ్చువిషయ మొకటి బాధించుచున్నది. నీసవతియైన చారుమతికి పురుడుబోసిన మంత్రసాని యెయ్యెడకేగెనో యామెజాడ తెలియ రాదు. అయినను దానిమాట యెవ్వరు పాటింతురు. ఈవిశాలపపంచములోనట్టి పుట్టుముచ్చుగలవారు మఱొక్కరుండకుందురా. మృతశిశువు నొసంగిన రజకాంగనయు కాలధర్మంబునొందెు. ఇక నీవుష్ట

లను ఖండించి యాశిరంబులను కోటబురుజులకుఁ గట్టింపుము. కోట లోని రహస్యములెల్ల మనమే పరీక్షించి తెలిసికొననగును." అని కఠోరంబుగఁ బలికెను. సేనాని యాప్రకార మొనరింపఁ గుళిందుల నొక్కవరుసగ నిలఁబెట్టి వారి శిరంబుల ఖండింపుఁడని భటుల కుత్తరువొసంగెను. ముష్కరులగు నల్గురుకుళిందులకు శిరచ్ఛేదమయ్యెను. తరువాత నైదవకుళిందుఁడు మిక్కుటంబుగ భీతిల్లి "బాబూ మమ్ముఁజంపకుఁడు. ఈకోటలో నొక్కచో పాతాళగృహముకలదు. అందొక కాంతామణి పదునెనిమిదిసంవత్సరములనుంచి నవయుచున్నయది. ఆగృహమునకు మార్గముఁజూపినచో మమ్ముఁ బ్రాణములతో విడిచిపెట్టెదరా ?" అని దైన్యముదోపఁ బలికెను. ఆమాటవినినంతనే మహారాజు వానిని సమీపించి " ఓరీ! ఆ కాంతామణి యింకను జీవించియుండెనా? ఇప్పు డెట్టిస్థితిలోనున్నయది ?" అని యాతురతతో నడిగెను. అందు పైయాకుళిందుఁడు "మహారాజా. ఆమె చిరకాలమునుంచి నిద్రాహారముల నొల్లక కృశించి యస్థిపంజరమేగాని రక్తమాంసములు లేక జీవవిహంగమునుమాత్రి మాపంజరములో డాచియుంచినది." అని పలికెను. ఆమాట వినినంతనే మహారాజు పట్టరానిదుఃఖంబున తక్షణమే యచ్చోటికేగి యామెను దర్శింపఁదమకపడియు వివేకశాలి కావునఁ దనను జూచినంతనే యానందాతిశయంబుచే నాపంజరములోని చిలుక యెగిరిపోవునేమోయని భీతిల్లి వైద్యునివెంట గొని యాకుళిందునితో నేగి "యామె పుష్టిఁజెందుటకు వలయు చికిత్సలనెల్లఁ జేయింపుము. తగిన పుష్టిఁజెందెనను నమ్మకముకలిగినతోడనే నాకు వర్తమానమంపునది." అని సేనాని కాజ్ఞనొసంగెను. సేనాని యట్లొనరింప వైద్యునివెంటఁగొని కుళిందునితోఁ బాతాళగృహమునకు బయలుదేరెను.

ఆకోట సౌధాగ్రభాగమున నొక చిన్నగదికలదు. ఆగదిలోని నాల్గువైపులగోడలకు నిలువుటద్దము లమర్చబడియుండెను. అందొక యద్దమునకుఁ దీగ మఱియొకటికలదు. ఆయద్దము చుట్టునుగల యిత్తడిసీలలలో నొకదానిఁ గట్టిగ నొక్కిన నాయద్దము తలుపువలె వివృతమగును లోపలనుండికిందకు మెట్లుగలవు. ఆమెట్లనుండి క్రిందకు దిగినంత మఱియొక విశాలమైన గది కాన్పించును. దానిలోఁగూడ నట్టి రహస్యపుమరగల దర్పణద్వారము గలదు. అదియుఁ బైవిధంబుననే తెలియఁబడును. అటనుండియు నడుమున కొన్నియో గుటిలసోపానంబులుగలవు. వాని నన్నింటిని దిగినపిదపఁ బాతాళగృహములోనికిఁ బ్రవేశముకలుగును.

అట్టి దుర్గమరహస్యమార్గంబుల నాకులిందుఁడు వైద్యుఁడును సేనానాయకుఁడును వెంటరాఁ బాతాళగృహములో బ్రవేశించెను. ఆపాతాళగృహము చిరకాలమునాటిదియగుటచే సాలిగూళ్ళతోడను విషవాయువులతోడను నిండి దుర్గంధబంధురంబైయుండెను. అట్టి పిశాచవాసయోగ్యంబగు కర్కశశిలాగారంబున నతిజీర్ణమలినవస్త్రధారిణియు విశీర్ణకేశపాశయుఁ జరతరశుష్కీభూతదేహయుఁ బిశాచసదృశవికృతాకారిణియునగు నొకకాంతామణి ప్రాణావశిష్టురాలై బల్లివలె నొక బల్లనంటి పరుండియుండెను. వారు ముగ్గురు నామెచెంతకు వచ్చియుండుట నామె యెఱుగనే యెఱుఁగదు. మూర్ఛాలసత్వంబున నైమఱచి చైతన్యరహితయై యుండెను.

ఆస్థితిలోనున్న చారుమతీదేవినిఁ జూచి వైద్యుఁడును సేనానియు మిగుల విచారించిరి. వైద్యుఁడు మెల్లగ నామెచెంతకేగి నాడిపరీక్షించి ధాతు వతిసీరసించియుండుటఁదెలిసికొని యెద్దియోయొక దివ్యౌషధీరసంబును శిరంబున నొక్కక్షణము మెల్లగ మర్దనఁజేయించెను. కొంతసేపటి కామె నోరుతెఱచి దాహాకాంక్ష సూచించెను. వెంటనే

యూ యోషధీరసమిశ్రితమైన పాలామెచే నొక్కింత ద్రాగించెను. దా నం జారుమతి యొక్కింత తెలివిం జెంది కనులు తెఱచెను. కాని చెంతనున్న వారి నింకను చూడలేదు. గాఢనిట్టూర్పు విడిచి తనలో "ఓదేవా. నన్నేల కొంచపోకుంటివి. అంతటి మహారాజు గర్భమునం బుట్టి యంతటి మహారాజు పట్టపుదేవినై చివర కిచ్చోట దిక్కుమాలినదానివలె జీవచ్ఛవంబనై పడియుంటిని. నాముద్దుబిడ్డను చూడనోర్వక కొనిపోయితివా. వానియొద్దకు నన్నుం గొనిపొమ్ము. ఆచిన్నారిముద్దుమోము నాకొక్కసారె చూపుము హా. కుమారా. నీసోయగము దేవునకుం గూడ కన్నులుగుట్టెనురా తండ్రీ." అని వెక్కివెక్కి యేడ్చి మరల సొమ్మసిల్లి మైమఱచెను. మరల వైద్యుండు వెనుకటిచికిత్సనె చేయ నామె తెలివిజెంది "అయ్యయ్యో. ప్రేమమయుండైన నాప్రాణేశ్వరుని ముఖమునైనం జూచుటకు నోచనైతినా. అకటా! సోదరీ. చిత్రాంగీ. నీకు నేనేమియపకార మొనరించితిని. అయ్యయ్యో. ఎన్నటికైన నేనీ చెఱ వీడంగలుగుదునా. ఎన్నటికైన నాప్రాణవల్లభుని పావనపదపంకేరుహంబుల సేవించుభాగ్యము నాకు మరల లభించునా ?" అని యనుకొనుచుం జెంతనున్న ముప్పురను జూచి త్రుళ్ళిపడి లేవంబోయి క్రిందంబడెను. వెంటనే వైద్యుం డామెచే మరల నోషధీమిళితమైన క్షీరములం ద్రావించెను. దాన బాగుగం బుష్టిజెంది చారుమతి లేచికూర్చుండి "అయ్యా. మీరెవ్వరు!" అని చకితదృష్టుల నడిగెను. అందుపై సేనాని కృతాంజలియై "అమ్మా. మేము మీ సేవకులము. మీమేలుంగోరి వచ్చినవారమేగాని కీడుం దలంచివచ్చినవారముకాము. మీచిత్తము నొక్కింత కుదుటంబఱచికొని యావేళ మునడంపంగలిగితిరేని యిప్పుడే మిక్కుటమైన సంతోషవార్త వినియెదరు." అని పలికెను. ఆమాట విన్నంతనే చారుమతి యత్యుత్కలికనుప్పొంగుచు సుమాళంబున "ఏమేమీ నాదైవము నన్నుం జెఱవిము

కురాలినిఁ జేయుట కేతెంచియుండెనా! నాప్రాణేశ్వరుని ముఖమును నే నీజన్మమున మరల కన్నులారఁ జూడగలుగుదునా!! ఓహో ! ఏమి నాభాగ్యము!!! ” అని యానందాతిశయంబున మరల మూర్ఛిల్లెను. వైద్యుఁడు మరల నామెకు వలయుచికిత్సలను గావించెను. ఆమె తెలివిఁ జెందినతోడనే యామెచేఁ గడుపారఁ బాలుద్రావించెను. దానపుష్టిఁ జెంది “మహోపకారులారా ! నాభర్తయేఁడీ నాదైవమేఁడీ నాప్రాణ మేఁడీ” అని యత్యాతురతతో నడుగుచుండఁ జంద్రశేఖరుఁడు వచ్చి “హా ! హా ! ప్రియా చారుమతీ. ఎంతకాలమునకు నిన్ను తిరుగఁ జూడఁగలిగితిని !” అనియొక్కట గంతిడెను. సేనానివైద్యునితోను కుళిందునితోను మహారాజును జూచినంతనే వెలికిఁజనిరి. ప్రేమబద్ధులైన నాయికానాయకుల చిరకాల వియోగానంతర పునస్సమావేశ సంతోషమును చదువరు లూహింపవలయునే గాని వ్రాయునది కాదు.

చంద్రశేఖర మహారాజు చారుమతిని మెల్లగ వెంటగొని సౌధోపరిభాగంబున కేతెంచెను. అచ్చోట నామె నొకయాందోళికపై నెక్కించి మెల్లగఁ గోటవెలుపలకు గొనివచ్చి యటనుండి యందఱును హేలాపురాభిముఖులై బయలుదేరిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఇరువదిరెండవ ప్రకరణము.



మ సిరిమై దుర్విషయాంకురంబులు మనోక్షేత్రంబునన్ మొల్వరా
గరసాప్తిం గలయంగ వానిఁ గొనసాగం జేయుచున్ దుష్టులా
దరతన్ దోహదలీల దుష్క్రియల నిర్దాక్షిణ్యభావంబున్
బరహింసాదతిఁ గూర్తు రాఫలము దైవంబే ఘటించున్ దుదిన్.

ఆహా! మనుష్యస్వభావ మెంత విచిత్రమైనది. సంకల్పములు వికల్పము లగుచున్నను పౌరుషమే ప్రధానమని యెంచి యనంతమగు నాశాపాశంబునకులోనై దుర్విషయలోలత్వంబున నల్పబుద్ధులు భావి విపతుల నెంచక యహంకారమమకారంబులఁ గుటిలవృత్తుల విజృంభించి విజృంభించి చివరకు దైవోపహతులై యధఃపతితు లగుచుందురు. అట్టివారినిఁ గనులారఁ జూచుచుండియుఁ బ్రకృతిజనులు రజస్తమో గుణంబుల విడఁజాలకున్నారు. అవిద్యాప్రభావ మెంతదుర్లంఘ్యమైనది. వారల బుద్ధిమరలించి జ్ఞానవంతులై సద్వ్యవసాయంబుల సుఖానుభూతి నిహపరంబుల నానందించునట్టుల దైవము వారల ననుగ్రహించుఁగాక.

ఒకరోజున హేలాపురము కోలాహలముగ నుండెను. కోసల రాజ్య రమాకళత్రులగు చంద్రశేఖర మహారాజుగారు చతురంగ బలసమేతులై పురపరిసరంబున నిల్చియుండిరి. వారిని సగౌరవంబుగఁ దోడ్కొనిరా సుదర్శన మహారాజు పౌరభటభృత్యామాత్య సామంత జనపరివృతుండై మంగళతూర్య నాదంబులతో నెదురేగి వారికి స్వాగతమొసంగి పురప్రవేశంబుఁ జేయించెను. ఆరోజునఁ బురవీథులన్నియు

నేత్రోత్సవంబుగ నలంకరింపఁబడి యుండెను. ఎందెందు చూచినను విజయపతాకములే. ఏచక్కిఁ జూచిన మంగళవాద్యఘోషములే. ఏ వంకఁ దిలకించినఁ గదళీతరుషండ మండితంబులు నవరత్న ఘటితమాలికా శోభితంబులు నుత్ఫుల్లకుసుమరాజి విరాజమానంబులునగు స్వాగతమంటపంబులే. ఏ కేరిఁ జూచినఁ బచ్చనితోరణపంక్తులే. ఏచాయ వీక్షించిన చిత్రవిచిత్ర మణిమౌక్తికరంగ వల్లికలే. ఆమహారాజులను జూచువేడుకఁ బరిభ్రమించు యాతాయాతజనంబులతోఁ బురవీధులన్నియుఁ గోలాహలంబుగఁ గ్రిక్కిరిసియుండెను.

చంద్రశేఖరమహారాజు నిజానుచరులతోఁ గోటలో నిర్దిష్టసౌధంబునఁ బ్రవేశించెను. అందు సంఘటిల్లిన సోదరసోదరీచిరతరపునస్సమావేశ పరిభావమానంద కల్లోలమయ్యెను. సుదర్శనమహారాజత్యుత్సాహంబునవచ్చిన యతిథులఁ బంచభక్ష్య పరమాన్నంబులఁ దనిపి కర్పూరచందన తాంబూలాది సత్కారంబుల గౌరవించి పరిచారకులు తాళవృంతంబుల వీచుచుండ పరుపులపైఁ గూర్చుండి వారితో నిష్టాగోష్ఠి వివిధవిషయంబుల ముచ్చటించుచుండెను చంద్రశేఖర మహారాజు సుదర్శనునిఁ జూచి "బావా! మీయొద్దనున్న బోయయువకుఁడు పూర్ణారోగ్యవంతుఁడయ్యెనా?" అని యడిగెను. "బావా! ఆమహావీరుఁడు మన యిష్టదేవతాకటాక్షంబునఁ బూర్ణారోగ్యవంతుఁడయే యున్నవాఁడు. అతఁడిప్పుడు తన పెంపుడు తండ్రియగు వీరధన్వియొద్దనున్నవాఁడు. శెలవయ్యేనని పిలిపించెదను." అని పలుకుచుండ వీరపాలుఁడయ్యెడకేతెంచి సుదర్శనచంద్రశేఖరులకు నమస్కరించెను. చంద్రశేఖరుఁడు వీరపాలునిఁ జూచి "నాయనా! వీరపాలా! నీవిపుడెచ్చోటనుండివచ్చుచుంటివి?" అని యడిగెను. అందుపై వీరపాలుఁడు "తండ్రీ! నేటియుదయమున వాహ్యాళిబయలు వెడలి యరణ్యంబున నొకచోఁ బ్రతాపసింహునిఁ గలిసికొని వినోదగోష్ఠిఁ

గాలముఁ బుచ్చుచుండఁ దనరు విచ్చేసిరనువార్త తెలిసి వచ్చితిని" అని పలికెను. ఆమాటవిని చంద్రశేఖరుఁడు "నాయనా! పరితాపసింహులు నీఁగూడఁ దోడ్కొనిరాలేదేమి?" అని యడిగెను. అందుపై వీరపాలుఁడు "తండ్రీ! నేను వానిని నావెంటరమ్మని యెన్నియోవిధములఁ బ్రార్థించితిని. తను యాజ్ఞలేకుండ నావెంటవచ్చినఁ గార్యార్థిగ నెంచుదురని రానొల్లఁడయ్యె. తెలవైనచో నేనిప్పుడే తోడ్కొనివచ్చెదను." అని పలికెను. అందుపైఁ జంద్రశేఖరుఁడు "నాయనా! మీరుభయులు భ్రాతృవత్సలత్వంబున రామలక్ష్మణులవలె నెప్పుడును విడువక కూడియుండటనే నెప్పటికి కన్నులార చూడఁగలిగెదనో కదా" అని పలికెను. ఆమాటవిని సుదర్శనుఁడును "భావా! అచిరకాలములోనే మీయభీష్టము నెరవేరనున్నయది. ఇంతదనుక వానిజన్మరహస్యవృత్తాంతము మన కొక్కింత మనోగోచరంబైనను లోకముచే నమ్మించుటకుఁ దగిననిదర్శనములు లభింపమి వెల్లడింపఁ జాలనైతిని ఆవృత్తాంతము సమగ్రముగ నెఱింగిన యిందుమతి హంతకులచే మృతిజెందుటవలన హతాశుఁడనైతిని. వివేకవంతురాలగు నాయిందుమతి యెప్పటికైనఁ దనకీగతి తటస్థించునని యెఱింగి యావృత్తాంతమంతయు వ్రాసియుంచ నిన్ననే నాకాలేఖనము లభించినది. రేపు దర్బారులో సద్దానిబ్రకటించి యాజగదేకవీరుఁడును జగన్మోహనాంగుఁడును సుగుణాగరిష్ఠుఁడునగు పరితాపసింహుని తమ జ్యేష్ఠభార్యాపుత్రునిగను నాముద్దులమేనల్లునిగను స్వీకరింపనగును" అని సహర్షంబుగ బలికెను. ఆమాటవినంతనే చంద్రశేఖరుఁడు దిగ్గనలేచి సుదర్శనునిఁ గౌఁగిలించికొని "భావా! నన్ను ధన్యునిఁజేసితిరి. మీవంటి బంధుచింతామణులు గలిగినవారికెట్టి యాపదలైన రానేర్చునా. దైవికంబుగ వచ్చినను చివరకవి శుభములుగనే పరిణమించుననుట కిదియే తార్కాణము. ఆలేఖావిషయంబులను వినుటకై నామ

నంబు త్వరపడుచున్నయది. ఇప్పుడు వినిపింపనగునా” అని కాంతు డోపఁబలికెను. అందుపై సుదర్శనుఁడా లేఖను పైకిదీసి యిట్లు చదువ నారంభించెను.

“మహారాజశ్రీ పాంచాలరాజ్యలక్ష్మీ మనోహరులగు సుదర్శనమహారాజుగారికి కోసలరాజ్యరమాకళత్రులగు చంద్రశేఖరమహారాజుగారిభార్యయుఁ బరమదుర్మార్గశీలుఁడగు గామపాలుని యనుంగుచెల్లెలునగు చిత్రాంగీదేవి యాంతరంగికదాసియు నగు నిందుమతి వ్రాయు వినయపూర్వకమైన విజ్ఞాపనము.

మహారాజా! ఏలినవారి చరణదాసురాలనగు నాజన్మవృత్తాంత మొక్కింత మీరువినియే యుంటిరికదా! నేనట్లు కుళిందసంస్థానములో దాసినై యుండఁ గుళిందరాజపుత్రియగు నీచిత్రాంగిని మధురాధినాథు లగు చంద్రశేఖరమహారాజుగారికిచ్చి వివాహముఁగావించిరి అప్పుడు నన్నొక దాసిగా నామెకొసంగిరి. నేనట్లామెయొద్ద రెండుసంవత్సరము లమితకష్టములఁ బీడింపఁబడుచుండియు మిగుల నోర్పుతో నమిత విశ్వాసముగఁ బరిచర్యసేయుచుంటిని. అంతటఁ దమయనుంగుచెల్లెలును సుగుణరాశియు నగు చారుమతీమహారాణి గర్భవతియయ్యెను. ఆమెకు సీమంతపుంసవనాది శుభకర్మ లమితవైభవముల జరిగించిరి. చిత్రాంగి యన్నవలెనే తంత్రజ్ఞురాలు. మాయలమారి. చక్కనిచుక్కనని నిక్కినిక్కిపడుచు నిజసౌందర్యగర్వంబునఁ జారుమతీదేవినిఁ దృణీకరించి యామెను పెక్కుకష్టముల పాల్సేయుచుండుటయేఁగాక యాత్మభర్తయగు చంద్రశేఖరమహారాజుగారినిఁ గూడ లక్ష్యపెట్టకుండెడిది. ముందువచ్చినచెవులకన్న వెనుకవచ్చినకొమ్ములు వాడికదా? పైకెన్నియో యిచ్ఛకంబుల నతివినయసంపదగల మహాసాధ్విపలె నలరించు పయోముఖ విషకుంభమగు చిత్రాంగి

కుటిలస్వభావ మెఱుంగఁజాలక యమాయకులగు చంద్రశేఖరమహా రాజుగా రామె నెంతయో పరమానురాగమున గారవించుచుండిరి. అట్లని పెద్దభార్యను నిరసించుచుండుటయు లేదు. ఆవిధంబుగ భర్త తనచేతిలోని కీలుబొమ్మయగుటచే చిత్రాంగికి తల తిరిగిపోయెను. ఆమెహృదయక్షేత్రంబున దురాశాబీజంబులు నాటి మొలకలెత్తెను. అగ్గిమీద గుగ్గిలమన్నట్లు స్వార్థపరుఁడైన కామపాలుఁ డామొలకలను బోషించెను. అట్లాదురాశాలతలు నానాటికిఁ గొనలుసాగి వృద్ధిఁ జెందెను.

చారుమతీదేవి గర్భవతియైనదిమొదలు చిత్రాంగి హృదయమునందలి యసహనసర్ప ముద్రేకించి బుస్సలుకొట్టనారంభించెను. మజ్జనభోజనాదులయం దనాదరముఁజూపుచుఁ దొడవులనొల్లక కొప్పు ముడువక యెల్లప్పుడుఁ జికాకుపడుచు లోలోన నెంతయో వేదనజెందుచుండెడిది. వివేకవంతులయ్యుఁ జంద్రశేఖరమహారాజుగారు మోహాతిరేకంబునకు లోనై యామెవికారలక్షణంబుల కెద్దియో హేత్వంతరముఁ గల్పించుకొని యుపేక్షించుచుండిరే గాని నిజమైన కారణమునుఁ దెలిసికొనఁజాలరైరి.

అట్లు తొమ్మిదినెలలు నిండినపిదప నొకరోజు ప్రాహ్ణసమయంబునఁ జిత్రాంగి నన్నపరిమితాదరంబునఁ జేరంజీరి "ఇందుమతీ! కేళీవనంబున కేగుదము రమ్ము" అని నన్ను వెంటఁగొని శృంగారవనమున కేగెను. అందొక పొదరింటిలోఁ బుష్పపరాగవికీర్ణశయ్యపై నన్నుఁ గూర్చుండఁబెట్టి తానును నాకభిముఖంబుగఁ గూర్చుండి నా రెండుచేతులను బట్టికొని "ప్రియసఖీ! నాచేటీజనములో నీకన్న నాకుఁ బరమాప్తు లెవ్వరును లేరు. నీయందు నాకెట్టిప్రేమగౌరవములుగలవో తగినంతపారితోషిక మెద్దియు నావలన నీకింతవరకును లభించకపోవుటచే నీవెఱుంగజాలకుంటివి గాని నిన్ను నాప్రాణముగఁ

జూచికొనుచున్నాను. నేనిప్పుడు నీతో నొకపరమరహస్యమును చె ప్పఁదలచితిని. అద్దాని నీహృదయాంతరాళంబుననే స్థాపితంబుగావిం చి నాకోరిక నెరవేర్పనంగీకరించితివేని నేనామరణాంతము నీకు కృత జ్ఞురాలనై యుండుటయేఁగాక లక్షవరహాలు నీకిచ్చెదను. ఏమనియెద వు ?" అని యడిగెను. హీనకులసంజాతనగుటచే ద్రవ్యలోభంబున మంచిదని నేనందుల కంగీకరించితిని. తత్క్షణము తనమెడలోని య మూల్యమైన వజ్రాలహారమును దీసి నాకొసంగి తనమనోగత రహ స్యతంత్రము నీక్రిందివిధంబున వెల్లడించెను.

"ప్రియసఖి ! నాసవతియైన చారుమతికి నెలలైనవి. నేఁడో రేపో ప్రసవించును. మగశిశువు కలిగినచోఁ బురుడుపదిరోజులలోపు ననే వానింగొనిపోయి యరణ్యమధ్యంబున వధించి పాతిపెట్ట్ర రావ లయును."

ఆమాటలు వినినంతనే నాయొడలు జల్లుమనియెను. భయా కులితచిత్తనై "తల్లీ ! అది సాధ్యమగునా ? పురుటింట నితరులుండకుం దురా ! పిల్లవాఁడెట్లదృశ్యుఁడయ్యెనని యడిగిన నేనేమిచెప్పుదును? ఈకార్యము నేనొనర్పజాలను." అని దృఢముగఁ బలికితిని. అందుపై నత్యుత్కటంబగు కోపమభినయించుచు "ఓసీ ! పిఱికిదానా. అపా యోపాయంబుల నెంచకయే నింతటిదారుణకృత్యంబునకు సాహసిం చితిననుకొంటివా ! నీకది సాధ్యమగుటకుఁ దగినయేర్పాటులన్నియు నేనే చేసెదను. నాకృతజ్ఞతను వడయఁగోరినదానవైనచో నేనుచెప్పి నట్లు చేయుము. నాకు ప్రాణోపద్రవకరమైన పరమరహస్యమును నీకు వెల్లడించితిని. నీవిప్పుడు తిరస్కరించితివేని నాప్రాణసంరక్ష ణార్థమై యెంతటిదుస్సాహసమునకైనఁ జొరఁబడకతప్పదు." అని పలి కెను. ఆమాటవిని భీతిల్లి యనుమతించితిని. తరువాత మేమిరువుర మ చ్చోటువీడి యంతిపురంబున కేగితిమి.

మఱునా డుదయమున మంచిశుభలగ్నంబునఁ జారుమతీదేవికి దివ్యతేజోవంతుఁడగు బాలుఁడుదయించెను. వానిలావణ్యదీధితులు కన్నులు మిఱుమిట్లుఁగొలుపుచుండెను. చిత్రాంగి పురిటిటిలోనికి వచ్చుట కెన్నియో విధములఁ బ్రయత్నించెను. కాని మహారాజు గారందుల కంగీకరించలేదు. ఆమెదుష్టస్వభావ మెఱింగియో చారుమతి భర్తతో నదివరకు చెప్పుటచేతనో మహారాజుగారావిషయమునఁ బట్టుదలయే వహించియుండిరి. చారుమతీదేవికి నాయందెక్కుడు నమ్మకముకలదు. ఆకారణముచేతనే నాపురిటింటిలో నే రేయింబవలులుండి చారుమతీదేవికిని శిశువునకు వలయునుపచారంబుల నొనరించుచుంటిని. ఎనిమిదవరోజున మహారాజుగారు వచ్చి పిల్లవానినిఁ జూచిరి. దేదీప్యమానుఁడగు నాపిల్లవానియందలి మహారాజలక్షణములను గాంచి యమితానందముఁ జెందిరి. రాజ్యమునందెల్ల యెడలను పుత్రోత్సవమును జరిపించిరి. ఆశిశువువీపుపై కుడిభుజముచెంత మత్స్యాకారముగల పుట్టుమచ్చయొకటి యుండెను. అట్టిది ద్వాపరయుగంబునఁ బాండవమధ్యమునకుఁ గలదుగాని మఱియెవ్వరికిని లేదు.

తొమ్మిదవరోజునఁ బురిటిస్నానమైనది. ఆరోజున చిత్రాంగి పిల్లవాని నెంతో ప్రేమగలదానివలె లాలించెను. అదిచూచి యాపిల్లవాని దివ్యసౌందర్యమా మెహృదయమున కుల్లాసముఁగలిగించెనని యందఱును భావించిరి. అట్లుందఱికినిఁ దనయందు విశ్వాసముఁగలిగించి యా రేయి నాకు వర్తమానించి "ఇందువతీ! చారుమతి నిద్రించినపిదప నీవుచేయఁబూనిన కార్యభారము నతిరహస్యోచితంబుగ నిర్వహింపవలయును. అందుకువలయు సౌకర్యముల నెల్ల నేర్పాటుఁగావించితిని. ఈమధురాపుర పరిసరంబున నొకరజకాంగన కలదు. అది యెనిమిది రోజులక్రిత మొకమగశిశువును గనియె. ఆబిడ్డఁడీరోజు సాయంసమయమునఁ జనిపోయెనన విని యారజకాంగన తనమృతశిశువును నీవు

నా సవతిబిడ్డను గొనిపోయినవెంటనే తెచ్చి చారుమతిపక్కలో పరుండబెట్టుటకేర్పాటుగావించితిని. కావున నీవెంతమాత్రము భయపడవలసిన పనిలేదు. కర్తవ్యము నెరవేర్పుము." అని చెప్పెను.

మొదట నేనట్లు చేయుటకే యోచిన్నాఁ ముద్దుబిడ్డ నరణ్యమునకుఁ గొనిపోయితిని. ఒక కఠినశిలపై వానినిఁ బరుండఁబెట్టి వధించుట కుద్యుక్తనైతిని. అంత నాశిసువు తనకు రానున్న భావివిపత్తునెఱింగి కాఁబోలుఁ వలదని వారింపఁ జేతులుపైకెత్తి యాడించుచు నేడువసాగెను —అత్తఱి 'బావా. నేనింక వినజాల. వినజాల' అని పట్టరానిదుఃఖావేశంబునఁ జంద్రశేఖరుం డొకింత వివశహృదయుఁడయ్యె వెంటనే తెలివిఁజెంది 'తరువాత నేమిజరిగినది?' అని యడిగెను. సుదర్శనుఁడు తరువాత వివరమిట్లు చెప్పఁదొడఁగెను. "మహారాజా! అట్లేడ్చుచున్న ముద్దుబిడ్డను చూడంజూడ నాహృదయము కరుణారససంక్షుభితంబయ్యెను. వానింజంపుటకు చేతులురానందునఁ బైకిఁదీసిన కైజారు మరల వఱలోనుంచి యాబిడ్డ నెవ్వరికైన నిచ్చివేయఁదలంచి ఆగ్రామమునకు పట్టికొని కొనిపోవుచుండ నేలినవారి యాస్థానవైద్యుఁడగు వీరధన్వి నాకెదురయ్యె. ఈపిల్లవానిని యాకిరాతునకిచ్చి తదీయపోషణార్థము చిత్రాంగి నాకొసంగిన వజ్రాలహారమును వానికిచ్చితిని. నాటనుండియు నాపిల్లవాఁడు బోయవానిచేఁ బెంచబడిన కతంబున లోకులు వానిని బోయవానిగ భావించుచుండిరేగాని యాపిల్లవాఁడు నిశ్చయముగఁ జంద్రశేఖరమహారాజుగారి పుత్రుఁడు. చారుమతీమహారాణీగారి గర్భశుక్తిముక్తాఫలము. ఇందుకు నేను గతించినను పంచభూతములును సూర్యచంద్రులును సాక్షులు." అని సుదర్శనుఁడాలేఖాపఠనమును ముగించెను.

అప్పు డక్కడనున్న వారందఱికిని గలిగిన భావసంక్షోభ మింతయని చెప్పశక్యము కాదు. చంద్రశేఖరసుదర్శను లానందాతిశయం

బుచే నోడలేకుండిరి. అట్లొకింతతడవు వివిధభావతరంగముల సు డిసి సుడిసి యెట్టకేలకు దమచి త్తములు గుదుటబఱచికొని యంత టనఁ గలయఁజూచుచుండ వీరపాలుఁడు సామర్షవిషాదోద్రేకుండై భాష్పపూరితనేత్రంబులనుండి యగ్నికణంబు లురుల నుద్వేగంబున లేచి "తండ్రీ! బాలఘాతకికా నెంచిన పూతకిగర్భంబున జనించి పరమ పాపాత్ముండనైతిని. ఈలేఖావిషయము లోకులెఱింగినంత నే నన్నా మరణాంతమును రక్కసికడుపునఁబుట్టిన రాకుసుఁడనియే భావింతురు. నే నాలోకనింద భరింపజాలం. నాతల్లి పూజ్యుఁడైన నాయన్నకుఁ గలి గించిన కష్టములెల్ల ననుభవించుట కజ్ఞాతవాసదీక్షచే నాజీవమాత్ర గడపనెంచితిని. దానఁగాని పైజన్మమునందైన నాకాత్మశాంతి కలుగ నేరదు. నాకు సెలవొసంగుఁడు." అని గద్గదకంఠుండై పలికెను. చంద్రశేఖరుఁడు పుత్రునిఁ బ్రియమారఁ గౌఁగలించి ముద్దుపెట్టుకొని "నాయనా! వీరపాలా? సుగుణవిశేషంబుల నీవు నీయన్నకుఁ దీసిపోయి నవాఁడవు కావు. నీతల్లి పాపాత్మురాలైనఁ దద్గర్భస్థదోషంబున నీవు పాత కుఁడవు కానేరవు. బురదలోఁబుట్టిన శుక్తియందు దాణిముత్తెములు దయిం చుటలేదా. నీతల్లియే శిక్షార్హురాలుగాని నీవుశిక్షార్హుఁడవు కావు." అని వాని యావేశంబుడిపి సుదర్శనుని బ్రతాపసింహునకును వీరధన్వి కిని వర్తమాన మంపించెను.

కొంతసేపటికి వీరధన్వి ప్రతాపసింహుని వెంటనిడికొని వచ్చె ను. దవ్వులఁ బ్రతాపసింహునిజూచిపుత్రవత్సలుండగు చంద్రశేఖరుఁడు పట్టరాని తమకంబున నెదురుగఁజని "కుమారా. ప్రతాపసింహా" అని కెవ్వున కేకవైచి ప్రతాపసింహుని బిగియారఁ గౌఁగలించి యానం దాతిశయంబున మైమఱచెను. ప్రతాపసింహుఁ డివివరకే తన జన్మ వృత్తాంతమును సూచ్యార్థ సూచకంబుగ సుదర్శనుఁడు కొంతవరకు తన కెఱింగించి యుండుటచేతను తనతండ్రి చంద్రశేఖరుఁడే యైయుండ

వలయుననియుఁ జిత్రాంగి తనను జంపఁదలంచి విఫలప్రయత్న యగుటచే ననుమానించి యుండుటచేతను తానును పట్టరాని సంతోషంబున మైమఱచెను. తనఁగన్నతల్లి యెవ్వరో యామెగతి యేమయ్యెనో తెలిసికొనఁజాలఁడయ్యె. తత్తరంబున నుచితోపచారంబులఁ దండ్రిని శాంతచిత్తునిఁగావించి "తండ్రీ! ప్రారబ్ధవశముచేఁ బరమపూజ్యులైన మీచరణసేవఁదొలఁగి యిరువదిసంవత్సరము లనామకుఁడనై పరులపంచ దైన్యజీవన మొనర్చిన యీనిర్భాగ్యుఁడు నేటికి మీయెదపై వ్రాలఁగలిగె. ఇప్పటికా ప్రారబ్ధము క్షయమయ్యెనుగాఁబోలు. జనకా తమపుత్రవాత్సల్యఫలం బనుభవించు మహాభాగ్యము నేడు నాకొదవుటచే నే నెంతయుఁ జరితార్థుండనైతిని. అజ్ఞానవశంబున నే నిదివరలోఁ దమ యెడల నేమైన యపచారము లొనర్చియున్నచో వాని నెల్ల క్షమింప వేడుచున్నాను." "అని తండ్రి పాదములపై వ్రాలెను. చంద్రశేఖరుఁడు వానిని లేవదీసి మరలమరల గ్రుచ్చి కౌఁగిలించి శిరంబు మూర్కొని "నాయనా. నాముద్దులప్రతాపా బుద్ధిహీనుండనై స్వర్ణకంచుకితకుటిల సర్పంబగు చిత్రాంగి మోహంపుటురులం జిక్కి మచ్చరంబున వారక్కాపి నిన్నును నీతల్లిని సంహరింపఁ బన్నుచున్న కపటతంత్రంబుల గుర్తింపఁజాలక నీవు నీతల్లియు నిశ్చయముగ మృతిఁజెంది యుండిరనియే నమ్మి నిరుపమాన శౌర్యధైర్య గాంభీర్యసాహస భుజబల ప్రతాపంబుల గాతరపరిరక్షణాయమాన భుజపంజరుండవై సాంద్రతరయశశ్చంద్రికారుచి జగజ్జ్యోతివై ప్రకాశించు నిన్నును పరమసాధ్వీమణి యగు నీతల్లిని నిరువది సంవత్సరములనుంచి నిర్దయత్వంబున నుపేక్షించిన నన్ను క్షమింపఁ గలిగితివా తండ్రి!" అని యశ్రుపూరితలోచనుండై పలికెను. ప్రతాపసింహుఁడు హర్షపులకితగాత్రుండై "తండ్రి నాప్రారబ్ధవశంబున నే నింతకాలము నుకన్న తల్లిదండ్రుల యనూనప్రేమకు దూరుఁడనై యుండవలసి వచ్చినది గాని మీలో

పమేమున్నది? ఎవరి పురాకృత కర్మఫలమును వా రనుభవింపకతీరునా? జనకా! నన్నుఁ గన్నతల్లి 'నిందించియుండనా?" అని యడిగెను. అప్పుడే వీరపాలుఁ డత్యుత్సాహంబున సమీపించి "సోదరా! పరితాపసింహా! పుట్టిన నాటఁగోలె బరమ నిర్భాగ్యుండనై నీయుత్తుంగసౌఖ్యమునకు దూరుండనైనను మహావీరశిఖామణి వగు నీవెన్నిసార్లో నాకు బ్రాణదాతవై నాయెడల నీయసమాన సోదరప్రేమను జూపితివి. అంతటి యమూల్య సోదరుండ వగు నీచరణదాస్యమున కింతకాలమువరకు దూరుండనై యుంటిని. నావంటి నిర్భాగ్యుఁడు కలఁడా! ఇంతకాలము నిన్ను తల్లిదండ్రుల యసమానప్రేమ కెడఁబాపి కులశీలాభిజాత్యంబు లెఱుఁగకుండఁ బరులపంచలఁ బాల్సేసి కడు నిడుముల గుడిపిన మనుష్యరూప రక్కసి పుత్రుండను నన్ను నీచరణదాసునిగఁ జేకొనదవా! నీయనుంగు తమ్ముండనై నీప్రసన్న దరహాస చంద్రికల నోలలాడుచు నీయమృత వీరవిహారంబుల నీసహచరుండనై యానందించుట కర్హత లేకున్నను నీచరణసేవకునిగనైన నన్నుఁ జేకొనవేడుచున్నాను." అని వాని పాదములపై వ్రాలెను. పరితాపసింహుఁడు వీరపాలుని లేవఁదీసి "అనుంగు తమ్ముఁడా! వీరపాలా" అని యత్యాదరంబునఁ గౌఁగిలించి శిరంబు మూర్కొని "తమ్ముఁడా! నే దైవవశంబున నింతవర కెన్నికష్టముల ననుభవించినను నేడు నీవంటి గుణఖనినిఁ దమ్మునిగాఁ బడసి వాని ప్రియగాత్రపరిష్వంగసుఖం బనుభవింపఁ గలుగుటచే నపరిమితానందంబు నొందుచున్నాను. కర్మవశంబునఁ గలుగు కష్టసుఖంబులకు కర్మయే కర్తయగును గాని యితరు లెట్లగుదురు? ఇంతటినుంచి మనము తోడునీడలవలె మెలంగుచు వృద్ధులైన తల్లిదండ్రులకును మన శ్రేయోభిలాషులకును సముత్సాహంబును గలిగింప యత్నించుదము." ఆమాటలు విని వీరపాలుఁ డమితానందమును జెందెను. అందఱును

హర్షాంబుధి నోలలాడుచుండిరి. ప్రతాపసింహుఁడు తండ్రితో "జనకా! నన్ను గన్నతల్లి యెవ్వరు? ఎచ్చోటనున్నది ఆమెను నేనెట్లు చూడగలుగుదును? పుట్టిన నాటగోలె మాతృప్రేమ యెట్టిదియో యెఱుంగను. ఈజన్మంబున నా కాభాగ్యముబ్బునా?" అనియత్యాతురతతో నడిగెను. చంద్రశేఖరుండు బాష్పపూరితనేత్రుండై సుదర్శనునివంకఁ జూచెను. సుదర్శనుండా యభిప్రాయమును దెలిసికొని ప్రతాపసింహునితో 'నాయనా! ప్రతాపసింహా. నిన్నుగన్నతల్లి జీవించియే యున్నయది. కాని యామెను నీవెఱుంగవు. నిన్నామె పురిటిదినంబులలో నొకటిరెండుసార్లు చూచియుండును. ఇప్పుడామె నిన్ను గుర్తింపగలుగునో లేదో- ఆమె నాయనుంగుసోదరియే" అని పూర్వవృత్తాంతమునంతయు నెఱింగించెను. ఆవృత్తాంతమువిని యత్యావేశంబున 'ఓరీ! కామపాలా! ఎంతటిదారుణంబున కొడిగట్టితివిరా పాలిశా! మామా! మామా! నాతల్లి యిప్పుడెచ్చోట నున్నయది? ఆమెను గనులారఁజూచి మాతృప్రేమ మాధుర్యమనుభవింప నామనంబు త్వరపడుచున్నయది ఆమెను నేనెట్లుచూడఁ గలుగుదునో శీఘ్రముగ వచింపుఁడు. నేను తాలిమినిలుపోపలేను" అనిపలికెను. అందుపై సుదర్శనుఁడు నాయనా ప్రతాపా! త్వరపడినచోఁ దలఁచిన కార్యము విపరీతపరిణామంబునుఁ జెందును. నీవు నిక్కువంబుగ మృతిఁజెందియుంటివని నమ్మి పుత్రశోకానలంబున మ్రగ్గుచుండుటయే గాక క్రూరశత్రువు కలిగించిన దుర్భరవేదనలచేఁ బదునెనిమిదివత్సరంబులు కృశించి కృశించి నీముద్దుమోముఁ జూడఁగోరి యస్థిపంజరంబున జీవనకంబు నింతవరకునుఁ గాపాడఁగలిగెనేగాని రక్తమాంసములు పూర్తిగ నశించుటచే నీతల్లి యతినిస్త్రాణలో నున్నయది. ఆమెనిప్పుడు హఠాత్తుగఁ జూచితివేని దుర్భరానందంబుచే నాపంజరములోని చిలుకయెగిరిపోవునేమో? ఇప్పుడామె కొక్కింతత్రాణకలిగినది. వీరధన్విచికిత్సాప్ర

దర్బారువేడుక లన్నియు యథాక్రమంబున జరిగిన పిదప సుదర్శనమహారాజు చంద్రశేఖరమహారాజు లేచి సభాప్రణామం బాచరించిరి. సదస్యుల కరతాళధ్వనులొక్కమొగి చెలరేగి మిన్నుముట్టెను. మహారాజు లిరువురు మరల సింహాసనముపైఁ గూర్చున్నకోడనే వర్షమువెలిసిన ట్లంతటను నిశ్శబ్దముగ నుండెను.

సుదర్శనమహారాజు నల్వంకులఁ గలయఁజూచి "సభాసదుల గునోమహాజనులారా, బహుజనకంటకులగు దుర్నయప్రవర్తనులపైఁ గల యభియోగంబుల నేఁడు మీ సమక్షంబున విచారింపఁబూని యున్నారము. ఈవిచారణలో న్యాయ్యభంగముగాకుండ మాబుద్ధి ధర్మపథంబుఁ దప్పకుండ నుదారభూతదయాసమన్వితంబై ప్రవర్తింప జగద్రక్షకుం డగుపరమేశ్వరుఁడు మాకు దోడ్పడుఁ గాక" అని యమాత్యునితో "మంత్రీ, ఈరోజున విచారింపవలసిన యభియోగంబులెవ్వి" అని పలికెను. అందుపై మంత్రి "మహారాజా! దుర్మార్గులగు చోరులపైఁ గలనేరములను విచారింపవలసి యున్నది." అని సవినయంబుగ మనవిఁజేసెను. 'మంచిది' అని చోరులను రచ్చకు రప్పింప మహారా జాజ్ఞనొసంగెను. వెంటనే కొందఱ అపరాధపరిశోధకభటులేగి నిగళబద్ధు లగుచోరుల నల్వుర రచ్చకు దోడ్కొనివచ్చిరి. విచారణ నుపక్రమించిరి. చోరులచే యథావిధి బ్రమాణములు చేయించిన పిదప మహారాజు చోరులపైగల నేరములన్నియు వెల్లడింపవలసిన దని తెలుప మంత్రి "తస్కరులారా? ద్రోహకృత్యంబులకు వెనుదీయని కామపాలుని భృత్యులై వాని ప్రోత్సాహంబునఁ జంద్రికాకన్యను బంధించి కొనిపోయి కామపాలుని కప్పగింపఁ బ్రయత్నించుటయు శూరసేనమహారాజుగారి పుత్రికయగు లలితాకన్యను దౌర్జన్యంబునఁ గొనిపోయి చెఱసాలను బంధించుటయు నామె విడుదలకై మీరు కోరిన లంచమును తెచ్చిన నీలకంఠుని వధించుటయుఁ

చాలామంది మహావీరులైన యీప్రతాపసింహ వీరపాలురచే హతులైరి. మాదండులో నిప్పుడు మిగిలినది మందారకునితోఁగూడ నైదుగురము మాత్రమే. మందారకుఁడు మమ్మిదివరకే విడిచి కామపాలుని యాజ్ఞపై చిత్రాంగి మహారాణీగారి రహస్యకింకరుండై మధురాపురములోనే యున్నాఁడు. సమరదివసంబునాటి రాత్రిమాత్ర మియ్యెడకు వచ్చి కామపాలునితో నెద్దియో మాట్లాడి వానినిఁ జెఱవిముక్తునిఁ గావించుటకు సింధుమతిని వధించుటకు మమ్ము హెచ్చరించి వెంటనే మధురాపురంబునకుఁ జనియె. మే మేతత్కార్యనిర్వాహణార్థమొకమాటున రహస్యంబుగ మాట్లాడికొనుచు మధురిక యియ్యెడనే యుండినసంగతిఁ దెలిసికొని యామె మాప్రయత్నమంతయుఁ దెలిసికొనియుండునని భావించి మే మామెను గొనిపోవ యత్నించి విఫలమనోరథులమైతిమి. ఇప్పుడు మేమునల్వుర మేలినవారిచేతిలోఁ జిక్కియున్నారము. మే మొనర్చియున్న ఘోరకృత్యంబుల కెన్ని జన్మములెత్తినను నిష్కృతి కలుగనేరదు. కావున మా కేలినవారు తగిన శిక్షవిధించినను మహాప్రసాదంబని యనుభవించుటకు సంసిద్ధులమై యున్నారము" అని పలికిరి. అందుపై సుదర్శనుఁడు చంద్రశేఖరునితో "భావా! రాజ్యలుబ్ధుఁడును దురాశాబద్ధుఁడు నగు కామపాలుని దారుణ ప్రయత్నమేమో మీ రిప్పుడు తెలిసికొంటిరి కదా" అని యడిగెను. అందుపై చంద్రశేఖరుఁడు "ఆదుర్మార్గుఁడు పరమద్రోహి యని వంగరాజ్యవిప్లవకారకుఁ డైనప్పుడే తెలిసికొంటిని. కాని నాయొద్దనే యింతటి దారుణోద్యోగి యగునని యనుకొనఁజాలనైతిని" అని వానిచెవిలో నెద్దియో రహస్యముగఁ జెప్పి యొకచీటి సుదర్శనున కొసంగెను. అద్దానిఁ జూచినంతనే సుదర్శనునకుఁ గామపాలునిపై మితిమీఱినకోపము వచ్చెను. "ఓరీ! తస్కరులారా! రాజద్రోహులారా! మీనాయకుఁడగు మందారకుఁడొక నరహంత్రి

కెను. సువర్ణుఁడు వెంటనే యాంత్రికవనగిరిగహ్వరములను సమూలముగ భగ్నముఁగావింప భటుల కుత్తరువొసంగెను.

తరువాత శూరసేనునిపైఁగల యభియోగవిచారణఁ జేపట్టిరి. శూరసేనుని రచ్చకుఁ బిలిపించి యథావిధి వానిచేఁ బ్రమాణముఁ జేయించిరి. పిదప సువర్ణుఁడు "శూరసేనా. మూఁడుతరములనుంచి శ్రీకోసలసామ్రాజ్యమున నతిమైత్రి కలిగియుండుచున్న కళింగ పాంచాల రాజ్యములకు నిర్హేతుకభేదము గలిగించితివి. ఈయకారణ రణ విప్లవంబున నిరపరాధులైన జను లెం[illegible] నొందిరో తెలిసికొంటివా? వారిమరణమునకు నీవు కారణభూతుఁడవైతివి. నిన్నేల శిక్షింపఁగూడదో వచింపుము" అని పలికెను. అంతపై శూరసేనుఁడు పశ్చాత్తప్త హృదయుఁడై శిరంబువాల్చి "మహారాజా సేనాధినుండియుఁ బరమ ధర్మస్వరూపులును భూతదయాళుచిత్తవృత్తులునగు మీతో మైత్రిగలిగి మిమ్ముల ననుకరించి ప్రవర్తించుచుండవలయుననే కోరుచుండెడివాఁడను. ఆ కోరికయంబు సఫలంబుసేయ కామపాలుఁడనే దుష్టగ్రహము నాయందు వక్రించె. వానిఁ గుచ్ఛిత విషోరగంబని తలంపక తదీయముఖప్రీతి వాక్యములకు లోనై వాని వలలోఁ జిక్కితిని. తరువాత నే నేలినవారి కుమారీమణియగు చంద్రకళను నాకు భార్యగానొసంగవేఁడి విఫలమనోరథుండనగుటచే నేలినవారియెడల నామనస్సక్రాంతి మారినది. ఆసంగతి గనిపెట్టి నన్నాశ్రయించియున్న దుష్టగ్రహ మా బాల్యవయస్య ప్రేమబద్ధులమగు నాకును చిత్రరేఖామహారాణికిని సంఘటనముఁ గలిగించెదనని యాశఁబెట్టి నాచే ద్వితీయవివాహ ప్రయత్నమును మానిపించెను. అది మొదలు దుష్టగ్రహము నాకాంతరంగిక మిత్రుఁడై స్వలాభముకొఱకు నాచే నెన్నియో దౌష్ట్యముల నొనరింపఁజేసి ఇనుముతోఁగూడిన వీతిహోత్రునకు సమ్మెటపోట్లు తప్పవా? పాపగ్రహములతోఁ గూడియు

న్నచో శుభగ్రహమైనను కీడును గలుగఁజేయకమానదు. ఆహేతువు చేతనే వంగరాజ్యమున కట్టికీడొనరించుటయేగాక యేలినవారికి నిర్హేతుకమింతటి విపత్తును గలుగఁజేసితిని.

నాపైఁ బగసాధింపవలెనని తమరే నాయేకైకపుత్రికయగు లలితను చోరులచే నపహరింపఁజేసిరనియు నాచోరులకు తమరేపోషకులై యుండిరనియుఁ గామపాలుఁడు నాయొద్దకు వచ్చిచెప్పగా విని వాని మాటలను విశ్వసించి యత్యాగ్రహంబున నుచితానుచిత వివేకహీనుండనై తమపైదాడివెడల నుత్సహించి యుద్ధసన్నాహమొనరించుచుండ నగ్నిపై గుగ్గిలమునున్లు చిత్రాంగిమహారాణి నన్నీమారణకర్మంబునకు హెచ్చరించుచు నొకలేఖ వ్రాసెను. అదియుఁ గామపాలునిప్రోత్సాహమేయై యుండవచ్చును." అని పలుకుచుండ సుదర్శనుఁడపవారించి ప్రతాపసింహునితో "నాయనా! ప్రతాపసింహా! కామపాలునకు నాపై నంతటిపగ యేలకలిగెనో" యని పలికెను. అందుకు ప్రతాపసింహుఁడు "మామా! నేనొకసమయంబునఁ గుండకేగి ప్రచ్ఛన్నవేషుండనై కామపాలునిచెంత కరిగి యాంతరంగికమిత్రునిగ నటించి వాని కపటోద్దేశ్యముల నెల్ల గ్రహించితిని. ఆపాపకర్ముఁడు మీకింతటియపకారము కేవలముఁ బగచేతజరిగించియుండలేదు. ప్రప్రథమమునఁ జంద్రికళ నపహరించి తన మిత్రులగు రహస్యహంతకులచే తరువాతఁ దమ్ముఁజంపించి పాంచాలరాజ్యము నాక్రమించుకొనవలెనని యత్నించె. ఆయత్నము భగ్నమగుటచే లలితాకన్యను తన చోరమిత్రులచే నపహరింపఁజేసి యామెను చోరుల పాతాళగహ్వరంబున బంధించి శూరసేనుని మీపై దాడివెడలఁ బ్రోత్సహించె. ఇందుకు గారణమేమైయుండునో మీరూహింపఁజాలరా! యుద్ధములో తనకుజయములభించినచో మాయోపాయంబునఁ జంద్రికళతోఁగూడ పాంచాలరాజ్యలక్ష్మినిఁ జేపట్టవలయుననియు

శూరసేనుఁడు చేసినవాగ్దానము ననుసరించి లలితను దా ప్లాడి పిదపఁ దనమిత్రులైన రహస్యహంతకులచే శూరసేనునిఁ జంపించి కళింగవంగ రాజ్యములను స్వాధీనము జేసికొనవలయుననియు నింత యెత్తు నెత్తెను." ఆమాటలువిని సుదర్శనుఁడు "ఓరీ! క్షత్రియకులపాంసనా! రాజద్రోహీ! కుక్కకు నెయ్యుందునటరా బాలిశా" అని శూరసేనునితో "శూరసేనా! కామపాలుని దౌష్ట్యము నీకెప్పుడెవ్విధంబునఁ దెలియవచ్చినది?" అని యడిగెను. అందుపై శూరసేనుఁడు, "మహారాజా! ఆదుర్మార్గుఁడు నన్నట్లు రణోన్ముఖునిఁగావించి యుద్ధానంతరమున నాయేకైకపుత్రికను దనకు భార్యగనొసంగ నాచే వాగ్దానముఁగొనియెను. అందుకా కన్నియ నంగీకరింపఁజేయ యత్నించినప్పుడు చోరులు కామపాలుని మిత్రులనియు వారికోరికపైనే చోరులు తనను చెఱనుబంధించిరనియుఁ జెప్పెను. కాని యప్పుడామాటలు నేను విశ్వసించలేను. యుద్ధానంతరమున నాపాపాత్ముఁడు చెఱబద్ధుఁడై యుండియుఁ దనచోరమిత్రులచే మరల నాకన్యను చెఱబెట్టింప నీలేఖ వ్రాసి బదరీవనగిరిప్రాంతమునకు రప్పించి యచ్చో బంధింప యత్నించె." అని జేబులోనుంచితీసి యొకలేఖను సుదర్శనునకొసంగెను. అందలివిషయములను చదివినంతనే మహారాజు కాలాగ్నిరుద్రుఁడయ్యెను. తరువాత శూరసేనునిఁ జూచి "శూరసేనా! నీవింకను నేమైనఁ జెప్పవలసియున్నదా?" అని యడిగెను. అందుపై శూరసేనుఁడు "మహారాజా! నేచెప్పవలసినదింకేమియు లేదు. కామపాలహంతకుని కుతంత్రములన్నియు నాకిప్పుడు కరతలామలకములైనవి. చేయి కాలినపిదప నాకులకై తడవికొనినలాభమేమి? విధివశంబుననైనను నేఁజేసిన ద్రోహకృత్యములు క్షమించఁదగినవి కావని నేనెఱుంగుదును. లోకనిందితుండనైన నేనింక తలయెత్తి తిరుగఁజాలను. పతితుండనైతిని. తమకొ

కతివశిక్షవిధించిన నమభవించుటకు సంసిద్ధుఁడనై యున్నాను." అని పలికి యూరకుండెను.

అంత సుదర్శనచంద్రశేఖరులు కొంతతడవొండొరులు రహస్యముగ మాట్లాడికొనిరి. తరువాత సుదర్శనుఁడు "శూరసేనా, పురాకృతకర్మపరిపాకంబుచే నీబుద్ధి పెడతలఁబట్టి చేయరాని దురంతకృత్యము లెన్నియోఁ జేసితివి. కలహకారణమేమియు లేకయే నీవు కామపాలుని మోసంపుటురులఁజిక్కి వంగరాజ్యవిప్లవమును ఘటించుటచే నీవటి పరమమూర్ఖుఁడు లోకములో నెయ్యెడలనుండఁడని వెల్లడియైనది. నీవంటి వివేకహీనుఁడైన దుశ్చరితుని మననిచ్చినచో లోకమున కెప్పటికైన హానికలుగకమానదు. కాని యింతటి పరమమూర్ఖుఁడవైన నిన్ను వధించినచో నీవు నిష్కృతిలేని మహాపాపములను చేసినవాఁడవగుటచే నవ్యాయమైన యమలోకవేదనల ననుభవింపవలసియుండును. నీయాభిజాత్యంబు నాలోచించి నీజీవితశేషమంతయుఁ బశ్చాత్తాపపరితప్తహృదయముతో సద్వృత్తిమననిచ్చినఁ గొంత నిష్కృతికలుగవచ్చునని యోచియింతటినుంచియైన నీవుబుద్ధిగలిగి ప్రవర్తించెదవని నమ్మి నిన్ను కొన్ని నిబంధనలపై విడుదలఁజేయుచుంటిమి. నీ స్వాధీనములోనున్న వంగరాజ్యమంతయు గతఫలయుతంబుగఁ దద్రాజ్యంబునకు వారసుగాలైన విష్ణువర్ధనుని కొమరితయగు మధురికకిచ్చివేయవలయును. నీకొమరితయగు లలితాకన్యకకు వెంటనే వివాహమొనర్చి కళింగరాజ్యమంతయు నామెకు స్వాధీనపఱచి నీవు దేశమునువీడి తీర్థయాత్రల నాత్మశుద్ధిఁగలిగించికొనవలయును. నీవీ నిబంధనల కంగీకరింపవేని యురిశిక్షయు ననంత యమలోకవేదనయు ననుభవింపవలసియుండును." అని చెప్పి యూరకుండెను. అందుపై శూరసేనుఁడమితానందముతో "మహారాజవతంసములారా, భూతదయాస్వరూపులగు తమరు నాయందుచూపిన యింతటిదయకు నేను పాత్రుఁ

డనుగాను. నేస్వబుద్ధిని కలితుండనైతిని. అయినను నన్ను ధన్యతము నిఁ గావించితిరి. నేనీజన్మమునఁ జేసిన మహాఘోరకృత్యంబులకు ని ష్కృతికలుగుమార్గమునుఁ జూపితిరి తమరు విధించిన నియమములకు బద్ధుండనయ్యెదను. వంగరాజ్యమంతయు గతఫలములతోఁగూడ మధురిక కిచ్చివేసెదను. కళింగరాజ్యవిషయములో నీదీనుని ప్రార్థనయొకటికల దు." అని పలికెను అందుపై సుదర్శనుఁడు "నీకోరికయేమి ?" అని యడిగెను. అందుపై శూరసేనుఁడు "మహారాజచంద్రములారా. ఏశూ రాగ్రణి నాయేకైకపుత్రియగు లలితను చోరమ్మూకంబుల వాతనుండి తప్పించి నాకప్పగించెనో యేమహావీరుని చరణదాస్యము నపేక్షించి నాలలిత యేయుంబవళ్ళు విరాళిఁజెంది కృశించుచుండెనో యా జగదేక వీరుఁడైన వీరపాలునకు నాకన్నియను భార్యగాఁజేయ నంగీకరింపఁ బ్రార్థించుచున్నాఁడను. నేనపరాధినైనను సుకుమారియగు నాకన్ని య నిరపరాధిని." అని సవినయంబుగ మనవిఁజేసెను. ఆమాటవిని చంద్రశేఖరుఁడు "నాయనా, వీరపాలా, నీవు నిశ్చయముగ లలితా కన్యను ప్రేమించియుంటివా ?" అని యడిగెను. అందుపై వీరపాలుఁ డొకింత ముగ్ధుండై ముసిముసినగవులతో "తండ్రీ తమ యనుమతిఁ గొనకయే లలితాకన్యను నేను హృదయపూర్వకముగఁ బ్రేమించితిని. నాభావిభాగ్యోదయసూచకంబగు శుభనక్షత్రమా లేమయే. నాహృ దయనిదానవమాజవ్వనియే." అనితమి మీారఁబలికెను. అంతఁ బ్రతాప సింహుఁడు "తండ్రీ, లలితావీరపాలుర దాంపత్యము పరిశుద్ధమైనదని నేను స్వయముగఁ దెలిసికొంటిని." అనిపలికెను. అందుపై చంద్ర శేఖరసుదర్శను లంగీకరించుట కామోదించిరి. శూరసేనుఁడు ప్రహృష్టమానసుండై "మహారాజచంద్రములారా, ధన్యుండనైతిని. తమ యాజ్ఞాప్రకారము నాకర్తవ్యంబుల నెరవేర్చి తీర్థయాత్రల కేగెదను సెలవొసంగుఁడు. ఈపాపుఁడు మరల మీాకంటఁబడఁడు"

అని పలికెను. అక్కడున్నవా రందఱును మిక్కిలి సంతోషించిరి. సుదర్శనుఁడు ప్రసన్నవదనుఁడై "శూరసేనా! ఉత్తమజన్మ ప్రభావంబున నీ కింతలోనే కలిగినవివేకసంపద కానందించితిని. లలితాకన్యయొక్కయు మధురికయొక్కయు చంద్రికళయొక్కయు వివాహములు జరిగిన పిదప నీవు తీర్థయాత్రల కేగవచ్చును. నీ వీలోపునవలయు నేర్పాటులన్నియుఁ గావింపుము," అని పలికెను. "చిత్తము మహారాజా" అని శూరసేనుఁడు వెడలిపోయెను. కాలాతీతమగుటచే సుదర్శనుఁ డానాటి దర్బారు చాలించెను. అందఱును తమతమ నెలవుల కేగిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఇరువదినాల్గవ ప్రకరణము.



చ. కలిమిని రాజ్యభోగములఁ గన్నులు గానక మానవాధముల్
కలుషభయంబు వీడి యనుకంపయు లేక సపత్నిభూతి ని
చ్చలు మదినోర్వఁజాల కనిశంబు నొనర్చి దురంతకృత్యముల్
తలగడక్రింద త్రాచులయి తల్పల మీఁదరె యంతమందునన్.

"అకటా! నేనింత దనుక చేసిన దురంతకృత్యములకుఁ దగిన ఫలమనుభవించుచుంటిని నాయాశలన్నియు నిరాశలైనవి. ఎవ్వరిసాహాయ్యమును నమ్మి నేనంతటి రాజద్రోహములకు సాహసించితినో యానాచోరమిత్రులకు దూరుండనైతిని. ఇంక నే నెవ్విధంబున నీచెఱనుండి విముక్తిఁ జెందగలను? విముక్తిఁ జెందిన నేమిలాభము? విశ్వాసపాత్రులైన నాసిరభటు లందఱు నశించిరి. పురజనులకెల్ల పరమద్వేషినైతిని. సోదరా! నన్ను ఖండింపఁ గత్తిఁ బైకెత్తుచుంటివా? రక్షింపుము. రక్షింపుము. భావా విష్ణువర్ధనా నీయెడల నేనొనర్చిన ద్రోహమునకు నిష్కృతిలేదు. ఓసీ! చిత్రాంగి నీవంత యభాగ్యురాలవైతివి. నీకుపకారముఁ జేయఁగడంగియే కదా నేనింతటి దురవస్థను దెచ్చికొంటిని అదిగో నన్నుఁ దీయుటకు యమకింకరులు వచ్చుచున్నారు నామెడకు నుచ్చుఁదగిలించిరి. అయ్యో. మెడ బిగిసి పోవుచున్నది.

ంగ్లు పైకి వచ్చుచున్నవి. హా ! హా !!" అని యొక పాతాళకారాగా ంబునఁ గామపాలుఁడు మరణవేదనఁ జెందుచు వివశుఁడై మూర్ఛిల్లెను.

ఆసమయమున నొకకింకరుఁ డాహారపానీయములు గొని యా దిలోనికి వచ్చెను. వానికి బాసటగా నిరువురు భటులు తళతళలాడు త్తులను చేఁబూని వాని వెంటనుండిరి. ఆయలికిడి విని కామపాలుఁడు ప్పిల్లిపడి లేచి యామువ్వురునిఁ జూచి "అయ్యో నాశిరస్సు ఖండించు ంకై వచ్చితిరా? నేనేమి చేసితిని? రక్షింపుఁడు. రక్షింపుఁడు" అని నయార్తి మొరలిడెను. రాజభటులు నవ్వుచు "కామపాలా మేము మకొఱకు రాలేదు. నీ కాహారపానీయము లొసంగుటకై వచ్చి యున్నారము." అని చెప్పెను. కింకరుఁడు వానిని కామపాలుని ముం దిడిన తరువాత నాముువ్వురును గలిసి వెడలిపోయిరి. ఖణిల్లను శబ్ద ముచే ద్వారము బంధింపఁబడుటఁ దెలిసికొని కామపాలుఁ డాయాహా రపానీయంబుల నచ్చోటనే విడిచి మరల దుఃఖసాగర నిమగ్నుండై యొక్కటటి నేడ్చుచు మఱొక్కసమయమున నవ్వుచు నంత నతిసం భ్రమంబున నంతటను దిరుగుచు దద్దరిల్లుచు బహువు లేమమఁ బరిపరి విధంబులఁ బిచ్చివానివలె గేకలిడుచుఁ బరితాపంబునఁ దూలుచుండె ను. ఈవిధంబుగ నాహారంబుఁ గొనకయే యారేయెల్ల వేగించెను. 'కొక్కొరొకో' యని కోడిపుంజులు కూయసాగెను. మఱికొంత సేపటికిఁ గామపాలుని శమనపురంబునకు శీఘ్రింబ రమ్మని బిల్చుచుం డెనోయనఁ గాకులు కావని కూయఁదొడంగెను. వాని కాసన్నమైయు న్న విపత్తున కలరుచుండెనోయన శకుంతసంతానములు కిలకిలారావం బులఁ జెలంగుచుండెను. వానిపై లోకమంతకును గలిగిన కోపమిట్లు వ్యక్తమగుచుండెనోయన నుదయరాగదీప్తి చెల్వారుచుండెను. అంతఁ బాగ్గిరిశిఖరంబుపైఁ బొడసూపిన వేడివెలుంగు నిజకరంబుల సుఖ నిద్రాసక్తులగు జీవులనెల్ల మేల్కొలుపుచుండెను.

ఎట్టుఁజూచినను హేలాపురమంతయుఁ గోలాహలముగ నుండెను. పౌరభట భృత్యామాత్య నికురుంబంబుతో మహారాజు లిర్వురును గొలువుకూటంబున రత్నఘటిత కనకసింహాసనంబులపై సమున్నతస్థితిఁ గూర్చుండియుండిరి. దర్బారు నిండువేడుకల నలరారుచుండెను.

అంత సుదర్శనమహారాజుగారి యనుమతిపై నపరాధశోధక భటులు కామపాలుని రచ్చకుఁ దోడ్కొనివచ్చిరి. సభాస్థానమంతయు బహునిశ్శబ్దముగ నుండెను. చిన్న గుండుసూదిమొన నేలతాకుటచే నొదవు సూక్ష్మశబ్దముకూడ విస్పష్టముగ వినఁబడుచుండెను. చూపాక్కింత మరల్చిన నేమిమించిపోవునోయని జనులందఱుఁ దదేకలక్ష్యంబుగఁ గనుచుండిరి. సుదర్శనమహారాజు కామపాలునిపైఁగల యభియోగంబులనెల్ల సభాసదులకు నివేదింప నమాత్యున కాజ్ఞ నొసంగెను. సచివుండు లేచి యీయభియోగంబుల నిట్లుగ్గడించెను.

"జగదేకరాజద్రోహియు హృదయగహిత ద్విపాద మార్జాలంబును మూర్తీభవించిన యసహ్యకృత్యపాతకుండను దుర్నయోపలబ్ధకుళింద సామ్రాజ్యధురంధరుండునునగు కామపాలుఁడు రాజ్యలుబ్ధుండై విశ్వాసఘాతుకత్వంబున నిజాగ్రజుని వధించి తదీయపుత్రుండగు భానుమంతునిఁ దన తస్కరమిత్రులచేఁ జంపించుట కెన్నియో విధములఁ బ్రయత్నించె. దద్గుణసంపత్తియందును దురాశాప్రేరిత ద్రోహకృత్యములయందును దనకీడుదీయుని తోడఁబుట్టువగు చిత్రాంగి మహారాణి కనులుగప్పి తన్మూలంబునఁ గోసలరాజ్యము నపహరింపఁ దలంచి మహారాణీ చారుమతీదేవికి జన్మించిన యీ ప్రతాపసింహ వీరశిఖామణిని జననాదిదశరాత్రంబులలోపుననే దాసీయుండు మతిచేఁ జంపింప నేర్పాటుగావించి తరువాత బుత్త్రశోకార్తయైన యీమహారాణీని నిజాంతరంగికుండగు మందారకునిచేఁ దనప్రాసాదాంతరపాతాళగహ్వరంబున జీవసమాధినుంచి దుర్భరక్లేశంబుల నిరువదిసంవత్స

గుప్తున్నపైకి వచ్చుచున్నవి. హా ! హా !!" అనియొక పాతాళకారాగారంబునఁ గామపాలుఁడు మరణవేదనఁ జెందుచు వివశుఁడై మూర్ఛిల్లెను.

ఆసమయమున నొకకింకరుఁ డాహారపానీయములు గొని యాగదిలోనికి వచ్చెను. వానికి బాసటగా నిరువురు భటులు తళతళలాడు కత్తులను చేఁబూని వాని వెంటనుండిరి. ఆయలికిడి విని కామపాలుఁడు త్రుళ్లిపడి లేచి యాయిరువ్వురనుఁ జూచి "అయ్యో నాశిరస్సు ఖండించుటకై వచ్చితిరా? నేనేమి చేసితిని? రక్షింపుఁడు. రక్షింపుఁడు" అని భయార్తి మొరలిడెను. రాజభటులు నవ్వుచు "కామపాలా మేమందుకొఱకు రాలేదు. నీ కాహారపానీయము లొసంగుటకై వచ్చియున్నారము." అని చెప్పెను. కింకరుఁడు వానిని కామపాలుని ముందిడిన తరువాత నాయిరువ్వురును గలిసి వెడలిపోయిరి. ఖణిల్లను శబ్దముచే ద్వారము బంధింపఁబడుటఁ దెలిసికొని కామపాలుఁ డాయాహారపానీయంబుల నచ్చోటనే విడిచి మరల దుఃఖసాగర నిమగ్నుండై రెక్కలెటి నేడ్చుచు నొకొక్కసమయమున నవ్వుచు నంత నతిసంభ్రమంబున నంతటను దిరుగుచు దద్దరిల్లుచు బడుచు లేచుచుఁ బరిపరి విధంబులఁ బిచ్చివానివలె గేకలిడుచుఁ బశ్చాత్తాపంబునఁ దూలుచుండెను. ఈవిధంబుగ నాహారంబుఁ గొనకయే యారేయెల్ల వేగించెను. 'కొక్కురోకో' యని కోడిపుంజులు గూయసాగెను. మఱికొంత సేపటికిఁ గామపాలుని శమనపురంబునకు శీఘ్రింబ రమ్మని బిల్చుచుండెనోయనఁ గాకులు కావని కూయఁదొడంగెను. వాని కాసన్నమైయున్న విపత్తున కలరుచుండెనోయన శకుంతసంతానములు కిలకిలారావంబులఁ జెలంగుచుండెను. వానిపై లోకమంతకును గలిగిన కోపమిట్లు వ్యక్తమగుచుండెనోయన నుదయరాగదీప్తి చెల్వారుచుండెను. అంతఁ బ్రాగ్గిరిశిఖరంబుపైఁ బొడసూపిన వేడివెలుంగు నిజకరంబుల సుఖనిద్రాసక్తులగు జీవులనెల్ల మేల్కొలుపుచుండెను.

ఎట్టుఁజూచినను హేలాపురమంతయుఁ గోలాహలముగ నుండెను. పౌరభట భృత్యామాత్య నికురుంబంబులతో మహారాజు లిద్దరును కొలువుకూటంబున రత్నఘటిత కనకసింహాసనంబులపై సమున్నతస్థితిఁ గూర్చుండియుండిరి. దర్బారు నిండు వేడుకల నలరారుచుండెను.

అంత సుదర్శనమహారాజుగారి యనుమతిపై నపరాధశోధక భటులు కామపాలుని రచ్చకుఁ దోడ్కొనివచ్చిరి. సభాస్థానమంతయు బహునిశ్శబ్దముగ నుండెను. చిన్న గుండుసూదిమొన నేలతాకుటచే నొదవు సూక్ష్మశబ్దము గూడ విస్పష్టముగ విననగుచుండెను. చూపొక్కింత మరల్చిన నేమిమించిపోవునోయని జనులందఱుఁ దదేకలక్ష్యంబుగఁ గనుచుండిరి. సుదర్శనమహారాజు కామపాలునిపైఁగల యభియోగంబులనెల్ల సభాసదులకు నివేదింప నమాత్యున కాజ్ఞ నొసంగెను. సచివుండు లేచి యాయభియోగంబుల నిట్లుగ్గడించెను.

“జగదైకరాజద్రోహియు హృదయరహిత ద్విపద మార్జాలంబును మూర్తీభవించిన యస్పృశ్యపాతకుండను దుర్నయోపలబ్ధ కుళింద సామ్రాజ్యధురంధరుండునునగు కామపాలుఁడు రాజ్యలుబ్ధుండై విశ్వాసఘాతుకత్వంబున నిజాగ్రజుని వధించి తదీయపుత్రుండగు భానుమంతునిఁ దన తస్కరమిత్రులచేఁ జంపించుట కెన్నియో విధములఁ బ్రయత్నించె. దద్గుణసంపత్తియందును దురాశాప్రేరిత ద్రోహకృత్యములయందునుఁ దనకీడుదీయుని తోఁడఁబుట్టువగు చిత్రాంగి మహారాణి కనులుగప్పి తన్మూలంబునఁ గోసలరాజ్యము నపహరింపఁ దలంచి మహారాణీ చారుమతీదేవికి జన్మించిన యీ ప్రతాపసింహ వీరశిఖామణిని జననాదిదశరాత్రంబులలోపుననే దాసీయును మతిచేఁ జంపింప నేర్పాటుగావించి తరువాత బుత్రశోకార్తయైన యామహారాణిని నిజాంతరంగికుండగు మందారకునిచేఁ దనప్రాసాదాంతరపాతాళగహ్వరంబున జీవసమాధినుంచి దుర్భరక్లేశంబుల నిరువదిసంవత్స

రము లనుభవింపఁజేసెను. నిర్హేతుకంబుగ నసత్య వక్రసంభాషణంబు లచే శూరసేనునిఁ బ్రోత్సహించి యీరణవిప్లవంబును ఘటియించె. ఇంకను నీదుర్మార్గుఁడు చేసిన ద్రోహకృత్యంబు లెన్నియో గలవు." అని విన్నవించి కూర్చుండెను. ఆమాటలువినినపిదప దర్బారులోఁ గామపాలుని వేతెఱంగుల దూషించుచు "పొడువుండు. చంపుఁడు. ఉరిదీయుఁడు. జీవముతోఁ దగలఁబెట్టుఁడు" అని కేకలిడసాగిరి.

అంత సుదర్శనుఁ డాగ్రహోదగ్రుండయ్యు దృష్టుల యుద్రేకంబు వారించి కామపాలునితో "ఓరీ క్షత్రియకులకళంక. రాజద్రోహీ. నీపై నారోపించిన నేరముల కేమిజవాబు చెప్పెదవు?" అని గద్దరించి యడిగెను. కామపాలుఁ డామాటలువిని హతాశుఁడయ్యు మొండిధైర్య మవలంబించి తిరస్కారముగ "సుదర్శనా. కాలవైపరీత్యంబుచే దైవోపహతుఁడనై రణంబునఁ బరాజయంబు నొంది నీకుఁ జిక్కియుంటినికదా యని తరమెఱుఁగక పేలుచుంటివి. అన్యాయంబుగ నారోపించిన నేరములను రుజువుసేయుకయే యుత్తమరాజవంశజుఁడనగు నన్నుఁ దూలనాడుటకు నీకేమి యధికారముకలదు? నేనాదినుండియుఁ క్షత్రియకులోచితంబుగ సంచరించితి నేగాని యెప్పుడు నధర్మంబుగఁ బ్రవర్తించియుండలేదు. నాయన్న కళింద రాజ్యమును మనఃపూర్వకముగ నాకొసంగి విధివశంబున స్వర్గస్థుఁడయ్యె. నాయన్నకుఁ గొమరుఁడు కలఁడనుట కేవలమసత్యము. అతఁడు పుత్రసంతానకాంక్షచేత నే తీర్థయాత్రల కేగెను. వంగరాజ్యముపైని నీపైని దాడివెడలుటలో నామిత్రుఁడైన శూరసేనుఁడు నన్నర్థించుటచే వానికొక్కింత సహాయ మొసంగితిని. అందేమి తప్పుకలదు? మృతిజెందిన చారుమతీ ప్రతాపసింహుల సమాచారము నాకేమియుఁ దెలియదు." అని పలికెను. ఆమాటలువిని ప్రతాపసింహుఁడు ప్రళయకాలభైరవుండోయన

చివాలున లేచి "ఓరోరి రాజ్యహాపచాండాలా! కామపాలా! చారుమతీప్రతాపసింహుల సమాచార మెఱుఁగనంటివికదా! వారుభయులు మృతిఁజెందిరని నీవెట్లెఱింగితివి? వారిమృతిని నీవు కాంక్షించితివి కాఁబోలు. నీకాంక్ష వ్యర్థమైనదని నీవిప్పుడు తెలిసికొనుము. ఎవ్వాఁడు నీయన్నకొమరుఁడైన భానుమంతుని వృత్తాంతమును చంద్రికకాలలితల నపహరింపయత్నించు దురుద్దేశ్యములను నీనోటనే యొప్పించెనో యెవ్వాని నీతోఁబుట్టువు దాసియగు నిందుమతిచే శైశవంబునఁ జంపింపఁదలంచెనో యెవ్వాని వీరధన్వి స్వయంపాత్రపుత్రునిగ లోకము భావించుచుండెనో యాప్రతాపసింహుఁడు కోసలరాజ్యమహారాణీచారుమతీదేవిపుత్రుఁడేయని తెలిసికొనుము. నేనే యాప్రతాపసింహుండను. నీపై నారోపించిననేరముల నీనోటనేయొప్పించి నిన్నాక్షణంబుననే సంహరింపనెంచియుఁ గిల్బిషపూరితుంతవగు నీపాదురక్తముచే నాచేయి మైలపడుననోర్వక నిన్నప్పుడు విడిచితిని. తరువాత రణరంగమున సుందరయువకుని ధనుర్విముక్త శరాఘాతంబున నేలఁగూలియున్న నిన్నంతకాలయంబున కనుపనున్నతఱి దైవికంబుగ నే నయ్యెడకువచ్చి మదీయహృదయ సామ్రాజ్యలక్ష్మియగు నాచంద్రికకు పరిశుద్ధహృదయముపై నీపాదురక్తముచే గళంకముకలుగకుండ నిన్ను బ్రతుకనిచ్చితిని. కుళిందలో నీప్రాసాదాంతరపాతళగహ్వరంబున నుంచిన నాతల్లియగు చారుమతీమహారాణి సజీవయై యిప్పుడిచ్చటనే యున్నయది. నీవు వ్రాసియిచ్చిన యాజ్ఞాపత్రంబునుగొని యామెను వధింప నుద్యోగించిన మందారకుఁడు నీతోఁబుట్టువైన చిత్రాంగిమహారాణిచే హతుండయ్యె. ఇంకను తలయెత్తఁ గోరుచుంటివిరా ఖలిశా! నోరుమూసికొని పడియుండుము" అని కఠోరంబుగఁ బలికి కూర్చుండెను. ఆమాటలు విని వీరపాలుఁడశ్రుకణంబులు రాల్చుచు శిరంబువంచి సిగ్గుఁజెందుచుండెను. చంద్రశేఖరుఁడు

"కుమారా. ప్రతాపసింహా. మనుష్యరూప పిశాచంబగు చిత్రాంగినిఁ దలగడక్రింద త్రొచునుపలెఁ జేర్చుటచేఁ బరమసాధ్వియగు నీతల్లిని క్షత్రియకులమండనుండవు కోసలరాజవంశదుగ్ధాబ్ధిచంద్రుండవు నగు నిన్నును జంపఁగోరి కాటువేసె. నేరస్తురాలైయున్న యీ కామినికి రాణీ పదమిదివరకే తొలంగినది. దాని నిప్పుడు ఖయిదీయని పిలువవలయు నే గాని రాణీయని పిలువరాదు." అని వీరపాలునిఁ జూచి "నాయనా వీరపాలా విచారింపకుము. అగ్ని యెప్పటికిని శుచియైనదియే. నీతల్లి ద్రోహకృత్యంబులకు నీవు బాధ్యుండవు గానేరవు. నీపవిత్రజననమున కాతుచ్ఛక్షేత్రమాలవాలమగుట శోచనీయమేయైనను నాకీను నీజీవ నకు బురాకృత పాపకర్మ ఫలయూర్థమై కలిగెనని భావించి ధీరచిత్తుండ వైయుండుము." అని మందలించెను. వీరపాలుఁడు సామర్ష విషాదావేశ పరవశుండై "తండ్రీ పరమపాపక్షేత్ర జననదోషంబునం జేసి యపవిత్ర మైయున్న యీదేహము పవిత్రనదీజలంబుల నవగాహనం బాచరించు చుఁ గొంతకాలముఁ దీర్థయాత్రలఁ దపోనియతిఁ గృశించినంగాని పూ జ్యులైన మీయొక్కయు నాయన్నగారియొక్కయు చరణదాస్యంబున కర్హుండను గానేరను. నాకు శెలవొసంగుఁడు. ఇప్పుడే బయలుదేరె దను." అని తండ్రి పాదంబులపై వ్రాలి డగ్గుత్తికతోఁ బలికెను. చం ద్రశేఖరుఁడు వీరపాలుని లేవదీసి యాలింగనంబొనర్చి "నాయనా. చరమావస్థనున్న నాకీవియోగదుఃఖమునుగూడఁ గలిగింపఁదలం చితివా? నిరపరాధివగు నీవే యింతగఁ బరితపించిన నీజన్మకుఁ గారణభూతుండనై నీ హృదయమున కింతటిక్లేశంబును కలుగఁజేసిన నే నెంతపరితపించవలసియుండును? నీమనస్సును చెదరనివ్వకుము. నీవీ విచారణానంతరమువరకు నీభవనంబుననే యుండుము." అని పలికెను. ప్రతాపసింహుఁడుకూడ నట్టుల నేపలికెను. ఎట్టకేలకు వీరపాలుఁడు శాంతించి వెడలిపోయెను.

అట్లు వీరపాలుఁడు దర్బారువిడిచి చనినయనంతరంబున సుదర్శనుఁడు కామపాలునితో "ఓరీ క్షత్రియకులాపసదా. ప్రతాపసింహుని పలుకులచే నీపైమోపిన నేరములన్నియు రుజువైనవి. నీకు మరణదండన యేలవిధింపఁగూడదో చెప్పుము" అని పలికెను. అందుపై కామపాలుఁడు హతాశుఁడయ్యుఁ దెగువవహించి "మహారాజా. ప్రతాపసింహుఁ డెవ్వఁడో నే నిప్పటివరకు నెఱుంగను. వాని నే నితఃపూర్వమెచ్చోటనుఁ జూచియుండలేదు. అతఁడు చెప్పినదంతయుఁ గేవల మసత్యము మీకు నాపై నెద్దియో గాఢమైన పగయుండుటచే నన్ను బహుజనసమ్మతంబుగఁ జంపవలయుననేకోరికతో మీరీనాటకమును బ్రదర్శించుచున్నారు. అంతియేగాని నేను కేవలము నిరపరాధిని. నిగళబద్ధుఁడనై మీచేతిలోఁజిక్కియున్న నన్ను మీరేమిచేయఁదలంచినను సులభముగఁ జేయవచ్చును" అని పలికెను. ఆమాటలు విని సుదర్శనుఁ డాగ్రహోదగ్రుండై చిత్రాంగికిని వానికిని జరిగిన యుత్తరప్రత్యుత్తరములను నిజామాత్యునిచేఁ జదివించి కామపాలునిఁజూచి "ఓరీ. తులువా. ఇప్పుడేమనియెదవురా!" అనిపలికెను. అందుకు గామపాలుఁడు నిరుత్తరుఁడయ్యెను.

అంత చంద్రశేఖరుఁడు తప్తలోహముపైఁ దైలముఁబోసిన భాతి మండిపడి "ఓరీ కామపాలా. రాజమాపభ్రష్టాలుఁడా, నరహంతకుఁడవైన నీవుచేసియున్న ఘోరకృత్యములకు ముందు నీవెన్నిజన్మములెత్తినను నీకు నిష్కృతి కలుగనేరదు. నీకు విధించవలసినశిక్ష నీతోబుట్టువయు నీవొనర్చిన పాపకృత్యములలో నీకు సహకారిణియునగు చిత్రాంగిపైఁగల యభియోగమును విచారించినపిదపఁ జెప్పఁబడును. నీవంతవరకు నిచ్చోటనే నిలిచియుండవలెను." అని పలికి చిత్రాంగిని రచ్చకుఁ దోడ్కొనిరమ్మని భటులు కాజ్ఞాపించెను.

చిత్రాంగికి విచారణసమాచారము లేమియుఁ దెలియలేదు. ఆమె కేర్పఱచిన యేకాంతసౌధములో నొక్కరితయే చెరబద్ధురాలై నటు లెచ్చోటికైనఁ బోవుటకుఁగాని పరు లెవ్వరినైనఁ దనయొద్దకు రప్పించుటకుఁగాని వీలులేని కఠిననిర్బంధనములో నుండెను. హతాశురాలై మృత్యువాసన్నమై యుండెనని తలంచి భయవిహ్వలయగుచుండెను. తనయన్నయైన కామపాలునిఁజూడ నభిలషించుచుండెను. కాని యదెట్లు సాధ్యమగును? చెలికత్తియయగు వాసంతికయైనఁ జెంతలేకుండుటచేఁ దన మనోవేదనల నివేదించి యొక్కింత యూరటఁ గొనవలనుపడకుండెను. అంతలో నెవ్వరో మేడమెట్లెక్కుచున్నట్లు సడియయ్యెను. తలుపు బీగముఁదీయుచున్నట్లు చప్పుడయ్యెను. అప్పుడే కలిగిన దక్షిణాక్షిస్పందనముచే నామె హృదయ మదరదొడంగెను. "నీవతిరయంబున మరలి రావలయునుసుమీ. ఆలసించితివేని నిన్నుఁ గూడ బలవంతముగ నీడ్చికొనిపోవలసివచ్చును." అను కర్ణశూలాయమానంబులగు గంభీరవాక్యము వినవచ్చెను. చిత్రాంగి దేహామాపాదమస్తకంబుగఁ గంపింపసాగెను.

అంతలోఁ దలుపు తెఱవఁబడియెను వాసంతిక దీనవదనయై లోనఁబ్రవేశించి "చిత్రాంగీ. సమస్తభోగంబుల ననుభవింపఁదగిన మహారాణివయ్యు బుద్ధిహీనత మితిమీరిన దురాశాపాశంబులం జిక్కి నీవు పరులకై త్రవ్విన గోతిలో నీవేకూలితివి. నీపై మందారకునిఁ జంపిన నేరమొక్కటియేగాక యింకను నెన్నియో నేరము లారోపింపఁ బడియున్నవి రాజభటులు నిన్నిప్పుడు రచ్చకుఁగొనిపోవుటకే వచ్చియున్నారు. నీయన్నపైఁగల నేరములన్నియు రుజువైనవి." అనిపలుకు చుండఁ జిత్రాంగి గుండె బ్రద్దలై "హా. చెలీ! వాసంతికా" అని దుఃఖావేశంబున మూర్ఛిల్లెను. వెంటనే వాసంతిక తత్తరపాటుతో వలయు నుపచారంబు లొనర్పఁ గొంతవడికిఁ దెలివిఁజెంది లేచి చిత్రాంగి

డగ్గుత్తికతో "చెలీ. నన్నా యమసదనంబునకుఁ గొనిపోవ యమకింక రులు వచ్చియుండిరా ?" అని యా స్త్రీతో నడిగెను. అందుపై వాసంతిక "ఆ వచ్చియుండిరి." అని పలికెను. అందుపై చిత్రాంగి "అయ్యో. ప్రియసఖీ వాసంతికా. ఇంక నాగతియేమి ? నాకీ విపత్తెట్లు తొలంగును ?" అని వాసంతిక యెదపై వ్రాలి వెక్కి వెక్కి యేడువనారంభించెను వాసంతిక యేమిసేయఁగలదు. "చిత్రాంగీ. నీవి ట్లేడ్వుచుండిన లాభమేమి ? చేయికాలినపిదప నాకులకై తడవికొనినఁ బ్రయోజనముండునా? నీవు చెయిచేతలఁ జేసిన పాపకర్మఫలం బెట్లు తప్పించికొనఁగలిగెదవు? ఇంకొక విశేషముకలదు. నీసవతియైన చారుమతీదేవి పూర్ణారోగ్యముఁగలిగి యిప్పుడిచ్చటనే యున్నయది. నీవు మృతిఁజెందెదవన్న యామెపుత్రుండు చంద్రశేఖరమహారాజుగారి కౌఁగిటనున్నాఁడు." అని పలికెను. వజ్రపాతసదృశంబులగు నామాటలు వినినంతనే చిత్రాంగి ధైర్యభూధరంబు భగ్నమయ్యెను. మేనెల్ల చెమ్మటలు క్రమ్మెను. చూపులు చిచ్చువడియెను. ఆననంబు పల్లటిల్లెను. మానసంబు తల్లడిల్లెను. అట్లొక్కింత తడవు నిర్విణ్ణురాలై హఠాత్తుగ లేచి "ప్రియసఖీ. వాసంతికా. నీవుకూడ నాచావునే గోరుచుంటివా ? నేను రచ్చకు రాఁజాలను ఇచ్చోటనే నన్నుఁ జంపివేయుము. నీకు నమస్కరించెదను." అని వాసంతికపాదములపై వ్రాలెను. వాసంతిక మెల్లగ నామెను లేవదీసి "చిత్రాంగీ. నీపరమదారుణతంత్రములన్నియు భగ్నములైనవి. నరహంత్రివైన నీవు నన్నుఁగూడ స్త్రీహంత్రినిఁజేసి నీవెంట నధోలోకంబులకుఁ గొనిపోఁదలంచితివా? ఆపనిమాత్రము నేను చేయఁజాలను నీకు మరణదండనము తప్పదు. రాజ్యలోభంబున సవతిబిడ్డఁడని శ్రీరామునకంతటి విపత్తును గలిగించిన కైకేయిని శ్రీరాముఁడు క్షమించినట్లు నిన్నిప్పుడు ప్రతాపసింహుఁడు కాపాడవలయునేగాని యితరులు కాపాడఁజాలరు. నేనిక నిటనిలువ

రాను. పోయివచ్చెదను." అని వెడలిపోయెను చిత్రాంగి దుఃఖావేశంబున మూర్ఛిల్లెను. ఆమెను రచ్చకుఁ గొనిపోవుటకై రాజభటులు లోనఁ బ్రవేశించిరి. చిత్రాంగి చైతన్యరహితయై గాఢమూర్ఛమునింగి యుండెను. ఆస్థితిలో నామెను గొనిపోయినయెడల నామె ప్రాణము నిలుచునో నిలువదో యనుభయంబున నాసంగతి మహారాజుల కెఱిగించి వారి యుత్తరుప్రకారము జరిగించుట మేలని తలంచి యామె నచ్చోటనే విడిచి వెడలిపోయిరి.

దర్బారులో సుదర్శనచంద్రశేఖరులు చిత్రాంగిరాక కెదురు చూచుచుండిరి. కొంతసేపటికి రాజభటులువచ్చి మహారాజులకు నమస్కరించి జరిగినవృత్తాంతమును నివేదించిరి. అప్పటికి సూర్యుఁ డస్తంగతుఁ డగుచుండెను. సుదర్శనుఁడు గద్దియనుండి లేచి 'పౌరభట భృత్యామాత్యసామంత సకుటుంబములారా! చిత్రాంగి కృతాపరాధ చలితాంతరంగయై గాఢమూర్ఛ మునింగియుండుటచే నేఁ డామెను రచ్చకుఁ దోడ్కొనిరా వలనుపడదయ్యె. ఆమెపైఁగల యభియోగ మెల్లి విచారింపఁబడును. ఈరోజు దర్బారు మఃగించడమైనది" అని యపరాధపరిశోధకాధ్యక్షునిఁ బిలిచి కామపాలుని గొనిపోయి వేఱొక యేకాంతపాతాళగహ్వరంబుననుంచి యెక్కువజాగ్రత్తతో వానిఁ గనిపెట్టి చూచుచుండుటకు పారాజమానుల వృద్ధిసేయుమని యాజ్ఞాపించి ప్రతాపసింహచంద్రశేఖరులతో వెడలిపోయెను. కొదువ వారందఱుఁ జిత్రాంగిపైఁగల యభియోగ విచారణ మెట్లు ప్రవర్తిల్లునో యని వితర్కించికొనుచుఁ దమతమ నెలవుల కేగిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.



## ఇరువదియైదవ ప్రకరణము.



ఉ. దీపితసద్గుణంబుల నతిం గను మన్న నృపాలలక్ష్మిమా
పోపక శాత్రవకృత్యముల నుద్ధతి సాగుల కగ్గసేయు నై
వాపహతుల్ వశింతురు మహోజ్వలధీయులు కీర్తిగం తురై
ప్రాపిత రాజ్యలాభము లపారశుభంబులుఁ గాంతు రేకదా!

చారుమతీదేవి వీరధన్వ చికిత్సాప్రభావంబునఁ బుష్టిఁ జెంది యొకనాటిసాయంకాలమునఁ జంద్రికళా ద్వితీయయై పుష్పోద్యానవనంబున వాహ్యాళిఁ బరిభ్రమించుచుండెను. చారుమతీదేవి తన మేనయత్తయనియుఁ దన హృదయపీఠాధిష్ఠిత దైవంబగు ప్రతాపసింహునిఁ గన్నతల్లియనియుఁ దెలిసికొనినది మొదలు చంద్రికళ యామె నతి భక్తి సేవించుచు నామెకు వలయు నుపచారంబుల నెల్ల మిక్కుటంబగు భక్తిశ్రద్ధలతో నెరవేర్చుచుండెను. ఆనాఁడు దర్బారులో జరిగిన యభియోగవిచారణాంశము లేమియు వారికింకను దెలియలేదు. చారుమతీదేవి ప్రేమమయుఁడైన భర్తను దిరుగఁ గలిసికొనఁ గలిగినందుకమితానందరసనిమగ్నయై లోకమునే మఱచియుండెను. దేహదార్ఢ్యమొక్కింత కలుగుటచేఁ జంద్రికళప్రోత్సాహంబున నుపవనంబున వాహ్యాళిఁ బరిభ్రమింప నిశ్చయించెను.

అట్లా యిరువురును బయలుదేరి కేళీవనంబున కేగిరి. ఇరువదిసంవత్సరములు సూర్యకాంతియన నెట్టిదియో యెఱుంగక గాఢాంధ

కారమయంబును దుర్గంధబంధురంబునగు పాతాళకర్కశశిలాగహ్వ రంబున నవసినవసి యిప్పుడాదృచ్ఛికంబుగ నప్పటి ప్రకృతి సౌందర్యం బునుఁ జూచినంతనే చారుమతీదేవి తాను దేవలోకంబున కేతెంచి నట్లుభావించి యమితోత్సాహముఁ జెందెను. ఏప్రక్కఁజూచినఁ బు ష్పాభరణభూషితలతాకన్యకలు తమ్ముఁ జేరదీసిన విశాలసాలస్కం ధంబుల బిగియారఁ గౌగలించికొని యుండుటగని యుత్సహించుచు గొమ్మలపై వ్రాలి పత్రిగుప్తపక్వఫలంబుల గ్రహించి సమున్నతత రుశాఖాలంబితలతాడోలికలఁ దూఁగుటుయ్యెలల నూఁగుచుఁ గల కూజితంబుల శుకపికశారికాది శకుంతసంతానంబు లత్యుత్సాహంబు ననోపర్చు మధురగానంబుఁ కుల్లసిల్లుచు వికచకుసుమగర్భాంతర నిష్యందమరందం బాస్వాదింపఁ జెలరేఁగు నదృప్రిమదృప్రిమర ఝుంకా రరవంబుల కుత్కలికఁజెందుచుఁ గోలంకుల నవగాహంబొనర్చి ప్రసూ నాలంకృత నవనవోన్మేష భూరుహంబులఁ బైకొని తదీయప్రతాచ్ఛా దిత పుష్పగుచ్ఛంబులలో దాఁగుకుమూఁతలాపను నల్లనల్లనఁ దమ పైఁబొలయు పరిమళమిళిత మందములయు మరుత్కిశోరంబుల తాకు డులచే హాయినిఁజెందుచు నొక్కింతతడవందు విహరించి విహరించి శ్రాంతిఁగొని వారిరువురు మరలి యంతిపురంబున కేతెంచుచుండిరి.

వారట్లు గృహాభిముఖులై పదియడుగులు నడిచినపిదప వాసం తిక వారి యెదురుగ వచ్చుచుండుటఁగని చారుమతి యామె నెఱింగిన దగుటచే నామె తనకేమివార్తఁ దెలుపవచ్చుచుండెనోయని యచ్చో నిలిచెను. వాసంతిక వారినిదరిసి "తల్లీ. చారుమతీదేవీ. మృత్యుము ఖంబుననున్న చితాగ్రింగి మీకీలేఖ నొసంగమని యిచ్చినది. చిత్తగిం పుఁడు." అని యొకలేఖనొసంగెను. అప్పటికింకను ఎకటిపడలేదు. చారుమతి సాంధ్యరాగచ్ఛవి నాలేఖనుఁ జదివికొని "చెలీ. వాసంతికా. చితాగ్రింగి నాయెడలచేసిన ద్రోహమునకు నేనామెను హృదయపూ

ర్వకముగ క్షమించితినని చెప్పుము." అని పలికెను. ఆమాట కమితా నందముఁజెంది వాసంతిక వెడలిపోయెను. తరువాత చారుమతీ చంద్రికళ లంతిపురంబున కేగిరి.

సుదర్శన చంద్రశేఖరమహారాజు లిరువురును దర్బారుముగించినతోడనే ప్రతాపసింహ వీరపాలురతో వాహ్యాళి కేగి యప్పుడేవచ్చి సౌధాంతరంబునఁ బ్రవేశించిరి. అచ్చో నలుగురునుచేరి మాతాపుత్రి సమావేశపరికారము నేర్పాటుఁజేసికొనిరి. తరువాత చంద్రశేఖరుఁడు చారుమతీదేవి యభ్యంతరంబున కేగెను. వానినిఁ జూచినంతనే చారుమతీదేవి యమందానందకందళిత హృదయారవిందయై సుందర దరహాసరుచుల నివాళియొసంగుచు "ప్రాణేశ్వరా. వచ్చితిరా" అని భర్తపాదంబులకెరగి లేచి "నాథా. నాపుణ్యవశంబున దేవరవారి పాదపద్మములను సేవించుభాగ్యము నాకికను కొంతకాలము లభింపఁజేయుటకై పరమేశ్వరుఁడు నాకారోగ్యమును కలుగఁజేయుటచే నాయనుంగు కోడలగు చంద్రికళ ప్రోత్సాహంబున నేనీరోజునఁ దమ యనుమతిఁ గొనకయే చంద్రికళా ద్వితీయనై వాహ్యాళి నొక్కింతతడవు పరిభ్రమింపఁ బుష్పోద్యానవనంబున కేగితిని. క్షమించెదరా?" అని యవనతవదనయై పలికెను. అందుపైఁ జంద్రశేఖరుఁడు ప్రియ మారఁ జారుమతి నొక్కకేల నాశ్లేషించిచికొనిపోయి యొక్కసోఫాపైఁ గూర్చుండఁజేసి తాను నందామె చెంతఁగూర్చుండి "ప్రేయసీ. నీకు వాహ్యాళి కేగఁగలిగినంత దారుఢ్య మొదవినందు కమితానందమునుఁ జెందితిని. ప్రియా. మనుజునకు కష్టసుఖములు కావడికుండలవంటివి. కలకాల మొక్కతీరుగనే యుండునా. చీకటికాలము కొన్నాళ్లు వెన్నెలకాలముకొన్నాళ్లుకలుగుచుండుటలేదా? ఈప్రకృతి స్వభావముననుసరించి నీవింతకాలము నంతటికష్టదశల ననుభవించితివో యికముందు నీవంతటి సుఖదశల ననుభవింపవలసియున్నది. ఇరువది సంవత్సరముల

నుంచి నీకీవితాకాశంబున దట్టముగ నలమికొనియున్న విపజ్జీమూత పటలమంతయు నేటికి సుదర్శన మహాబలప్రభావంబునఁ జెదిరిపోయి నది. ఇంతటినుంచి నీవు నిర్మలానందంబు ననుభవించెదవు." అని దర స్మితాననుండై పలికెను. ఆమాటలువిని యానందపరవశాత్మయై చారుమతి "ఒహాహో. ఏమి యీవాక్యామృతమాధుర్యము!" అని భర్త యెదపైవ్రాలి యత్యంతసంతోషాంబుధి నోలలాడుచుండెను.

ఆసమయమున సుదర్శనమహారాజు చారుమతీదేవినిఁ జూడఁ గోరి వచ్చుచుండెనన విని యాదేవి భర్త కౌఁగిటనుండివిడి యన్నరాక కెదురుచూచుచుండెను. అంత సుదర్శనుఁడు లోనఁబ్రవేశించి సము త్సాహముతో "అనుంగుచెల్లెలా. చారుమతీ. నేమునీవు పుష్పోద్యాన వనంబునకేగి యందు వాహ్యాళి విహరించితివని నీకోడలు చెప్పుటచే నపరిమితానంద భరితుండనై నిన్నుఁజూడఁగోరివచ్చితిని. ఇంతలోనే నీకంతటి దాక్ష్యముకలుగుట భావగారి మహిమకాఁబోలు." అని న వ్వుచుఁబలికెను. ఆమాటవిని సిగ్గుఁజెంది నెమ్మొగమ్మునఁ జిఱునగవు దళుకొత్త "అన్నా. మీవంటి మహనీయసోదరుని వడసిన ధన్యురా రాలికిఁ ద్వదీయవాల్లభ్యలక్ష్మీకటాక్షభూతి నీపాటి యారోగ్యము కలుగుట యబ్బురమా." అని సహాస్యంబుగఁబలికెను. ఆమాటకు ముదితుండై సుదర్శనుండు "ప్రియసోదరీ చారుమతీ. నీవంటి పరమ పతివ్రతామణికిఁ గాలకర్మవశంబున నెట్టియిక్కట్టులొదవిన నద్దియో కారణంబున నయ్యవి సుఖసంతోషదాయకంబులే యగును. మున్ను దమయంతి పతిసుతులనెడఁబాసి చిరకాల మమితక్లేశంబు లనుభవిం చినను చివరకు పతిపుత్రులతో మహనీయ రాజ్యభోగంబుల ననుభ వింపలేదా? నేనిప్పుడు నీవలన నొక్కవిషయంబునుఁ దెలిసికొనఁగోరి వచ్చితిని. నీమనంబు శక్తికొలఁదిఁ జక్కగ నాలోచించి ప్రత్యు త్తర మీయఁగలవా?" అని పలికెను. ఆమాటవినినంతనే చారు

మతి నెమ్మనమ్మున నెద్దియో యుత్కలికజనింప విస్మితయై "అన్నా. ఆవిషయమేమి?" అని కొంతకుదోపఁ బలికెను. అందుపై సుదర్శనుఁ డొక్కింత యాలోచించి "సోదరీ వినుము. పుట్టిన పదిరోజులలోనే మృతిఁజెందెనని భావించిన పుత్రునికై శోకార్తిమగ్గుచున్న సాధ్వి గోరుచుట్టుపై రోకలిపోటనునట్లు రాజద్రోహము మాయాజాలంబునఁ జిక్కి యాత్మభర్తనుగూడ నెడఁబాసి క్రూరశత్రువుచే గాఢాంధకార బంధురంబును దుర్గంధ దుస్సహంబునునగు నేకాంత పాతాళకర్కశ శిలాగహ్వరంబున బాధింపంబడి చిరకాలము రేయుంబవళ్ళు నిద్రాహారంబులులేక పడరాని యిడుములంబడుచుఁ గృశించి కృశించి ప్రాణావశిష్టయైయుండ నామెకు దైవానుగ్రహంబున భర్తృసమాగమంబును మృతసంభావిత పుత్రసందర్శనంబునుఁ గలిగినచో నామె యానంద మెట్లుండునో చెప్పుము?" అని పలుకుచుండ చారుమతి హృదయోద్వేగం బాపికొనఁజాలక త్రుళ్ళిపడిలేచి "ఏమీ! ఏమీ!! నా ముద్దులపట్టి, నాకూర్మితనయుఁడు, నానోములపంట, జీవించియేయుండెనా! వాని చిన్నారిముద్దుమోముఁ గనులారఁజూచు భాగ్యము నాకీ జన్మమున లభించునా! నానయనోత్పల చంద్రుఁడేఁడీ. నాగర్భధనం బేదీ. ఓహో! నాకన్నతండ్రీ! బిడ్డా-బిడ్డా-బిడ్డా-ఆ-ఆ-ఆ." అని సంతోష పరవశాత్మయై మైమఱచి వ్రాలుచుండ బ్రితాపసింహుఁ డొక్క గంతునలోనికేతెంచి యామెనుఁబట్టికొని తన నయనగోళంబులనుండి సంతత ధారాపాతంబుగ జాలువారు హర్షాశ్రుజలంబున నామెశిరంబునుఁ దడపుచుండెను. కొంతసేపటికి చారుమతి తెలివిఁజెంది "నాబిడ్డఁడేఁడీ. నాజగజ్జోతియేదీ." అని మరల వాపోవుచుండఁ బ్రితాపసింహుఁడాపరానిభావోద్వేగంబున "హా తల్లీ. తల్లీ." అని చారుమతి పాదములపైవ్రాలి "అమ్మా. చిరకాలము మిమ్మట్లు పతిపుత్రవియోగానలంబున మ్రగ్గింప మీకు గర్భభారభూతుండనై జన్మించిన పర

మపాతకుండనగు మీపుత్రుండనునేనే. పుట్టిననాటనుండి మాతృప్రేమయన నెట్టిదియో యెఱుఁగని యీపరమనిర్భాగ్యుని యనుగ్రహించెదవా తల్లీ" అని ధీరుండయ్యు నశ్రుపూరితలోచనుండై భావోద్వేగంబున డగ్గుత్తికతోఁ బలికెను. చారుమతి తత్తరంబున వానిని లేవదీసి యాజానుబాహుండును నాకర్ణాయతచారునేత్రుండును సమున్నతఫాలభాగ సంచలితాలకుండును ముఖవిజితరాకాపూర్ణచంద్రుండును పృథుపీనవక్షస్థలుండునునగు ప్రతాపసింహునిఁజూచి "ఓహో. ఏమినాభాగ్యము! ఈజగజ్జ్యోతియే నా నాపెన్నిధి! ఇది కలయా నిక్కువమా." అని విస్మయాకులితచిత్తయై చూచుచుండ చంద్రశేఖరుఁడు "ప్రేయసీ నీగర్భంబున జన్మించినపుత్రుని వీపుపై నీవు కనియున్న మత్స్యాకారజన్మలాంఛనము వీనివీపుపై నుండెనో లేదో పరీక్షించితివేని నీసంశయము నివారణయగును." అని పలికెను. చారుమతి యాపుట్టుమచ్చనుఁ జూచినంతనే పట్టరాని సంతోషంబున "కన్నతండ్రీ! పుట్టినదినంబులలోనే నాపొత్తిలి విడనాడి యెచ్చోటడాగియుంటివిరా తండ్రీ! నాపై నీకంతటికోపమేల కలిగె" అని వాని ప్రియమారఁ గౌఁగలించికొని శిరంబు మూర్కొనుచు చుబుకంబు నివురుచు ముంగురుల సవరించుచు మాటమాటకు ముద్దుఁ బెట్టుకొనుచు నానందసాగరంబున నోలలాడుచు లోకమును మఱచియుండెను. ప్రతాపసింహుం డెట్టకేలకు తల్లి కౌఁగిటనుండి విడివడి "జననీ! నాప్రారబ్ధవశంబున నేనింతకాలము నింతటిమాతృప్రేమ కెడమై కిరాతకులంబునఁ బెరిగి బహుజనగర్హితుండనై దిక్కుమాలిన పక్షివలె నేకాకిగఁదిరుగుచుఁ బరమపూజ్యులైన నాతల్లిదండ్రులఁ బెక్కుకష్టంబుల పాల్జేసి యపరాధినైతిని. ఇఁకటినుంచి నే నామరణాంతము మీరొసంగిన యీదేహమును మీచరణకమలంబుల సేవకొఱకే వినియోగించుచు మీయాజ్ఞాబద్ధుండనై ప్రవర్తించెదను. మీ

రు గతమును మఱచి సముల్లసితచిత్తులరగుఁడు." అనిపలికెను. చారుమతి పరమానంద భరితురాలయ్యెను ఆసమయంబున నెవ్వరో వీరిబోణి యొకర్తు ప్రతాపసింహునిఁ జూడఁగోరి వాకిటవేచి యుండెనని ప్రతిహారివచ్చి చెప్పెను తక్షణమే ప్రతాపసింహుఁడు తల్లియనుమతిఁ గొని యవలకేగెను.

అంత వీరపాలుఁడు లోనికేతెంచి చారుమతిదేవి తన పెదతల్లి యని తెలిసికొని యామె పాదములపైవ్రాలి" హా! జననీ! పరమపూజ్యులైన మిమ్మును మహావీరశిఖామణియైన నాయన్నను రాజ్యలోభంబునఁ జంపఁదలఁచిన చితారిగర్భంబున జన్మించిన పరమపాతకుండను వీరపాలుఁడని నన్నునీగర్భమునఁ ప్తి సాకవాతల్లీ!" అని యామెపాదంబులపైఁబడి డగ్గుత్తికతోఁ బలికెను. అంతచారుమతి యమితకూర్మి వీరపాలుని లేవదీసి "నాయనా! వీరపాలా! నీవు నారెండవపుత్త్రుండవు కావా! కర్మవశంబునఁ దటస్థించు సుఖదుఃఖంబుల కొకరు కారణభూతులగుదురా! నీతల్లిని యేలదూషించెదవు? సీతారాముల వనవాసక్లేశంబులకు మంథరచే బ్రోత్సహింపఁబడిన కైకేయి యెట్లు కారణభూతురాలో నన్నును నాయనుంగుబిడ్డను గామపాలుని ప్రోత్సాహంబున నింతటి క్లేశంబుల ననుభవింపఁజేయుటకు నీతల్లియు నంతే కారణభూతురాలు. దైవసంకల్పం బప్రతిహతంబని నీవెఱుంగవా నాయనా! వ్యర్థముగ నిష్కలుషితం బగునీమనంబు నలయింపకుము. నాకెప్పుడును నీయన్న యెంతప్రియుఁడో నీవు నంతియే ప్రియుఁడవని యూహింపఁ దలంపుము. మీయుభయులుఁ బరమపూజ్యులైన నాప్రాణేశ్వరుని యాత్మతేజోమూర్తులు కారా!" అని పలికెను. వీరపాలుఁ డమితోత్సాహమునుఁ బొందెను.

అంత ప్రతాపసింహుఁడు తిరుగవచ్చి తల్లిచెంతఁ గూర్చుండెను. సువర్ణనుఁ డారోజునజరిగిన యభియోగ విచారణాంశముల నెఱిం

గించి కామపాలుఁడు రాజద్రోహియని నిర్ణయింపఁబడెననియు మఱు వాఁడు చిత్రాంగిపైఁగల యభియోగంబును విచారించి యన్నకుఁ జెల్లెలకు నొకేసారి శిక్షవిధింపఁబడుననియుఁ దెలిపెను.

అంత ప్రతాపసింహుఁడు లేచి "జనకా! మామా! మీ రుభయులును ధర్మపరిపాలనార్థమై దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుటకై యవతరించిన పుణ్యపురుషులని లోకముచేఁ గొనియాడఁబడుచున్నారు. న్యాయపాలనావిషయంబున రాజదండన మావశ్యకమే కాని యాదండనము క్షత్రియోచిత మహోదారభూతదయాది గుణంబులఁ బ్రవర్తిల్లినయెడల స్వచ్ఛతరయశోదీపికఁ బరగుననుట నిర్వివాదాంశము. సర్వధర్మవిజ్ఞానఖనులును నిరుపమానభూతదయాసమన్వితులును నీతికోవిదులునగు మీమ్రోలఁ గించిద్జ్ఞుండనగు నేను న్యాయవిషయంబులను గ్రోడీకరింప సాహసించినందుకు క్షమింప వేఁడుచున్నాను. ఒకఁడేకారణముచేనైన దుర్మార్గవర్తనుఁడైనచో వానినా దుర్మార్గమునుండి తొలఁగించి సన్మార్గావలంబునిఁ జేయ యత్నింపవలయునేగాని దుర్మార్గవర్తియయ్యెనని శిక్షించుట పాడిగాదు. చోరుల విషయములోను శూరసేనుని విషయములోను మీరొసంగిన తీర్పు ధర్మసూక్ష్మము ననుసరించియే యున్నయది. స్వార్థపరుఁడు నాజన్మకిల్బిషచరితుఁడు దురాశాబద్ధుఁడు నిర్హేతుక పరహింసాసక్తుఁడు గూరహృదయుఁడు నగు కామపాలుఁడు సర్వజనకంటకుఁడై లోకద్రోహిగనున్నవాఁడగుటచే నట్టినష్టునకెట్టికఠిన శిక్షయైన విధింపవచ్చును. కానియబలయుఁ బశ్చాత్తప్తహృదయయు నగు చిత్రాంగి పరులప్రేరేపణచే నజ్ఞానవశంబునఁ జేసిన పాపకృత్యంబులకు నిష్కృతిఁ గలిగింపననువగును. కావున నామెనిషయమై యుదారభావముతో కర్తవ్యమాలోచింప వేఁడుచున్నాఁడను. మఱియు నావిన్నపమొకటి యాలింపఁగోరెదను. చిత్రాంగి పశ్చాత్తప్తహృదయయై నన్ను శరణుజొచ్చినది.

ఎట్టిదుశ్చరితుఁడైనను శరణన్న వానిని రక్షించుట వీరధర్మము. నేను చిరకాలమునుంచి వీరవ్రతం బవలంబించి నామానవసోదర సోదరీమణుల నాపద్విషయంబులనుండి యుద్ధరించుటయే పురుషార్థముగ భావించి పాటుపడుచున్న వాఁడను. ఆపద్విషయంబుల శత్రుమిత్రభేదంబుఁ బరిగణింపఁదగదు. ఇదియునుగాక చిత్రాంగి పరమపూజ్యులైన నాతండ్రిగారి భార్యయగుటచే నాకును పూజ్యురాలే. ఉత్తమక్షత్రియోచిత వీరవ్రతుండ నగునేను వీరమాతను రచ్చకు రప్పింపఁ జూచి సహింపఁగలనా? ఇప్పట్టున నామె పశ్చాత్తప్తహృదయయై యైహికంబును విడిచి యాముష్మికాన్వేషణాసక్తి యోగినీవ్రతమవలంబించి తీర్థయాత్రల కేగ సమకట్టియున్నయది. ఆమెపై మోపిన నేరములనన్నింటిని నాయొద్ద నొప్పికొనియున్నది. తానుచేసిన పాపకృత్యంబుల కీవిధంబుగ నిష్కృతి ఘటింపఁగోరుచున్నది. కావున నో ధర్మపరులారా ! చచ్చినపామునుఁ బొడువనెంచుట భావ్యమా? శరణాగతురాలగు నావీరమాత పరాభవానలంబుచే మ్రగ్గుచు సగము చచ్చియుండ నామెను రచ్చకు రప్పించి స్త్రీహత్య గావించి కోసల పాంచాల రాజవంశములకుఁ గళంకమునుఁ గలిగించుట మేలగునా ? దానజరిగిపోయినది కలిసివచ్చునా? సర్వసాక్షియగు పరమేశ్వరుఁడు మీహృదయములఁ బ్రవేశించి నా వేడికోలంగీకరింపఁజేయుఁగాక" అని సవినయపౌరుషోక్తులఁ బలికెను. ఆమాటల కక్కడనున్న వారందఱు నత్యాశ్చర్యభరితులై చిత్రప్రతిమలవలె నిశ్చేష్టులైరి.

సుదర్శనుఁ డాపరాని సంతోషంబునఁ బ్రతాపసింహుని నాలింగనం బొనర్చి "శహబాస్. ప్రతాపసింహా. వీరుఁడవన నీవే వీరుఁడవు. వీరవ్రతమన నీవుపూనినదియే వీరవ్రతము. పౌరుషప్రతాపాదుల నీవె ట్లద్వితీయుండవైతివో రాజనీతియందును గవిగురుల లెక్కసేయని యప్రతిమానశేముషీవిశేషుండ వని నేనిప్పు డెఱింగితిని.

నీమూలమునఁ గోసలపాంచాల రాజ్యములు స్వచ్ఛశరత్సాంద్రయశశ్చంద్రికల నాచంద్రతారార్కము సంతతప్రవర్ధమానసమున్నతస్థితి రామరాజ్యములని ప్రసిద్ధిగాంచుట నిశ్చయము. యుక్తాయుక్తంబుగఁ బలికిన నీవేడికోలునకు నిరుత్తరులమైతిమి. అయినను ప్రతిఫలరహితమైన ద్రోహకృత్యంబునకు దాక్షిణ్యమొసంగునుగాని ఫలాపేక్ష నొనర్చిన రాజద్రోహమును క్షమించినచో నయ్యది విషయాసక్తంబగు లోకంబునకు మార్గదర్శకంబు కాదా!" అని పలికెను అంతుపైఁ బ్రతాపసింహుఁడు "మామా! చిత్రాంగిగొనర్చిన ద్రోహకృత్యంబు వలన నేను నాతల్లియుఁ బంచత్వంబునొందినను మామామయగు కామపాలుఁడు తనభృత్యులగు రహస్యహంతకులచేఁ బూజ్యులైన నాతండ్రిగారిని గుణఖనియైన నాయనుంగుతమ్ముని మావెంటననిపి కోసల రాజ్యమంతయుఁ దాను స్వాధీనపఱచుకొనునేగాని చిత్రాంగికి గుటక దిగనిచ్చుననుకొంటిరా యేమి? చిత్రాంగి వివేకహీనురాలగుటచే నామెనుఁ గోసలరాజ్యప్రాప్తి బపేక్షించిన కామపాల మర్కటంబు మార్జాలకిశోరంబుగాఁ జేయభావించె చివర కామెయు మావెంట వచ్చెడిదేయగును" అని పలికెను. ఆమాటలకు సువర్ణుఁడు నిరుత్తరుఁడయ్యెను. చంద్రశేఖరుండు హర్షాశ్రుపూరితలోచనుండయ్యు పట్టరాని కోపమునఁ గాలాగ్నిరుద్రుండై పేరెలుంగున "ఓసీ! చిత్రాంగీ. స్వర్ణకంచుకితవిషసర్పమా! ఇంతటి సుగుణఖనియగు నా పెన్నిధానమును, నాకుమారరత్నమును, నాజీవితాకాశ మార్తాండ మండలంబు నంతరింపఁజేసి నీవుబ్రతుకఁగోరుచుంటివా తుచ్ఛురాలా! పుట్టినంతనే యీనిరుపమానతేజోనిధి నీకు కంటిలోని నెరసయ్యెఁ గాబోలు. నాయనా! ప్రతాపసింహా. ఆపాపాత్మురాలి ముఖము నేను చూడఁజాలను. మహోదారవీరశిఖామణివైన నీవేడికోలును నేను దిరస్కరింపఁజాలను. ఏమిసేయుదును. అసహాయవిశాదియైన

యామారకగృహమును నీవీక్షణంబుననే పాటలీవోలి కోసలపాంచాల దేశముల నేమూలను నడుగుబెట్టకుండఁ జేయుము." అని పలికెను. ఆమాటలు వినినంతనే ముదితహృదయుండై "తండ్రీ! మీయాజ్ఞ ప్రకారమే కట్టడిచేసి పంపించివేసెదను." అని ప్రతాపసింహుఁడు వెడలిపోయెను. అప్పటికి వేగుచుక్క పొడిచెను.

ప్రతాపసింహుఁడు వెడలిపోయినపిదప సుదర్శనుఁడు చంద్రశేఖరుని చేరంజని వాని రెండుచేతులును బట్టికొని "భావా. ఇంతవరకును విపజ్జీమూతపటలాచ్ఛాదితంబు లగుటచే నంధకారబంధురంబులై యున్న మన హృదయాకాశంబులు ప్రతాపోదయంబుచే నేటికి నిర్మలములై తేజోవంతంబులైనయవి. ఆప్రతాపునకు నా యేకైకపుత్రికయగు చంద్రికళను భార్యాదేవిగఁ జేయ నభిలషించుచున్నాఁడను. మీరందు కంగీకరించి నన్నుఁ జరితార్థునిఁజేయ వేడుచున్నాను. పాంచాలరాజవంశాలవాలంబున జన్మించిన నాసుకుమారవల్లిమతల్లి కోసలరాజవంశపయఃపారావారంబున జన్మించిన యాప్రతాపసింహ మందారోర్వీజంబు నల్లికొని విలసిల్లఁ గోరుచున్నయది. ప్రతాపసింహుఁడుఁగూడ నాచంద్రికళను మనసార ప్రేమించియున్నాఁడు. మేనత్త మేనమామ బిడ్డలగుటచే నాయుభయులకు నట్టి పరస్పరప్రేమలు కలుగుట సహజమే. అట్టి సహజప్రేమల నేముద్ధరింప నుదారభావులగు మీరుత్సహించి నాపుత్రికారత్నంబు నింతటినుంచి మీగర్భగుప్తి సాకవేడెదను." అని పలికెను. చంద్రశేఖరుఁ డమితానందము జెంది "భావా. మీవంటి మహనీయులతో వియ్యమందుటకంటె గణనీయమైన భాగ్యము నాకు వేఱొండు కలదా? ఆప్రతాపునిఁ గనుటయే మానంతయ్యోఁ గాని యిరువది సంవత్సరము లపారదయతోఁ బెంచి వర్ధిల్లఁజేసినది మీరు కారా? దారుణ రణక్షత వేదనలచే మరణావశిష్టుఁడై యుండ కాపాడి బునరుజ్జీవితునిఁ గావించినది మీరు

కారా? అట్టి పరితాపునిపై మీకన్న నాకెక్కువ స్వాతంత్ర్యంబు గలదా? ఈయనుబంధంబుచేఁ గోసల పాంచాలరాజ్యంబు లప్రతిమాన యశోవిరాజితంబులై యాచంద్ర తారార్కంబు భూమిపై వర్ధిల్లుగాక" ఆమాటలకు సుదర్శనుఁ డమితానందముఁ జెందెను. అప్పటి కరుణోదయుం బగుటచే నెవరిభవనంబునకు వా రేగిరి.



శ్రీరస్తు.

# ప్రతాపసింహ.

## ఇరువదియాఱవ ప్రకరణము.

ఉ. ఎన్నికలమందు దుర్జను లకారణమత్సరమూని మత్తులై
నీతినివీడి ద్రోహముల నెమ్మి నొనర్చుచుఁ దారుత్రివ్వా
గోతులలోనఁ గూలుదురు కోరికల న్నెరవేర్చి సాధుభూ
నేతల దైవ మెయ్యెడల నిర్మలసత్కృపఁ బ్రోచుచుండఁడే.

తెల్లవాఱినది. బాలభానుఁడు ప్రాఙ్నగశిఖరం బలంకరించి నిజకరంబుల సకల జీవుల మేల్కొలుపుచుండెను. ఆరోజున హేలాపురమంతయు గోలాహలముగ నుండెను. పురజను లాబాలగోపాలము వీధులఁ గిక్కిరిసియుండిరి. యాతాయాత శకటాందోళికాది వాహనసముదాయంబులును వాజివారణ పరిభ్రమణంబులు నపరిమితముల య్యెను. వీధుల కిరుబుజంబులం గల సౌధాగ్రభాగముల నిలిచి పురస్త్రీ లతివేడ్కఁ జూచుచుండిరి.

అంతలో వేత్రహస్తులు త్రోవ సమకూర్చుచు ముందు నడువఁ గొందఱు రాజభటులు తళతళలాడు కత్తులను చేతఁబట్టికొని యిరు పార్శ్వంబుల నడుచుచు నిగళబద్ధుఁడైన కామపాలుని గాడిదెపై నెక్కించి తీసికొని వచ్చుచుండిరి. వానినిఁ జూచినంతనే జనులలో విపరీతసంచలనము కలిగెను. "ఛీ ఛీ ఈపరమపాపాత్ముని ముఖముఁ జూచినచో మనకుఁ బాప మొదవును." అని పరాఙ్ముఖు లగువారు

కొందఱును నిఖిలజన కంటకుండగు నీమనుష్యరూప రక్కసుం డంత మొందినచో లోకపీడయే నశించు ననువారు కొందఱును నిరపరాధులగు జనుల నెందఱినో చంపినచోరుల నావిధంబుగ గృపఁజూచిన మన ధర్మప్రభువునకు వీని కింతటి దారుణశిక్ష విధించుటకెట్లు మనసొప్పెనోయని యచ్చెరువొందువారు కొందఱును వీని నొక్కమారు నిర్బాధకంబుగ శిరచ్ఛేద మొనరింపక దురాశాపిశాచగ్రస్తుండగు వీఁడు నిష్కారణము స్వార్థపరతఁ బరుల నెట్లు హింసించెనో యావిధంబుగ హింసించి హింసించి చంపిన బాగుండునని పలుకువారు కొందఱునై బహువిధంబుల ముచ్చటించుచుఁ దదేకదృష్టి వానినిఁ జూచుచుండిరి. ఆయుత్సవము చతుష్పథంబున నాఁగెను.

అచ్చో నత్యున్నతంబగు నొకశిలాస్తంభంబు ప్రతిష్ఠింపఁబడి యుండెను. నాలుగుపలకలుగ మలచిన ఱాళ్లతోఁ గట్టినదాని నలుతట్టులను నీక్రిందివిధంబున వ్రాయఁబడియుండెను.

"కుళిందరాజ వంశపాంసనుండగు కామపాలహతకుఁడు రాజ్యలోభంబున విశ్వాసఘాతకుండై నిజాగ్రజుని సంహరించి కుళిందరాజ్యము నక్రమముగ స్వాధీనపఱచికొని యంతటితో దనివిసనక కళింగ కోసల పాంచాలరాజ్యములను గబళింపదలంచి యెన్నియో దురంత కృత్యముల నొనర్చి చివరకీవిధంబుగ మృతిఁజెందె. ఇట్టి దురాశాబద్ధులగు రాజద్రోహుల కీగతియే సంభవించునని తెలుపుటకై వానిశిరం బీస్తంభముపైఁ బ్రతిష్ఠింపఁబడినది."

అద్దానిఁ జూచినంతనే కామపాలునిచిత్త మదటుఁజెందెను. దేహము కంపించెను. ఆపాదమస్తకపర్యంతముఁ జెమ్మటలు గ్రమ్మెను. చూపులు ఱిచ్చవడియెను. నోటఁదడి యాఱిపోయెను. అట్లు నిర్విణ్ణుఁడై నిర్లక్ష్యంబుగ బయలఁ దేయుఁ దిలకించు కామపాలుని డగ్గఱి వాసని సరదారు బంధవిముక్తునిఁ గావించి "ఓరీ కామపాలా! ఇంతటితో

నీజీవయాత్ర సమాప్తమైనయది. ఇచ్చోట నీశిరంబును ఖండించి సర్వ జనులునుచూచి బుద్ధిదెచ్చుకొని భూతదయయుఁ బాపభీతియుఁ గలిగి ప్రవర్తించుటకై నీతుచ్ఛశిరస్సు నీశిలాస్తంభంబుపైఁ బ్రతిష్ఠించవల సినదిగా మహారాజుగారి తీర్పైనది. ముందుగ నీగౌరవంబునకుఁ దగిన చరమోత్సవమైనది. కొదువకార్యంబుఁ బూర్తిఁ గావించుటకుఁ బూర్వ ము వలయునేని రెండునిముషము లవకాశమిచ్చెదను. నీవింతవఱకును చేసిన పాపకృత్యములను స్మరించికొని పశ్చాత్తప్తహృదయుండవై యాత్మశాంతి వడయ నీయిష్టదైవమును బ్రార్థించికొనుము" అనిపలి కెను. అందుపై గామపాలుఁడు గాడిదపైనుండి క్రిందకుదిగి క్రోధా రుణనేత్రుండై "ఓరోరి రాజద్రోహులారా. వ్యర్థప్రలాపములనుగట్టి పెట్టి మీరుచేయఁదలంచినదేమో చేయుఁడు." అనిపలికెను. తక్షణ మే దండనాధికారి కనుసైగఁ జేయ హంతకుఁడు కామపాలుని వధ్య శిలపైఁ బరుండఁజేసి వానిశిరం బొక్కవేటున ఖండించెను. ఘోరున రక్తధారలుపై కెగయ మొండెమొక ప్రక్కను శిరంబొక ప్రక్కను పడియెను. వెంటనే రక్తసిక్తంబగు నాశిరస్సును శిలాస్తంభంబుపైఁ బ్రతిష్ఠించిరి. జనులందఱు నాఘోరకృత్యమునుగూర్చి మచ్చటించి కొనుచుఁ దమతమ నెలవుల కేగిరి.

అట్లు కామపాలుఁ డంతమొందినపిదప నొకనాఁడు ప్రభాత సమయంబునఁ జంద్రికళ యేకతంబ పుష్పోద్యానవనంబున కేగి యట నూతనోత్ఫుల్ల కుసుమసంచయంబులం గోసి యొక్క సమున్నతతరు శాఖాలంబితడోలికాధిరోహయై దండ గ్రుచ్చుచు "నేనీపూఁదండనామ నోహరుని కంఠంబునం దెన్నఁడు గీలింతునో. ఎప్పటికి నాకోరికలీడేరునో. ఎప్పటికి నేధన్యురాలనయ్యెదనో. హృదయమా నీవువరించినజగన్మోహ నుఁడు నిన్ను బ్రేమించెగదాయని యువ్విళులూరుచుంటివి. 'శ్రేయాంసి బహువిఘ్నాని' అను నార్యోక్తి ననుసరించి చేఁజిక్కిన ఫలముఁ గూడ

నర్థానిననుభవింపవలసిన జిహ్వాకును చాల దప్ప్వకలదని యెఱింగి యుండుము. నాయత్తమామలయభిప్రాయమెట్లుండునో" అని యే మేమో తలపోసికొనుచుండ నామె వెనుకనుండి యొక వ్యక్తివచ్చి తన కరతలంబులచేతను జంద్రికళకన్నులను మూసెను. అంత చంద్రికళ త్రుళ్ళిపడి యావ్యక్తి కరతలంబులం దిగిచి వెనుకకు దిరిగిచూచి "చెలీ! మధురికా నీవటే?" అని విస్మితయై పలికెను. మధురిక నవ్వుచు "సఖీ! చంద్రికళా! మొదట నన్ను నీ హృదయేశ్వరుండగు ప్రతాపసింహునిగ భావించితివా యేమి? అటులైనచో నాపూలదండ నాకొసంగనైతివేమి?" అని యాదండగ్రహింపంబోయెను. చంద్రికళ వ్రీడాభరంబున దరహసితముఖియై శిరంబొక్కింతవంచి క్రేగంట మధురికనంజూచుచు "చెలీ! మధురికా! నన్ను భానుమంతునిగ భ్రమించి నీవట్లు పరిహసించితివి కాంబోలు. అటులైన నీదండ నాయొద్ద నేయుంచుము." అని యాదండను గైకొనెను.

ఇట్లొండొరులు తమ హృదయాలక్ష్యంబుల వ్యక్తపఱచికొనినపిదప మధురిక "ప్రియసఖీ! చంద్రికళా! నీకొక శుభవార్తచెప్పెదను. నాకేమిబహుమతి నొసంగెదవు?" అనిపలికెను. ఆమాటవిని చంద్రికళ యమితోత్సాహమున నుప్పొంగుచు "నెచ్చెలీ! నీవేమికోరిన నదియు యొసంగెదను. ఆశుభవార్త యేమోచెప్పుము." అని యడిగెను. అందుపై మధురిక "సఖీ! చంద్రికళా! నేటిరోజున నీకును ప్రతాపసింహునకును బాణిగ్రహణ మహోత్సవమును జరుపం జంద్రశేఖరమహారాజుగారును నీతండ్రిగారును నిశ్చయించి నిండువేడుకల దర్బారులోం గూర్చుండి నిన్నలంకరించి తోడ్కొనిరమ్మని నాకాజ్ఞనొసంగుటచే నిన్నెల్లయెడల నరయుచు నియ్యెడకువచ్చి యదృష్టవశంబున నిన్నుం గనుగొంటిని. అంతిపురంబున కేగుదమురమ్మీ" అని చంద్రికళను దోడ్కొని మధురిక యంతిపురంబునకేగెను.

యథాప్రకారము సుదర్శనమహారాజు చంద్రశేఖరునితోఁ గొలువుకూటంబున కేతెంచెను. ఆనాఁడు దర్బారు నిండువేడుకలఁ గనుపండు వొనరించుచుండెను. ఒకయెడ మృదంగవాదయుతంబగు గాయకగాయకీ గానవినోదంబులును వేఱొకప్రక్క వారవనితాశిరోమణుల లాస్యగానాభినయప్రయోగంబులును మఱొక్కచక్కి రుథవేషధరులైన రాజకుమారుల హాస్యరవంబులును వేఱొండుకేవ బహువిధమంగళతూర్యనాదంబులును మఱొండుచోటఁ గులగౌరవంబుల నగ్గడించి పొగడెడు వందిమాగధుల కైవారంబులును మఱొండుచాయఁ బేరటాండ్రనివాళులును చూపరుల హృదయంబుల నానందవీచికాడోలికల నూఁగించుచుండెను.

ఆసమయంబునఁ బ్రతాపసింహుఁడు వచ్చి మహారాజులకు నమస్కరించి "తండ్రీ! కృతార్థుండనై వచ్చితిని. చిత్రాంగి నిరూఢమైన పశ్చాత్తాపపరితప్తహృదయయై పరిపూర్ణవైరాగ్యసంపదఁ గలదియై కాషాయాంబరముల ధరించి యోగినీవ్రత మవలంబించి కాశ్మీరదేశమున కేగినది." అని చెప్పెను. ఆమాటలు విని చంద్రశేఖరుఁడు హర్షించెను. సభ్యులామాటవిని పలుతెఱంగుల ముచ్చటించుచుండిరి.

అంత సుదర్శనమహారాజు లేచి ప్రతాపసింహుని కరంబూని సభాసదులగు నోమహాజనులారా! మహావీరశిఖామణి యగు నీప్రతాపసింహుని వృత్తాంతము వారివలననే మీరు కొంతవరకు వినియుంటిరి. కాని యీపురుషసింహుఁడు కోసలరాజ్యరమాకళత్రుండగు చంద్రశేఖర మహారాజుగారికి నాయనుంగుచెల్లెలగు చారుమతివలన జన్మించిన పుత్రుండు. మీ రింతవరకును వీనిని వీరధన్వి స్వయంప్రాప్తపుత్రునిగ భావించుచుంటిరి. అంతటి మహారాజు పుత్రుండు కిరాతపాలితుండై యేల వర్ధిల్లవలసివచ్చెనో యని మీకు సంశయము

కలిగి యుండవచ్చును. వినుండు" అని యిందుమతి వ్రాసియుంచిన పత్రమును మరల సభామధ్యంబునఁ జదివెను. ఆవృత్తాంతమును వినినంతనే యందున్నవా రందఱుఁ గ్రోధావేశులై "దురాశాబద్ధురాలును బాలఘాతినియు నగు చిత్రాంగి కేమిశిక్ష విధించితిరి! ఆలేఖలో నుద్ఘాటించిన పురుషుం డీమహావీరుఁడేయనుట కింకేమైన నిదర్శనము గలదా?" అని యడిగిరి. అందుపై సుదర్శనుఁడు "మహాజనులారా! చిత్రాంగి తన్నుఁ బ్రేమించిన భర్తకన్నులు గప్పి యంతటి రాజద్రోహ మొనర్చుటచే నామెను దేశద్రోహినిగ భావించి కోసల పాంచాల కళింగ రాజ్యముల నెన్నండు నడుగువెట్టకుండఁ గట్టడిఁజేసి విదేశంబునకుఁ ద్రోఁచివైచితిమి. ఆలేఖలో నుద్ఘాటించిన పురుషునకు వెన్నుపై కుడిభాగంబున నున్నదని తెలిపిన మత్స్యాకారజన్మలాంఛన మీమహావీరుని వెన్నుపైగలదు. చూడుఁడు" అని యందఱికిఁ బ్రత్యక్షంబుగఁ జూపెను. అదిచూచి సభాసదు లందఱు నపరిమితానందభరితులై యచింత్యంబగు పరమేశ్వరుని నిగూఢసాధురక్షణకౌశలంబును వేవిధంబులఁ గొనియాడిరి.

తరువాత సుదర్శనుఁడు గద్దియపైకేగి "మహాజనులారా! మీ రందఱు నిష్కళంకహృదయులై యీమహావీరశిఖామణిని నామేనల్లునిగ నంగీకరింప నిచ్ఛగించితిరా?" అని యడిగెను. వా రందఱుఁ గరతాళధ్వనులఁ దమ యంగీకారమును వెలిఁబుచ్చిరి. పిమ్మట సుదర్శనుండు "మహాజనులారా! ఈవీరాగ్రగణ్యుఁడును నాపుత్రికయైన చంద్రికళయుఁ బరస్పరము ప్రేమ బద్ధులైయుండుటచే మీయందఱి సమక్షంబునను నాయుభయులకు పాణిగ్రహణమహోత్సవము నిప్పుడే జరిగింప నిశ్చయించితిమి. మీ రందఱు వధూవరుల నాశీర్వదింపఁ బ్రార్థించుచున్నాను." అని పలికినంతనే సదస్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టెను. అప్పుడే చంద్రికళ పూర్ణాలంకృతురాలై కరద్వయం

బునఁ బూలదండఁగొని నిలుకడఁజెందిన కౌసల్యయుఁగోయన సఖిజన పరివృతయై దర్బారులోని కేతెంచి తండ్రిగారి యాజ్ఞపై వ్రీడాభరంబున శిరం బొక్కింత వాల్చి వాలుచూపులు నివాళియొసంగుచు దాను తెచ్చిన పూలదండను ప్రతాపసింహుని యఱుతఁ గీలించెను. అందఱును మరలఁ గరతాళధ్వనులఁ దమ యమితానందమును వెల్లడించిరి. వెంటనే మంగళతూర్యనాదంబులెసంగ నాయిరువురకును బాణిగ్రహణమహోత్సవము జరిగెను. పుష్పవర్షము వారిపైఁ గురిసెను

అనంతరము సుదర్శనుఁ డానందబాష్పపూరిత నేత్రుండై గద్దియడిగ్గి వధూవరుల శిరంబులపైఁ దన కరతలంబులనుంచి "హేదేవా. నీయనంతదయచే నేటికి నేనఫలితమనోరథుండనైతిని. ఇంక నీయను గ్రహంబుననే పాంచాలరాజాన్వయ దుగ్ధాబ్ధి జన్మించిన యీ నా చంద్రికళ కోసలరాజాన్వయ ద్యుమణియగు నీ ప్రతాపసింహుని గుణశీలస్నేహానుబంధంబుచే నాచంద్రతారార్కము బ్రకాశించుచుఁ దదీయదశదిశావకాశ పూరితసాంద్రతరయశశ్చంద్రికళంగూడి బహు పుత్రపౌత్ర ధనధాన్యసంపదల వర్ధిల్లుగాక" అని యాశీర్వదించెను. తరువాత సభ నవలోకించి సుదర్శనుఁడు "మహాజనురాలా! ఏమహావీరుఁడు దట్టశాత్రవ కాంతారంబుల దగ్ధముగావించుచుఁ బుట్టిననాట గోలె నేటివరకును పరవ్రతుండై బహుజనుల మృత్యుముఖంబునుండి రక్షించెనో యేశూరుఁడు నిరుపమాన శౌర్యధైర్యసాహసోదారభుజ బలప్రతాపంబులచే శత్రువులకుఁ గైవసంబుఁగానున్న యీపాంచాల రాజ్యలక్ష్మిని మిమ్మును నన్నుఁగాపాడి రక్షించెనో యానా మేనల్లుఁడు నాపుత్రికాలలామంబుతోఁగూడ నీ పాంచాలరాజ్యలక్ష్మిని గూడ గ్రహించెఁ గావున నింతటినుంచి యీప్రతాపసింహుఁడే మీ ప్రభువు." అని పలికి తన కిరీటము వానిశిరస్సుపై నుంచి తనచేతి

లోని రత్నఖచితంబగు ఖడ్గంబు నొసంగి ప్రతాపసింహునిఁ జంద్ర శేఖరను సింహాసనంబుపైఁ గూర్చుండఁబెట్టెను. అందఱును కరతాళధ్వనుల దమయుత్సాహంబును వెలిబుచ్చుచు "ప్రతాపసింహమహారాజునకు జై" అనిజయజయధ్వానముల నొనర్చిరి. చంద్రశేఖరమహారాజమితానందము జెందెను.

ఈవిధంబుగఁ బ్రతాపసింహునకుఁ బరిణయపట్టాభిషేకోత్సవంబులైనపిదప శూరసేనుని కోరికపై వీరపాలుఁడు కన్యాలలామయగు లలితతోఁగూడఁ గళింగరాజ్యలక్ష్మీలలామ నారోజుననే స్వీకరించెను. తరువాత మధురికకును భానుమంతునకును వివాహముఁగావించి కుళిందవంగరాజ్యములకు భానుమంతుని ప్రభువుగఁ జేసిరి.

ఈశుభకార్యములన్నియు జరిగినపిదప శూరసేనుఁడు తీర్థయాత్రలకేగెను భానుమంతుఁడును మధురికతో ముందు వంగరాజ్యమునకేగి యచ్చోవలయు నేర్పాటులను గావించి యనంతరము భార్యాసహితుఁడై కుళిందకేగెను.

చిత్రాంగి హేలాపురమునుంచి బహిష్కరింపఁబడినది మొదలామె యెచ్చోటికేగెనో యేమయ్యెనో నేటివరకు నామెజాడ తెలియరాదు. వీరపాలుఁడు జాయాసహితుఁడై కళింగరాజ్యంబున కేగెను. చంద్రశేఖరుండును సుదర్శనుని యనుమతిపై చారుమతీదేవిని వెంటగొని మధురాపురంబున కేగెను. వీరధన్వ సుదర్శనప్రతాపసింహులయొద్దనే యుండెను.

పాఠకమహాశయులారా! ఇంతటితో మనకథ పరిసమాప్తమైనయది.



# తప్పొప్పుల పట్టిక



ఈగ్రంథమును జదువఁ బ్రారంభించుటకు మున్న నీక్రింది సవరణ లధుఁ జేసికొనఁ జదువరులు ప్రార్థితులు.

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 11 | 4 | నీతిరహితంబై | నీఁతిరహితంబై |
| 14 | 21 | పరినారంబును | పరివారంబును |
| 26 | 15 | భుజపజరుండు | భుజపంజరుండు |
| 27 | 1 | వె టనే | వెంటనే |
| ,, | 15 | నాజన్మాంతరమును | ఆజన్మాంతమును |
| 28 | 1 | రక్షిపవచ్చిన | రక్షింపవచ్చిన |
| 29 | 6 | ఽష్టైశ్యంబులును | అష్టైశ్వర్యంబులును |
| 31 | 6 | గణబులను | గుణంబులను |
| 43 | 1 | అస్రుతపూరిత | అస్రుపూరిత |
| 83 | 10 | యాంగతుకములు | యాగంతుకములు |
| 86 | 20 | జోదులలో | జోరులలో |
| 87 | 15 | పూరితుఁడై | పూరితుఁడగు |
| 88 | 20 | అఁదతి | అందలి |
| 92 | 18 | నిణ్గించుట | నిగ్గించుట |
| 96 | 4 | యుండునో | యుండునోయని |
| 109 | 8 | యద్దా | యద్దాని |
| 125 | 11 | మృత్యోర్వా | మృత్యుర్వా |
| 135 | 21 | పురుషుని | పురుషుఁడు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 142 | 9 | మషికాంతరము | మళకాంతరము |
| 144 | 23 | సరిక | దరియుసరిక |
| 147 | 22 | విలీయములు | విలీనములు |
| 151 | 17 | తేవిహీనము | తేలిహీనము |
| 153 | 1 | జీవనయాత్ర | జీవయాత్ర |
| 161 | 5 | పాడములపై | పాదములపై |
| 164 | 1 | రక్షుక్షుణార్థమై | రక్షణార్థమై |
| ,, | 7 | వికటగ్రంధిల | వికటగ్రంధిల |
| 165 | 12 | ఆమహాయాకర | ఆమహాభయంకర |
| ·174 | 20 | మిల్కిలి | మిక్కిలి |
| 181 | 16 | అందుకై | అందుపై |
| 187 | 3 | దస్యులు | సదస్యులు |
| 188 | 10 | ఘోషించుచుండనో | ఘోషించుచుండునో |
| 189 | 8 | భూదరంబుల | భూధరంబుల |
| 190 | 1 | మహోదారు | మహోదార |
| ,, | 18 | చరణనసరోరుహ | చరణసరోరుహ |
| 212 | 5 | నెరవేర్బి | నెరవేర్చి |
| 213 | 6 | వీరిని | వీని |
| 232 | 12 | కుళిద | కుళింద |
| 266 | 4 | గావించి | గావించెదము |



ప్రతాపసింహ

(నవరసభరితంబగు నవల)

బ్రహ్మశ్రీ హోతా వేంకటకృష్ణకవి

13944